౬౫

# ఆస్తికవాదము

పండిత గోపదేవ్

అంటా దర్శన గ్రంథ మాల : ౨

# ఆస్తికవాదము

పండిత గోపదేవ్

"స్వభావ మేకే కవయో వదంతి
కాలం తథాన్యే పరిముహ్యమానాః
దేవస్యైష మహిమా తు లోకే
యేనేదం భ్రామ్యతే బ్రహ్మచక్రమ్"

ది మాడరన్ పబ్లిషర్సు (రిజిష్టర్డు)
తెనాలి - ౧౯౪౭



కీ॥ శే॥ క్రొత్తపల్లి వెంకటప్పయ్య

జననం ౧౮౭౯-౧౧-౧౬. మరణం ౧౯౧౮-౧౨-౨౮.



శ్రీమతి క్రొత్తపల్లి యామినీదేవి

# ద్రవ్యదాత్రి యామినీదేవి

"శతహస్తం సమాహర, సహస్రహస్త వితరం"

కూచిపూడి (తెనాలితాలూకా) గ్రామమునగల ధనికులలో తమ జీవితకాలమున కీ. శే. కోగంటి వెంకటసుబ్బయ్యగారొకరు. వారు జీవించినకాలము స్వల్పము. కాని యది ప్రతిష్ఠామయము. వృద్ధుడైన జనకునకు స్వయముగా సేవజేసిన పితృసేవా తత్పరుడు. ధనము గడించుటలో నేర్పరియయ్యు, యాచకుల మనోరథముల నీడేర్చిన దాత. దైవ దుర్విపాక మెట్టిదో కాని నడివయసుననే తాగడించిన ధనలక్ష్మినేకాక యిరువురు ముద్దుబిడ్డలతో బాటు తనసతి (అచ్చమ్మ) ననాథనొనర్చి దివంగతు డయ్యెను. గ్రామవాసులు వారి యకాలమరణమునకు చింతిల్లిరి.

ఆ యిరువురి బిడ్డలలో పెద్దబిడ్డ జయప్రద. తండ్రి జీవించి యుండగనే యోగ్యుని చేపట్టిన సుఖవతి. చిన్నబిడ్డ యామినీదేవి. తల్లి తోబుట్టువుల యండను పెరిగి, విద్యాబుద్ధులు నేర్చి, బావ (శ్రీ కన్నెగంటి కోటయ్య) గారి పరిశ్రమ ఫలముగా తన కనురూపుడైన వరుని బొందగలిగెను. ఈ పట్టిని చేపట్టిన యువకుడు అమృతలూరు వాస్తవ్యులగు క్రొత్తపల్లి శ్రీరాములుగారి యేకైక పుత్రుడు వేంకటకృష్ణ నామాంకితుడు. బాల్యముననే తన తండ్రి దివంగతుడుకాగా తాను గ్రామమునగల సంస్కృతపాఠశాలలో కావ్యనాటకముల నారితేరిన విద్యావంతుడు. సాటియువకులలో పేరు వడసి ప్రాయ

మునకు తగినట్లు మొలకలెత్తుచున్న విశాల నూత్నభావముల
కాటపట్టై యౌవనము నలంకరించెను. అతనికి పదునెనిమిది
వర్షములు. యామినీదేవికి పదునారవ వసంతము. శుభ
ముహూర్తమున యామినీ వేంకటకృష్ణులకు పరిణయ మహో
త్సవము జరిగినది. వారి జీవితము సుఖమయమును, కీర్తిమం
తము కాగలదని ప్రజ లాసించిరి. కాని కాలగతి యెరికిని తెలి
యదుగదా! పంద్రెండుమాసములైన పూర్ణము కాకముందే
దుర్దైవ మీ నూత్న దంపతుల మధురజీవితమునకు కన్నుగుట్టి
వేంకటకృష్ణుని భౌతిక జీవితము నంతమొనరించెను నాటి నుం
డియు దుర్భర వైధవ్యదుఃఖమును, సంయతజీవితమును యామినీ
దేవి నాశ్రయించినవి. తన భక్తిశ్రద్ధలను జూరగొని తన్ను
విడిచి దివంగతుడైన భర్తృస్మారకముగా నీ గ్రంథము నచ్చొ
త్తించి యందులకయిన ద్రవ్యము నిచ్చి, సాహిత్యప్రచారము
ద్వారా సంఘమును సేవించుచున్న యాదేవికి దేవదేవుడు
దివ్యశాంతి నొడగూర్చుగాక.

గోపదేవ్

# మొదటి మాటలు

సుమారు ఇరువైదు వత్సరములనుండి భారతావని యందు - ముఖ్యముగా తెలుగుప్రాంతమున - చదువరులకు దేవునియందును, ధర్మ (మత) మునందును నొక విధము జుగుప్స యేర్పడినది. వీరిలో కొందఱు సభలలో నైతము బాహాటముగ దేవుని నిరసించి మతమును మత్తుగా జెప్పి తూలనాడు చున్నారు. జనులకు నీ విషయమునందు అశ్రద్ధ కలిగించుట వీరి కొక 'ఫాషన్' అయినది. దీనికి కారణ మేమై యుండును? రాజకీయమే వీరికి లక్ష్యమా? అట్టియెడ దేవుని, మతమును కాదను టేల? ప్రాతఃస్మరణీయులైన తిలక్, గాంధి ప్రభృతు లుత్తమ రాజకీయవేత్తలయ్యు నిట్టి చేయ లేదే. మతములవలననా జరుగు సంఘకలహములు కారణమగునా? రాజ్య-ధన-అధికార ప్రాప్తి నిమిత్తముగా జరుగు ప్రపంచయుద్ధములవలన నేర్పడు హత్యల యెదుట మతకలహముల వలన గలుగు హింస లెంతటివి? కాబట్టి యీ విరోధమునకు కారణము ప్రస్తుతము దేశమున జనవృకొన్నవారిలో గలుగు భౌతిక విజ్ఞానమని యూహింప నగును. ఈ యసంపూర్ణమాత్మ విజ్ఞాన మొకింత యలవడ్డ కాని విశ్వవిద్యాలయములనుండి బయటపడి సమాజమున ప్రవేశించుటయే తడవుగా కొందఱు నవనాగరికులు దేవధర్మముల సత్య స్వరూపమును తెలిసికొనకయే వానిని నిందించు చున్నారని యనుభవగమ్యము. అట్టియెడ యథార్థమైన మతముగాని, ఆస్తిక్యముగాని విజ్ఞాన విరుద్ధములు కాకపోగా, తన్మూలకములని తెలియజేయు సాహిత్యము తెలుగున నెంతయు నవసరము. ఈ గ్రంథ మీ యవసరమును పూర్తిచేసి చరితార్థము కాగలదను నాశతో చదువరుల కందజేయు చున్నాడ. దీని యుపయోగమును పాఠకులే గుర్తింతురుగాక!

ఈ గ్రంథమునకు మూలము హిందీభాషలోని 'ఆస్తిక వాదము' ...రచయితలు శ్రీ పం. గంగాప్రసాద్ ఉపాధ్యాయులు, M. A., (ప్రధానకార్యదర్శి, సార్వదేశిక ఆర్య ప్రతినిధి సభ, ఢిల్లీ). తమ గ్రంథమును తెనుగున ననువదింప దయతో నంగీకరించినందులకు వారికి భక్తిపూరిత నమస్సులు.

పుస్తకములోని స్థూలదోషములను సవరించి సమయము వెచ్చించి సహకార మొనర్చిన ఆదరణీయులగు పండిత వేంకటరత్నంగారికి నా శ్రద్ధాంజలులు.

అడిగినంతమాత్రమున కాదనక పుస్తకప్రకాశమున కవకాశము కల్పించిన శ్రీ పిల్లలమర్రి లక్ష్మీనారాయణ (ది మాడరన్ పబ్లిషర్సు) గారికి, వీలైనంత త్వరలో పుస్తకమును ముద్రించి చక్కని రూప మొసంగిన భారతీ ముద్రణాలయ కార్యకర్తలకు కృతజ్ఞతా వందనములు.

ఐదారు సంవత్సరములకు పూర్వమే వ్రాయబడియు, ధనము చేకూరమి ప్రకటింపబడకున్న యీ గ్రంథమును తనకు తెలియగానే, తన భర్త స్మారకముగా ముద్రించుట కగు వ్యయము నంతయు నిచ్చి సాహిత్యముద్వారా సంఘమును సేవించు శ్రీ. యామినీదేవిని సుఖస్వరూపుడగు పరమేశ్వరుడు సుఖశాంతుల నిచ్చి పాలించుగాత!

ఈ గ్రంథ విక్రయమున సమకూరు ద్రవ్యము కూడి పూడి ఆర్యసమాజమునకు చెందును. సమాజము దానిని సాహిత్యప్రచారమునకై వినియోగించును.

విద్వదనుచరుడు,
గోపదేవ్

# విషయసూచిక

## ప్రథమాధ్యాయము

### విషయవ్యాపకత:—౧ - ౩౨.



## రెండవ అధ్యాయము

### మనుష్యుడు అల్పుడు:—౩౩ - ౫౬

## మూడవ అధ్యాయము

## సృష్టిరచన:—౪౬ - ౭౮



## నాల్గవ అధ్యాయము

## సృష్టికర్త:—౭౪ - ౧౧౮

## అయిదవ అధ్యాయము

## ఆరవ అధ్యాయము

## ఏడవ అధ్యాయము

### పాపము - దుఃఖము:—౧౭౫ - ౨౨౬



## ఎనిమిదవ అధ్యాయము

### ఈశ్వరగుణములు (అనంతత) ౨౨౭ - ౨౫౨

## తొమ్మిదవ అధ్యాయము

### కర్మ – ఫలము ......... ౨౫౩ – ౨౬౯



## పదవ అధ్యాయము

### ఆస్తిక్య ప్రయోజనము ......... ౨౭౦ – ౨౯౯

## పదునొకండవ అధ్యాయము

ఓమ్

# ఆ స్తి క వా ద ము

## ప్రథమాధ్యాయము.

### విషయవ్యాపకత. (విస్తృతి)

"ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః,
తస్మాద్ధర్మో న హన్తవ్యో, మానో ధర్మో హతో౽వధీత్"

ప్రాచీనకాలమున నొక కవివరునిచే రచింపబడిన యీశ్లోక మాకాలపు మానవహృదయమును జక్కగా వెలిపుచ్చుచున్నది. 'నష్టముచేయబడిన ధర్మము మానవుని నష్టపరచును. సురక్షిత ధర్మము మనుజుని రక్షించును. అందువలన ధర్మమును నశింప జేయజనదు. దానివలన మనము రక్షింపబడుదు'మని శ్లోకతాత్పర్యము. ప్రపంచమున దమ మేలుగోరువారు ధర్మమును రక్షింపవలసి యుందురని ప్రాచీనుల యభిప్రాయము. ఈ విషయము స్వతః సిద్ధమని వారెంచుచుండిరి. కాబట్టి భారతవర్షముననేగాక, సమస్త ప్రపంచమునగల ప్రాచీనగ్రంథములందు 'కో ధర్మః?' ధర్మమెయ్యది? అను ప్రశ్న యనేకస్థలములం దుల్లేఖింపబడి యుండుట చూడగలుగుదుము. కాని; ధర్మ మేమిటకు? అను ప్రశ్న నొకచోటను గనుగొనలేము. స్మృతులను దిలకించినను, దర్శనములను పరిశీలించినను, ఉపనిషత్తుల

నధ్యయన మొనరించినను, మఱియు నే యితర ప్రాచీనగ్రంథ ములను గాలించినను, ధర్మమన నేమి? సత్యధర్మ మెయ్యది? యను జిజ్ఞాస దృష్టిగోచరమగును గాని, ధర్మాచరణ మేల? అనిగానీ, మనుష్యు డేల ధర్మాత్ముడు కావలయును? అని గానీ ప్రశ్నించినట్లు గానరాదు.

ఆ యుగమున మానవుల కీప్రశ్న లెందులకు గోచరింప వయ్యె? వారు దూరదర్శులు కారా? వారి బుద్ధి యింత కుంఠితమైనదా? ఒక యుగపు మనుజులకంటె మరియొక యుగపు మానవులు అధికధీశాలులు కావచ్చును. నేటి మనుష్యుల బుద్ధికి బోడకట్టని విషయ మేబదివర్షములకు దరువాత రాబోవుసంతతి కనాయాసముగా తోచవచ్చును. కాని ప్రాచీనగ్రంథములం దానాటి విద్వాంసుల బుద్ధితీవ్రతను వెలిపుచ్చు ప్రశ్నలు వందలకొలది లభించును. వానిని జూడ నైహికాముష్మికాలోచనముల యౌన్నత్యము, అసా ధారణాలోచనా స్వాతంత్ర్యము, భావగాంభీర్యము ప్రకటమగు చుండును. మేధస్సంపన్నులయ్యు భూమ్యాకాశముల ననేకవిధ ముల శోధించిన ధీశాలు లయ్యును వారీ చిన్నప్రశ్న నేల స్పృశింపరైరి? దీనికి సమాధానమేమి? 'ధర్మాచరణమేల?' అనునది యొక స్వతంత్రప్రశ్న. ధర్మమన నేమి? అనునది అంగ ప్రశ్న. ముఖ్యప్రశ్నలు అంగప్రశ్నలకంటె గూఢముగా నుండును. అందువలన ప్రాచీనులు తీవ్రబుద్ధులయ్యు మూలప్రశ్నలవఱకు నేగజాలకపోయి రని యొకవిధముగ సమాధానము జెప్ప వీల గును. కాని ధర్మసంబంధమయిన సమస్య మానవజాతికి గంత

పాశ నెట్లయ్యె ననుసమస్య మన సమ్ముఖమున నుండకపోదు. ప్రపంచమునగల సభ్యాసభ్య జాతులన్నియు నీ సమస్యను గూర్చి విచారించుచున్నట్లు చూడగలము. మానవజాతుల జీవనమున నధికభాగము 'ధర్మ మననేమి?' అని మీమాంసించుటతోనే వ్యయమగుచున్నది. ఐతిహాసిక ఘట్టములు సాహిత్యమునగల ప్రధానగ్రంథములు, యుద్ధములు, సభలు, సామాజిక విప్లవములు, సంధివిగ్రహములు నన్నియు నేదో యొక యంశమున ధర్మమునకు సంబంధించి యున్నవి. ఆ యుగమున మానవు లీ వృక్షమూలము నన్వేషింపజాలకపోయిరని యంగీకరించినను వారి కీ వృక్షపరిచయ మెట్లుకలిగినది? దాని మాహాత్మ్యము వారివైయక్తిక సామాజికజీవనముల నెట్లు వ్యాపించినది? వాస్తవమున నిదియొక వృక్షమైయుండెనా? ఉన్నచో దానికి మూలము సైత ముండియుండును. మఱియు 'ధర్మ మెందులకు?' అను నీ ప్రశ్న, 'మనుష్యు డెందులకు' అను ప్రశ్నను బోలియున్నది. నేడు విజ్ఞానము మిక్కిలి పెంపొంది యున్నది. విజ్ఞానమునకు సంబంధించిన ప్రతి శాఖయందును విశాల సాహిత్యముకూడ నిర్మింపబడుచున్నది. ప్రతిశాఖయందు ననేకోపశాఖ లేర్పడి యవి వటవృక్షములవలె విశాలకాయములుగలవై విలసిల్లుచున్నవి. సమాజశాస్త్రము, అర్థశాస్త్రము, మనఃశాస్త్రము, భూగోళశాస్త్రము, ఇతిహాసశాస్త్రము మున్నగు ననేక శాస్త్రమీమాంసలు నేడు ప్రచురములై యున్నవి. వానిలో మానవసమాజ మెట్లేర్పడినది? అది యెట్లు వృద్ధిబొందినది? జడప్రకృతిపై నెట్లుఅధికారమును

కారణమేమన విజ్ఞానమన వర్తమాన వస్తువులంగూర్చి యధ్యాయన మొనర్చుటయే గదా ? కాబట్టి విజ్ఞాన మెన్నడు మానవ జీవనమునకు పథప్రదర్శకము కాజాలదు.

ధర్మమును బహిష్కరించి కేవల భౌతికవిజ్ఞానమును జీవన పథమునకు ప్రదర్శకముగా నెంచువారు పొరపడుచున్నారని మహాత్ముడైన టాల్‌స్టాయిగారి యభిప్రాయము. కారణమేమన, భౌతికవిజ్ఞానము వర్తమానకాలమున నున్నపదార్థములను మాత్రము మీమాంసించునుగాని భవిష్యత్తున రానున్న యసంఖ్యసమస్యలను బరిష్కరింపగల యోగ్యత దానికి లేదు. వైజ్ఞానికులు స్వయముగా భావిసమస్యలను మీమాంసింపగల శక్తి భౌతికవిజ్ఞానమునందు లేదనియు నొప్పుకొనుచున్నారు.

టాల్‌స్టాయ్ మహాశయుడు 'ధర్మమన నేమి?' (What is Religion) అను తన పుస్తకమున నొక విచిత్ర విషయమును బ్రదర్శించియున్నాడు. అది యెట్టిదియన, వైజ్ఞానికులును, అంధవిశ్వాసులయిన తదనుయాయులును (ధర్మాధికారుల ననుసరించువారిలో ననేకు లంధవిశ్వాసము గలవా రున్నట్లు వైజ్ఞానికుల యనుచరులలో నుందురు. ఇందాశ్చర్యమునకు దావులేదు.) ధర్మమును బహిష్కరింప యత్నించిన సమయమున వారు ధర్మమును బహిష్కరింప జాలకుండుటయేగాక మఱియొకవిధమైన నికృష్టధర్మోపాసకులైరి. దీనికి చరిత్రమునగూడ ననేకోదాహరణములు గాన్పించుచున్నవి. వర్తమానసమయమున పాశ్చాత్యదేశములందు నాగరికతపేరిట ధర్మమును బహిష్కరించుట కనేకవిధ

యత్నములు జరుగుచున్నవి. కాని ధర్మము సంశయవిశ్వాస మని తిరస్కరించునట్టివారే, యున్నతధర్మమునకు గాని, భౌతిక విజ్ఞానమునకు గాని సంబంధింపని వ్యర్థవిషయములందు చిక్కుకొనుటయేగాక వానిని విశ్వసించుచున్నారు. భారత వర్షమునందును ధర్మమువం దనేకవిషయముల సంశయవిశ్వాసములనిమోంచి వానిని విడచి, మృతజీవులను పిలిచి భవిష్యద్విషయములను గుఱించి వానినడుగుటయు, వానియందు విశ్వాసముంచుటయు మున్నగు భ్రమమూలకవిషయములందు చిక్కువడియున్న నాగరికుల నెందరినో మేమెరుగుదుము.

ఈ విషయమునందును టాల్‌స్టాయ్‌గారి వచనముల నుల్లేఖించుట బాగని తోచెడిని.

'ఇంతకుబూర్వ మొకానొక దేశమునగాని ఒకానొక సమయమునగాని మనుజుడు ధర్మమును విడిచి యుండగలిగినట్లు లేకున్నను, నేటి విద్వాంసులు ధర్మమును విడిచి యుండగలమనియు, నుండవలయుననియు జెప్పుచున్నారు. అంతియగాక విశ్వసించుచున్నారు. కాని, ధర్మము ప్రాచీనకాలమున నున్నట్లే నేడును విరాజిల్లుచున్నది అది మానవజాతికి హృదయము. ధర్మము లేకున్న మనుష్యజాతి సంచరింపనేరదు. శరీరమున హృదయము లేకున్న జీవన మసంభవమగునట్లు ధర్మము లేనిచో మానవజీవనము నట్లే యసంభవమగును. ప్రాచీన యుగములందును భిన్నభిన్న దేశములందు భిన్నభిన్న జాతుల యున్నతి వివిధరూపముల నగుటచే అనంత శక్తి, ఈశ్వరుడు,- దేవీదేవతల విషయమున మనుష్యభావ

ములు మారుచుండినను, మానవుడు జ్ఞానవంతుడైనప్పటి నుండి నేటివరకు కతడు ధర్మమును విడిచి యుండజాలక పోయెను. భవిష్యత్తున నుండజాలడు.'

ఫ్లింట్ (Flint) తన 'ఆస్తిక్యము' అను పుస్తకమున నిట్లు వర్ణించెను.

వాస్తవమున ధర్మమొక విశాలశక్తి. యధార్థముగా నిది మానవజీవనమునకు, జరిత్రమునకును సమానాంతరముగా నడచును. ఒకానొక దేశమునకో లేక సమయమునకో సంబంధించిన మానవులొకప్పుడైన ధర్మమును విడిచియున్నారనుట సంశయాస్పదము. ఇంతియగాక, మానవులు నివసించిన తావులందెల్లయెడల నేదోయొక ధర్మముండుటయేగాక అది వారి జీవనములందు మిక్కిలి ప్రాభవము చూపించెను. జాతుల నాగరికత వానిధర్మముచే వర్ణితమయియుండును. కలాకౌశలమునందును, సాహిత్యమునందును, విజ్ఞానమునందును, దర్శనశాస్త్రమునందును నెల్లయెడల వాని ప్రతియవస్థయందును ధర్మప్రభావము గనబడును.

ధర్మవ్యాపకతయందు కొందరకు విశ్వాసము లేదు. వారసభ్యజాతులలో నేవిధమైన ధర్మములేదని ఋజువు చేయుటకనేకయత్నములు చేసిరి. మోక్షముల్లరుమహాదయుడు తన 'సైన్సు ఆఫ్ రెలిజియన్స్ (Science of religions)' అను పుస్తకమున నుపర్యుక్తవిషయమును గూర్చి కొన్ని సాక్ష్యముల నుల్లేఖించెను. కప్తాన్ గార్డినర్ (Gardiner)

క్రీ. ౧౮౩౬ సం॥న జూలూ (ఆఫ్రికా అరణ్యజాతి) వారితో కలిసి యీ క్రిందివిధముగ సంభాషించెను.

గార్డినరు:- జగమును రచించిన శక్తిని గురించి నీ కేమైన తెలియునా? సూర్యుని యుదయాస్తమయములను, వృక్షముల యభివృద్ధిని చూచినపుడును వీనిని రచించువానిని గూర్చిగానీ, శాసించువానిని గూర్చిగానీ నీకేమైన తెలియునా?

'టపాయీ' యనునొక జూలూ:- (కొంచెము యాలోచించి) మేము వీనిని జూచుచున్నాము; కాని, ఇవి యెట్లు వచ్చునవో తెలియదు. అవి తమంతటతామే వచ్చుచున్నవని మాతలంపు'.

గార్డినరు:- 'అట్లయిన యుద్ధములందు కలుగు జయాపజయములకు కారణ మెవనిగ భావింతురు?'

'టపాయి:- మేము శత్రువులతో నోడిపోయి పశువులను వశపరచుకొనలేనపుడు మాతండ్రి-ఇటోంగో మామీద కృపాదృష్టిని ప్రసరింపజేయలేదని యెంతుము.'

ప్రశ్న:- 'నిపితరులయాత్మ లీప్రపంచమును సృష్టించినట్లు నీవెంతువా?'

టపాయీ:- లేదు.

ప్రశ్న - మనుష్యుని యాత్మ శరీరమును విడిచి యెట కేగునో నీకు తెలియునా?

టపాయీ:- మేము చెప్పలేము.

ప్రశ్న:- అది యెల్లప్పుడు నుండునని యెరుగుదురా?

టపాయీ:- మేము చెప్పజాలము. మేము యుద్ధములకు వెళ్లినప్పుడు మాపూర్వుల యాత్మలు మాపై కృపాదృష్టినుంచునని విశ్వసింతుము. కాని యితరసమయములందు వానిని గురించి మేము విచారింపము.

ఈ సంభాషణానంతరము కప్తాన్ గార్డినరు మహాశయుడు ఆఫ్రికా జూలూ జాతియందెట్టిధర్మము లేదని భావించెను. ఇది సత్యమగుచో ధర్మము సర్వవ్యాపకమనియు, నది సర్వావస్థలందు మానవజాతి నంటియుండుననియు, వ్రాసిన మాలేఖ ఖండితమగును. కాని మోక్షమూలరు మహాశయుడు గార్డినరు సాక్ష్యమును విశ్వసనీయమని యెంచడయ్యె. 'ఒక శ్వేతజాతీయు డొంటరిగా నసభ్యజాతుల మధ్యకేగి, వారి భాషలందు పరిచయము సంపాదింపక యేరెండుమూడు ప్రశ్నలో యడిగి వాని యుత్తరముల నాధారముగా గొని యొకానొక నిశ్చయము గావించుట యుచితము గాదు. ' కారణమేమన: అసభ్యజాతులలో ననేకులు శ్వేతజాతీయులన్న భయపడుదురు. మఱియు వారడుగు ప్రశ్నలకు సరియైన సమాధానము నీయజాలరు. లేదా సమాధాన మొసంగ నిచ్ఛగింపరు. ఇం దసత్యములేదు. అనాగరికులే కాదు-సభ్యజాతులకు సంబంధించిన ఒక క్రైస్తవునకంటె నెక్కువ ధార్మికజ్ఞానముగలిగిన భారతవర్షమునందలి గ్రామీణజనులు తమభావములను శ్వేతజాతీయులయెదుట ప్రకటింపనెంచరు. సాధారణ సంభాషణ పరిణామముకూడ

నేమగునో యని భయపడుదురు' అని మోక్షమూలరు చెప్పెను.

మోక్షమూలరు తలంపు సత్యదూరముకాదు. కారణ మేమన, రెవరెండు డాక్టర్ కోలెవే (Callaway) యను నొక పాదిరి జూలూజాతి మధ్యమున బహుకాల ముండెను. ఆజాతిభాషను భాషించుటకును, తెలిసికొనుటకు సమర్థుడయ్యెను. అపుడతడు జూలూజాతి ధర్మశూన్యముకాదని యెఱింగెను. ప్రతివంశమున కొకమూలపురుషుడును, అట్లే సమస్తమానవజాతి కొక మూలపురుషుడు నున్నట్లు వారెంచుచుండెడివారు. మానవజాతి కాదిపురుషు డైనవానిని 'ఉన్‌కులంకులూ' (Unkulunkulu) అని పిలుతురు. ఈ శబ్దమునకు జూలూ భాషయందు ప్రపితామహుండని యర్థము. ఈశబ్దమునకు సంస్కృత కులశబ్దముతో దూరస్థసంబంధముండి యుండవచ్చును. ఉన్‌కులంకులుని తండ్రి యెవ్వరని వారినడుగ అతడు వంశము వెదురునుండి వచ్చెనని (Branched off from a reed) చెప్పిరి. జూలూ భాషయందు వెదురు వాసమునకు 'ఉథ్లంగ' (Uthlanga) యని పేరు. బిడ్డలు తండ్రిని ఉథ్లంగ యందురు. కారణమేమన, వాసమునుండి రెబ్బలు పుట్టినట్లు తండ్రివలన సంతానమేర్పడును. ఉథ్లంగి శబ్దమునకు వాస్తవికార్థము మఱియొకటై యుండునని డాక్టర్ కోలేవే అభిప్రాయము. జను లా యర్థమును మరచియుందురు. కేవల శబ్దము మిగిలియుండును. ప్రొ. మోక్షమూలరు నభిప్రాయమున సంస్కృతవంశశబ్దము వాసము

(బాంగు) కులము అను నర్థములం దుపయోగింపబడునట్లు ఉన్ లంగ శబ్దమునందును పరివర్తన మేర్పడియుండునని స్పష్ట పడుచున్నది.

డాక్టర్ కోలేవేతో నొక జాతీయు డిట్లనెను. 'స్వర్గ రాజునుగూర్చి మేము శ్వేతజాతీయులనుండి ప్రథమమున నేర్చుకొనియుంటిమనుట సరిగాదు. వేసవియందాకాశ మున మేఘములు గర్జించుటజూచి రాజు (ఈశ్వరుడు) క్రీడించుచున్నా డనుచుందుము. మాలో నెవడైన భయ పడిన వృద్ధులు 'నీవు రాజుసొమ్మేమితింటివి, ఎందులకు భయ పడుచున్నా' వని మందలింతురు.

మఱియొక వృద్ధుడిట్లు నుడివెను. 'మేము బాల్యమున రాజు స్వర్గమున నున్నాడు (The king is in Heaven) అని వినుచుండెడివారము. రాజు పైనున్నాడని చిన్ననాడు వింటిమి. మా కతనినామము తెలియదు. లోకమును సృష్టించు వాడు ఉమ్దబూకో (Umdabuko) అను వాడు. అతడు పైనున్నాడనియు మేము వింటిమి.'

ఒకానొక వృద్ధ స్త్రీయు నిట్లుచెప్పెను. 'అన్న మెట నుండి వచ్చుచున్న'దని నేనడిగినపుడు 'ప్రపంచమును రచించిన వాడే అన్నమును సృష్టించెను. కాని వాని నామమును మేమెరుంగము.' అని వృద్ధజనులు చెప్పుచుండెడివారు. "ఈశ్వరు డెక్కడనున్నాడు? మనమతని నేలచూడనేరము?' అని యనినపుడు 'అతడు స్వర్గమునందున్నాడు- రాజులకురాజు'

అని వృక్షాలు సమాధానము చెప్పినరు. ఎప్పుడైన నొక పశువు పిడుగుపాటుచే మరణించినచో 'దేవుడు దానిని గ్రామమునుండి గొనిపోయెను' అని లోకులందురు.

కొండొకవృద్ధు డీవిధముగ బలికెను. 'మా పూర్వుల యభిప్రాయమునుబట్టి 'ఉసకులంకులూ' అనునొక మనుష్యుడు భూమిపై నుండును. ఒక రాజు స్వర్గమున నుండును. జీవనమునకు మూలము స్వర్గమున నున్నది. అదియే మానవులకు జీవన మొసంగును. రాజు మేఘములను వర్షింపజేయును. సూర్యచంద్రుల నుదయింపజేయును. చంద్రకాంతి రాత్రి యందు తెల్లగా ప్రకాశించును. దానివలన మానవులు నిరపాయముగా సంచరింతురు.' అని మా పూర్వులతలంపు.

ఒక జంతువుమీద పిడుగుపడినపుడు, జనులు నిట్లు పలుక 'రాజు దీనిని తనభోజనముకొరకు జంపెను- నీకేల? ఇది రాజదికాదా? అతడాకలిగొనియున్నాడు. అందువలన నతడు తనకొఱకై చంపెను.' అని పలుకుదురు. మనుష్యుని మీద పడినట్లయిన 'రాజతని నపరాధిగా నెంచెను' అని లోకు లందురు.

జూలూ భాషయందు జగత్కర్తకు 'ఇట్లోంగో' (Itongo) అనియు నామము కలదు. ఒక జూలూ యిట్లనెను: 'ఇట్లోంగో' శబ్దమునకు మనుష్యుడనికాని మానిసి చేసిన వాడనిగాని యర్థముకాదు. మనుష్యపశుపక్ష్యాదుల కాధార భూతమైన పృథివిని ధరించిన శక్తి యని దాని యర్థము.

మనకు పృథివి యాధారము. దానిపై మనము నివసించు చున్నారము. మన కాధారరూపమున సహకారియైన యీ పృథివికి నొక యాధారమున్నది.'

దీనిమీద మోక్షమూలరు మహాశయు డిట్లు వ్యాఖ్యానము చేయుచున్నాడు.

'ఈ విధముగా నేజాతులను ధార్మికజీవనశూన్యములనియు, ఈశ్వరునిగూర్చిన భావము లేదనియు మన మెంచుచుంటిమో వానియందును అనేకావశ్యక ధర్మాంగము లున్నట్లు మనకు తెలియుచున్నది. అనగా నందఱను పుట్టించినవాడొకడు స్వర్గమున నుండును. అతడు మేఘములను, వడగండ్లను, విద్యుత్తును పంపును. అపరాధులను దండించును. మఱియు వేలకొలది కొండపసువులనుండి తనకొఱకు బలిని గ్రహించును' అను నగోచరుడగు నీశ్వరవిశ్వాసము వారిలో నున్నది. దీనింబట్టి యారణ్యకజాతుల ధర్మశూన్యత విషయమున నొసంగబడు నిషేధాత్మక సాక్ష్యమును స్వీకరించుటలో నెంత జాగ్రత్త తీసికొనవలసియున్నదో ప్రకటమగుచున్నది.

ఇంతవరకు వ్రాసినదానిచే, మానవుల చరిత్రము నాధారముగా గైకొని ప్రపంచమున నేజాతియు ధర్మశూన్యమై యుండలేదనియు నికముందు నుండబోదనియు జూపుటకై యత్నించితిమి. మానవమాత్రుని హృదయమున ధర్మక్షుధ యుండును. క్షుధాతురు డొకప్పు డుచితానుచిత

పదార్థములద్వారా తన పొట్ట నింపుకొనునట్లు కొన్నిసమయ ములందు వ్యక్తులు జాతులు హానికలిగించు పదార్థములను సైతము తమధార్మికక్షుత్తును తీర్చుకొన నుపయోగించు చుందురు. కాని, యాహారమును గ్రహింపనిచో మనుజుడు జీవింపనట్లు ధర్మమును విడిచి యేజాతియు జీవింపనేరదు. క్షామపీడితజను లిసుకను సైతము బొక్కుదురు. ఆకటిచే మృత్యువు వాతబడు తల్లులు తమ బిడ్డల మాంసమును కాల్చితిందురు. ఆకలిగొన్నపుడు నాగరికజాతులును, ప్రియ మిత్రులను జంపి తినుటకు వెనుకాడరు. కాని, యుత్తమ భోజనము లభించినపుడుకూడ నవి యట్లుచేయుననిగానీ, యనుచితభోజనము వారికి హానికలిగింపదనిగానీ యెంచజనదు. దానివలన హాని కలుగకమానదు. అయినను ఆకలి వివశు లను జేయును. పొట్టను నించుట కేదైన నుపయోగింపక తప్పదు. ఇట్లే ధర్మతృషచే పీడితులైనవారికి సత్యధర్మము లభింపనపుడు నానావిధ దుస్సాధనములతో వారు తమదప్పికను తీర్చుకొన యత్నింతురు. వానివలన నపారనష్టము లనుభ వింతురు. కాని వారొకింతకాలమైన ధర్మమునువిడిచి జీవింప జాలరనుట నిస్సంశయము.

'జలము వెలుపల మత్స్య ముండనేరనట్లు, సాధారణ మానవుడు కూడ ధర్మబాహ్యుడై యుండజాల డనుట మనోవిజ్ఞానమునకు సంబంధించిన యఖండనీయ సిద్ధాంతమయి యున్నది.' (మేడమ్ బ్లేవట్స్కీ)

ఈకాలపు జనులు ధర్మము నెందుల కేవగించు చున్నారు? దీనికి రెండు ముఖ్యకారణములగపడుచున్నవి. మొదటికారణము ధర్మముపేరిట జరుగు నన్యాయములు. రెండవది యంధానుకరణము ధర్మమునెపమున వేలకొలది యుపద్రవములు తఱచు జరుగుచున్నవి. జనులు ప్రాణములతోనే దగ్ధముచేయబడుచున్నారు. వందలకొలది పశువులు నిర్హేతుకముగ జంపబడుచున్నవి. జాతులు పరస్పర రక్తపానము నపేక్షించుచున్నవి. ఇట్లు మానవజీవనము ధర్మవ్యాజమున నత్యాచారభూయిష్ఠమై యశాంతికి నెలవగుట జూచినపుడు విచారకులకు ధర్మమున నసహ్యభావమేర్పడుచున్నది. కాని వీరి యేవగింపు ఇసుకను బొక్కుచున్న క్షుధాపీడితుని జూచి భోజనము నేవగించి భోజనమువలన నిట్టియుపద్రవము లుత్పత్తిల్లుచుగాన మనుష్యునకు భోజనమే తగదనునట్లు తోచుచున్నది. యథార్థమున, నిసుక నారగించువాని కది సరియైన యాహారము కాదు. అన్నము భుజింపుమని బోధించుట న్యాయమగును. స్థిరబుద్ధితో పరిశీలించి చూచిన నేడు ధర్మవ్యాజమున జరుగు హింసాదులకు మూలము ధర్మముకాదు. అధర్మమే. అది ధర్మవేషమును దాల్చి యిన్ని దుష్కృత్యముల నాచరింప జేయుచున్నది. నేనొక శత్రువును బరాజితుని జేయనెంచితి ననుకొనుము. అందు నా సహచరు డొకడు నాకు సహాయ మొనర్పనెంచనపుడు వాని యజ్ఞానము ననువుగాగొని యతని కుత్సాహాము గల్పించి శత్రువును చంపుట ధర్మమని నమ్మించిన

వాడు నాకు సహాయకు డగును. చరిత్రమే దీనికి సాక్షి. ఔరంగజేబు తనసోదరు డయిన 'దారా' ను చంపగోరెను. అతడు తన కోర్కెను నెరవేర్చుకొనుటలో 'దారా'ను ధర్మ శత్రువుగా నిరూపింపనంతకాలము సఫలుడు కాజాలకపోయెను. నిజ మారయ నిట కారణము ధర్మముకాదు; స్వార్థమే. స్పెయి నులు, బుడతకీచులు (పోర్చుగీసులు), దక్షిణఅమెరికా యడ వులలో నున్న యాటవికుల నశింపజేసి యట నివసింపనెంచిరి. ఇందుల కేదైన నెప మవసరమయ్యెను. ఆ యాటవిక జాతులు వీరి కొనరించిన యపకార మొందును లేదు. అతిథులవలె వీరిని సత్కరించిరి. ఇట్టి సాధుజనుల నశింపజేయ నొక వ్యాజ మత్యావశ్యకమయ్యెను. అందువలన నొకమాటు ఒక 'పాదిరి' యాటవిక జాతులలో నొకటియగు 'ఇంకా' జాతి నాయకుని సమీపించి తన 'ఇంజీలు' (బైబిలు) నతని హస్తమున నుంచి 'ఇది చెప్పినట్లు మీరు నడుచుకొనవలయు'నని నుడివెను. ఆ నాయకు డాపుస్తకమును తన కర్ణసమీపమునకు గొనిపోయి యేమియు వినబడమి 'ఇది యేమియు చెప్పుటలేదు. నేనేమి నడచుకొందు' ననుచు దానిని క్రింద బడవేసెను. ఇక గావలసినదేమి? పొంచియున్నందులకు కుందేలు చేత జిక్కి నది. వారికి కావలసినది నెపము. 'నీవు మా ధర్మ గ్రంథము నవమానించితివి. అందులకు నీవు దండ్యుడవు. అని నాగరిక శ్వేతజాతి తన శస్త్రాస్త్రముల నుపయోగించి యా జాతిని రూపుమాపినది. ఈ యుపద్రవమునకు మూలము ధర్మమా? స్వార్థమా? కొంచె మాలోచించి బుద్ధిమంతులు

నుడువుచుందుగాక. ప్రస్తుతము భారతవర్షమున ధర్మ మనుపేర హిందూ మహమ్మదీయులలో ననేక కలహములు ప్రతిదినము జరుగుచున్నవి. 'మీరు మా మసీదుల యెదుట మేళములు వాయించెద రేని మేము మీ తలలను బగులగొట్టుదుము.' ఎందులకు? ఎందులకా? 'మేళమువలన మా 'నమాజు' నకు విఘ్నము కలుగు'నందురు మహమ్మదీయులు. ఈయుపద్రవమునకు నమాజు కారణమా? యెన్నడును గాదు. వాస్తవమున 'నమాజు' ద్వారా ఈశ్వరుని బ్రార్థింపబూనిన వారికి మసీదు వెలుపల మోటారులే పోవుచున్నవో, లేక మేళములు జరుపబడుచున్నవో తెలియుట కష్టము. కాని, నమాజు చేయుటకు పూర్వమే హిందువుల వాద్యముల నన్వేషింప బూనినవారికి నీశ్వరధ్యానమున కవకాశమే లభింపనేరదు. నమాజు కేవలము నెపము, స్వార్థము. హఠముతప్ప యిందు మఱియొండు గానరాదు.

లోకమున నుపద్రవములన్నియు ధర్మమువల్లనే జరుగు చుండునని యెంచుటయు ప్రమాదమే. రాజనీతి నూతగాగొని వందలకొలది యుద్ధములు జరుగుచున్నవి. ఆహారనిమిత్తమై యనేక కలహములు బయలుదేరును. న్యాయాలయములను, కారాగారములను బరిశీలించినట్లయిన నూటికి తొంబది తొమ్మిది (యభియోగముల) యుపద్రవములకు గారణము ధర్మేతరమనియే బోధపడును. జాతులకు సంబంధించిన వందలకొలది యుద్ధములకు గారణము రాజనీతియే గాని ధర్మము కాదు.

౧౯౧౪ సం॥ పు ఐరోపామహాయుద్ధమునకు చెందిన జాతుల ధర్మములో భేదము లేదు. ఒకే ధర్మమునకు సంబంధించిన జాతులలో నిట్లనేక యుద్ధములు జరిగినవి. ధర్మప్రనెపమున దేవతలకు వందలకొలది పశువులు బలిచేయబడిన. విజ్ఞాన వ్యాజమున జీవనశాస్త్ర ప్రయోగశాలలందు (Biological laboratory) ప్రతిదినము లక్షలకొలది జీవులు మృత్యువువాత బెట్టబడుచున్నవి. మరియు భోజనప్రియు నెపమున ప్రత్యహము నిరపరాధములై మానవజాతి కత్యంతోపయుక్తము లగు కోట్లకొలది పశువుల కుత్తుక లుత్తరింపబడుచున్నవి. లోకైక-సంస్కర్తయు నిట్టి యసంఖ్య ఘోరములను హేతువగు రాజనీతిని త్యజింప బోధింపదేల? యథార్థమైన రాజనీతి యీఘోరముల నంగీకరింపదందురేని సత్యమైన ధర్మము మాత్రము అన్యాయములను, ఉపద్రవముల నెట్లంగీకరించును? అందువలన ధర్మము నెపమున జరుగు నత్యాచారములకు గారణ మధర్మమేకాని యథార్థ ధర్మము కాదు.

ధర్మము సేవించుటలో రెండవకారణము 'మహాజన' అంధవిశ్వాసమని యుల్లేఖించి యుంటిమి. 'మహాజనో యేన గతః సపంథా' సంఘమున గౌరవముగల వ్యక్తు లేసిన నట్లే సామాన్యులును పలుకుచుందురు. ఒక పెద్దమనుష్యుడు 'ధార్మిక దంభములను విడిచిపెట్టుడు; దీనివలన ననేక విప్లవము లుప్పతిల్లుచున్నవి' అని యనును. అంతట సాధారణ మనుష్యులును ధర్మమును నిషేధించుటయే గొప్పవారగుటకు సాధనమని యెంచి యా పెద్దమనుజుని

వాక్యములనే యేకరువు బెట్టసాగుదురు. నేటి స్వతంత్ర వైజ్ఞానికులు ధార్మికవిషయముల నేవిధముగను విమర్శింపక వానిని దమ కార్యక్షేత్రమునకు బాహ్యములని యెంచుచున్నారు. అయినను నింతకు బూర్వము కొందఱు వైజ్ఞానికులు ధర్మమును దిరస్కారదృష్టితో జూచియుండిరి. అందువలన కళాశాలలందును, విశ్వవిద్యాలయములందును, మఱియు నితరోన్నత సంస్థలందును సంచాలకులు వారి మార్గము నే యనుసరించుచున్నారు. విద్యార్థులును వారితో నేకీభవించి ధర్మమును దిరస్కరించుట శ్రేయస్కర మనుకొనుచున్నారు. కొండొక కళాశాలయం దొకానొక ప్రిన్సిపాల్ గాని, ప్రొఫెసర్ గాని, 'ఈశ్వరప్రార్థన నిరర్థక' మని బోధించినపుడు విద్యార్థులును మంచి చెడుగులను విచారింపకయే వారి మాటలను యథార్థమని యెంతురు.

ధర్మ మొక సర్వవ్యాపకమగు వస్తువని తెలుపుట కింతవరకు యత్నించితిమి. మా పాఠకులు 'మీ రింతవరకు ధర్మమునకు లక్షణమేమో వ్రాయనైతి' రని యడుగుదురు. వాస్తవమున నెఱిగి యెఱిగి ధర్మలక్షణ మింతవఱకు వ్రాయకుంటిమి. అతివ్యాప్త్యవ్యాప్తిదోషములు లేనిదే లక్షణమగును. దోషములను బరిశీలించుటకు పూర్వము వస్తుపరిచయ మవసరము, కాబట్టి ధర్మనామముతో పాఠకులకు బరిచయ మొనరించితిమి. మూడునాలుగేండ్ల ప్రాయముగల బాలునకు గోవు విషయమున నున్నంత జ్ఞానము సాధారణముగ మనుష్యుల కెల్లరకు ధర్మవిషయమున నుండును.

బాలకుడు గోవును గుర్తించును. పొరబడక 'ఇది ఆవు' అని చెప్పగలిగి యుండును. ఇతర విశేష విషయము లతనికి గోవు విషయమున దెలియక పోవచ్చు. ఇట్లే ప్రతిమనుజుడు 'నిది ధర్మ మిదియధర్మము' ని సామాన్యముగా నెఱుగగలిగి యుండును. గూఢవిషయముల నెఱుంగకుండుటలో నాశ్చర్యము లేదు. ఒక కవియు నీవిషయము నెట్లు వర్ణించెనో చూడుడు.

'ధర్మస్య తత్త్వం నిహితం గుహాయామ్.'

ధర్మతత్వ మతిగూఢ మని దీనిభావము. ధర్మము సంస్కృతశబ్దము. సంస్కృత సాహిత్యమున ననేకార్థములు చూడనగును. వానితో మన కెట్టిప్రయోజనమును లేదు. ఉదాహరణార్థ మిట గొన్నిటి నుదాహరింతును. యోగదర్శనమున బతంజలి ముని ధర్మవిషయమున నిట్లు వ్రాసియున్నాడు.

"యోగ్యతా వచ్ఛిన్న ధర్మిణః శక్తిరేవ ధర్మః"

ధర్మియొక్క యోగ్యతా యుక్తశక్తియే ధర్మము. అగ్నికి దాహకశక్తి ధర్మము. అది నశించి భస్మమయినపుడు దానిని అగ్ని యని వాడరు. ఇక్కడ ధర్మమన 'ధారణ చేయున' దని యర్థము (ధరతీతి ధర్మః). మహాభారతము నందు నీ యాశయ మొకచో వెల్లడింపబడినది.

"ధారణా ద్ధర్మ ఇత్యాహుః, ధర్మో ధారయతే ప్రజాః
యత్స్యా ద్ధారణ సంయుక్తం స ధర్మ ఇతి నిశ్చయః"

'ధారణ చేయుటవలన ధర్మ మని పేరు గలిగినది. ధర్మము ప్రజను ధరించును. నిశ్చయముగా దేనివలన ధారణ

తెలుపునో యదియే ధర్మము- 'ధర్మ' శబ్దమున కింత విశాలార్థ మిష్టమయిన మనుష్యత్వము సైతము ధర్మమగును. అందు వలన మీ సిద్ధాంతముల నంగీకరింపకున్నను మేము ధార్మికు లము కాగలమని ధర్మవిపక్షు లనవచ్చును. వారి యీ యాక్షేప ముచితమే. ధర్మవిపక్షులును మనుష్యత్వము నిషే ధింపరుకదా!

ఇట్లే (మనువుచే) వర్ణింపబడిన ధర్మలక్షణములను నాస్తి కులు కూడ స్వీకరింపగలరు. అది యెట్లన:

'ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః
ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్'

ధృత్యాది లక్షణములతో నేరికిని విరోధ ముండ జాలదు. కాని యింతమాత్రమున సమస్య పరిష్కరింపబడదు. కాబట్టి ధర్మమున కీక్రింది విధమున

'వేదప్రతిష్ఠితం కర్మ ధర్మ స్తన్మంగలం పరమ్
ప్రతిషిద్ధ క్రియాసాధ్యః స గుణోఽధర్మ ఉచ్యతే॥

'వేదవిహిత పరమశుభకరమగు కర్మయే ధర్మము. తత్ప్రతికూలకర్మ యధర్మము' అని లక్షణ మొనరించుచో వేదములందు విశ్వాసము లేనివారు దీని నంగీకరింపరు. వేద విపక్షులు పైధర్మము అవ్యాపకమగుటచే తమకు సంతోష మును గలిగింప జాలదందురు.

**మనువు సైతము**

'శ్రుతిః స్మృతిః సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్.'

అను నీ శ్లోకమున శ్రుతి స్మృతులకే యెక్కువ ప్రామాణ్యమొసంగుచున్నాడు. ఇదియు సర్వాంగీకారము కాజాలదు.

వైశేషికాచార్యుడగు కణాదమహర్షిచే నిర్వచింపబడిన
'యతోఽభ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స ధర్మః'

'లోక పరలోకములు దేనివలన సిద్ధించునో అది ధర్మము' అను నీ ధర్మలక్షణమునందు ననేకులకు విశ్వసింప ననువుపడని పరలోకశబ్దమొకటి చేర్పబడి యున్నది. అది లేకున్న గొంతవఱ కీలక్షణము ప్రయోజనకరమై యుండెడిది.

మఱియు ప్రస్తుత విషయమునకు సంబంధింపని యనేకార్థములు ధర్మవిషయమున గలవు. 'మాసిక ధర్మము' న గల ధర్మ శబ్దము నియమార్థకము. సంస్కృతమున పలుచోట్ల ప్రయోగింపబడిన 'ధర్మాధ్యక్ష' పదమునగల ధర్మపదమునకు దానమని యర్థము.

అందువలన మేమీ పుస్తకమున ధర్మశబ్దము, ఆంగ్లేయము, పార్సీ భాషలందు క్రమముగా నుపయోగింపబడు రెలిజన్ (Religion) 'మజహబ్' శబ్దములకు బర్యాయముగా నుపయోగింతుము. పలువుర దృష్టిలో ధర్మశబ్దమునకు రెలిజన్ (Religion) 'మజహబ్' శబ్దములు పర్యాయములు కానేరవు. వీరి యభిప్రాయము కొంతవరకు అంగీకరింపదగినదే. అయినను ప్రస్తుతము ధర్మము 'రెలిజన్' శబ్దములు సమానార్థ

కములుగా వాడబడుచున్నవి. సాధారణ జనులేకాక విద్వాంసులును వీనిని పర్యాయములుగానే యెంచుచున్నారు. అందువలన నీ పుస్తకమున ధర్మశబ్దమునకుగల యౌగికార్థమును బరిగణింపక ప్రస్తుత లౌకికార్థమునే లక్ష్యమందుంచుకొని పై పుటలం దాశబ్దమును బ్రయోగించి యున్నారము. తదనుసారముగా మా ధర్మశబ్దమునకు లక్షణ మీ క్రిందివిధమున నుండును. 'మనుష్యునకు దనకంటె నున్నతమై యదృష్టమయియుండు శక్తియందుగల విశ్వాసము-మఱియు నావిశ్వాసముచే బ్రభావితుడై చేయు వ్యాపారము ధర్మ మనబడును.' ఈ లక్షణము ననుసరించి ధర్మ మొక సర్వవ్యాపకవస్తువు. దీని నతి నికృష్టులగు ననాగరికులు మొద లుత్తమోత్తమ నాగరికుల వఱకు నందరయందు జూడగలుగుదుము. మానవుడు తనకంటె నుత్తమమగు నొకానొక శక్తియందు విశ్వాసముంచని యవస్థ యేజాతి యందు నెన్నడును జూచియుండము. అట్టి విశ్వాసము మానవజీవనమున బ్రభుత్వము చేయకుండుటను గాంచ నేరము. ఒకప్పుడు కొందఱు విద్వాంసులు మాత్రము విశిష్టశక్తిసత్తు నంగీకరింపక తమ మతమును బోషించుటకు తగిన యుక్తులను బ్రదర్శించియుందురు. కాని వారి వ్యవహారమును బరికించిన వారును తాదృశశక్తి నంగీకరించినట్లు తోచకపోదు. ధ్యానపూర్వకముగ నిరీక్షించినట్లయిన వారి జీవనయాత్రయు నీశ్వర విశ్వాసకులచే స్వీకరింపబడిన నియమములందే నడచినట్లు గోచరింపకపోదు. దీనికి జైనులే ఉదాహరణము. జైనులు

లీశ్వరు నొప్పుకొనరు. కాని వారి దేవాలయములు, పూజా విధులు, నడవడులు రీతిరివాజులు, సదాచార నియమములు నన్నియు మనుష్యజాతికంటె నుత్తమమగు నొక శక్తివిశేషము నందు వారికి విశ్వాసమున్నట్లు తెలియజేయును. ఈశ్వరుని యందున్న గుణములన్నియు నా శక్తియందు వారికి గోచరింప కున్న నుండవచ్చు. ప్రపంచమున ననేకులు భూమియందుండు నాకర్షణశక్తి నెఱుగకుందురు. కాని, ఆ యాకర్షణశక్తి వ్యాపకమగుటచే నెల్లర వ్యాపారములందును తన ప్రాభవమును జూపకపోదు. భూమ్యాకర్షణ నపేక్షింపకయే సర్వకార్యములు నడవగలవని నమ్మువారు ఆకర్షణశక్తిలేని స్థలమున నివసించి తమ మతమును సార్థకపరచి చూపవలసిన వారగుదురు. ఇట్లే మానవజీవనమును సుఖపూర్ణముగను, సదాచారయుక్తముగను జేయుటకు ధర్మముగాని, యాస్తికత్వముగాని యవసరము లేదనువారు ధార్మిక భావములతో నేవిధమగు సంబంధము లేని మానవజాతిని నిర్మించి రూపింపవలసియుందురు. ఆకర్షణ శక్తి రహితభూభాగము లభించుట యసంభవమైనట్లు ధార్మిక ప్రభావరహితమగు మానవసంఘమును నిర్మించుటయు నసంభవమనియే మావిశ్వాసము. ధర్మము నపేక్షింపకయే మేము సత్యాస్తేయాది సదాచారములకు సంబంధించిన నియమము లను భావింపగలమని యనేకులు ఎలుగెత్తి చెప్పుచుందురు. కాని వారేసమాజమునకు సంబంధించినవారో యాసమాజము నందు వారికి బూర్వమే సదాచారమునకు సంబంధించిన ధార్మిక భావములు వ్యాపించియుండుటను జూచినపుడు వారి పలుకులు

వ్యర్థములని తోచకపోవు. ఒకానొక సువ్యవస్థిత రాజ్యము నందు నివసించుచు రక్షకభటసహాయ మపేక్షింపకయే 'నేను జీవనమును సుఖప్రదముగ నడుపుకొనగల' నని చెప్పుట సర్వదా వ్యర్థమగును. కారణమేమన: ఆరాజ్యప్రజలందు రక్షకభటుల ప్రాభవ మంతకు బూర్వమే వ్యాపించియుండుటచే నట చౌర్యాదులు సహజముగా జరుగనేరవు. అట్టిచో నొకరు 'సుఖజీవనమును గడపుటలో రక్షకభటులసహాయ మపేక్షింప' ననుట వ్యర్థముగాక మరి యేమగును? అట్లే యాస్తిక్య భావములయు, ధార్మికభావములయు ప్రచారముగల సమాజము నందు నివసించుచు ధార్మిక ప్రభావవిముక్తులమై యుండగల మని యెంచుటయు, నట్టిడంబములు పలుకు చుండుటయు సాహసమే యగును.

పై పంక్తులలో ధర్మ మొక వ్యాపక విషయమని నుడివి యుంటిమి. 'ఆస్తిక్యము' ధర్మమునకు ముఖ్యాంగము. 'ఆస్తిక్య' మనగా మనుష్యునకు తనకంటె నధికమగు నున్నత శక్తియందు విశ్వాసముంచుట యని తాత్పర్యము. ఈ విశ్వాసము కొందఱకు భూతప్రేతములం దుండవచ్చు. కొందఱకు నిరాకారమునందును, మఱికొందఱకు సాకారమునందును నుండవచ్చును. ఈ విశ్వాసమునకు లక్ష్యము సర్వవ్యాపకమగు పదార్థము కావచ్చు. ఏకదేశీయవస్తువును గావచ్చును. దయాళువునందో, లేక క్రూరశీలునియందో యీవిశ్వాసము కేంద్రీకరింపవచ్చు. ఎట్లైనను నొకచో నందరకు నిట్టి విశ్వాసముండుటలో సందేహము లేదు. కాబట్టి 'ఆస్తిక్యము' నయితము సర్వవ్యాపక

మనవలసి వచ్చుచున్నది. ఇది ప్రతిదేశమునను, సర్వకాలము లందు మనుష్యులలో జూడనగును. రానున్నపుటలందు 'ఆస్తికభావము'న గల సత్యాసత్యములను పాఠకులకు తెలుప యత్నింతుము. కాని యాస్తికభావముయొక్క యస్తిత్వమును గూర్చి యేరికిని సందియముండజాలదని నమ్ముచున్నాము.

ఈ విషయమున మఱిరెండాక్షేపములు గలవు. వాని నిట దూరమొనర్చుట యుచితమగును. అందు 'ఆస్తిక్యము సర్వవ్యాపకమగుచో ఆస్తికులలో నొకసంఘము మఱియొక ఆస్తికసంఘమును నాస్తికమని దూషింపనేల?' అనునది మొదటిపక్షము. 'ఆస్తికత సర్వవ్యాపకమగుచో దాని ప్రచారముకొరకై యాస్తికు లేల యత్నించుచున్నారు' అనునది రెండవ ఆక్షేపము.

ఒకానొక యాస్తిక సంఘము మరియొక యాస్తిక సంఘమును నాస్తికసంఘమని నిందించుటయేగాక వాస్తవముగ నా సంఘమును నాస్తిక సంఘమనియే యెంచుచున్నదని మొదటి యాక్షేపకుల తాత్పర్యము. మహమ్మదీయులు ఈశ్వరు నొప్పుకొందురు. కాని, వారిదృష్టిలో మహమ్మదీయేతరు లెల్లరు నాస్తికులే. అందువలన వారిని 'కాఫిరు' లందురు. క్రైస్తవుల పరిస్థితియు నిట్లే. హిందువులుకూడ హిందువులనే యాస్తికులని యెంతురు. మనువు 'నాస్తికో వేద నిందకః' అని వేదనిందకులను నాస్తికులని వ్రాసి యున్నాడు.

ఇఁతియగాక మహమ్మదీయులలో నొక యంతఃశాఖ మరియొక శాఖను 'నాస్తికము' అనును. దయానంద సరస్వతీ స్వాములు తన సత్యార్థప్రకాశమునందు నవీన వేదాంతులను నాస్తికుల పక్షమున జేర్చిరి. ఇట్లొక నిష్పాక్షిక వ్యక్తి యాస్తికుల విషయమున నన్వేషణ మొనర్చిన ప్రత్యాస్తికుని నాస్తికుడని ఋజువుచేయుటకు తొంబది తొమ్మిది మంది యాస్తికసాక్షులు వానికి లభింతురు. ఈవిధముగా నెవరు మానవజాతియందు నాస్తికతావ్యాపకతను రూపింపనెంతురో వారి ప్రయత్నము విఫలమగును.

ఈ యాక్షేపము స్థూలదృష్టికి బలిష్ఠమై తోచినను వాస్తవమున నిందు బలము కానరాదు. ఇంతకు పూర్వమే యతివ్యాప్త్యాది దోష రహితమైన ధర్మమును మేము ప్రతిపాదించి యుంటిమి.

'మనుష్యుడు తనకంటె నున్నతమై యదృష్టమైయుండు శక్తియందుగల విశ్వాసము- మరియు నావిశ్వాసముచే ప్రభావితుడై చేయు వ్యాపారము ధర్మమనబడును.' ఈ లక్షణమున పూర్వభాగము అదృష్టమహాశక్తియందు విశ్వాసముంచుట అనునది ఆస్తికత్వమై యున్నది. ఈ లక్షణమును ధ్యానపూర్వకముగ దిలకించిన సమస్తజాతులు ఆస్తికకోటి యందు జేరగలవు. ఒకానొక ధర్మావలంబి మరియొక ధర్మావలంబిని నాస్తికుడనుటలోగల యభిప్రాయము వేరు. అతడాస్తికతయందు నాచరించునట్టియు, నమ్మునట్టియు విషయముల నన్నిటిని చేర్చును. ప్రతిపురుషుడును తన లేఖల

యందును, సంభాషణమునందును కొండొక శబ్దమునకు విశేషార్థము నుద్దేశించుట కధికారము కలిగియుండును. దీని కొక యుదాహరణము గలదు. 'మనుష్య' శబ్దమును విచారింపుడు. ప్రపంచమునగల నికృష్టజాతీయులును సామాన్యార్థమున మనుష్యశబ్దముచే గ్రహింప నగుదురు. కాని 'మనుష్య' శబ్దమునకు విచారశీలుడను నర్థము గ్రహించి యా విచారశీలశబ్దమునకును విశేషార్థమునే వివక్షింతుమేని ప్రపంచమున నలుగు రైదుగురే మనుష్యులు లభింతురు. మిగిలినవారి నేనామమున బిలువవలయునో యెఱుగుట కష్టమగును.

రెండవ యాక్షేపము:- ఆస్తికత సర్వవ్యాపకమైనపుడు ఆస్తికులు నిర్బాధముగా కాళ్లారజాచి కూర్చుండక నాస్తికులను ఖండింపనేల? దూషింపనేల? ఆస్తికతాప్రచార మొనరింపనేల? యని. ఈ యాక్షేపమున కొకవిధముగా సమాధానము పూర్వ పత్రములందు జూడనగును. మానవజాతియందాస్తికత బీజరూపమున నున్నదని మా యభిప్రాయము. ఇతిహాసమును దీనినే స్థిరపరచుచున్నది. కాని భిన్నభిన్న స్థానములందును జాతులందును ఆస్తికత భిన్నరూపముల ప్రాదుర్భవించుచుండును. అగ్ని సర్వవ్యాపకమే యయినను దాని నుపయోగించుటకు విశేషపరిస్థితు లవసరము. మనము వ్రాయుట కుపయోగించు కాగితమునందును నగ్ని యున్నది. కాని దీని వలన నన్నము పక్వముకానేరదు. ఇట్లే 'నాకంటెనుత్తమశక్తి యొకటి యున్నది' అను భావము ప్రతిమనుజునందును గలదు. కాని

యీ భావమే భిన్నభిన్న మానవులందు భిన్నస్థితుల నుత్పన్నము చేయును. ఆశక్తి యేమి? దానియందుగల గుణము లెయ్యవి? దానిస్వభావ మెట్టిది? మన కార్యములపై దానికున్న ప్రాభవ మేమి? దానితో మనకుగల సంబంధమేమి? ఆశక్తిని సంతోష పెట్టవలసిన యవసరమున్నదా? లేదా? అను నీప్రశ్నములయెడ భిన్నమతము లేర్పడుచున్నవి. ఈవిభిన్నతవలననే యాస్తికులలో పరస్పరప్రేమ యేర్పడుటకు బదులు వైర మేర్పడుచున్నది. ఒకయాస్తికు డాశక్తిని సంతోషపెట్టుటకు గోబలి నీయవలయు ననును. మరియొకడు నరుని సహితము బలిగా నొసంగ వలయు ననును. 'ఎఱిగియెఱిగి నీవొక పిపీలికను హింసించినను నీపై నాశక్తి కోపించు' నని మూడవవా డనును. కొండొక 'డాశక్తి యదృష్టము, అందువలన కాల్పనికమూర్తుల నాశక్తి స్థానమున గల్పించి తను మనోధనముల నర్పింపవలయు' ననును. వేఱొకడు 'ఆయదృష్టశక్తికి మూర్తిని గల్పించి దానియెదుట నతమస్తకు లగుటయు, బలుల నర్పించుటయు మహాపాతక' మనును. ఆయదృష్టశక్తి విషయమున ననేకు లనేకవిధముల విచారించుటచే నిన్ని భిన్నమతము లేర్పడినవి. ఆశక్తినుండి ముక్తులగుట కవకాశములేదు. అది బీజరూపమున నెల్లర హృదయముల బ్రవేశించియున్నది.

నాస్తికు లేమిచేయుదురో యాలోచింపుడు. వారొక యాస్తికునిమతము నాధారముగా గొని వేరొక యాస్తికమత మును ఖండింతురు. ఈవిధముగా 'ఆస్తికతనుండి విముక్తులు కా నెంతురు. కాని యాస్తికత మాత్రము వారిని మృత్యు

పర్యంతము విడనాడదు. వారు తమ జీవనమున 'మాకంటె నున్నతశక్తి బ్రహ్మాండమున మఱియొండు లే' దని యెన్ని దంభోక్తులు పలికినను మృత్యువు సమీపించినపుడు ప్రియాస్పదమగు ధనమును, శరీరమును, కుటుంబమును విడువ బలవంతపెట్టబడుదురు. అట్టిచో వారు తమకంటె నున్నతశక్తి యొండు వేరుగాగల' దని యొప్పుకొనక తప్పనివా రగుదురు. ఇంగ్లండులోని నాస్తికులలో బ్రముఖుడయిన 'బ్రాడ్లా' (Bradlaugh) మహాశయుడొకప్పుడు 'మిసెస్ బెసెంటు' నను సాధ్వితో నొక నాస్తికతా ప్రచారిణీసభను స్థాపించినాడు. మృత్యుశయ్యను పొంది తానొక యదృష్టశక్తిచెప్పునను లాగబడుచున్నట్లు అతనికి తోచెను. అనుభవించెను. అతని జీవితకాలమున నతనికి తచ్ఛక్తివిషయకానుభవము గలిగి యుండినచో నత డద్దానిని గూర్చి విశేషముగా విచారించి యుండెడివాడు. కాని పాప మతనికా యనుభవము అంత్యావస్థయందు గలిగెను.

ఆస్తికుల పరస్పర కలహములును కొంతవఱకు నాస్తిక్యప్రచారము నొనరించుట సత్యమే. కాని మంచి చెడుగులను విచారింపకయే అదూషితవిషయములను దూషితము లొనర్చుట బుద్ధిమంతుల కార్యము గానేరదు. నేను వ్రాయు కలము పాళీ సరిగా లేకున్న నక్షరములు సరిగా నుండవు. అప్పుడా పాళీని తొలగించి మఱియొకపాళీనుంచి పనిచేయుట బుద్ధిమత్త యగును. కాని, కలమునే పారవేయుట బుద్ధికౌశలమగునా? ఇట్లే యాస్తికులలోని పరస్పరకలహములకు హేతువును తొలగించుట న్యాయమగును. వైద్యుడు రోగ

నివారణమున కుపాయము రోగిని రూపుమాపుటయే యని యెంచిన నంతకంటె మూర్ఖత యేమగును?

ఇంతవరకు వ్రాసినపుటలలో ధార్మికత, ఆస్తికతయు నివి రెండును మనుజులలో నెల్లరయందును బీజరూపమున నున్నవని జూపుటకు యత్నించితిమి. ఇకముందు పుస్తకమున 'ఆస్తికతాభావము సరియైనది. ఇందు భ్రమలేదు' అనువిషయమును బ్రమాణపురస్సరముగా రూపింతుము.

# రెండవ అధ్యాయము.

## మనుష్యుడు అల్పుడు.

'కౌంట్ టాల్‌స్టాయి' తన 'ధర్మమన నేమి' (What is Religion) యను పుస్తకమున 'అనంత శక్తికంటె మనుష్యుడు (తుచ్ఛుడని) సమస్త ధర్మములకు సమ్మతము (Every religion regards men as equally insignificant compared to infinity) అని వ్రాసియున్నాడు. నాస్తికులలో బలువురకీవాక్యములు కటువుగా తోచును. కొంతవఱకిట్లు తోచుటయు ననుచితము కాదు. ఆత్మగౌరవము గలమానవుడు తన్నెల యితరులకంటె తుచ్ఛుడని యెంచును? ధర్మము మనుష్యులను నపుంసకుల నొనరించిన దని యనేకులాక్షేపింతురు. 'మానవుడు తుచ్ఛుడు. ఈశ్వరుని యందతనికి విశ్వాసముండవలయును అనియే ధర్మము ప్రప్రథమమున బోధించును. ఇట్టి శిక్షాఫలితముగా తన తుచ్ఛతను భావించుచు క్రమముగా మనుజుడు తుచ్ఛుడగుటయే కాక లోకమున నెన్నడు నే మహాకార్యము నాచరింప నేరడు. మన మంతయు జేయగలమని భావించువారే యెల్లకార్యముల నాచరించుచున్నారు.'

మే మీ మతమును సంపూర్ణముగ నంగీకరింపము. వాస్తవమున మనుజుడు తన వాస్తవిక శక్తులను గుర్తింపక నీచుడైనట్లు అనేకులు తమ శక్తికంటె పెక్కురెట్లధిక శక్తులను తమ యందు భావించి హానిని బొందుచున్నారు. కాసువీసముగల మనుజుడు తన్ను లక్షాధిపతియని యెంచునేని తప్పక హాని

నొందును. అందువలన యథార్థము ననుగమింపని యాత్మ గౌరవమును, తుచ్ఛతను వీడి వాస్తవిక శక్తులను దెలిసికొనవలయును. శక్తికంటె తక్కువకార్య మాచరించుచో శక్తి నశించును. శక్తిని మించి యత్నమాచరించిన విఫలు డగును. మనుష్యునకు తన శక్తులను సరిగా నెరుగుట మిక్కిలి శ్రేయస్కరము.

లోకమునందు దృష్టిని సారించినపుడు రెండు వస్తువులు గోచరించును. ఒకటి చేతనము, రెండవది జడము. చేతనము కంటె జడము దుర్బలమైనది. చిన్నచిన్న చీమలు పెద్దపెద్ద మట్టిగడ్డలను తునకలు చేయును. చిన్నపురుగులు పర్వతములను సైతము భేదించును. చిన్నచిన్న పక్షులు పెనువృక్షములను గంపింప జేయును. దీనింబట్టి చేతనమున్నచోట బలమున్నదని తెలియుచున్నది. జడపదార్థములందు బలము లేదు. వానియందు చేతనయోగమున బలము సమకూరును. గుఱ్ఱము బండి నీడ్చును. కాబట్టి గుఱ్ఱమునందు బలమున్నది. కాని బండియందు లేదు. జడశరీరమును చేతనసహాయమున నడుచుచున్నది. మరణించిన గజముకంటె జీవిత పిపీలిక బలము గలదనుట నిస్సంశయము.

చేతనశక్తులలో మానవశక్తి యన్నిటికంటె నుత్కృష్టమైనది. ఇత డితర చేతనశక్తుల నన్నిటిని దనవశ మొనర్చుకొనియున్నాడు. ఒక చిన్నబాలుడు మత్తేభము నెక్కి దానిని నడుపగలుగును. సింహామువంటి క్రూరమృగములు సైతము మానవుని కనుసన్నల మెలగుచో నితర చిన్నజంతువులను

గూర్చి వ్రాయవలసిన యవసర ముండ నేరదు. జడవస్తుల మీదను మనుజునకున్న యధికార మత్యధిక మనవచ్చును. జలము మానవుని కొక అల్ప సేవకుడు. దీనితో దన దప్పికను శాంత మొనర్చుట యేగాక నౌకలను నడపును. దీనినుండి విద్యుత్తును దీసి యనేక కార్యములను నిర్వర్తించును. వాయువు మనుజుడు చెప్పినట్లు నడచును. అగ్ని మానవ సేవయందు తత్పరతను వెలిపుచ్చుచుండును. ధూమశకటము, తంతివార్తా వాయుయానము, జలయానము మున్నగునవన్నియు మానవశక్తి పరిచాయకములే. ఇతర పశుపక్ష్యాది జీవితశక్తులును సృష్టియం దనేకవిధ పరివర్తనముల నొనరించినను, మానవునిచే జేయబడు పరివర్తన మతి విచిత్రముగా నుండును. సింహము వనమునకు రాజు. కాని యది యా వనమును దన జన్మసమయమున నున్నట్లే మరణించునపుడు విడిచిపోవును. ఇందులకు విపరీతముగా మానవుడు సృష్టిరూపమునే మార్చివైచెను. అతడు సముద్రమును మెరక నొనరించెను. పర్వతములు భేదించెను. నదులపై సేతువుల బంధించెను. వాని ప్రవాహములను మార్పగలిగెను. అరణ్యముల మార్చి నగరముల నిర్మించెను. జలతలస్థానములను తలజల స్థానములుగా మార్చెను. సారాంశ మేమన: ప్రపంచపు ప్రతి కోణమునందును మనుజుని శక్తి ద్యోతకవ్యాపారము దృష్టిగోచర మగుచున్నది. ఇతని బోలిన వస్తువు మరియొండు లోకమున గానరాదు. మనుజు డన్నిటికంటె బలవంతుడు. అతడు తన బలమును జూచినపు డభిమానభరితహృదయు డగును. తనతో సమానుడు లేడని

యొంచును. తానే సృష్టికర్త. తానంతయు చేయగలుగును. తన యధికారమునందే సర్వము నున్నదని భావించును.

యథార్థము పరిశీలించిన మనుష్యుడిట్లెంచుట గొప్ప ప్రమాద మనవలసియున్నది. అన్యప్రాణులకంటె మనుష్యునియం దధికజ్ఞాన మున్నది. అందువలననే యతని శక్తియు నధికమే. అయినను ప్రతివిషయమునందును సృష్టియందుగల సమస్త శక్తులను బరీక్షించినపుడు మానవశక్తులు అల్పము లనవలసి యుండును. మానవప్రభుత్వము నపరిమితము కాదు. అతని జ్ఞానమునకు సీమ లేకపోలేదు. మనుజుని పరాక్రమమును మర్యాద నతిక్రమింపజాలదు.

మున్ముందు శరీరావస్థను విచారింతము. మనుష్యుడు ప్రపంచమున బలముగల ప్రాణులలో నొకడు కానేరడు. వందలకొలది జంతువు లతనికంటె బలమున మించియున్నవి. మానవుని ఇంద్రియశక్తులును స్వల్పములే. అతడు గృధ్రము వలె విశేషదూరము చూడజాలడు. హరిణముభంగి పరువెత్తనేరడు. గజముకైవడి యధికభారమును మోయజాలడు. మఱియు నతడు కన్నులసహాయమున నెంత చూచుచున్నాడో దానివలన కలుగు జ్ఞానము నత్యల్పమే. వందలకొలది యాకృతులు, ననేకవర్ణములు నతనికి గోచరముకావు. పలువిధములగు శబ్దముల నతడు వినజాలడు. ఏ జ్ఞానము నూతగాగొని బలిష్ఠ ప్రాణులనుసైతము వశపరచుకొనగలనని గర్వించుచున్నాడో, అనల్పదూరమువఱకు దనశక్తి ప్రసరింపగలదని తలంచుచున్నాడో, ఆ జ్ఞానము ననుసరించి యతడు సర్వ

జ్ఞుడనిగాని, బహుజ్ఞుడనిగాని యెంచ వలనుపడదు. మనుజుని జ్ఞాన మత్యల్పము. అతడు తానెఱుగదలచిన దానికంటె నెరుగ దగినది పెక్కుమడుంగులు మిగిలియుండును. ఒకడొక నిమ్న ప్రదేశమున నిలబడి నలుగడల దృష్టిజఱపి తన కగబడు దిక్చక్ర మునే ప్రపంచముగా నెంచును. కాని యతడున్నత్ స్థానము నాక్రమించుకొలది దిక్చక్రవిస్తారమును పెరుగుచునే యుండును. అట్లే మనుజుని జ్ఞాన మభివృద్ధి నొందుకొలది యతనికి సంపా ద్యజ్ఞానవిస్తృతి గోచరించును. చిన్నతరగతి విద్యార్థి వర్ణ మాలనే విద్యకు ఇతిశ్రీగా నెంచును. తానా చిన్న పొత్తమును చదివినంత విద్వాంసుడ నగుదునని యోచును. కాని విద్యా లయమున పెద్ద తరగతియం దుత్తీర్ణుడయిన విద్యార్థి తా నేర్చిన దత్యల్పమనియే నిశ్చయించును. న్యూటన్ (Newton) విద్వాంసుడు 'అపార జ్ఞానసముద్రము నాయెదుట ప్రవహించు చున్నది. నేను దాని తటమునగల గులకరాళ్లను మాత్రమే ఏరుచున్నాను' అని నుడివెను.

ఉపనిషత్కారులును 'అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్' అని పలుకుటయు నెంతయు సత్యము. ప్రపంచ మునగల మూర్ఖులెల్లరును సంపూర్ణజ్ఞానమునందు సగము తమ దగ్గఱ నున్నట్లును మిగిలిన సగభాగము మిగత ప్రాణులలో బంచ బడి యున్నట్లును నెంతురు. కాని, భిన్నభిన్న శాస్త్రములందు నిష్ణాతులయిన విద్వాంసుల నడిగిచూడుము. వారేమందురో! ప్రతి విద్వాంసుడును దనకు తన శాస్త్రమున నత్యల్పజ్ఞాన మున్నట్లు చెప్పడా? మనోవిజ్ఞానమున (Psychology) ప్రసిద్ధ

కెక్కిన విద్వాంసుని ప్రశ్నించి చూడుము? అతడేమనును? "నేను నా పూర్వజులును, వందలకొలది వత్సరములు ప్రయత్నించి మానవ మనస్సునుగూర్చి చాల నేర్చుకొంటిమి. కాని యంతకంటె నేర్వదగినది చాల మిగిలియున్నది' అనును. గొప్పగొప్ప చికిత్సకులు పూర్వానుభవముల నాధారముగాగొని, తమ సంపూర్ణమగు నాయువును వ్యయించియు తమకు గల శరీరసంబంధ విజ్ఞాన మత్యల్పమని నుడువుదురు. ప్రతి చికిత్సకుని జీవితమునందును నతని జ్ఞానమునంతయు వమ్ముచేయునట్టి వ్యాధి యొండొకటి యుపస్థితము కాకపోదు. అతడు తా నేర్చిన దంతయు సరిగాదని తెలిసికొనవలసిన స్థితి యేర్పడును. శరీరమున వేలకొలంది యవయవముల స్థితిగతులు శరీరవిజ్ఞానుల బుద్ధి కింతవరకును గోచరము గాకున్నవి. అన్యశాస్త్రకారుల పరిస్థితియు నిట్లే. కాని మనుష్యుని యజ్ఞానసీమకు మేర లేదు. ఒక శాస్త్రవేత్త మరియొక శాస్త్రమునం దజ్ఞానియనియో, అల్పజ్ఞుడనియో తెలిసినపుడు మనకు గల్గు నాశ్చర్యమునకు మితియుండదు. వృక్షశాస్త్రమునకు మానవ నేత్ర పరిస్థితి తెలియదు. గణితశాస్త్రజ్ఞుడు వనస్పతులనుగుఱించి యేమియు నెఱుగడు. మానవజాతికి సంబంధించిన సమస్త విభాగములను బాగుగా నాలోచింప దక్షుడగు నొక కవి యతి నికృష్టమని యెంచబడు నొక మేదరబుట్ట నల్ల నసమర్థుడగును. ఒకానొక ఖగోళవిద్యాభిజ్ఞుడు తన యంగమున బుట్టి పీడించు చిన్న వ్రణమునకు చికిత్స జేయ నసమర్థుడగును. అట్టితఱి మనుష్యుని జ్ఞాన మనల్పమని యెట్లనగలము?

పై నుదాహరించిన యుదాహరణము లన్నియు జ్ఞానవృద్ధి కొఱకు యావజ్జీవ మర్పించిన మహనీయులవి. హార్బర్టు స్పెన్సరునకు, అరిస్టాటిల్ మొదలుకొని యాధునిక వైజ్ఞానికులవఱకు నార్జింపబడిన జ్ఞాన మంతయు తెలియునట. కాని, హార్బర్టుస్పెన్సరు స్వయముగా తానెంత యల్పజ్ఞుడో యతని సాక్ష్యమువల్లనే తెలియనగును. కోటి కొక్కడుగా లెక్కబెట్టతగిన నుత్తమ మానవవ్యక్తులు జీవనమంతయు ధారవోసి సంపాదించిన జ్ఞానపుంజము, సృష్టిజ్ఞానమునం దత్యల్పమగుచో మానవులకు తనజ్ఞానవిషయమున గర్వింప నధికారమెక్కడిది? మానవజాతికి మించిన జ్ఞానముగల జాతి మరియొండు లేదు. సమస్తజాతులకు శిరోమణియనదగు మానవజాతియందలి సర్వోత్తమవ్యక్తులస్థితి యిట్లుండ మనుష్యు డల్పుడనుటలో సందేహమేల? ఇంతియగాక దేశకాల సీమలను విచారించిన మఱియు నాశ్చర్యము గలుగును. ఉత్తమోత్తమ విజ్ఞానియు మరుక్షణమున నేమిజరుగు నదియు తెలియజాలడు. కాదు-కాదు. ఆ క్షణముననే యాతని వెనుక నేమి జరుగుచున్నదియు గుర్తింప జాలడు. వేలకొలది రోగుల రోగములను దూరమొనర్పసాహసించు నుత్తమ చికిత్సకుడు సైతము తనహృదయగతినిగాని, తన యూపిరితిత్తులం దేరోగము ప్రవేశించుచున్నదనిగాని యెఱుంగ జాలడు.

మనుజుని జ్ఞానమెట్లో పరాక్రమము నట్లే. మానవుడు ధరాతలమును మార్చివైచె ననుటలో సందియము లేదు. కాని యెవని బలముతో? ప్రాపంచిక వస్తువుల ననుకరించుటకంటె

నత డేమి చేసెను? అనుకరణమైనను ప్రతిమనుజుడు చేయ జాలడు. గొప్పగొప్ప బుద్ధిమంతులే చేయగలరు. అంతమాత్ర ముననే వారు బహుధా ప్రశంసింపబడుదురు. అనుకరింపక మనుజుడుచేసిన వస్తువుగాని కార్యముగాని యెద్ది? మనుజుడు గొప్పగొప్ప సౌధముల నిర్మించె నందుమా యతనికి శిక్ష నొసంగదగు 'బయానుమిూ'జంతువు లోకమున లేకపోలేదు. ఒక కందిరీగలగూడునే తిలకింపుడు. లేక తేనెటీగలతుట్టెనే పరి కింపుడు. మనుష్యుని పరాక్రమము లజ్జాస్పదముకాకపోదు. లోకుల దృష్టిని వంచింపజేయు సుందరమగు న్మామ్రఫలము నొకడు మట్టితోనో కాగితముతోనో రచించిన మాత్రమున నతనిని మిక్కిలిప్రశంసింతురు. పారితోషికము లతనికీయబడును. అతని యోగ్యత నెలుగెత్తి గానముచేయుదురు. ఈ సంరంభ మంతయు నేల? ఇందులకేగదా? అతడొక ప్రాకృతికవస్తు వున కనుకృతి చేయగలిగెను. ఆ యనుకృతియు నాకృతి మాత్రముననే. గంధాస్వాదాదిగుణము లతని కందరానివి. ప్రంపంచమున బుద్ధిమంతులు దినదినము నావిష్కారము లను జేయుచున్నారు. అందులకు వారు ప్రశంసింప బడు చున్నారు. కాని ఆవిష్కార మననేమో కొంచె మాలో చింపుడు? ఒకానొక వ్యక్తి కొండొక ప్రాకృతికవస్తువును సంపూర్ణముగనో, అసంపూర్ణముగనో అనుకరించు వస్తువును సిద్ధపఱుచుటయేకదా? మనుష్యుడు తన యీ నిర్మాణకౌశ లముపై గర్వింపరాదని మా యభిప్రాయము గాదు. వాస్త వమున వైజ్ఞానికులు, ఆవిష్కారకులు నెల్లరు నితర సామా

న్యులచే బూజింపదగినవారే. వారు మానవజాతి సుఖాభివృద్ధికిని, జ్ఞానవృద్ధికిని, తోడ్పడుచున్నారు. కాని వారి యభిమానమే వారి యల్పశక్తిని వ్యక్తపఱచుచున్నది. ఒక బాలుఁ డొకవిద్యాలయమున చదువ నేగె ననుకొనుడు. అతని పలకమీఁద నుపాధ్యాయుఁడు కొంచెము వ్రాసియిచ్చును. ఆ బాలుఁడా యక్షరములను జూచి యట్లే వ్రాయ యత్నించును. ఆ యక్షరము లుపాధ్యాయుని యక్షరములకంటె నిమ్న శ్రేణికి చెందియుండును. కాని యాబాలున కుపాధ్యాయుని యక్షరములం బోలిన యక్షరములను వ్రాసినందులకు అభిమానము కలుగును. ఒకప్పు డాబాలుఁడు వ్రాసిన యక్షరము లుపాధ్యాయుని యక్షరములకంటె నుత్తమములై యున్నను తన్ను దా నుపాధ్యాయునికంటె గొప్పవాఁడని యెంచుట న్యాయము కాజాలదు. ఎందువల్లనన, అతఁడుపాధ్యాయుని యక్షరముల ననుకరించియేకదా నిపుణుఁడయ్యెను. కాని యుపాధ్యాయుని యక్షరములతో సాటి యగు నక్షరములను వ్రాయగలుగుటయే బాలుని యభిమానమునకు బర్యాప్తము. ఇట్లే లోకమున నావిష్కారకు లనే కాంశములందు బూజ్యులు ప్రశంసాపాత్రులయ్యు, సర్వజ్ఞులనిగాని, బహుజ్ఞులనిగాని యభిమానము నొంద నర్హులుగా నేరరు. తన్ను దా సర్వజ్ఞుఁడనిగాని, బహుజ్ఞుఁడనిగాని ప్రతిజ్ఞ చేయునట్టి నిర్బద్ధులైన వైజ్ఞానికులు లోకమున నుండరని యేమా విశ్వాసము.

మానవు డెల్లప్పుడును ప్రాకృతిక శక్తులను వశమొనర్చుకొన యత్నించి పరాజితు డయినట్లు మానవేతిహాసమును తిలకించిన వారికి గోచరింపక పోదు. ప్రపంచ మొక మల్లయుద్ధస్థానము. వివిధప్రాపంచికశక్తులు మానవునకు పోరాడు పద్ధతులను నేర్పును. ప్రధాన మల్లుడు ఇతరులకు నేర్పును. ఒకప్పుడు తానును గ్రిందపడును. శిష్యులను ప్రోత్సహించుటకై తన యల్పబలము నే వినియోగించును. అట్లు చేయకున్న నేర్చుకొన నెవ్వరును సాహసింపరు. కాని శిష్యులలో నెవ్వరైన నొకరు గురువుకంటె దాను గొప్పవాడని యెంచసాగిన వెంటనే యతని యభిమాన మడంపబడును. మనుష్యుని యవస్థయు నిట్టిదే. అత డెల్లవేళల సృష్టియందు గల శక్తుల ననుకరించెను. వానిని జయింపవలయుననియు గోరెను. సృష్టియు నతనికి సహకార మొనర్చెను. ధైర్యమును బెంపొందించెను మానవుడు నదుల ప్రవాహదిశను మార్పనెంచెను. నదులు నతని కోరిక ననువర్తించినవి. మార్గమున కడ్డుదగిలిన పర్వతములను భేదింప నుద్దేశించెను. పర్వతములును తమ కాఠిన్యమును సడలించెను. అతడు వాయువుద్వారా తన యంత్రాగారముల నడపగోరెను. వాయు వతనికి సహాయ మొనర్చినది. కాని, సమస్తప్రాకృతికశక్తులు తన వశమైనవని మానవహృదయమున గర్వమంకురింపగానే యాశక్తులు నతని గూబలు పగులునట్లు చెంపలు వాయించినవి.

పెద్దపెద్ద బుద్ధిమంతులయిన వైద్యులు శరీరావయవములనన్నిటిని బరీక్షించి రోగమూలమును గనిపెట్టి మానవుల రోగములను బోగొట్టి చిరాయువుల జేయగోరిరి. వారనేక పరిస్థితులలో ననేకరోగముల శమింపజేయుటలో సమర్థులయిరి. కాని మానవుల మరణమునాపుటలో నశక్తులే అయిరి. మృత్యువు సమీపించినపుడు ప్రసిద్ధవైద్యులు, పేరుగన్న డాక్టర్లెల్లరు గ్రుడ్లుమిటకరించి చూచుటకంటె నేమియు జేయజాలకపోయిరి. పెద్దపెద్ద శ్రీమంతుల ధనము వారి నొక్క నిమిషము జీవింపజేయజాలదయ్యె. ఇదియంతయు నేమి? పైన వర్ణించిన చెంపదెబ్బే! ఒకప్పుడొక ప్రశ్నపత్రమున నిట్లు ప్రశ్నింపబడెను.

'ఈశ్వరు డెప్పుడు నవ్వును'? "ఒక వైద్యుడొక రోగిని చూడవచ్చి 'భయపడకుము, నిన్ను నే బాగుచేయుదు'నని చెప్పినప్పు డీశ్వరుడు నవ్వు" నని యా ప్రశ్నకు సమాధానము. యథార్థమున నవ్వదగిన విషయమే. 'నేను నీరోగము నుపశమింపజేయ యత్నింతు' నని చెప్పవచ్చును. యత్నించుట కంటె నధికముగా మనుష్యు డేమిచేయగలడు? అతని యధికారమున నంతకంటె నేమిగలదు? రోగి మరణించిన తరువాత బంధువులను వంచింప ననువగు నెపములను వెదకు డాక్టరుల నెందఱను మన మెరుగము? ఇవి విడంబనముగాక మరేమగును? డాక్టరు తన పుత్రుని బ్రతికింపగలడా? లక్షల కొలది యేండ్లనుండి చికిత్సకులు నేటివఱకు మృత్యువుతో బోరాడుట కసంఖ్యయత్నములు చేసియుండుటను మన

మెఱుఁగుదుము. వారు తమ యుద్దేశమును నెరవేర్చుకొనుటలో నెంత విఫలులైరో గుర్తించినపుడు మానవుని యల్పతయం దొకింతయు సంశయము కలుగనేరదు.

ఇటుపై ప్రపంచ విజేతల విషయము నాలోచింపుడు. వారారంభమున నెంతశక్తి గలిగియుండిరి? 'సికిందర్' ప్రథమమున నొక బాలుడు. అతనికి ప్రపంచమును జయింపవలయునని కోరిక గలిగెను. అనేక శత్రువుల నతడు జయించెను. అతడు యువకుడు కాకముందే యతనికి ప్రపంచమునం దంతటను రాజ్యము చేయవలయునను నుత్కంఠ హృదయమున రేకెత్తెను. అతనికి తనయుద్దేశమును బూర్తినొనరించుటలో విశేషసమయ మవసరము లేదనియు తోచెను. కాని యచిర కాలముననే యతడు తన యల్పతను గుర్తింపగలిగెను. మఱియు, తన యుద్దేశమును బూర్తి నొనరింప జాలకయే యటనుండి దీర్ఘయాత్ర నొనరించెను.

'కార్థేజ్' ప్రసిద్ధ విజేతయయిన హానిబల్ స్థితియు నిట్టిదే. అల్పాయువునందే రోముసామ్రాజ్యపు దర్పము నడంపగలిగినవా డతడే. కాని ప్రాకృతిక శక్తు లతనిని మాత్రము విడచెనా? అసంభవ మనుశబ్దము మూర్ఖుల శబ్దకోశమున నుండదగినదని బింకము లాడిన నెపోలియన్ వీరునకు రాజ్యప్రాప్తి యటుండ పొట్టనించుటకు తగినన్ని రొట్టెలు సంపాదించుటయు దుర్భరమయ్యెను. సృష్టి యెంత యద్భుతమైనది! దాని శక్తు లెంతయపారమైనవి! మనుష్యు డొకశక్తిని వశపరచుకొన యత్నించును. ఎటనుండియో యనేకశక్తులు

బయలుదేరి యతనినే వశపరచుకొనును. అతడు నివ్వెఱ పోయి చూచుచుండును. చిన్న మొన్నటి సంగతి. మన కన్నులయెదుట జరిగినది. ౧౯౧౪ సం. లో జర్మనుచక్రవర్తి కైజర్ దిగ్విజయ మొనర్ప నిశ్చయించెను. అందుల కవసర మగు నెల్లకార్యములను సిద్ధపఱచెను. శత్రునగరములందు ప్రవేశింపవలసిన తిథులనుసైతము నిర్ణయించెను. ప్రపంచ మునగల పెద్దపెద్ద వైజ్ఞానికు లతనికి తోడయిరి. వారి భయంకరావిష్కారములు పలమాత్రమున జనసహస్రములను వేలగిం జలవలె మాడ్చివైచెను. నాడు ప్రపంచమున కైజరో లేక యతని యనుజ్ఞవడసిన ప్రాణులో దక్క యితరులు నివసింప నవకాశములేదను స్థితి సంభవించెను. కాని ప్రాకృతికశక్తులు మరియొక విధమున నాలోచించెను. దినములు గడచెను. కైజర్ తన యల్పతను గుర్తింపవలసిన క్షణ మరుదెంచెను. అతనికి దన యభిమానమునుగూర్చి పశ్చాత్తాప పడవలసి వచ్చెను.

వైజ్ఞానికుల యావిష్కారముల పరిస్థితియు నిట్టిదియ. టైటనిక్ (The Titanic) నావయొక్క యితివృత్తమును చదివినవారుదానివలన నీతిని గ్రహించియే యుందురు. ఈ నావ క్రీ. ౧౯౧౨ సం. న ఇంగ్లండులో సౌథంప్టన్ ఓడరేవు (Southampton harbour) న నిర్మింపబడినది. దీనికి బూర్వ మింత విశాలకాయముగల యోడ నిర్మింపబడియుండలేదు. దీని నిర్మాణమునందు మూడు సంవత్సరముల దీర్ఘకాలము వ్యయింపబడెను. నిర్మాపకాధికారులలో బట్టభద్రుడగు

కెప్టన్ స్మిత్ (Captain Smith) నాడు ప్రసిద్ధులయిన పల్లెకారులలో నుత్తమోత్తముడు. ఓడ పొడవు ౧౦౦౦ అడుగులు. సముద్రమునకు పైన ౧౬౪ అడుగుల ఎత్తుండెను. ఇది సముద్రమున మునుగనేరదని దానిని నిర్మించినవారు రొమ్ముచఱచి పలికిరి. ఆనావ క్రీ. ౧౯౧౨ ఏప్రిల్ ౧౦ తారీకున సౌథంప్టన్ ఓడరేవునుండి న్యూయార్కునకు బయలుదేరినపుడు దానియందు ౨౩౫౪ యాత్రికు లుండిరి. ఎన్నడును సముద్రమున మునుగని నిరపాయకరమైన టైటనిక్ ఓడయందు యాత్ర నొనరించు భాగ్యము లభించినందుల కా పథికుల హృదయములు హర్షోత్ఫుల్లములయి యుండెను. విజ్ఞానమునకు స్వాధీనముననున్న విషయము లన్నియు నందు ప్రయోగింపబడెను. మానవాధికారమున నున్న సాధనముల నన్నిటి నుపయోగించి పరీక్షింపబడినది. సముద్రమున నోడలకు కలుగు విఘ్నముల నన్నిటి నెదుర్కొనగలదని నిర్ణయింపబడెను. మూడు దినములు ప్రయాణము సాగినది న్యూయార్కు చేరుటకు ౨౪ గంటల విలంబ మవశిష్టమై యుండెను. ఓడ ధూమశకట వేగమున నడచుచుండెను. యాత్రికులు శాంతచిత్తులై సుఖనిద్ర ననుభవించుచుండిరి. అమెరికావాసులును తమ నావ విశాలతాదార్ఢ్యములను ప్రశంసింపకుండజాలరు. కెప్టన్ యొక్కయు వాని యనుచరులయు హృదయములు అభిమానముతో నుప్పొంగుచుండెను. కాని 'తానొకటి తలప దైవ మొకటి దలచు' నన్న సామెతయే దీనియెడ చరితార్థమయ్యెను. మానవాభిమానమును కుంఠిత

మొనర్చి చూపుటయే సృష్టి నియమమేమో యన్నట్లు అక స్మాత్తుగా రాత్రియందొక తాకిడి గలిగెను. ఆ తాకిడియు నత్యల్పము. యాత్రికులలో నెరికిని దెలియదయ్యె. కాని కెప్టన్ తల మాత్ర మదరిపోయెను. అతనికి వెంటనే నావ బ్రతుకదని తోచెను. యథార్థమున నట్లే జరిగెను. ఎన్ని యత్నము లొనరించినను నోడలో నీరు ప్రవేశింపక మాన దయ్యె. దీనికంతకు కారణమేమన, నొక మంచుకొండ సముద్రమున గుప్పుచప్పుడుగా నొక దిక్కునుండి మరియొక దిక్కునకు బోయెను. అది మిగుల విశాలపర్వతము. అందు వలననే దీని తాకిడిమాత్రమున టైటనిక్ వంటి స్థూలకాయముగల నావయందును ఛేదమేర్పడెను. కెప్టన్ స్మిత్ - ఇతరాధికారు లును సమీపమున యాత్రనొనరించు నావలకు 'వైర్ లెస్ టెలి గ్రామ్' ల ద్వారా 'టైటనిక్' సముద్రమున మునుగుచున్నది. రక్షణకు రావలసినద'ని వార్తల నంపిరి. కాని కొన్ని గంటలకు తరువాత 'కార్పేథియా' (Carpathia) పేరుగల యోడ మాత్రము సహాయమునకు రాగలిగెను. మఱియు ౭౦౩ యాత్రికుల ప్రాణములు మాత్రము రక్షింపగలిగెను. కెప్టన్ మున్నగు వారతిసాహసముతో బిడ్డలను, స్త్రీలను రక్షించుటకై యత్నించిరి. తాము నందు మునిగి యసువులు గోలుపోయిరి.

ఇది 'టైటనిక్' నావ వృత్తాంతము. అమెరికా ఇంగ్లండు లలో నీవార్త సమాచారపత్రములందు ముద్రింపబడినపు డెవ రికిని విశ్వాసము కలుగకపోయెను. టైటనిక్ వంటి సుదృఢ

మైన నావ ప్రథమయాత్రయందే ఛిన్నభిన్నమగునని యెవ్వరు దలంచఁగలరు? పెక్కు చిన్నయోడలే యేండ్లకొలఁది మను చుండ నిది యిట్లగునని యెవరూహింతురు? కాని అప్రమేయ ప్రకృతిశక్తుల యెదుట 'టైటనిక్' ఒక తుచ్ఛమయిన వస్తువు. అది మానవుని పరిమితశక్తిచే నిర్మింపబడినది. టైటనిక్ నావ యితివృత్త మొక విచిత్ర మహత్వపూర్ణమగు కథానికము. అంతకంటె నల్పమగు ఘటనలు ప్రతిదినము, కాదు-కాదు ప్రతి క్షణమును జరుగుచుండుట నెల్లరెఱిఁగినదియే. మనము సంపూర్ణ మానవేతిహాసమును (Man proposes and God disposes) 'మనుష్యు డొకటిగోర నీశ్వరు డొకటిగోరు' నను సామెతకు లక్ష్యమని యెంచవచ్చు. ప్రతిక్షణమునందును మానవుడుచేయు కార్యమం దేదేని విఘ్నము వాటిల్లుచుండుటను చూడగలము. ఒకయెడ విఘ్నముకలిగిన మఱియొక యెడ యత్నింతుము. అందును విఘ్నము కలుగును. ఇట్లు తన యత్నపరంపరలందు నడుగడుగునను నాటంకము లేర్పడుట జూడ మానవుని యల్పతకు వేరే సాక్ష్యమేల! కాబట్టియే గీతయందు నిట్లు చెప్పబడినది.

'కర్మణ్యేవాధికారస్తే మాఫలేషుకదాచన.'

మనుష్యుడు పురుషార్థమును సాధించుటకై యత్నింప నధికారి. ఫల మేమగును? ఉద్దేశము నెరవేరునా లేదా? తానవలంబించిన మార్గమున నాటంకము కలుగునా? లేదా? అను విషయములందు మానవున కధికారము లేదు. అతఁడీ విషయములందు శక్తికొలఁది ఆలోచన మొనర్పగలడు. రాబోవు

విఘ్నములనుండి తప్పించుకొనుటకై యత్నింపవచ్చును. కాని నిశ్చయముగా నిదమిత్థమని నిర్ణయింప జాలము.

ఇట్టియెడ కొందరీవిధమున నాక్షేపింతురు. మానవుని యల్పత నిట్లు చిత్రించి నీవు మానవుని ప్రయత్నశీలతను హరించుచున్నావు. మానవునియందు సంచాలనశక్తియే లేకున్న నతడు కార్యముల నెద్దాని యాశ్రయమున జేయ దొడగును. మఱియు నుపర్యుక్త గీతావాక్యమునందు పూర్వభాగము వ్యర్థమగును. గీతయందు 'సంశయాత్మా వినశ్యతి' యనియు చెప్పబడెనుగదా?

మనుష్యశక్తి నల్పమని వచించుటచే నతడు సంశయాత్మకు డగును. వరివిత్తనముల నాటిన వరి పండునను నిశ్చయము లేకున్న వరి విత్తు మనుజు డెవడుండును? మానవజాతినుండి జ్ఞాన నిశ్చితత్వమును తొలగింతుమేని కార్య నిర్వాహక వస్తువు మఱియొకటి యతనిదగ్గర నుండబోదు. ఆవు దినమంతయు పొలము మేసి సాయంకాలమునకు గృహమున కరుదెంచును. గృహమున దన వత్స ముండునని నిశ్చయముండుటచే నది యట్లు చేయును. అట్లే మనకార్యము లన్నియు ఆశ నవలంబించి యుండును. ఆశ నిశ్చయమున కూతకఱ్ఱవంటిది. కాబట్టి మనుష్యు డల్పుడని వచించుట యతనిని గర్మవిముఖుని జేయుటగును.

ఆపాతదృష్టికీ యాక్షేపము సముచితమని తోచును. యథార్థమున దీని కాధారమేమియు గనుపింపదు. మను

ష్యుని యల్పత్వమును బోధించుటకై వర్ణించిన యుదాహర
ణములు సత్యములై యుండుటలో సందేహము లేదుకదా!
అట్టితరి వాస్తవమును నిషేధించుట మూర్ఖతగాక మతి
యేమగును? మనుజునకు తన సఫలతకు సంబంధించిన నిశ్చయ
ముండకుండుట కాశయే కారణము. మనుజుని జ్ఞానపరా
క్రమము లల్పము లనినంతమాత్రమున, మానవున కాశ
యుండరాదని మా యభిప్రాయముకాదు. మనుష్యునం దాశ
యుండుటవలన నతని యల్పతకు విరోధము వాటిల్లకుండుటయే
గాక పుష్టియు నేర్పడును. మానవుడొక కార్యమును జేయు
టకుగాని దానిని సఫలము చేయుటకుగాని యేల యాసించును?
తా నల్పుడు కాదనికాదు. వాడు తనకంటె నుత్తమమయి
యచలమై యుండు శక్తియందు విశ్వాస ముంచుచున్నాడు.
అందువలన నట్లాసించును. తన తండ్రి తనకు బజారునుండి
మిఠాయి తెచ్చునని యొకబిడ్డడు విశ్వసించుననుకొనుడు.
ప్రతిదినము తండ్రి యతని కట్లు తెచ్చియిచ్చుటచే నతని
కాసగలుగుట నైజము. ఈ యాశా విశ్వాసములవలన
నా బిడ్డయందున్న యల్పత కెట్టివిరోధమును కలుగనేరదు.

గీతయందు వాడబడిన 'సంశయాత్మ'పదమున కర్థము
దృఢతాఽభావము. మనమెన్నడైన నొకకార్యమునం దవశ్యము
సఫలులమగుదుమని సంపూర్ణవిశ్వాసమును వెలిపుచ్చగలిగితి
మేని యట్టియెడ రెండభిప్రాయములు ప్రకటితము లగును.
అందు మొదటి యభిప్రాయమేమన, ఆకార్యమును నెరవేర్చు
టకు తగిన సాధనములనన్నిటిని సంపాదించి యుండుట. రెండ

పది తన నియమములనెన్నడు భగ్నమొనర్పనట్టి యొకానొక యున్నతశక్తి యందుగల ప్రబలవిశ్వాసము. ఈ రెండు విషయముల వలనను మనుష్యుని యల్పతయే సూచింప బడును. మన మవశ్యము సఫలుల మగుదుమని చెప్పుటలో గల అవశ్యశబ్దము పూర్ణనిశ్చయమును బోధింపదు. ప్రత్యా నల్ప ధీమంతుడు, పరాక్రమవంతుడును తనకు భవిష్యత్ జ్ఞానము లేదని యెఱుంగును. హేమంత ఋతువునందు మంచుచే విశ్వ మావరించి యున్నపుడు మన మెంత కన్నులు విచ్చిచూచినను సరిగా వస్తువు గోచరము కానట్లు భవిష్యత్తు సైత మావరణమున దాగియున్నది. మనము మన బుద్ధి రూప నేత్రములతో నెంత యత్నించి చూచినను భవిష్యత్తు స్పష్టము కానేరదు. మన మెన్నడును నొకానొక కార్య మును గుఱించి యిది యిట్లు జరిగితీరునని చెప్పజాలము. పెద్ద పెద్ద డాక్టర్లకు, మహా వైద్యులకు నసాధ్యమయిన రోగ ములను స్వయముగా శాంతించుట జూచుచున్నారము. చికిత్సకులు సాధ్యమని యెంచి తప్పక సఫలుల మగుదుమని యెంచిన రోగము లనివార్యములై మానవ ప్రాణములు తీయుట జూడమా? గోదుమలు విత్తిన క్షేత్రమున యవలు పండకుండుట సత్యమే. కాని గోదుమలు పండుట కింకెన్ని సాధనము లవసరములో వానినన్నిటిని సంపాదించుట మానవు నకు దుష్కరము కాకపోదు. క్షేత్రమున నెరువు తక్కువ గావచ్చును. లేక యెక్కువ గావచ్చును. అతివృష్టి, అనా వృష్టి, శలభ మూషకాది బాధ లెన్నో కలుగవచ్చును. ఇట్లు

గానున్న యాపత్తుల నన్నిటి నెదుర్కొన మానవుడు సిద్ధుడై యుండును అతడతి సమీప భవిష్యత్తు నెఱుగునుగాని యంతకంటె నధికముగా నెఱుగ జాలడు. సృష్టియందలి కార్యములు, సంపూర్ణజ్ఞానము, మానవునికొఱకే. ప్రకృతిదేవి మానవుని జూచి చాటున కేగదు. అది తనకార్యములను జూచి స్వకార్యములను సంస్కరించుకొనుడని మానవుల నుద్బోధించును. కాని, మనుజుని యల్పత ప్రకృతియొక్క సంపూర్ణజ్ఞానమునుగాని కార్యజాతమునుగాని పూర్ణముగా దెలిసికొన నియ్యకొనదు. అందువలన నేకొంచెమో తెలిసికొన గలడు. ఒక చిన్నపుష్పము తోటలో నిలుచున్న మనుజుని పిలిచి నా నుండి జ్ఞానము సంపాదింపుమని నుడువును. ఎందరో విద్వాంసు లీ ప్రపంచరంగమున కరుదెంచిరి. జీవనయాత్రను గడపి పోయిరి. కాని యాపుష్పమునగల యొక దళము నైనను సంపూర్ణముగ తెలిసికొనజాలరైరి. ఒకడా పుష్పమున గల రంగునుగూర్చి యన్వేషించెను. సంపూర్ణజీవనమును వ్యయించి యతడు తా నేర్చిన భౌతిక రాసాయనిక జ్ఞానముల నందుపయోగించి సంతుష్టుడు కాజాలడయ్యె. మరి యొకడు 'పుష్పములవలన మనుష్యుల రోగములం దేమి మార్పుగలుగునో విచారింప దలపెట్టెను. అతడు తనపూర్వుల జ్ఞానముతో బాటు తనజ్ఞాన మంతయు వినియోగించియు బుష్పగుణములను పూర్ణముగా నెఱుగజాలడయ్యె. ఒండొకడు పుష్పముల పెరుగుతరుగుల విధమును, వికసించు విధమును నెఱుంగ సమకట్టెను. ఇందులకై వృక్షశాస్త్రము నిర్మింప

బడెను. ప్రపంచమున నెందఱో ధురంధరు లిందు దమబుద్ధిని వినియోగించిరి. కాని వారును పూర్ణసఫలత నొందజాలక పోయిరి. పుష్పమును జూడదలచిన వారియెదుట పుష్పము తన చమత్కారమునంతను జూపెను. దానిని ద్రుంపదలచిన వారి నది యెదిరింపదయ్యె. దాని నాఘ్రాణింప నెంచువారికి దన గంధమును వితరణచేయుటలో సంకోచింపదు. దాని స్పర్శసుఖము ననుభవింప దలచువారి కది పెడమొగముపెట్టి యెఱుగదు. అయినను ఆ చిన్నపువ్వు ప్రపంచమున నెవ్వరి చేతను సంపూర్ణముగా నెఱుగబడదయ్యె. సృష్టిగతి యతి విచిత్రము. ఒక ఉర్దూకవి యిట్లు పలికెను.

"క్యాతమాషాహై, కి చిల్మన్ సే లగే బైఠేహఁ,
సాఫ్‌ఛిప్తేభీ నహీఁ సామ్‌నే ఆతేభీ నహీఁ"

ప్రకృతిదేవి యేరికిని దాగదు. కాని దాని తేజమును దిలకింప నేత్రము లవసరము. ఆంగ్లేయభాషయందు మహా కవియగు టెన్నిసన్ (Tennyson) ప్రకృతివిషయమున నెంత మనోహరముగ వాకొనియున్నాడో జూడుడు

'ఓ! కుడ్యఛిద్రముల నంకురించిన పుష్పమా! నేను నిన్ని ఛిద్రములనుండి త్రుంచుదును. మఱియు నిన్ను నీవేళ్ళ తోను, ఇతరావయవములతోను నాచేత నిడుకొందును. కాని ఓచిన్నపుష్పమా! నేను నిన్ను నీయవయవములతో బాటు నీవెవరివో యెఱుగ గలిగితినేని, ఈశ్వరు డెవడో, మానవు డెవడో యెఱుంగ గలుగుదును.'

మనుష్యుడు నతనిశక్తులు నల్పములగుటలో సందియము లేదు. కాని తనయల్పతవలన మనుష్యునం దెట్టిలోటును గలుగదు. ఈయల్పభావ మతనిని కొఱగానివానినిగా జేయదు. చతురుని జేయును. మిథ్యాభిమానమునుండి తప్పించును. మిథ్యాభిమానము మానవున కెన్నడును లాభదాయకము కాదయ్యె. ఇక ముందును కాజాలదు. నేనిపుడు సమస్త సూర్యమండలమునకు స్వామినని యెంచిన సూర్యుడు తనకార్యమును నావశ మొనర్చునా? ఇట్లెంచిన మాత్రమున నాకట్టి శక్తి గలుగునా? సూర్యుని యుదయాస్తమయములు నావశమున నుండునా? మనుష్యుడు తన యల్పతను గుర్తించి బ్రహ్మాండమంతటను నొక యనంతశక్తి ప్రసరించియున్నదనియు, దానియం దనంత బలజ్ఞానము లున్నవనియు, దనయల్పశక్తి నా యనంతశక్తి కనుకూలముగా వినియోగించిన తనకా శక్తి యుపకారక మగుననియు, నెంచినట్లయిన నిస్సందేహముగా నతని కెన్నడును విఫలతకలుగ నేరదు. మన మల్పులమా అనల్పులమా యనునది ప్రశ్నయే కాదు. మనయల్పతలో సందేహమే లేదు. తనకు దానల్పుడనని యెంచినవాడు నల్పుడే. సర్వథా పరిపూర్ణులమని యెంచినవారును నల్పులే. కాని సృష్టియందు ప్రకటా ప్రకట రూపముననున్న యనంత శక్తులలో వేనినుండి మనము లాభము పొందగలమా? అనునదియే ప్రశ్న. ఏ బాష్పసహాయమున 'డ్రైవరు' రైలుబండిని నడుపుచున్నాడో యదియే వానిని చంపగలదు. బాష్పమున నున్నశక్తి డ్రైవరునకు సంబంధించినది కాదు. అత డాబాష్ప

శక్తిని వినియోగించి లాభమును పొందుచున్నాడు. బొమ్మ మునకు డ్రైవరు అనుయాయిగా నున్నంతకాలమే యది వాని కుపకరించును. వాస్తవమున మనము వైభవమునకు స్వాము లముకాము. కోశాధ్యక్షులము మాత్రమే. రాజ్యకోశమునుండి కోశాధ్యక్షుడు ప్రతిదినము వేలకొలది ద్రవ్యము నిటునటు నడుపగలిగియు నియమవిరుద్ధముగా నొకకాసైన ఖర్చుచేయ జాలనట్లు ప్రకృతి మనకొఱకై ఫలింపజేసిన నానాప్రకారము లగు వైభవమును నియమము విడిచి యుపయోగింపజాలము. నియమవిరుద్ధముగా వ్యయించు కోశాధ్యక్షుడు కారాగార వాయువును సేవింపవలసివచ్చునట్లు ప్రకృతియందును నియమ ముల నుల్లంఘించుట యాత్మనాశము కొనితెచ్చుకొనుట యగును. అల్పత్వమును భావించు మానవులు అకర్మణ్యు లగుదురను వారు మానవచరిత్రను ఉచితదృష్టితో జూచి యుండరు. ప్రపంచమున నున్నతశిఖరము నధిరోహించిన వ్యక్తులు, జాతులును ప్రారంభమున తమ్మా నియమబద్ధ కోశాధ్యక్షునివలె నెంచెను. మాకు సమానులుగాని, యధి కులుగాని మఱియొకరు లేరు. మేమే స్వాములము; ఇష్టము వచ్చినట్లే వైభవముల ననుభవింప గలుగుదుము' అని యెంచప్రారంభించినాడే వానిపతన మారంభమగును. జాతు లయు, వ్యక్తులయు హ్రాసవికాసములమధ్య ప్రతిమానవునిచే గుర్తింప ననువగు భేదకభిత్తి లేదు. విలక్షణచక్షువులే దానిని చూడగలవు. ఇదియే వంచనకు స్థానము. మన మొకానొక జాతి యభివృద్ధిగాంచుట జూచినపుడు దానికి సంబంధించిన విష

యముల నన్నిటిని ప్రశంసనీయములుగానే చూతుము. దాని దోషములను గుణములనుండి వేఱుచేయము. ఇదియే మన యపక్షయమునకు గారణమగును. ఒక్కొక్కప్పుడాజాతులును తమదోషములను మహత్త్వములుగా నెంచును. ప్రాచీనార్యజాతిపతనమున కిదియే కారణము. వర్తమాన సమయమునను గొన్నిజాతుల పతనచిహ్నములు కనబడుచునే యున్నవి. వేలకొలది వ్యక్తుల యుదాహరణములు మన యెదుట నున్నవి. కన్నులు విచ్చిచూచి వానినుండి నీతిని గ్రహించుటయే విలంబము.

మనుష్యుని యల్పతయే వానిని తనకంటె నున్నతశక్తియందు విశ్వాసముంచునట్లు ప్రేరించుచున్నది. అతడాశక్తినే నామముతో పేర్కొనినను వివాదము లేదు.

---

# మూడవ అధ్యాయము

## సృష్టిరచన

పాఠకులలో నెక్కువమందికి శబ్దవ్యుత్పత్తి రుచింపదు. కాని శబ్దవ్యుత్పత్తివలన చాలవిషయములు తెలియనగును. సృష్టిరచనకు సంబంధించిన మూలవిషయములను తెలుపు శబ్దములు సంస్కృతభాషయందు పెక్కుగలవు. ఉదాహరణమునకు సృష్టి శబ్దమునే తీసికొందము. ఇది సంస్కృత భాషకు చెందిన 'సృజ' ధాతువునుండి యేర్పడినది. ధాత్వర్థము 'నిర్మించుట'. 'సృజ' ధాతువునకు 'క్తిన్' ప్రత్యయమును చేర్చిన సృష్టి యను శబ్దము సిద్ధించును. నిర్మింపబడిన వస్తువని దాని యర్థము. రెండవ శబ్దము 'సంసారము' ను గైకొనుడు. ఇది 'సృ' ధాతువువలన నేర్పడును. దీని యర్థము ప్రవహించుట లేక వెడలుట యగును. అందువలన సంసారమనగా వెడలిన పదార్థమని తేలుచున్నది. మూడవశబ్దము సృష్టికి 'జగత్' అనియు గలదు. ఇది 'గమ్లు' ధాతువువలన నేర్పడును. ధాత్వర్థము నడచుట. దీనిబట్టి సృష్టి చలించునది (నడచునది) యని తెలియుచున్నది. సంస్కృతభాష ప్రపంచభాషలలో నతిప్రాచీనమైనది. కాబట్టి యతిప్రాచీన కాలమునుండియు విద్వాంసులు సృష్టి (చేయబడినది) నిర్మింపబడినదనియు, వెడలినదనియు, నడచునది యనియు నమ్ముచుండిరి. కాని ప్రాచీనపురుషుల కథనమునైనను పరీక్షింపక యెందుల కంగీకరింపవలయు ననునది ప్రశ్న. కావున, నాధునిక

విద్వాంసుల యాలోచన మింకెట్లున్నదా యని చూడవలసి యున్నది.

ప్రపంచమున మనము చూచు వస్తువులకు, ఘటనలకు నన్నిటికి నారంభమున్నదనుటలో నేరికిని సందియము లేదు. అనగా నవి యనిత్యములని తెలియుచున్నది. కాలప్రాభవము నకు లోబడని వస్తువు జగమున గానరాదు. అతిప్రాచీనవృక్ష మును దీసికొనుడు. అదియు నొకప్పుడు పుట్టియుండునని యొప్పుకొనక తప్పదు. పురాతన పర్వతమును జూడుడు. దాని యందము తెలియకపోదు. నేటి వైజ్ఞానికులు తమ పరీక్షాశాలలందు పదార్థములెట్లేర్పడినవా? యనియే పరిశీ లించుచుందురు. భూగర్భవిద్య (Geology) పర్వతములు, గ్రావాణములు నెప్పు డెట్లేర్పడినదియు తెలుపును. పృథివి యందుగల సమస్తపదార్థములకు బితామహుడయిన హిమ వంతుడు నొకప్పుడు పుట్టియే యుండును. భిన్నభిన్నస్థానము లందుగల మృత్తిక సృష్టిరచనకు సంబంధించిన యవస్థావిశేష ములను తెలుపు చరిత్ర మనదగును.

ఒకవస్తువు మఱియొక వస్తువుకంటె క్రొత్తదగును. కారణమేమన నవి యొకనియతకాలమున నేర్పడియుండును. వృక్షమున బత్రములకంటె పుష్పములు నవీనము లగును. ఆకులు వేళ్లకంటె నూతనములు. వృక్షమూలము తాను పుట్టిన మంటికంటె నూత్నమగును. మన్ను తాను పేరుకొని యున్న చట్టురాతికంటె క్రొత్తదగును. ఆ చట్టురాయికూడ భూమి యడుగు భాగముకంటె నూతనమగును. భూమికి ననే

కావస్థలు చెప్పబడుచున్నవి. మొదట భూమి యొక అగ్ని గోళమట. అది శీతలమగుచు నగుచు నేటిస్థితికి వచ్చినది. కాలిన వంకాయ చల్లారినపుడు దానిపైనిమ్నోన్నతము లేర్పడు నట్లు భూగోళమును చల్లనగునపుడు దానిపై ముడతపల్లము లేర్పడినవి. మెట్టలో నున్నతస్థానములు పర్వతములైనవి. నిమ్నప్రదేశమున సముద్ర మేర్పడినది. ఇట్లే భౌతికశాస్త్రజ్ఞులు (Physics) రసాయనశాస్త్రజ్ఞులు (Chemistry) ను జలవాయ్వాదుల నిట్లే విశ్లేషించి (Analysis) యుండిరి. అవి యేయే పదార్థముల కలయికచే నేర్పడినవో ఆయాపదార్థముల వేరుచేసి చూపించిరి. ఆ పదార్థముల యారంభ కాలము మన కన్నులయెదుట లేకున్నను మన యెదుట ననేక పదార్థములు నిర్మింపబడుట జూచుచున్నాము. పూర్వ మేర్పడియున్నవాని విశ్లేషణ నొనరించి వాని యుత్పత్తి నెఱుగ గలము. చేయబడని వస్తువు నొకదానిని జెప్పుమనిన నెవ్వరును జెప్పజాలరు. పదార్థములు దానిని దెలుపు నింద్రియములు నన్నియు నిర్మింపబడినవే. ఏ పదార్థములు స్వయముగా చేయబడనివై ప్రపంచమునగల పదార్థములన్నియు నేర్పడుటకు మూలము లగుచున్నవో ఆ మూలతత్వము నెఱుగుటకే వైజ్ఞానికులు యత్నించుచున్నారు. మొదట నేవి మూలతత్వములని యెంచబడినవో నేడవి సంయుక్తపదార్థములని తెలిసికొన బడినవి. నేడేవి మూలతత్వములని వైజ్ఞానికులచే తలపబడుచున్నవో వానికి ప్రకృతిభూతములగు నన్యతత్వము లిక నుండజాలవని నిర్ణయింప శక్యముకాదు. కథమపినిశ్చ

యించినను, మనచే తెలియబడు రూపమున నున్నంతవఱకది స్వపరమాణువులచే నిర్మింపబడియుండుటలో సందియము లేదు. ఉదాహరణమునకు సువర్ణ మొక తత్వమనుకొనుడు. సువర్ణపు కణిక ఖండింప ననువగును. ఏ సువర్ణపు కణములచే నా కణిక యేర్పడినదో యాకణము లొకానొక సాధనము చేతనే సంయుక్తములై యుండును. మనచే ఖండింపబడదగు వస్తు వొకట్టా డదిచేయబడియున్నదనుటలో హానియేమి? ప్రపంచమునగల వస్తువులలో ఖండింప ననువుగాని వస్తువెద్ది? వాస్తవమున ప్రాకృతిక వస్తువులన్నియు సంశ్లేషణము (Synthesis) విశ్లేషణము (Analysis) నను క్రియలద్వారా నేర్పడును. పూగుత్తివలె కొన్నివస్తువులను కలుపుటచేతనో, ఇంటి ద్వారబంధమువలె నొక వస్తువును తునకలు చేసి కలుపుటచేతనో వస్తువు లుత్పన్నము లగును.

‘సృష్టియందుగల వస్తువులన్నియు గొన్ని తత్వములవలన నేర్పడినవి. కాని యా తత్వములు మాత్రము స్వయంసిద్ధములు. వస్తువులను విశ్లేషించుచుపోగా నంతమున విశ్లేషించుటకు వీలులేని పరిస్థితి యేర్పడును. విశ్లేషింప వీలులేని స్థితిలో నుండు పదార్థములే పరమాణువులు - తత్వములు నని పిలువబడును. అవి యితరపదార్థములచే నేర్పడినవి కావు. ఒకప్పుడు వానినిగూడ విశ్లేషింపగలిగినచో నా యంతిమపరిస్థితిలో నుండువానినే తత్వములని యందుము. ఇట్లొకానొక పరిస్థితియందు విశ్లేషణక్రియకు నవకాశములేక ఆగిపోవలసి వచ్చును.’ అని వైజ్ఞానికు లందురు. ఈ యాక్షేపమునే

జె. ఎస్. మిల్ (J. S. Mill) మహాశయుడు తన మూడు ధార్మికవ్యాఖ్యానములు (Three Essays in Religion) అను పుస్తకమున నిట్లు వర్ణించెను.

సృష్టియందు స్థాయి - అస్థాయి భేదములతో రెండు విధములగు తత్వములున్నవి. పరిణామము లెప్పుడు పూర్వ పరిణామములకు గార్యరూపము లగును. మాకు తెలిసినంత వఱకు స్థాయి (స్థిర) తత్వములు కార్యరూపమున నుండవు. మనము ఘటనలను, పదార్థములను రెంటిని కారణములచే నేర్పడియున్నట్లు చెప్పుచుండుట నిజమే. అదియెట్లన, 'ఆక్సిజన్' "హైడ్రోజన్' కలిసి జలమయ్యెను. కాని యిట్లు చెప్పుట వలన ఘటనల యారంభము- కొన్ని కారణములు కార్య రూపము నొందుటే యని మా భావము. కాని యాఘటనల యస్తిత్వమునకు ప్రారంభము పదార్థముకాక ఘటనలు మాత్రమే యగును. ఒకానొక వస్తు వున్నదనుటకుగల కార ణమే వస్తువునకును కారణమగునని యెవడేని యాక్షేపించిన, నిట్టి శబ్దప్రయోగములకై యతనితో నేను తగవులాడను. కాని యా పదార్థమున నాభాగము దేని యస్తిత్వమున కారంభ మగునో యది సృష్టిలోని యస్థాయితత్వముతో సంబద్ధమై యుండును. ప్రతి పదార్థమునందును దానికంటె భిన్నమయిన స్థాయితత్వ మొకటి యుండును. ఏ స్వతంత్ర సత్తావలన నా పదార్థ మేర్పడినదో దాని ధర్మమే యా తత్వమని భావము. మేము వీని యస్తిత్వారంభము నంగీకరింపము. మానవజ్ఞాన మున కందినంతవరకు వానికి మూలము లేదనియే సిద్ధమగు

చున్నది. కాబట్టి వానికి కారణమును లేదు. కాని, యిది తనకు తాను ప్రత్యేకించి యేర్పడు ఘటనకు కారణముగాగానీ, సహాయ కారణముగాగానీ, తప్పక యుండును.

మాకు 'మిల్' మహాశోదయుని యభిప్రాయము నొప్పుకొనుటలో నేమియు సంకోచింప నవసరము కనబడదు. సృష్టిస్థాయి పదార్థములయు నస్థాయిపదార్థములయు కలయికవలన నేర్పడినదనియే మామతము. సంస్కృతభాషయం దస్థాయి పదార్థములను 'నామరూపము' లని పేర్కొనిరి. స్థాయి పదార్థములను మూలతత్వము లనిరి. మూలతత్వములు నామరూపములతో గలసి సృష్టి యేర్పడుటలో నెట్టి సందేహమును లేదు. అందువలన నీసృష్టిజగత్తు కార్యమని తేలుచున్నది.

పరమాణువుల విషయములో ప్రధాన విజ్ఞానవేత్తలందు మతభేదము లున్నవి. విజ్ఞానవిషయికాన్వేషములు జరుగుచునే యున్నవి. కొందఱ యభిప్రాయమున బరమాణువొక వస్తువేకాదు. సృష్టి యేమూలతత్వమువలన నేర్పడినదో యది శక్తికి కేంద్రము మాత్రమే. కాని యీమతము ననుసరించి చూచినను, నా శక్తి కేంద్ర మొకానొకప్పుడు తన ప్రధాన (మూల) స్వరూపమును విడిచి ప్రస్తుతసృష్టిరూపమునకు వచ్చియుండునని యొప్పుకొనక తప్పదు. సృష్టిరచింపబడినదనియే తేలును. సృష్టిరచింపబడిన నదికార్యమగుటలో వివాదమునకు తావులేదు.

సృష్టిని రచించుటకు బరమాణువులలో బరస్పర సంయోగ మవసరముండదని కొందఱ మతము. సృష్టియం

దొక మూలతత్త్వము ప్రకృతి యనబడునది యున్నది. అదియే మంచుగడ్డ కరిగి నీరయినట్లు స్వయముగా బరిణమించి సృష్టి యేర్పడునని వీరి యభిప్రాయము మేమీ భిన్నభిన్నమతముల నన్నిటి నిట మీమాంసింపము. మూలతత్త్వవిషయము నాలోచించుటచే మాకిట ప్రయోజనము లేదు. సృష్టికారంభమున్నది. అది యొకానొక సమయమున నిర్మింపబడుచున్నది. అని చూపుటయే మా యుద్దేశము. మంచుగడ్డ వేరు జలము వేరు. వీని నొకటిగా నెవరు నెంచరు. మంచుగడ్డ నీరగుటలో కొంతకాలము పట్టును. ఇట జలమునకు మంచుగడ్డ కారణము. జలము కార్యము.

సృష్టి కార్యత్వమునం దొకానొక యంశమున నాక్షేపించు దార్శనికులు లేకపోలేదు. వారే వివర్తవాదులు.

'అతాత్త్వికో ఽన్యథా భావః వివర్తః స ఉదీరితః'

వస్తువు లేకయే తెలియబడుట వివర్త మనబడును. సర్పము లేదు. కాని ఉన్నట్లు తెలియబడును. జలము లేదు; ఉన్నట్లు ప్రతీతమగును. దార్శనికులలో గొందఱి యభిప్రాయమున నీ సృష్టి యథార్థముస నొక భ్రమాత్మకమైన కల్పితవస్తువు. లేదా కల్పనామాత్ర మనవచ్చును. మనుష్యుడు కలలో రథగజాదులను జూచుచున్నాడు. కన్నులు తెఱచిన నందొకటియు గనబడదు. ఇట్లే సృష్టినిగూడ మనము స్వప్నమువలె జూచుచున్నాము. మనము మన జ్ఞాననేత్రమును విచ్చినపుడు జగత్తు మనకు కనిపింపదు. ఈ మతమువారి దృష్టియందు సృష్టి కొక వస్తువేకాదు. అందువలన నది కార్యమనియెట్లుచెప్పు

గలము? వీరి యభిప్రాయమున దేనిని మనము జగత్తని వ్యవహరించుచున్నామో యది తాత్త్వికదృష్టి యందు స్వప్నము మాత్రమగును. వాస్తవమున జగమునగల విభిన్నవస్తువులు, వానివలన గలుగు వైచిత్ర్యము స్వప్నముకంటె భిన్నముకాదు. మూలతత్త్వ మొక్కటే గలదు. దానిని వీరు బ్రహ్మ యని వాడుదురు.

మేమిట 'స్వప్నవాదము' ను 'బ్రహ్మైక్యవాదము' ను గురించి యేమియు జెప్పదలంపలేదు. అది సరిగానిండు; కాకపోనిండు. కాని, సృష్టిని స్వప్నమాత్రమని భావించు వారికిగూడ నీస్వప్న మొకానొకప్పుడు ప్రారంభింపబడి యుండునని యొప్పుకొనక తప్పదు. స్వప్నముయొక్క సాధారణపరిస్థితిని విచారింపుడు. స్వప్నములు తాము, స్వయముగా కలుగనేరవు. అదియు నొక కారణజన్యకార్యము మాత్రమే. జ్ఞాననేత్రము తెఱచినపుడు స్వప్నము లోపించునని చెప్పువారు జ్ఞాననేత్రము మూసినపుడు స్వప్నము మరల నారంభించుననియు నొప్పుకొందురు. అట్టిచో నీస్వప్నమెట్లేర్పడుచున్నదనుట ప్రశ్నకాదు. కాని, స్వప్నము కార్యమగునా కాదా? యనునదియే ప్రశ్నము. ఆరంభించునది కార్యమనుటలో సందియమేల? అందువలన దానికి గారణము నారయ వలసి యున్నది.

సృష్టి కాదియున్నదని మేమీ పంక్తులవలన చూప యత్నించితిమి. ఈ సృష్టి కార్యరూపము. అనగా నిది యొకానొక సమయమున నేర్పడినది. దీని నంగీకరించుటలో

నేబుద్ధిమంతునకు నాపత్తి యుండఁబోదు. యథార్థమున నిది ప్రత్యక్షమే.

ప్రస్తుత మీ కార్యరూపజగత్తునం దేయే విషయము లుపలబ్ధములగుచున్నవో చూపవలసి యున్నది.

ప్రథమమున నన్నిటికంటె విచిత్రమైనది నియమము (Order). మన మీ ప్రపంచమున ప్రతిఘటనయందు నొక విశేష నియమమును జూచుచున్నాము. వాస్తవమున మనుజుఁడీ నియమము నాధారముగా తీసికొని తన కార్యములను నిశ్చయించును. భూమియందు విత్తనము పడుచు మొలకెత్తును. క్రమముగా పెరిగి వృక్షరూపమును ధరించి పుష్పించును. అనంతరము ఫలవంతమగును. వనస్పతిశాస్త్రమున నిదియొక క్రమము. ఇది వానస్పతిక జగత్తును శాసించుచున్నది. క్రమము నుల్లంఘించుట కేదియు సమర్థముకా నేరదు. ప్రథమమున ఫలోద్గమము, ననంతరమున పుష్పప్రసవము నెక్కడను మనము చూడనేరము. కర్షకులు, వనపాలకులు నీ నియమము ననుసరించియే వారు తమ కార్యమును నెరవేర్చుచుందురు. మఱియు బీజము ననుసరించియే యంకురముండును. వేపవిత్తునుండి మామిడివృక్ష ముద్భవించునని యాసించుట కెట్టి యవకాశమును లేదు. గోదుమలనుండి సెనగపంటను గోరు మానవుఁడుండఁడు. ఇది వృక్షశాస్త్రనియమము.

మానవాది ప్రాణివర్గమునం దొక నియమ మున్నది. బిడ్డ పుట్టి యావన జరాదులను గ్రమముగా బొందును. మొదట వృద్ధుఁడై మరల యువాద్యవస్థలను బొందు నెన్నఁడును

జూడనేరము. మిక్కిలి యవివేకులైన తల్లులును పిల్లల వృద్ధి యందు రాగల యవస్థలను తెలిసికొని యుందురు. దీనికిఁ గారణము ప్రపంచమున ప్రాణివర్గపు టభివృద్ధియం దొక యనుల్లంఘ్యమగు నియమము పనిచేయుచున్నది. వైద్య శాస్త్రమునకును శరీర విజ్ఞానమునకు నాధార మీ నియమమె. చికిత్సాలయములం దీ నియమము ననుసరించియే చికిత్సయు జేయబడు చున్నది.

భూగోళ పరిస్థితియు నిట్టిదే. పర్వతము లెట్లేర్పడినవి? వానినుండి నదు లెట్లుపుట్టినవి? ఈ నదులు నొక విశేషదిక్కు నకే యేల ప్రవహించుచున్నవి? గంగానది హిమాలయమున బుట్టి భారతమున నేల ప్రవహించుచున్నది? టిబ్బతునకు ఉత్తరదిశయం దేల ప్రవహింపదు? భారతవర్షమునకు మూడు దిశలం దే యేల సముద్రమున్నది? నాలుగవ దిశయం దెందులకు సముద్రము లేదు? బ్రిటిష్‌దీవులు దీవులుగా నేల యున్నవి? సముద్రమునుండి బయలువెడలు గాడ్పులు ఒకేదిశ నేల ప్రవహించుచున్నవి? రెండవ దిశ కేలపోవు? వీని కన్నిటికి నియమము లున్నవి. భూగోళమునకు సంబంధించిన ఘటనలన్నియు నానియమములను బాలింపవలసి యుండును.

భూగర్భవిద్యావేత్తల యభిప్రాయము నిదియే. ఒక పర్వతమున నాయా పొర లెట్లేర్పడినవి? ఒకానొక ద్వీపమున నున్న మట్టి యొప్పు డెట్లేర్పడినది? ఫలాని స్థలమున జల మెన్నడుండెడిది? ఎప్పుడు జలముపోయి భూభాగ మట నేర్పడినది? ఫలానిస్థలమున భూమియం దేయేపదార్థము

లున్నవి? అను నిట్టి ప్రశ్నలన్నియు నుపర్యుక్త నియమబద్ధతనే సూచించుచున్నవి.

ఖగోళవిద్య యేమనుచున్నది? పృథివి మున్నగు గ్రహములు సూర్యాది నక్షత్రగణములు, చంద్రాద్యుపగ్రహములు నన్నియు నియమము లేక నడుచుచున్నవా? సూర్యుడు నిత్యము దయ ముదయించి సాయంతనమున నస్తమించును. ఆ యుదయాస్తమయములు ఖగోళమునకు సంబంధించిన ఘటనలలో నొక్కటి. ఈ కార్యము నియమపూర్వకముగ నడుచుచున్నది. ఈ నియమము నాశ్రయించి కొన్నిమాసములకు ముందే ఫలాన దినమున సూర్యుడిన్నిగంటల కుదయించునని చెప్పగలము. మా గడియారములందు సమయ వ్యత్యాసము కలుగవచ్చును. కాని సూర్యోదయాస్తమయములం దెట్టి వ్యత్యాసమును గలుగ నేరదు. వాస్తవమున ఘటికాయంత్రముల క్రమమంతయు సూర్యోదయముపై నాధారపడి యున్నది. ఇట్లే చంద్రుడు నొక కఠినమైన నియమసూత్రమున బంధింపబడి యున్నాడు. అందువలన నతని యుదయాస్తమయములందును, క్షయవృద్ధులందును భేద మేర్పడ వీలులేదు. ఇందొక విశేషనియమము లేకున్నను, ఒకవేళ యున్నచో నది జ్యోతిర్విదులకు దెలియకున్నను, గ్రహణాదులను నిర్ణయించుటకుగాని, చంద్రుని యుదయాస్తమయములు దర్శనాదర్శనములు తెలుపుటకుగాని ఎరికిని వశముగాదు.

అన్నిటికంటె మనోవిజ్ఞానశాస్త్రము, విలక్షణమేగాక దుర్జ్ఞేయము నై యున్నది. సృష్టియందుగల పదార్థములను

గురించి యేకొంచెమో తెలిసికొన నవకాశమున్నది. కాని, మానవమస్తిష్కము చేయు నసంఖ్యాతకార్యములను జూచి నపుడు దీనికొక నియమమున్నదా? లేదా? యని సందేహము కలుగును. క్షణకాలమునకు తరువాత నా మానసికగతి యెట్లుండునో నాకే తెలియదు. అట్టిచో నితరుల మానసికస్థితి నెరుగుట దుస్తరమనుటలో సందియముండదు. కాని యింత మాత్రమున మనోవిజ్ఞానమునం దొక నియమమే లేదని యెంచరాదు. మానవుల మనస్సెంత విలక్షణమైనదైనను దీని గతులయందును నితరపదార్థములందువలె నియమము నిశ్చయింపబడియే యున్నది. ఆ నియమమును ప్రాచీన అర్వాచీన మనోవిజ్ఞాన శాస్త్రవేత్తలు కనిపెట్టియే యున్నారు. నేడు పెక్కండ్రు విద్వాంసు లీశాస్త్రము నన్వేషించుటలో దత్తచిత్తులై యున్నారు. మనుష్య జీవనమునకు సంబధించిన ఇతిహాసశాస్త్రము - కళాశాస్త్రము - నాట్యశాస్త్రము - కావ్య - వ్యాకరణ - అర్థశాస్త్రములు - సమాజశాస్త్రము మున్నగున వన్నియు మనోవిజ్ఞానమునకు సంబంధించిన నియమములపై నాధారపడి యున్నవి. మనుష్యులు సాధారణముగా నితిహాసఘటనలలో నొకదానికి మఱియొక దానితో నెట్టిసంబంధము లేదని తలతురు. అక్బరు జన్మించుట, అతని తండ్రి హుమాయూన్ పఠానుల వలనుండి తప్పించుకొని పారిపోవుట - పఠానుల పునరుత్థానము - మరల వారి పరాభవము, అక్బరు హుమాయూనుల విజయము - ఈ విషయము లన్నియు నకస్మాత్తుగ జరిగినవనిగాని, యొకానొక నియమ

సూత్రమున బంధింపబడి యుండలేదనిగాని యొంచుట పొరపాటు. మానవచిత్తమే యే యవస్థలందే యే రీతులందు పనిచేయునో దానివలన సమస్త జాతి లేక దేశమునందు గలిగిన మార్పేమో, ఇతిహాసమున నెట్టిమార్పులు కలిగినవో చరిత్ర నన్వేషించు పండితులు చక్కగా గనిపెట్టియే యున్నారు. యథార్థమున గొన్ని భిన్నభిన్న శబ్దములను నాయా శబ్దములందు వ్యాపక రూపమున బనిచేయుచున్న నియమములను కనుగొనకయే నొకదానివెంట నొకటి నుంచిన మాత్రమున వ్యాకరణశాస్త్రము నిర్మింపబడినట్లు పదిపదునైదు లేక వంద రెండువందల చారిత్రిక ఘటనల నెరిగిన మాత్రమున నితిహాస మెరిగినట్లు కాదు. ఆఘటనలందు శాసన మొనరించుచున్న నియమముల నన్వేషించుట యత్యావశ్యకము.

ఈవిధముగా ప్రపంచమునం దంతటను మనకు నియమబద్ధత గనిపించుచున్నది. సృష్టియందు మీమాంసింపదగిన రెండవవిషయ మేకతయై యున్నది. సృష్టియందు నామరూపములు, అవయవాదులు భిన్నములైనప్పటికి సృష్టియంతయు నొక్కటే. కాబట్టియే ఇంగ్లీషునందును సృష్టిని యూనివర్స్ (Universe) అందురు. ఏకత యని దీనియర్థము. మనశరీరమున అల్పానల్పావయవము లనేకము లున్నను శరీర మొక్కటి యైనట్లు సృష్టియు నొక్కటే. సృష్టియందసంఖ్యాతావయవములు లేకపోలేదు. సూర్యమండలములు భూమండలములు, మున్నగు ననేకమండలములు, నుపమండలములు

నుండినను అన్నియు నొక్క బ్రహ్మాండమున నంతర్భూతములే యగును.

ఇంతకు బూర్వము వర్ణించిన నియమములను గూర్చి విచారించిన సృష్ట్యైక్యత మిక్కిలి తెలియనగును. వాస్తవమున నియమబద్ధతయే యేకతకు చిహ్నము. నియమమనగా నేమి? అనేక భిన్నభిన్న పదార్థము లొకేవిధమున పనిచేయుటయే కదా? అనగా వానియం దేకత గలదని తాత్పర్యము. రాముడు, కృష్ణుడు, గోవిందుడు, మున్నగు బాలు రనేకులొక పాఠశాలకు బ్రతిదినము పదిగంటలకు వెళ్లుదు రనుకొనుడు. అప్పుడు పాఠశాలకు పదిగంటలకు వెళ్లు నియమమున్నట్లు మనము చెప్పుదుము. కారణమేమి? ఆబడికి వెళ్లు విద్యార్థు లందరకార్యమునం దేకత యుండుటవల్లనే కదా! అట్లుగాక, రాముడు తొమ్మిదిగంటలకు, గోవిందుడు పదకొండు గంటలకు, కృష్ణుడు పన్నెండు గంటలకు, నిట్లే యితర బాలురు భిన్నభిన్న సమయములకు బడికి పోవుచుండిన పాఠశాలకు వెళ్లుటలో నియమము లేదనియే కదా మన మందుము. ఈ విధముగానే లోకమునందు మోహనుడు జన్మించి కాలాంతరమున మరణించెను. గోవిందుడును నొకనాడు జన్మించి మఱియొకనాడు మరణించెను. రాముడు నిట్లే పుట్టి చచ్చెను. మఱియు నిట్లే యెందఱో పుట్టి గిట్టిరి. దీనినిబట్టి సృష్టియందు బుట్టినవారు (ఉత్పన్నములైన పదార్థములు) మరణించుట యొక నియమమని తెలియుచున్నది. ఎందువల్లనన

పుట్టినవారెల్లరు మరణించుట యను నొకేవిధమగు కార్యము నాచరించుచుండ జూచుచున్నాము.

భిన్నవస్తువులలోగల యేకత నియమమైనట్లు, అనేక నియమములందును ఏకత గనబడుచున్నది. అనేకులు మరణించుటను జూచి మనుజుడు మరణధర్ముడని తెలియుచున్నది. ఇట్లే భిన్నభిన్న పశువులు మరణించుటను జూచినపుడు పశువు మరణధర్మము గలవని తెలియుచున్నది. పక్షులలోను మరణధర్మము మనకు గోచరించుచున్నది. ఇట్లు మూడు నియమములు మనకు తెలిసినవి.

(౧) మనుష్యుడు మరణధర్మి
(౨) పశువు... మరణధర్మి
(3) పక్షి...... మరణధర్మి

వ్యవహరించుట కిట్లు మూడు నియమములై యున్నను, వీనియం దేకత్వము కనిపించుచునే యున్నది. ఈ మూడు నియమములను గలిపి ప్రాణులన్నియు మరణధర్మము గలవని యొకే విధమున జెప్పగలము. మొదటి మూడు నియమములు భిన్నవర్గములకు జెందిన భిన్నవ్యక్తులలోగల యేకత్వమును బోధించుచున్నవి. 'ప్రాణులన్నియు మరణధర్మములు' ను నీ నియమము ప్రాణిమాత్రమునగల యేకతను బోధించుచున్నది. ఈ విషయము ఒక జ్యామితి యుదాహరణము వలన మిగుల స్పష్టము గాగలదు. జ్యామితియందు త్రిభుజమునగల మూడు కోణములు కలిసి రెండు సమకోణములకు

Ex △.

సమానమగును. ఈ నియమము త్రిభుజములందు మాత్రే వర్తించును. చతుర్భుజములందు వర్తింపదు. చతుర్భు ములలో నాలుగు కోణములు కలిసి నాలుగు సమకోణా లకు సమానమగును. కాబట్టి,

(౧) త్రిభుజముల మూడుకోణములు రెండుసమకో ములకు తుల్యములనియు,

(౨) చతుర్భుజముల నాలుగుకోణములుకలిసి నాలు సమకోణములకు సమానములనియు,

రెండునియమము లేర్పడుచున్నవి. స్థూలదృష్టితో జూచి నీరెండు నియమములందు నెట్టి సాదృశ్యమును గనిపింపదు సర్వథా భిన్నములని తోచును. ఇట్లే పంచభుజ షడ్భు సప్తభుజాది క్షేత్రముల కోణములను కొలిచి చూతుమే భిన్నభిన్న నియమములు లభింపగలవు. పంచభుజ క్షేత్ర మునగల కోణములన్నియు కలిసి ఆరు సమకోణములతో సమానమగును. షడ్భుజములుగలది యెనిమిది సమకో ములతోను, సప్తభుజములుగలది పది సమకోణములతోన సమానమగును. కాని యీ నియమములందును ఒక సమా నత లేకపోదు. ఆ సమాననియమము త్రిభుజ, చతుర్భుజ బహుభుజాదులందును చూడనగును. ప్రతి క్షేత్రమునకును గల అన్నికోణముల యోగము, ఆ క్షేత్రభుజములను ద్విగ ణముచేసి అందు నాలుగు తగ్గించిన మిగులునట్టి సంఖ్యగల సమకోణములకు సమానమగును. ఇట్లు త్రిభుజ చతుర్భు జాది భిన్నజాతులనబడు క్షేత్రములందు నొకానొక సమాన

నియమము చూడనగుచున్నది. ఆ నియమము ననుసరించి యవన్నియు సమానజాతీయములు ననదగును.

ఇట్లే బీజగణితమునందును, అంకగణితమునందును గల భేదమేమి? అంకగణితము కొన్ని వ్యక్తులందుగల వ్యాపక నియమమును వర్ణించును. కాని బీజగణిత మా నియమము లన్నిటియందు నొకవిధమగు సమానతను - సాదృశ్యమును వెదకును. జ్యామితియందు త్రిభుజ - చతుర్భుజములందు మాత్రము వ్యాపించియున్న నియమమే బీజగణితమున త్రిభుజ చతుర్భుజములందే గాక, ప్రపంచమునగల యితరవస్తువు లందును ప్రయోగింప నగుచున్నది.

ఈసంబంధ మింతటితో నాగక బహుదూరము పోవును. వనస్పతి శాస్త్రమునందు గొన్ని నియమములు గలవు. కొన్ని ప్రాణిశాస్త్రమునం దున్నవి కాని యీ రెండువిధము లగు నియమములును జీవనశాస్త్రమునం దేకమగును. ఇట్లే రసాయనశాస్త్రము, భౌతికశాస్త్రము, జీవనశాస్త్రము, గణితము మున్నగు భిన్నభిన్న శాస్త్రములన్నియు నేకమై యేక శాస్త్రమగును. ఆశాస్త్రనియమము లన్నియు ప్రపంచమున గల సమస్త వస్తువులందు నుపయోగింప బడును. ఆశాస్త్రమే దర్శన మనబడును. ప్రపంచమున నియమైక్యత లేకుండుట చెల్లనేరదు. భిక్షుకసమ్రాట్టులం దేకత యున్నట్లు, మనుష్య-పశు - పక్షి - కీటాదులందు నేకత యున్నది. జడ చేతనము లందును నేకత యున్నది. అప్రకాశమాన మృత్తికా కణము లందును, ప్రకాశమాన సూర్యగోళములందును నేకత యున్నది.

ప్రపంచమున గోచరమగు మూఢవవస్తువు ప్రయోజనము. నియమములు, నియమగత సమానతయు వ్యర్థములగు నెడల ప్రయోజన ముండదు. పాఠశాలయందు పిల్లలందఱు నేకసమయమున నియమబద్ధులై యరుదెంచుట వ్యర్థముగాదు. ప్రయోజనమున్నది. ప్రయోజనము వలననే కార్యము సార్థకమగును. బ్రహ్మాండమునగల ప్రతివస్తువు, ప్రతిసంఘటనము ప్రయోజనమునే సూచించుచున్నది. భిన్నత గోచరించు తావులందును ప్రయోజనమే సిద్ధించును. కాని యా ప్రయోజనమొకప్పుడు మనుజబుద్ధికి తెలియును. మరియొకట తెలియకుండ వచ్చును. కాని ప్రయోజనము తప్పనిసరిగా నుండును. ఒకని ప్రయోజనము మరియొకనికి తెలియకుండవచ్చు. అందువలన బ్రయోజనము లేదనుట పొసగదు. ఒకప్పుడొక యైరోపానివాసి యాత్రచేయుచు అరబ్బీ యాటవికులకు అతిథి యయ్యెను. అత డొకనాడు వారి డేరాయెదుట విహరించు చుండెను. ఆయాటవికు లతని జూచి నవ్వసాగిరి. వారిదృష్టిలో నతడొక వైపునుండి మరియొక వైపునకు మెల్లగ నడుగులిడుచు తిరుగుచుండుట వ్యర్థముగా తోచెను. కాని యాత్రికు డట్లు తిరుగుటలో బ్రయోజనము లేకపోలేదని స్పష్టమేకదా! ఇట్టిదే ప్రాపంచిక పరిస్థితి. మనమెన్ని ఘట్టములనో మన బుద్ధియందు గల ప్రయోజనములతో మేలవించి చూతుము. కలిసిన వానిని సార్థకములనియు మిగిలినవి నిరర్థకములు నిష్ప్రయోజనములనియు నెంతుము. ఇదియే మనమొనర్చు ప్రమాదము. ప్రతిప్రయోజనమును మన

మెఱుంగ నేరము. కాని ప్రపంచగతి మాత్రము ప్రయోజన మున్నదనియే బోధించును.

ఒక పెద్దయంత్రమును తిలకింపుము. దానియందు నీకు వేలకువేలు అవయవములు గనిపించును. వానిలో కొన్ని చిన్నవి. మరికొన్ని పెద్దవి. కొన్ని పొడవైనవి. కొన్ని కుఱుచవి. కొన్ని గుండ్రనివి. కొన్ని వంకరగలవి. కొన్ని తిన్ననివి. వీనిలోనున్న యీ పరస్పర భేదమును చూచినపుడు వీనియందొక సామ్యము నూహించుట సులభము కాదు. కాని యంత్రకారుని బుద్ధిని ప్రశ్నింపుము. అన్నిటికంటె ముందొక ప్రయోజన ముండెను. యంత్రకారుడు వస్త్రవయనమో, పుస్తక గ్రథనమో, కాగితనిర్మాణమో, యేదోయొక కార్యసిద్ధి నపేక్షించియే యంత్రమును నిర్మించెను. ఈప్రయోజనమే యంత్రకారుని ప్రేరించి నానావిధావయవములను యంత్రమున నిర్మింపజేసెను. అవయవము లన్నియు నొకేవిధములు గాకున్నను, ఒకే కూర్పుగలవి కాకున్నను పరస్పర మత్యంత భిన్నములయ్యు నొకానొక విశేషకార్యమును సిద్ధింపజేయుటలో నన్నియు సమానములే. వీని యుపయోగమును యంత్రోపయోక్తపై నిబ్బరమై యున్నది. యంత్రము నడుచుటయే వీని యుద్దేశము. యంత్రావయవములలో ననేకములు చూడ నింపుగలిగింపవు. వాని స్థానమున సుందరమైన వానిని చేర్పవచ్చు. కాని యవి యంత్రమును నడుపుటలో సహాయకములు గాకున్న నిరర్థకములగును. యంత్రకారుడు వానికి విలువ నొసంగడు. వాని దృష్టిలో యంత్ర

చాలనమున కుపయోగించు సాధనములు చూచుట కెంతో వికృతము లైనను, మూల్యమున నెంత యల్పములైనను, సుందరము లగును. బహుమూల్యము లగును. అవియే వాని యుద్దేశమును (ప్రయోజనము) పూర్తి నొనరించును. ఇట్టిదే బ్రహ్మాండస్థితియు. ఇదియొక ముఖ్యప్రయోజనమునకై నిర్మింపబడినది. ఇందలి ప్రతి స్వల్ప సంఘటనము సప్రయోజనమై యున్నది. ఇందనేకవస్తువులు లోకులదృష్టిలో వికారములుగావచ్చు. అనేక ఘటనలు హానికారకములుగా బొడకట్టవచ్చును. కాని: మనుజుడు తాను గల్పించిన ప్రయోజనమునే సృష్టిప్రయోజనముగా నంటగట్టును. అందువలన సృష్టిరచనలు తా ననుకొనిన ప్రయోజనములను సిద్ధింపజేయనపుడు వానిని నిష్ప్రయోజనములుగా నెంచును. ఇట్లు సృష్టిరచనయం దనేకు లనేకవిధముల న్యూనతల నాపాదించిరి. ఒక సంస్కృతకవి

'గంధం సువర్ణే, ఫలమిక్షుదండే, నాకారిపుష్పం ఖలు చందనేషు, విద్వాన్ ధనాఢ్యో, నృపదీర్ఘజీవీ, ధాతుస్తదా కోఽపి నబుద్ధిదోఽభూత్'

'సువర్ణమునందు సుగంధమును, ఇక్షుదండమునందు ఫలమును, చందనమున పుష్పమును, పుట్టించు బుద్ధి సృష్టికర్త కొసంగువాడు లేకుండెన'ని వ్రాసియున్నాడు. కాని సువర్ణమున సుగంధమును వెదకు బుద్ధిమంతులకు, బంగారమునకు సువాసనయున్నచో ధనాఢ్యులు చిత్రవిచిత్రములయిన సుందరపుష్పములను ప్రేమింపజాలరని తెలియదు. బంగా

రపు రంగు, పుష్పముల సుగంధము రెండును భిన్నములై భిన్న ప్రయోజనములను నెరవేర్చుచు లోకపు ప్రయోజనమును సిద్ధింపజేయుచున్నవి. రాబర్టు ఫ్లింట్ (Robert Flint) మహాశయుడు తన యాస్తికత (Theism) నామకపుస్తకమున నిట్లు వర్ణించియున్నాడు.

'మన భూమి యేమండలమున కొక యవయవమో ఆ మండల మతివిశాలమై, విచిత్రమై, నియమితమై యున్నది. ఏ గ్రహోపగ్రహములచే నీ మండల మేర్పడియున్నదో వాని పరిమాణము, స్థూలత, దూరము, ప్రగతి, మార్గతలము, మున్నగునవన్నియు మండలరక్షణకు, దార్ఢ్యమునకు దగిన ట్లేర్పరుపబడి యున్నవి. దీని యవయవములును మన శరీరావయవములవలె పరస్పరానుకూల వ్యవహార మొనర్చుచున్నవి. ఉదాహరణార్థము మన భూగ్రహమునే గైకొనుడు. ఇది సూర్యచంద్రులతో నెంతో సువ్యవస్థితమై యున్నది. అందువల్లనే బీజములను విత్తుటలోను, వాని ఫలములను గ్రహించుటలోను మనకెట్టి బాధయును గలుగదు. సముద్రకెరటములు మనల నెన్నడు మోసగింపవు. మఱియు నీ సూర్యమండలము సైతము కోట్లకొలది మండలములలో నొకటి. వానిలో ననేకము లీమండలముకంటె నసంఖ్యగుణములు పెద్దవి. ఇట్టి కోటానకోట్లు సంఖ్యగల సూర్యమండలములు, తారాగణములు పరస్పర మెంతయు సువ్యవస్థితములై బ్రహ్మాండరక్షణకనుకూలములై గణితవిద్యలో గల గూఢతమ నియమములతో నిబద్ధములై ప్రతి స్థానమునందును సామ్యసౌందర్యముల వెలి

గ్రక్కుచున్నవి. ప్రతిగ్రహము తన యిరుగుపొరుగు గ్రహ మార్గములయందు తన ప్రభావమును జూపెట్టును. గ్రహ నక్షత్రాదులన్నియు నేదోయొక మహత్త్వపూర్ణ కార్యకరవ లయి యున్నవి. అవి యట్లొనరింపకున్న తమకేగాక బ్రహ్మా డమున కంతటికి నష్టము వాటిల్లును. కాని మండలవ లన్నియు విలక్షణరూపమున నిర్మింపబడి భయానక ఘట్టము కాకరము లయినట్లు గోచరించుచు బ్రహ్మాండరక్షణమునకు దృఢతకు సాధనములయి యున్నవి. అవి పరస్పరశక్తులను గో డొక నియతసమయమున కుపకారకము లగునట్లు వ్యయించి చుండును.

ఈ పరస్పర సహకారమే యీ విశాల బ్రహ్మాండప విశేషప్రయోజనమును గుర్తింప జేయుచున్నది. ఈ విశా ప్రయోజనమున కంతర్భాగములయిన చిన్నప్రయోజనము లనేకములున్నవి. వానిలో బరస్పర సంబంధము కానిపింపదు కాని మనమా విశాలప్రయోజనమును గూర్చి దృష్టి సారించి తిమేని యీచిన్న ప్రయోజనముల యుపయోగము గోచ రింపకపోదు. ఎట్లన, మనుష్యుని నిశ్శ్వాసమువలన దుష్ట వాయువు బయలువెడలును. ఈ దుర్వాయువు మానవజీవ మునకు హాని కలిగించును. అందువలన మన శరీరములు దుర్వాయువును వెలువరించునవి గాకుండునట్లు నిర్మించియున్న బాగుండెడిది. కాని ఈదుర్వాయువు వలన వనస్పతులు వృద్ధి నొందును. ఆ వనస్పతులు మన శరీరవృద్ధికి కారణములు ఇట్లు మనకు ప్రతివస్తువు నొకదృష్టితో హానికారకముగ

దోచినను మరియొక రూపమున నది లాభదాయకముగనే సిద్ధమగుచున్నది. ఒక చిన్న పుష్పమువలన గలుగు నుపయోగములను విచారింప నెంతుమేని ప్రపంచమున ననేకవిషయములను గూర్చి విచారింపవలసి యుండును. మానవదృష్టి కోణముతో నది యతని కన్నులకు తృప్తికారక మగును. అందు సుగంధమున్న ఘ్రాణేంద్రియ సుఖమును సైత మిచ్చును. వైద్యులు దానినే ఓషధులందు ప్రయోగింతురు. చిత్రకారులు దానినుండి చిత్రకళను నేర్చుకొందురు. రంగులు వేయువారు రంగువేయుటను తెలిసికొందురు. కవి తన కవితాకలాపమున నొకింత సహాయమును పొందును. ఇట్లు మనుష్యునకు జెందిన ప్రయోజనములేగాక పుష్పమునందు మరియు ననేక ప్రయోజనములు గలవు. భ్రమరములు దాని మధువును గ్రోలుచుండును. మధుమక్షికలు మధువును సేకరించును. సీతాకోకచిలుకలు వానిపై కూర్చుండి యానందము ననుభవించును. ఇంతియగాక పుష్పము వృక్షసంతతిని రక్షించు బీజకారకము నగును. ఇది యొక చిన్న పుష్పప్రయోజన వృత్తము. ఇట్లే ప్రపంచమునగల ప్రతివస్తువును గురించియు మనము విచారింప గలుగుదుము.

మేమిట సృష్టిలోగల నియమబద్ధతను సమానప్రకారతను ప్రయోజనమును చూపించుటకు యత్నించితిమి. ఇవిగాక సృష్టియందు విచారింపదగిన వస్తువు మరియొండు గలదు. అదియే విశాలత. ఈ జగమెంత విశాలమైనది? ఊహింపనైన తరముగానిది. వైశాల్యము నూహింప గలుగుదుమేని సృష్టి

విశాలమని చెప్పను. అందువలననే కాబోలు దీనిని బ్రహ్మాండమందురు. బ్రహ్మాండమనగా నొక గొప్ప విశాల మండలమనియే కదా తేలుచున్నది.

అన్నివిధముల నీ విశ్వము విశాలమనక తప్పదు. పొడవు వెడల్పులను కొలుతుమేని ఆగజము లనంతసంఖ్యలో తేలును. మనుజుడు భూమినంతయు దిరిగి దానిని కొలువ గలిగెను. భూగోళవేత్తలు భూపరిధిని ౨౫,౦౦౦ మైళ్లని యందురు. ప్రథమమున నిరువదియైదువేల మైళ్లను మనస్సునకు తెచ్చుట సులభముకాదు. మానవశరీర మైదారడుగులకు మించదు. మనుష్యుని దృష్టియు నతిదూరము పోదు. ౨౫వేల మైళ్లదూరము ననుభవమునకు తెచ్చుట దుస్తరమే. కొంత యనుమానించియు, కొంత కల్పించియు భూమండలమున నొక యంశమును మనుజు డెఱుంగగలడు. ఐనను భూమిని విశాలము కాదని యెవడనగలడు? హిమాలయ పాదభూమి యందు నిలబడి దాని శిఖరమువంక దృష్టి నిగుడింపుము. స్వయముగా నీ నిలువును గుర్తింపుము. అటుపై పర్వతముతో నిను బోల్చి చూడుము. పోల్చుటకు ముందే పర్వత వైశాల్యము హృద్గతము కాదొడగును. ఎంతపొడవు? ఎంత వెడల్పు? ఎంత యెత్తు? ఓహో! కన్నులు మిరుమిట్లు గొనును. బుద్ధిభ్రాంతిజెందును. మస్తిష్కము భ్రమింప దొడగును. ఇది పర్వతవైశాల్యము. భూమిపై నిట్టివెన్నో పర్వతములున్నవి. ఓడయందు కూర్చుండి సముద్రముమీద నడువుము. ప్రథమమున నోడ వైశాల్యమును విచారింపుము. అదియు తక్కువ

కాదు. దాని వైశాల్యమును గురించి మనుష్యు డభిమా నించును. కాని సముద్రమునెదుట నావ యెంతటిది? శతాం శమా? సహస్రాంశమా? మాసములకొలది యాత్ర నొన రింపుము. ఆవలియొడ్డు దొరకదుకదా! ఇది భూమండల ములో నొక్క యంశపు వైశాల్యము. కాని, భూమి బ్రహ్మాండములో నొక విశాలతమ వస్తువా? ఇంతకంటె పెద్దవస్తువు లేదా? కాదు, కాదు ఈభూమివంటి ౧౩ లక్షల గోళములను చిదిపి పిండిచేసి యొక పెద్దగోళమును సిద్ధపరచిన నది మన సూర్యగోళముతో సమానమగును. అట్టి సూర్యగోళ మీ బ్రహ్మాండమున నొక్కటేనా? ఖగోళ విద్యావిశారదుల నడిగి చూతుము? వారు ఇట్టిసూర్యులు కోట్లుకొలది గలవని చెప్పుచున్నారు. రాత్రియందు దీపకలికలవలె మినుకు మినుకు మనుచుండు నక్షత్రములన్నియు మన భూమండలము కంటె చాల రెట్లు గొప్పవందురు. సెకండునకు లక్షలకొలది మైళ్లు పరువెత్తగల వానిప్రకాశము భూమిని చేరుటలో వం దల యేండ్లు గడచునట. వానిదూరము నూహింపుము.

ఇది పొడవు వెడల్పుల సంగతి. సూక్ష్మదృష్టితో జూచినను ఈసృష్టివైశాల్య మింతని చెప్పనలవికాదు. మన మొక వస్తువును ఖండఖండముగ నొనర్చుచు నేగితిమేని కొంతవడికి మన కల్పనాశక్తియు పనిచేయ జాలనంతటి సూక్ష్మావస్థ వచ్చును. అంతకంటె ముందునకు పోవుటకు మనకు శక్యముకాదు. నీటిని వేడి చేయుదుము. దాని కణములు బాష్పరూపముననో, ధూమరూపముననో మన కనులయెదుట తాండవ మాడదొడ

గును. అధికముగా వేడిచేయుదుమేని కంటికి కగబడకుండఁ బోవును. ఇట్లెన్ని వస్తువులు సూక్ష్మరూపమున నీబ్రహ్మాండమున నిమిడియున్నవో మన మెఱుంగము. 'మహతో మహీయాన్' అనఁదగు జంతువును చూచి యాశ్చర్యపడు పట్టులందే 'అణోరణీయాన్' అనఁదగు ప్రాణి మన కాశ్చర్యము కలిగింపక పోదు. మశకము మత్తగజమునకలె న్యూనప్రభావోత్పాదకమగు టెట్లు?

నియమముల విశాలతయు విలక్షణమైనదే. నీవొక శాస్త్రమును దిలకించిన నందనేక నియమములు దృగ్గోచరములగును. అట్టిశాస్త్రము లసంఖ్యములై యున్నవి. విజ్ఞానవేత్తలు చిరకాలమునుండి యీ నియమముల నన్వేషించుటలోను వానిని వర్గీకరించుటలోను తత్పరులై యున్నారు. నేటికిని క్రొత్త క్రొత్త నియమములు బయలువెడలుచునే యున్నవి. దీనింబట్టియు సృష్టి విశాలమని తోచును.

చిన్నచిన్న వస్తువు లనేకములు చేరియే యొక పెద్ద వస్తు వగునని కొందఱు చెప్పఁదొడగవచ్చు. ఎట్లన, పర్వతమన నేమి? అనేకములగు చిన్నచిన్న మట్టికణముల సమూహమే కదా! సముద్రమన నేమి? చిన్నచిన్న నీటిబిందువుల కూటమియేగదా? కాబట్టి విశాలతయం దింత మహత్వ కల్పనయేల? కాని యిది వారి ప్రమాదము. విచారించిచూచిన మనుష్యుల మస్తిష్కమున వైశాల్య ప్రభావ మతివిలక్షణముగా నేర్పడుచుండును. జలబిందువుల సముదాయమే సముద్రము కావచ్చు. సందియములేదు. కాని సముద్రము

స్వస్వరూపమున చిన్నచిన్న జలకణములు కానేరవు. అదియొక విలక్షణవస్తువు. అట్లుగాకున్న మానవహృదయములం దాసము ద్రపు ప్రాభవమేల గోచరించును? అత్యున్నత పర్వతరాజమును జూచినపు డేర్పడు మహాత్త్వానుభూతి చిన్నచిన్న మట్టికణము లను చూచినపుడు కలుగ నేరదు. సేనను చూచినపు డుండు భావ మొక్కొక్క సైనికుని చూచినపు డుండబోదు. కాబట్టి విశాలత నిరసింపదగిన దనుట సహృదయ లక్షణ మెట్లగును? వాస్తవమున బ్రహ్మాండ వైశాల్యము సైతము, దానియందుగల నియమబద్ధత, ప్రయోజనము, ఏకత్వము నకు ముఖ్యమయిన దనుట నిర్వివాదాంశము. విశాలతను సృష్టి నుండి తొలగింతుమేని యితర గుణములు నిరర్థకములే యగును. మనుష్య కృతములయిన యద్భుత వస్తువులందును, సృష్టియందుగల యద్భుతవస్తువులందును గల పెద్దభేదము విశాలతయే. మనుష్య కృతములకంటె సృష్టి నిబద్ధములు ప్రతి విషయమునను విశాలములే.

ఒక్కొక్క సమయమున మనుజకృత వస్తువులును మనస లను చకితులం జేయును. విద్యుద్దీపకాంతి చంద్రకాంతికంటె నధికాశ్చర్యము నొదవించును. మనుష్య నిర్మితమగు కాగితపు చిలుక నిజమగు చిలుకకంటె నద్భుతముగా దోచును. ఆకాశ యానము (Aeroplane) ను జూచి మనము విస్మితుల మగు దుము. కాని, యీ యాశ్చర్యము మానవ బుద్ధియందుగల విశాలతవలన గాక తద్విపరీతమగు స్వల్పతచే నేర్పడుచున్నది. నాలుగైదేండ్ల బాలుడొకడు ప్రౌఢవయస్కుడైన వ్యాఖ్యాత

కంటె నతిస్వల్పమయిన వ్యాఖ్యాన మొనర్చినను మన కాశ్చ
ర్యము గలిగించును. ఎందువలన? అట్టి యల్పవయస్కు డంతటి
కార్యమొనర్ప జాలడను భావము మనలో నుండుటచే మన
కట్టి యాశ్చర్యము గలిగినది. ఇట్లే మనుష్యకృత వస్తువుల
విషయమునను నెంచవలయును. మనుష్యుని బుద్ధిలాఘవమును
లక్షించినపుడు విద్యుద్దీపకాంతి చమత్కారి యగును. వాస్తవ
మున నది చంద్రకాంతిని మించునట్టి వైశాల్యము కలది కాదు.
ఇట్లే వాయుయానము పక్షుల శరీరమున గల విశాలతకంటె
నెక్కువ విశాలతగలది కాదు. గంభీరదృష్టితో జూచిన
మానవశిల్పము సృష్టిశిల్పమున సహస్రాంశమైన గాదు.
సాగరమునకు కలశమునకు నున్న సంబంధమే మానవా
మానవ కృతవస్తువులకు నని యెంచవలయును.

---

# నాల్గవ అధ్యాయము

## సృష్టికర్త

పూర్వాధ్యాయమున సృష్టియందు నియమబద్ధత, ఏకత్వము ప్రయోజనము, విశ్వాలత్వము నున్నవని నిరూపించి యుంటిమి. అంతకు పూర్వ మీసృష్టి యొక కార్యమనియు సిద్ధపరచి యుంటిమి. ఈ సృష్టి కారంభమున్నది. అనగా నొకసమయమున సృష్టిలేకుండెను. మరియొక నాడది యుత్పన్నమైనది. ఇట్టిచో నీ సృష్టి కొక కర్తకలడా యని ప్రశ్న వొడమును. ఎవడేని సృష్టినొనర్చిన ఆస్తికత సిద్ధించును. లేకున్న ఆస్తికత కేవల కల్పన యగును.

ఈవిషయమునందు నాల్గువిధములైన యభిప్రాయము లున్నవి.

(౧) సృష్టి స్వభావమువలన నేర్పడినది. దీని నిర్మించువా డెవ్వడు లేదు. కర్తలేకయే యనాదికాలమునుండి పుట్టుచు గిట్టుచు వచ్చుచున్నది.

(౨) ప్రకృతియే ('నేచర్') సృష్టికి కారణము.

(౩) ఈ సృష్టిరచన ఆకస్మికము.

(౪) సృష్టిని రచించు జ్ఞానమయ సత్తా యొకటి కలదు. అది యొకానొక ప్రయోజన ముద్దేశించి సృష్టిని రచించుచుండును. నాశ మొనర్చు చుండును.

మొదటి మూడు మతములు నాస్తికవాదమునకు సంబంధించి యుండును. నాలుగవది యాస్తికమతము. ఈ నాలుగవ మతమునం దనేక శాఖలును గలవు. కాని వాని

కన్నిటికి నాదిమూలము సృష్టికార్యమే. మన మిట నీమతముల నన్నిటిని క్రమముగా విచారింతము.

ప్రతికార్యమునకు గారణ ముండుననుట నిస్సందిగ్ధ విషయము. ఆకారణ మొకటిగాక మూడుండును. ఒక ఘటము నుదాహరణముగా తీసికొందము. దీని కుపాదాన కారణము మన్ను. మన్నే పరివర్తితమై ఘటమగును. నిమిత్త కారణము కుమ్మరి. మంటికి ఘటరూప మొసంగును. మూడవ సాధారణకారణము చక్రము- కాలము- దేశము మున్నగునవి. వీనిలో సమయము దేశము - మున్నగున వన్నికార్యములకు సామాన్యములే. కారణమేమన, మన మొకానొక కార్యమును గూర్చి విచారించునపుడు ఆకార్య మేర్పడిన దేశకాలములు తప్పక తెలియ నగును. కాని, కారణము అనగా క్రియను జనింపజేయు సాధనము కొన్నియెడల నిమిత్త కారణముకంటె భిన్నమగును. ఉదాహరణము: ఘటవిషయమున చక్రదండాదులు. కొన్ని యెడల నట్లు భిన్నములు కావు. నేనెవరినైన కొట్టవలయు నన్న నాహస్తమే నాకు సాధనము గావచ్చును. కాబట్టి, నిమిత్తకారణమునం దితరకారణము నపేక్షింపకయే క్రియను కలిగించు శక్తి యున్నయెడల నట్టితావున వేరుగా కరణ మవసరముండదు. నిమిత్తకారణమున గల శక్తియే కరణ కార్యమును నెరవేర్చునని తాత్పర్యము.

పూర్వాధ్యాయమున నుదహరించిన 'మిల్' మహాశయుని కథనము ననుసరించి- సృష్టి యొకవిధమగు రచితపదార్థము. ఒకవిధమగు ఘటనలయు, నసంఖ్యక్రియలయు, సమూ

హామే సృష్టిరచన యని యర్థము. ఈ క్రియ లనేకములు. ఒకటిగాదు. మనము దేని నొకే క్రియ యనుచున్నామో అదియు ననేక క్రియల శృంఖలయేగాని యొకటిగాదు. 'గోవిందుడు మదరాసునుండి వచ్చెను.' అనినపుడు సాధారణ దృష్టికి వచ్చుట యను నదొక క్రియగా దోచును. కాని గంభీరముగా పరిశీలించిన ననేకక్రియలు గనఁబడును. వాని నన్నిటిని మనము 'వచ్చుట' అను నొక క్రియగా జెప్పుచున్నారము. మదరాసునుండి వచ్చుట కెన్ని క్రియ లవసరములై యుండెను? మొదట మనస్సునందు ప్రేరణాత్మక క్రియ కలుగును. దానిపై విచారణ యేర్పడును. తదుపరి నిశ్చయమగును. తరువాత లేవవలెను. ఒకయడుగు ముందుంచవలెను. అటుపై రెండవ యడుగు నెత్తవలెను. ఈ విధముగా నొకదానివెంట మరియొక క్రియ యొనర్పవలసి యున్నది. సాధారణ కార్యమునందే యిట్లనేక క్రియలు చేయవలసియుండ నతివిశాలమైన యీసృష్టియందు జరుగు ప్రతి క్షణిక క్రియయందు నెన్ని క్రియలు జరుగుచుండునో యూహింపుడు. నదుల ప్రవాహమునందును, వాయువు వీచుటలోను, జల వాయువుల కణములలో నెన్నిమారులు క్రియ జరుగునో చెప్ప నలవిగాదు.

ఈ యసంఖ్య క్రియాజాలమున కొకకర్త యుండునా లేకుండునా యను నొకప్రశ్న వొడమును. అనగా ఘటమునకు కుమ్మరివలె నీకార్యముల కొక నిమిత్తకారణ ముండునా? ఉండదా? యని యీప్రశ్న భావము. ఆస్తిక, నాస్తిక

లలో నీవిషయమున భిన్నభిన్న మతము లున్నవి. ప్రపంచ మున జరుగు క్రియలను రెండు ముఖ్యభాగములుగా మార్పనునవగుచున్నది. అందొక భాగము చేతన ప్రాణులచే జేయబడు క్రియలు. పుస్తకములు వ్రాయుట, ఇండ్లు కట్టుట, కులాయములను నిర్మించుట, ఏడ్చుట, నవ్వుట, నడచుట, పరుగెత్తుట మున్నగునవి. ఈ క్రియలకు సంబంధించిన నిమిత్తకారణములు కొన్నిచోట్ల బ్రత్యక్షము లగును. కొన్నియెడల ఆనుమానికములు. ఎట్లన మనయెదుట నొక కుమ్మరి కుండను చేయుచున్నాడనుకొనుడు. అక్కడ కుండను జేయువానిని(నిమిత్తకారణము) గూర్చి యెట్టిసందియ ముండదు. అనుమానమున కవసరము లేదు. ప్రత్యక్షమే. ముంజేతి కంకణమున కద్దమేల ? కాని దుకాణమునుండి యెన్నడో సిద్ధముచేయబడిన కుండను కొని తెచ్చితిమనుకొనుడు. ఆ కుండకు నిమిత్తకారణమైన కుమ్మరి దానిని చేయుచుండ మనము ప్రత్యక్షముగా చూచి యుండలేదు. అందువలన నతనిని యనుమాన ప్రమాణము ద్వారా తెలిసికొందుము. ఒక చెట్టుమీద నొక గూడు కట్టియుండ జూచితిమేని దానిని గూడ నొకపక్షియే నిర్మించి యుండునని యనుమానింతుము.

చార్వాకుల వంటివారు కొందఱు అనుమానమును బ్రమాణముగానే యంగీకరింపరు. వారు

'అవినాభావస్య దుర్బోధతయా, నానుమానాద్యవకాశః,
ధూమాది జ్ఞానానంతరమ్ అగ్న్యాది జ్ఞానే ప్రవృత్తిః,
ప్రత్యక్ష మూలతయా భ్రాంత్యావాయుజ్యతే'.

(సర్వదర్శనసంగ్రహము) అందురు.

'అనుమానమున సాధారణ భూతమగు నవినాభావ సంబంధము దుర్జ్ఞేయ మగుటచే ననుమానము ప్రమాణము గాజాలదు. ధూమాది జ్ఞానానంతరమున అగ్న్యాదిజ్ఞానము కలుగుట ప్రత్యక్షమూలమో భ్రాంతియో యగును' అని వారి తాత్పర్యము. ఈ విషయమును గూర్చి మేమిట చెప్పున దేమన, 'అనుమానము ప్రమాణము కాదు' అని యనుటకు చార్వాకుల దగ్గరనున్న ప్రమాణ మేమి? శబ్దమును గూడ వారు ప్రమాణమని యంగీకరింపరు. అట్టిచో అనుమానాదులు ప్రమాణము కావను శబ్దములు ప్రమాణ మెట్లగును? కేవల ప్రత్యక్ష ప్రమాణము నాధారముగా తీసికొని వారెట్లి తరము లప్రమాణములని సిద్ధింపజేయుదురు? ఇంతియ గాక, వారు -

'అంగనా లింగనా జన్య సుఖమేవ పుమర్థతా' యని స్త్రీల యాలింగనమువల్ల కలుగు సుఖమునే పరమపురుషార్థముగా నుడువుదురు. వీరి పరమార్థమునందుగల అంగనాలింగనమునకు సుఖమునకు గల యవినాభావ సంబంధము మాత్రము అగ్నిధూమముల సంబంధమువలె దుర్జ్ఞేయమేల కాదు? ఇట్టిచోటులందు అవినాభావము సిద్ధించునెడల నితర స్థలములందును సిద్ధించి యనుమానము ప్రమాణమగును. లేనిచో చార్వాకుల సిద్ధాంతమునకే హాని కలుగును. అందువలన వీరి వాదము ఆలోచనాసహము కాదని స్పష్టమే. చార్వాకుడు గాని, మరియొకడు గాని, ప్రపంచమున ప్రతిమానవుడును తన

జీవనయాత్రకు సంబంధించిన కార్యములలో నెక్కువ యను మానము నాశ్రయించియే జరుపుచుండును. చార్వాకులయు, వారి యనుయాయులయు నిండ్లలో సిద్ధముచేయబడు శాక పాకాదు లన్నియు ముందు తమ కాకలియగును; అన్నము కావలసియుండు నను అనుమానము నాశ్రయించియే జరుగు చుండు ననక తప్పునా? అనుమానమును బ్రమాణముగా నంగీకరించుటచేతనే ప్రాణులకు గార్యారంభములలో బ్రేరణ కలుగును. 'ఈ కార్యమొనర్చిన నీఫల మేర్పడును' అని ముందుగానే అందఱు ననుమానించి యటుపై దానిని జేయ నారంభింతురు. అనుమానము నంగీకరింపకున్న బ్రత్యక్ష ప్రమాణమునగల యుపయోగితయు సఫలము కాదు. ప్రత్య క్షము వర్తమాన కాలికము. దాని నాధారముగా గొని భవిష్యత్తునకు జెందిన కార్యక్రమము నిర్ణయింపబడును. అందు వలన అనుమానమును బ్రమాణమని యంగీకరించుట ఆస్తిక వాదమునకే గాక యందరకు నావశ్యకము.

అనుమానము ప్రమాణమగునా కాదా యని విచా రించుటకు బూర్వము మనుష్యులచేతను, అన్యప్రాణుల చేతను జేయబడిన వస్తువులను జూచి అనుమానముద్వారా వానికర్తల నూహింతుమని వ్రాసియుంటిమి. ఇందు నాస్తికులకును మత భేదము లేదు. ఒకయాస్తికు డెట్లు కొండొక కుర్చీని చూచి యదియొక వడ్రంగిచే చేయబడి యుండునని యూహించునో నాస్తికుడు నట్లే యూహించును. ప్రాణులచే జేయబడని వృక్షము లుద్భవించుట, సూర్యచంద్రుల యుదయాస్తమయ

ములు, భూకంపము మున్నగు ననేక క్రియలవిషయమై యాలో చింపవలసి యున్నది. వీనికొక కర్త యున్నాడా లేడా యనున దొక సమస్య. ఈక్రియలన్నియు సాధ్యకోటికి జెందినవి. ఇంతకు బూర్వము వర్ణించిన క్రియలు సిద్ధకోటిలోనివి. అనగా వీని నొనర్చువా రుందురనుట నిర్వివాద విషయము. ప్రాణికృతము లుగా రెండవప్రకారపు క్రియలవిషయములో మతభేదము లున్నవి. ఆస్తికులీక్రియల విషయమునందును పూర్వక్రియ లకు వలెనే కర్తయుండు టవసరమందురు. ప్రథమప్రకార మగు క్రియలకు వాని నొనరించు కర్తలకు నవినాభావ సంబంధ మున్నదని నిశ్చయింపబడినది. ప్రత్యక్షమే యిందు ప్రమా ణము. ఈయుక్తియే రెండవప్రకారమగు క్రియలందును చొప్పింపనగునా యనున దొకప్రశ్న. మాదృష్టిలో నిందుదోష మేమియు కానరాదు. ప్రతిక్రియకు కర్త యొకడుండు టావశ్యకమని తెలినపుడు భూకంపము మున్నగు సృష్టిరచనా సంబద్ధములగు క్రియలకు కర్త యనావశ్యక మెట్లగును? నాస్తికులు మొదటి క్రియలకు కర్త యవసరమందురుగాని యీ రెండవరకపు క్రియలకు కర్త నొప్పుకొనరు. కుర్చీచేయుటకు వడ్రంగి యవసరమేగాని పర్వత మొనర్చుటకు కర్త యుండ నక్కర లేదందురు. చెంబులను నిర్మించుటకు కంచరి కావల యును. తటాక సరిత్సముద్రాదుల నొనరించుట కెవ్వరు నక్కర లేదు అని వారి తాత్పర్యము. ఇందుల కొక దృష్టాంత మొసంగుడని వారి నడుగుదుమేని సాధ్యకోటికి చెందిన క్రియ లనే వారుదాహరింతురు. ప్రపంచములోని క్రియలన్నియు

ప్రాణికృతములు, అప్రాణికృతములు నని రెండువిధములుగా నున్నవి. అందు ప్రాణికృతములు సిద్ధకోటికి చెందినవి. అప్రాణికృతములు సాధ్యకోటికి చెందినవి. వీనిలో సిద్ధకోటిలో జేరిన క్రియలే దృష్టాంతము లగునుగాని, సాధ్యకోటివి గావు. ఆస్తిక నాస్తికులలో నేరును సాధ్యకోటికి చేరిన వానిని దృష్టాంతపరుప వలనుపడదు. న్యాయశాస్త్రమున నిట్లే చెప్పబడియున్నది.

'లౌకిక పరీక్షకాణాం యస్మిన్ అర్థే బుద్ధిసామ్యం సదృష్టాంతః'

వాది ప్రతివాదుల కుభయులకు మాననీయమయినదే దృష్టాంతమని యీ సూత్రాభిప్రాయము. కాబట్టి నాస్తికులకు వారి పక్షమును దృఢపరుచుటకు దగిన దృష్టాంత మొండును గానరాదు. ఈ విషయము మరింత సుస్పష్టము గావలయునన్న నిట్లు విచారింపుడు. ఆస్తికుని పక్షము: 'సూర్యాదులను రచించు కర్త యొకడున్నాడు' ఇది సాధ్యము. కుర్చీని నిర్మించుటకు 'వడ్రంగి యావశ్యకమైనట్లు సూర్యాదులకు గర్త యావశ్యకము' అని కుర్చీని దృష్టాంతపరుచును. ఈ దృష్టాంత మాస్తిక నాస్తికుల కుభయులకు సమ్మతమే. సిద్ధకోటికి జెందియున్నది. కాని నాస్తికపక్షము 'సూర్యాదులకు గర్త యనావశ్యకము. ఇది సాధ్యము. నది ప్రవహించుటకు బ్రవహింపజేయువా డెట్లనవసరమో అట్లే సూర్యాదులకు గర్త యనవసరము' అని నదిని దృష్టాంత మొనర్చును. ఈ నదీదృష్టాంతము సిద్ధకోటికి జెందినదికాదు. సాధ్యకోటిలోనిది. అందువలన దృష్టాంతమునకు దగదు.

అది యుభయసమ్మతము గాదు. నాస్తికుడు సిద్ధకోటికి జేరిన వానిని దృష్టాంతముగా గైకొనడు. అట్లు తీసికొనిన వాని పక్షమే సిద్ధింపదు. సాధ్యకోటినుండి దృష్టాంతీకరించుట న్యాయవిరుద్ధము. ఈ రెండుపక్షములకు జెందని పదార్థ మొండు కానరాదు. కాబట్టి దృష్టాంతరహితమైన నాస్తిక పక్షము నిర్బలమనుట నిర్వివాదాంశము. గడియారము చేయువాడు లేకున్న గడియారము నిర్మింపబడనేరదనియు, వడ్రంగి లేకున్న కుర్చీ నిర్మింపబడదనియు నాస్తికు డంగీకరించు నేని, నదీ, పర్వత, సూర్యచంద్రాదులును చేతనసత్త్వ మొకటి లేకున్న నేర్పడనేరవని యంగీకరింపక తప్పదు.

కొందఱు కార్యకారణసంబంధవిషయమున నాపత్తి నుద్భావింతురు. కారణ మననేమి? రెండుఘటనలలో పూర్వఘటనము కారణము- ఉత్తరఘటనము కార్య మన బడును. ఇంతకంటె కార్యకారణములకున్న సంబంధమేమి? అని యందురు. కార్యకారణ సంబధమే సిద్ధింపకున్నచో ఆస్తికతాభవనము తటాలున కూలిపోవును. ఈ విషయమున నొక మహాశయు డిట్లు వ్రాయుచున్నాడు.

'జోన్ స్టువర్టు, హ్యూమ్‌చే నొసంగబడిన యొక పురాతనయుక్తిని దీసికొని దానిని పెద్దచేసి సర్వదా, పూర్వ మేర్పడునదే కారణము. ఇంతకంటె మిన్నగాద'ని మనకు నిశ్చయము కలిగింప యత్నించెను. ఎల్లపుడు నొకఘటన మరియొక ఘటనకు బూర్వ మేర్పడుచో నవి రెండును గారణ

కార్యములన దగునట్లు మన మనస్సులలో సంబద్ధములగునని యెత డనును?

కాని ధ్యానపూర్వకముగా విచారించిన నిది మనో విజ్ఞానమునకు సంబంధించిన యొక పెద్దప్రమాదమని తేలును. బాలకులు, వృద్ధులు, శిక్షితులు, అశిక్షితులు నెల్లర మనస్సులందును గార్యకారణ భావములున్నవి. ఈ భావములు పూర్వాపర సంబంధమువల్లనే యేర్పడుననుట చెల్లదు. తల్లి యన్నము వండుచుండ చూచిన బాలకుడు తల్లి నన్నమునకు నిమిత్తకారణమని తెలిసికొనును. కార్య కారణ శబ్దముల నెరుంగకున్నను వాని హృదయమున గార్యకారణ సంబంధ భావ మేర్పడుచునే యున్నది. ఇది స్వాభావికము. తల్లి యన్నమువండుట అది పిల్లవానిదగ్గర చేరుట అను నీరెండు ఘటనలమధ్య ననేకఘటనలు జరుగును. వాడాఘటనల నన్నిటిని అన్నమునకు గారణముగా (కర్తగా) నెంచడు. తల్లినిమాత్రమే కర్తగా నెంచును. ఇది స్వాభావికము. ఆస్తిక నాస్తిక పక్షపాతములకు సంబంధములేని బాలకుని స్వచ్ఛహృదయమున గార్యకారణ సంబంధజ్ఞాన మెట్లుదయించుచున్నది? మిల్ హ్యూము మహాశయులు తమ తమ విశేష మతములను స్థాపించుటకై యట్లు మీనమేషముల గణించిరి. కాని బాలకుడు కపటరహితుడు. ఇట్లే యశిక్షితులైన జాంగలికులందును కార్యకారణ భావజ్ఞాన మున్నది. వారును ముందు వెనుకలుగా నేర్పడు ఘటనలను కారణకార్యములుగా నెంచరు. ఈ కార్యకారణభావము నే శబ్దములతో వర్ణించినను, కార్య

కారణ సంబంధమునకును, పూర్వాపర సంబంధమునకును భేద మున్నదనక తప్పదు. మనుష్యులలోనే గాక పశుపక్ష్యాదు లందును గార్యకారణభావజ్ఞాన మున్నదనియే నా యభి ప్రాయము. పెంపుడు కుక్కలయు, చిలుకలయు వ్యవహార మిందులకు బ్రమాణములు. ఒక్కొక్క సమయమున బూర్వాపర సంబంధములే కార్యకారణభావముగా నెంచి యనేకులు మోసపోవుదురు. కాబట్టి కార్యకారణభావము, పూర్వాపర సంబంధము, భిన్నములని యెఱుంగవలయును. మిల్ మహాశోదయుని 'సర్వదా పూర్వమేర్పడునదే కారణము' (Coming always before) అను నీవాక్యమునగల సర్వదా (always) అను శబ్దమే వారిపక్షము సరిగాదని తెలుపు చున్నది. ఒక ఘటన మరియొక ఘటన కెల్లప్పుడు పూర్వ మేర్పడుట యనునది కారణ లక్షణములలో నన్యతమమగును గాని అదియే కారణమునకు బూర్ణలక్షణము కానేరదు. మాయీ విషయమునే 'ఆర్మ్‌స్ట్రాంగ్' (Armstrong) మహా శయు డిట్లు స్పష్టపరచి యున్నాడు.

'సోమవార మెల్లపుడు మంగళవారమునకు ముందు వచ్చును. కాని యెవరును సోమవారము మంగళవారమునకు కారణమని చెప్పుచుండగా విని యుండలేదు...... చీకటి యెల్లపుడు సూర్యోదయమునకు ముందువచ్చును. కాని చీకటి సూర్యోదయమునకు కారణము కానేరదు.'

ఇతడే నిమిత్తకారణము నిట్లు నిర్వచించి యున్నాడు.

డాక్టర్ వార్డు, కారణమున కన్నిటికంటె మంచి యుదాహారణము నిచ్చియున్నాడు. మనుష్యుని యిచ్ఛాశక్తి వాని శారీరిక వ్యాపారమున ప్రవేశించుట'

'కార్యము కారణమునకు తరువాత నగుటయే గాక కారణముద్వారా నగును. ఇది దానికార్యము లేక పరిణామము- ఇచ్ఛాశక్తి క్రియ, దానికారణము.'

అన్నంభట్టు తన తర్కదీపికయందు నిమిత్తకారణ లక్షణమును వార్డుకంటె నెంతో సుందరముగా నిర్వచించి యున్నాడు.

"ఉపాదాన గోచరాపరోక్షజ్ఞాన- చికీర్షా - కృతిమత్వం కర్తృత్వమ్"

(౧) ఉపాదానగోచర- అపరోక్షజ్ఞానము- (కుమ్మరికి మృత్తికాజ్ఞానమువంటి ఉపాదాన కారణపు నికట తమ జ్ఞానము.)

(౨) చికీర్ష (కార్య కరణేచ్ఛ = కార్య మొనరింపవలయు నను కోరిక.)

(౩) కృతి (క్రియ-ప్రయత్నము) యను నీమూడువిషయములు గలది నిమిత్తకారణము- కర్త యనబడును. అని పై వాక్యార్థము. జ్ఞానము- చికీర్ష- కృతులందును- గారణ కార్యభావమున్నది. జ్ఞానము లేని కోరికగాని, కోరిక లేని క్రియగాని కలుగనేరదు. ఇచ్ఛాశక్తికూడ కర్తృత్వ లక్షణమని యొకవిధముగ నుడువవచ్చును. ఎందువల్లనన, ఇచ్ఛకలుగుటకు

టకు బూర్వమట జ్ఞాన మవశ్యముగా నుండును. అక్కడనే క్రియ జరుగుటయు సంభవించును.

ఇట్లిచ్ఛాశక్తికి గారణత్వముతో విశేష సంబంధ మున్నది. ఇచ్ఛాశక్తిలేని ఘటన మరియొక ఘటన కనేక పర్యాయములు ముందుగా జూడబడినప్పటికి నది కారణమన జెల్లదు. ఇంటికప్పునుండి క్రిందరాలు మంటి ననేకపర్యాయ ములు చూచియు నద్దానికి గారణ మింటికప్పు కడ్డీలని యెన్నడు ననము. ఒక మనుష్యునిచే పడవేయబడుచున్న మంటి నొకమారు చూచితిమేని వెంటనే యతడా మన్ను పడుటకు గారణమందుము. మొదటి యుదాహరణమున నిచ్ఛాశక్తి లేకుండుటయు, రెండవ యుదాహరణమున నిచ్ఛాశక్తి యుండుటయే ఇందులకు హేతువు.

ప్రతి కార్యమునకు నిమిత్తకారణమును, ప్రతి నిమిత్త కారణమునకు నిచ్ఛాశక్తియును ఉండుట యనివార్యము లను మాట మానవబుద్ధినుండి తొలగించుట దుస్తరమేగాక యసం భవ మగుచున్నది. మానవీయ జ్ఞాననియమముల (Theory of Knowledge) పై దర్శనశాస్త్రముల యాధారముంచ బడు నీకాలమున, తత్త్వజ్ఞాన ప్రాప్తికొఱకు జ్ఞానతత్త్వ ప్రాప్తి యావశ్యక మని రొమ్ము విరుచుకొని చెప్పు నీ రోజులలో, ప్రతియుగమునను ప్రతిదేశమునను మానవబుద్ధిపై శాసన మొనర్చు నియమముల నుపేక్షించుటెట్లు పొసగును? వాస్త వమున ప్రతిక్రియతో నిచ్ఛాశక్తిని జోడించుట మనుష్యున కనివార్యమగుటచే నిచ్ఛాశక్తి ప్రకటముగాని చోట్ల నేదో

నిర్మాతల విషయమున విస్మయ మంతగా గలుగ నేరదు. ప్రథమప్రేక్షకుల కన్ననో మితిమీరిన యాశ్చర్యము కలుగును.

కణాదముని:- 'కారణా భావాత్ కార్యాభావః' అని యనెను. 'కారణము లేక కార్య మేర్పడ నేరదు.' దీనిని ప్రతిపురుషుడు ప్రతియవస్థయందు నేదోయొకవిధమున నంగీక రించుచునే యున్నాడు.

ప్రపంచమున ననేకఘటన లకస్మాత్తుగా నేర్పడుచుం డును. వాని కొక విశేషకారణ ముండ నేరదు. అట్లే యీ సృష్టియు నకస్మాత్తుగా (Bychance) నుత్పన్నమైనదని కొంద అందురు. ఇట అకస్మాత్ శబ్దమున కర్థమేమని యాలోచింప వలయును. మనము బజారున వెళ్లుచుండ నకస్మాత్తుగా నొక మిత్రు డగపడెను. ఇక్కడ అకస్మాత్ శబ్ద తాత్పర్య మేమి? మనము బజారునకు వెళ్లుచుంటిమి. మిత్రుని జూడ నుద్దేశింపలేదు. కాని మిత్రు డగపడెను. ఇదియేగదా! ఇక్కడ మనము మిత్రునితో కలియుటలో నిమిత్తకారణము లేదా? ఎన్నడు లేకుండదు. మిత్రు డటకు వచ్చుటలో నిమిత్త కారణ మతని యిచ్ఛాశక్తి. మన మటకు వెళ్లుటలో నిమిత్త కారణము మన యిచ్ఛాశక్తి. కాని యీ కలయికను 'ఆకస్మి కము' అనుటకు కారణమేమనగా ఇరువురి యాగమన ములకును నిచ్ఛాశక్తి యను కారణముండినను, వానిలో బర స్పర పరామర్శ పూర్వము లేదు. భిన్నములయి యసంబద్ధ ములైన రెండు శక్తులద్వారా ఉత్పన్నములయిన ఘటనల కలయికనే యాకస్మిక మందుము. పూర్వమే పరామర్శించి

యట్టుపై కలిసియున్నచో నాకస్మిక మని యనము. కాబట్టి యాకస్మిక ఘటనలని మనము వేనినందుమో యవియు విచారించినమీదట నాకస్మికములు గానేరవు. సృష్టి యాకస్మిక మనువారిని, వారట్లనుటలో గల తాత్పర్య మేమని యడుగవలసి యున్నది. పై యుదాహరణమువలె సృష్టిరచన యాకస్మిక మందురేని, సృష్టిలోని భిన్నభిన్న ఘటనలు, భిన్నభిన్నములయి, అసంబద్ధములయి స్వతంత్రములయిన ఇచ్ఛాశక్తుల ద్వారా యుత్పన్నములయి పరస్పరము కలిసినవని యెంచవలయును. అనగా నొకశక్తి నదిని నిర్మించుచున్నది. రెండవది పర్వతమును బుట్టింప జేయుచున్నది. మూడవది మేఘముల నిర్మాణ మొనర్చుచున్నది. నాల్గవది వాయుమండలము నుత్పన్నము చేయుచున్నది. ఈ శక్తులు స్వతంత్రములయి యసంబద్ధములయి యున్నవి. ఇవి పరస్పరము కలిసి యొకవిధమగు పరామర్శను జేసియుండలేదు. అనగా 'నేను బర్వతమును జేయుచున్నాను. నీవు నదిని చేయుము' అని చెప్పుకొనలేదని యర్థము. వానిలో నొకదానికి మరియొకటిని గూర్చిన జ్ఞానమును లేదు. పదార్థములు నిర్మింపబడిన యనంతరము 'కారణ మొండులేకయే (అకస్మాత్) ఇవి పరస్పరము కలిసినవి' అందురు.

ఇట్టి మతము నంగీకరించువారు ఇచ్ఛాశక్తి రూప నిమిత్తకారణమును నిషేధింపరు. కాని యాకారణములలో గల పరస్పర సంబంధమును మాత్రము నిషేధింతురు. అనగా వీరొక యీశ్వరుని నిషేధింపగోరి వేలకొలది యీశ్వరుల

నంగీకరింప నుద్యుక్తులగుదురు. దీనిని నాస్తికత యనుటకంటె విశిష్టాస్తికత యనుట సముచితమేమో.

'ఆకస్మిక' శబ్దమున కర్థము సృష్టిరచనలకు, నిచ్ఛాశక్తికి సంబంధము లేకుండుట యగునేని ఇది కేవలము వీరి కల్పన యనదగును. ఇచ్ఛాశక్తికి సంబంధములేని యాకస్మికఘటన లోకమున కని విని యెరుగము. మనుష్యభావ యం దట్టిదాని నేమనవలయునో యేరికిని దెలియదు. ఈ విషయమును ఫ్లింట్ మహాశయు డతిసుందరముగా వర్ణించి యున్నాడు. దాని నిట నుల్లేఖించెదము.

"నియమములేని యాకస్మిక ఘటన జరుగనేరదు. రెండుగాని, అంత కెక్కువగాని ఘటనలు పూర్వపరామర్శ లేకయే పరస్పరము కలియుచో నిట్టి మేలనమును ఆకస్మిక మందుము. ఒకానొక కారణపరంపరచే బ్రేరితుండయి యొకమనుజు డొకదినముననొక నియతసమయమునం దొక గృహము క్రిందుగా నేగుచుండ, తత్సమకాలీనమయిన మరి యొక కారణపరంపరచే బ్రేరితమయి యా యింటి కప్పు నుండి యొకబరువైన వస్తువు పడుటచే నామనుజుడు చనిపోయె నేని యా ఘటన నాకస్మిక మందుము ఈశ్వరుని సర్వజ్ఞత్వము, సర్వనియంతృత్వము, ప్రబంధకత్వమును విశ్వసించువానికి దైవ ఘటనయందుగల యాకస్మికత్వము నామమాత్రమే యగును. అయినను వాడిట్టిఘటనలు ఆకస్మికము లనుటకుగాని, మరియు నితరఘటనల నాకస్మిక శబ్దముతో వ్యవహరించుటకుగాని నాస్తికుల కధికారము లేదనడు. కాని దృశ్యములందు

స్వతంత్ర శృంఖల లేకున్నంతవరకు అనగా భౌతిక మానసిక నియమములు లేనంతవర కాకస్మికము నిరర్థకమని యాస్తికుల తాత్పర్యము. ”

“ఇంతియగాక, ప్రకృతి స్వయంభువు, అనాది యని యంగీకరించినను, ప్రకృతి స్వయముగా నెట్లు నేర్పడగలదు? ప్రాకృతిక పరమాణువులు పరమాత్మునిక్రియ నపేక్షింపకయే యిట్టి విచిత్రసృష్టిని రచించినవని యంగీకరించుట, ఆంగ్లేయ భాషాక్షరములు జగత్ప్రసిద్ధుడగు షేక్స్పియరు మస్తిష్క సహాయము నపేక్షింపకయే నాటకముల రచించి నట్లంగీకరించుట కంటె నెక్కువయు క్తిశూన్య మనఁదగును. ఒక్కొక్కప్పుడొక్కొక్క సాధనమున దూరదేశములందో, దీర్ఘకాలముననో యీపరమాణువులు పరస్పరము కలిసి కొండొక వస్తువును గలుపగలిగి యుండుట సంభవము కావచ్చు. కాని యవి యిట్టి సుందర సుదృఢ విచిత్ర విశాలసృష్టిని రచింప సమర్థములు కానేరవు. పరమాణువులను బుద్ధిపూర్వకముగా నొక క్రమమున నుంచకున్న నిక్లెన్నడు సృష్టి యేర్పడజాలదు. ఒక క్రమము, బుద్ధిప్రేరణయు లేకయే పరమాణువులు స్వయముగా నిట్టి సుందరలాభదాయక పదార్థములతో నొప్పు సృష్టిని సృష్టింపగలిగినవని విశ్వసించుట నేటివరకు గల పెద్దపెద్ద యంధవిశ్వాసులచే నంగీకరింపబడిన అంధవిశ్వాస సీమనైతము నుల్లంఘించుటయే యగును. అయినను యథార్థ ప్రకృతివాదియగు నాస్తికుడు ఈ భయంకరమైన యకస్మాత్ వాదమును తిరస్కరింప జాలడు. సృష్టిరచనమును వ్యాఖ్యాన

మొనర్చిన డిమాక్రిటస్, ఎపిక్యూరస్ మొదలు డిడరట్, లైంగ్ మున్నగు నాస్తికులు ఇట్లు వివరించిరి. 'ప్రాకృతిక నిత్యపరమాణువులు అసంఖ్యప్రకారములలో బరస్పరము సంయుక్తములగు చున్నవి. భూత భవిష్యత్తులలో గూడ నిట్లే కోట్లకొలది పద్ధతులలోనివి సంయుక్తములైనవి కాగలవు. మన యీవర్తమానసృష్టియు వానిలో నొకటియై యున్నది. గ్రీకుభాషకు సంబంధించిన యక్షరముల ననేకపర్యాయము లెగురవేసిన నది ఇలియడ్ మున్నగు పుస్తకములను సిద్ధము చేయగలవని చెప్పబడుచున్నది.' 'సంభవ' వాదమున నింత కంటె నిర్మూలము, నిరర్థకము నగు విషయ మెన్నడు నంగీక రింపబడి యుండలేదని నేను వేరుగా జెప్పనక్కరలేదు. ఆలో చనా రహితముగా ననంతకాలమువరకు నక్షరముల నెగుర వేయుము. వానివలన నీవొక భావమును ప్రకటింపజాలవు. ఎకిలీజ్ క్రోధమును, ట్రాయ్ యుద్ధమును వర్ణించుటకు హోమర్ తలంపకున్నచో ఇలియడ్‌లోని యక్కరములను ప్రపంచమునగల సమస్తమానవులు సృష్ట్యాదినుండి నేటిదనుక అహర్నిశములు నెగురవేసినను ఇలియడ్‌లో నున్న మొదటి పంక్తియైనను నిర్మింపబడియుండదు. ఇంతియగాక ఈసృష్టికావ్య మునకు- ఈయీశ్వరీయ నాటకమునకు ఇలియడ్‌తో నేటి సాటి? ఇట్టి వస్తువులు రచింప నుద్యమింపని పరమాణువులు ఆకాశమున నెగురుచు నొండొంటితో గలిసి యిచ్ఛాశక్తి సహా యము లేకయే యిట్టి విశాల సృష్టిని సృష్టింపగలవా? విశ్వ

సించువారు విశ్వసింతురుగాక. నాకు మాత్రము 'అరేబియన్ నైట్స్' కథలను విశ్వసించుట తేలికగా తోచుచున్నది."

ప్రకృతి పరమాణువు లాకస్మికముగా నొండొంటితో గలిసి మహామహులయిన పండితులకును దుర్జ్ఞేయము లయిన పదార్థములు బ్రహ్మాండమున నేర్పడినవని విశ్వసించు మానవు డే విషయమునైనను గ్రుడ్డితనముగా నంగీకరించుట యతిసులభము. ప్రపంచమున నాకస్మిక రచనను ధ్రువ పరచుటకై యుదాహరణములు లభింపగలవా? గ్రీక్ వర్ణముల నెగురవేయుచుండిన కాలాంతరమున ఘుణాక్షరన్యాయమున 'ఇలియడ్' నిర్మింపబడునందువా? అది యెట్లుపొసగును? ఘుణాక్షరము లేర్పడుటకును ఘున్ (పురుగు) కావలయును గదా.? అట్లే అక్షరముల నెగురవేయువా డొక్కడు కావలసి యుండునుగదా? గ్రీక్ భాషావర్ణములు వేలకొలది వర్షముల నుండి ప్రచారములో నున్నవి గదా? హోమర్ కొలది దినములలో గష్టపడి నిర్మించిన ఇలియడ్ వంటి గ్రంథములు మరికొన్ని యింతకాలమునుండి యీ గ్రీకు వర్ణముల వలన నేల నిర్మింపబడవయ్యె? మీ యిండ్లలో గోదుమలు స్వయముగా నేల రొట్టెలను సిద్ధపరుపవు? వడ్లేల స్వయముగా నన్నమును పక్వపరచి భోజనముగా నుపయోగింపవు? మంటికణము లేల ఇటుకలై గోడను నిర్మించి యిండ్ల నేర్పరుప' వని యీ ప్రకృతివాదుల నడుగవలసి యుండును. పరమాణువులలో నాకస్మిక సంచలన ముద్భవించి సూర్యచంద్రనక్షత్రాదులు, పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములు నేర్పడు

నన్న బుద్ధిమంతు లంగీకరింపజాలరు. విచారశీలుర మనస్సుల కిందు విశ్వాస ముండనేరదు. ఆకస్మికముగా పరమాణువులు కలిసి జాజ్వల్యమానమయిన సూర్యగోళ మేర్పడగల్గుచో నొక చిన్నదీపమేల యేర్పడరాదు? పెద్దపెద్ద నదు లేర్పడ గల్గుచో చిన్న బావి యొండేల యేర్పడదు? అంబరచుంబి పర్వత శిఖరము లేర్పడుచో చిన్నకుటీర మేల నిర్మింపబడ రాదు? రహస్యపూర్ణమైన మానవశరీరాదు లేర్పడుచో నొక చిన్న రాట్నమేల స్వయముగా నిర్మింపబడదు? అకస్మా త్తనగా నింతకుపూర్వ మేర్పడ్డ వస్తువులేవో యేర్పడినవిగాని ముందస్లేర్పడుట కాదందు రేని ఆకస్మిక వాదమునకు ప్రమాణమేమి? పర్వతము నాకస్మిక నిర్మాణమని యంగీక రించువారికి తాజమహాల్ ఆకస్మికమని యేల తోచదు? ఆక స్మిక వాదము నంగీకరింతు రేని పురాతత్త్వవేత్తల ప్రయత్నము లన్నియు విఫలములగును. భూమియం దణగియున్న ప్రాచీన భవనములను చూచి వానితో నైతిహాసిక మానవుల బుద్ధికి గల సంబంధమును వెదకుట నిస్సారమగును. ఆ భవన ములు నాకస్మికము లేగదా?

జగత్కర్త- జగన్నిర్మాణకు డొకడు లేడని కొందరం దురు. లోకరచనకు గారణము 'నేచర్' (Nature). నేచరే పర్వతముల నిర్మించును. సూర్యచంద్రాదులు, మేఘములు నన్నియు నేచర్ వల్లనే యేర్పడినవి, ఏర్పడుచున్నవి. ఈ 'నేచర్' శబ్దమునకు సరియైన సంస్కృతశబ్దముగాని, తెలుగు శబ్దముగాని మాకు తెలియమి దానినే యుట వాడుదుము-

'సృష్టినియమము' అను శబ్ద మొకింత దీని యాశయమును వెలిపుచ్చగలదని యెంచెదము. వాస్తవమున నేచర్ వాదు లీశబ్దము నేతాత్పర్యముతో వాడుదురో చెప్పుట దుస్తరము. నేచర్ అనగా బుద్ధిబలముతో గూడిన సత్తాయనియు, నది సృష్టిరచన నొనర్చుననియు నందురేని ఆస్తికనాస్తికులలో నంతగా భేదముండదు. నామమాత్రమున భేదింతురు. ఆస్తికు లట్టిదానినే యీశ్వరు డందురు. నాస్తికులు 'నేచర్' అందురు. ఈమాత్రమునకు కలహించుట వ్యర్థము.

కాని, నేచర్ అనగా సృష్టినియమమనియు, అదియే సృష్టికర్తయనియు నందురేని, వ్యాపారనియమములను వ్యాపారియని వ్యవహరించి నట్లగును. నేచర్వాదు లీశబ్దతాత్పర్యమును గూర్చి యెన్నడు విచారింపరని మాయభిప్రాయము. వారొక విలక్షణభ్రమ యందుండి దానిని విడువజాలకున్నారు.

'నేచర్' అనగా నేమో మొదట విచారింపవలసి యున్నది. అదియొక శక్తివిశేషమునకో పురుషవిశేషమునకో నామము కాకున్నచో నదియేమి? అది సృష్టికార్యము నెట్లు నిర్వహించుచున్నది? అనగా దాని కెట్లు కారణ మగుచున్నది? లోకులు తఱచు కారణశబ్దమును విచారింపకయే ప్రయోగించుచుందురు. ఈ కారణశబ్దమును విశేషముగా వైద్యులు దురుపయోగ మొనర్చుచుందురు. 'ఆ మనుష్యు డేల చనిపోయెను?' అని యెవరైన నడుగుదురేని 'హృదయగతి నిలిచి పోయెను' (His heart failed) అని సమాధానమిడుదురు. ఇక్కడ ప్రశ్నకర్తల యభిప్రాయము మృత్యుకారణ

మేమి? అని. సమాధానము చెప్పువాడు కారణము చెప్పుటకు బదులుగా మృత్యువునకు పర్యాయమైన హృదయగతి నిరోధమును జెప్పును. హృదయగతి నిరోధమునకును, మృత్యువునకును గార్యకారణ భావమేమియు లేదు. మృత్యువనగా హృదయగతి నిరుద్ధమగుటయే. ఇట్లే నాస్తికులను సృష్టిరచనకు గారణమేమని ప్రశ్నించిన 'నేచర్' అందురు. 'నేచర్' అనగా నేమని వారినడిగిన సృష్టినియమమందురు. సృష్టినియమ మనగా నేమని ప్రశ్నించిన 'అనేకఘటనలొకేవిధమున నగుచో దానిని నియమ మందురు' అని చెప్పుదురు. ఘటనలన్నియు నొకేవిధమున నగుటకు కారణమేమని మరల ప్రశ్నించిన 'సృష్టి నియమమనియో 'నేచర్' అనియో మరల మరల వెనుకటి సమాధానమునే చెప్పుదురు. ఇట్లు మన యుక్తులు గానుగెద్దు వలె ఒక స్థలముననే భ్రమించుచుండును. యథార్థమున సృష్టి నియమములు, సృష్టిఘటనలు పర్యాయములేగాని వేరొండుగావు. వాని నొండొంటికి గారణకార్యములుగా జెప్పుట గొప్ప పొరపాటు.

ఫ్లింట్ మహాశయు డీ విషయమును నెంతచక్కగా జెప్పెనో చూడుడు. 'సృష్టి ప్రబంధమునకు గారణము సృష్టి నియమ మని చెప్పుట ప్రసంగమును దాటవేయుట యగును. నియమమే ప్రబంధము. నియమమునకే కారణము చెప్పవలసియున్నది. నియమము జ్ఞానయుక్తమా? జ్ఞానరహితమా? అని ప్రశ్న వొడమును. ఇది జ్ఞానశూన్యమని బుద్ధిమంతు డంగీకరింపజాలడు. కొన్ని ఘటనలలో గల సంబంధమును

బోధించునట్టిదో, లేక వానిపై శాసనమొనర్చునట్టిదో నియమముల యస్తిత్వమే యొకటినుండి యాలోచించి నియమములను స్థాపించునట్టియు, శాసన మొనర్చునట్టియు జ్ఞానమయ శక్తి యొకటి గలదని ప్రకటించుచున్నది. భిన్నభిన్న ఘటనలను దేశ- కాల- సంఖ్యా- పరిమాణముల నియమములందు బంధించుటయే ఆలోచనకు, బుద్ధికి సూచకము అని డాక్టర్ హ్వేవిల్ (Whewell) చెప్పుచున్నాడు. జ్ఞానయుక్త ప్రబంధముద్వారా పర్యాప్త మీమాంస యొనర్పదగిన స్థితిలో నీవస్తువుల పారస్పరిక సంఘటన మేర్పడుటయే సృష్టి నియమముల ప్రయోజనమై యున్నది. ఈ స్థితి హ్వేవిల్ డాక్టరుని యాశయమును పుష్టిచేయుచున్నది. ఒక నియమమునకు దోడ నేకములగు నవ్యావస్థలు నుండును. ఈ యవస్థలు, నియమములు తోడ్తోచుండి భౌతికనియమముల ద్వారా వానిని వ్యాఖ్యానముచేయ వీలులేనపుడు కొండొక చేతనశక్తి పనిచేయుచున్న ట్లంగీకరింపక తప్పదు. నియమము ప్రబంధమునకు కారణము కాదు కాని సూచకమని తాత్పర్యము. ప్రబంధపరిణామము నియమము. అది యీశ్వరీయ బుద్ధికార్యమును సూచించును. ఉదాహరణము కొఱకు రాసాయనిక నియమములను తీసికొనుడు. అవి యెందులకున్నవి? రసాయనములకు సంబంధించిన తత్త్వముల కిట్టి సమానత- ఆకర్షణము; శక్తియు, భిన్నములయ్యు ప్రపంచోపకారమునకై పరస్పరము సంబద్ధము లగునట్లు వానికి లభించి యున్నది. నియమములు స్వయముగా నెట్టి కార్యమును

బోధించునట్టియో, లేక వానిపై శాసన మొనర్చునట్టియో నియమముల యస్తిత్వమే మొకటినుండి యాలోచించి నియమములను స్థాపించునట్టియు, శాసన మొనర్చునట్టియు జ్ఞానమయ శక్తి యొకటి గలదని ప్రకటించుచున్నది. భిన్నభిన్న ఘటనలను దేశ- కాల- సంఖ్యా- పరిమాణముల నియమములందు బంధించుటయే ఆలోచనకు, బుద్ధికి సూచకము అని డాక్టర్ హ్యూవిల్ (Whewell) చెప్పుచున్నాడు. జ్ఞానయుక్త ప్రబంధముద్వారా పర్యాప్త మీమాంస యొనర్పదగిన స్థితిలో నీవస్తువుల పారస్పరిక సంఘటన మేర్పడుటయే సృష్టి నియమముల ప్రయోజనమై యున్నది. ఈ స్థితి హ్యూవిల్ డాక్టరుని యాశయమును పుష్టిచేయుచున్నది. ఒక నియమమునకు దోడ నేకములగు నవ్యావస్థలు నుండును. ఈ యవస్థలు, నియమములు తోడ్తోచుండి భౌతికనియమముల ద్వారా వానిని వ్యాఖ్యానముచేయ వీలులేనపుడు కొండొక చేతనశక్తి పనిచేయుచున్న ట్లంగీకరింపక తప్పదు. నియమము ప్రబంధమునకు కారణము కాదు కాని సూచకమని తాత్పర్యము. ప్రబంధపరిణామము నియమము. అది యీశ్వరీయ బుద్ధికార్యమును సూచించును. ఉదాహరణము కొఱకు రాసాయనిక నియమములను తీసికొనుడు. అవి యెందులకున్నవి? రసాయనములకు సంబంధించిన తత్త్వముల కిట్టి సమానత- ఆకర్షణము; శక్తియు, భిన్నములయ్యు ప్రపంచోపకారమునకై పరస్పరము సంబద్ధము లగునట్లు వానికి లభించి యున్నది. నియమములు స్వయముగా నెట్టి కార్యమును

సంయోగ మొకటి యీ యనంత ప్రకార సంయోగముల నుండి యెన్నుకొనబడిన సమయ మొం డవశ్యముండి యుండును. వాస్తవమున జ్ఞానయుక్తమగు నెన్నికచేతనే సుప్రబంధ మేర్పడగలదు.

స్వభావ వాదుల సిద్ధాంతము నొకింత మీమాంసింప వలసి యున్నది.

సర్వసిద్ధాంత సంగ్రహమున నిట్లున్నది.

'శిఖిన శ్చిత్రయేత్ కోవా కోకిలాన్ కః ప్రకూజయేత్
స్వభావ వ్యతిరేకేణ విద్యతే నాత్ర కారణమ్'
(లోకాయతిక పక్షప్రకరణమ్ శ్లో. ౫)

మయూరపంఖముల నెవడు చిత్రించును? కోయిలలకు మధురస్వర మెవ్వ డొసంగును? స్వభావమునకు మించిన కారణము లేదు.

శ్లో. 'అగ్నిరుష్ణో జలం శీతమ్ సమస్పర్శ స్తథా ఽ నిలః
కేనేదం చిత్రితం తస్మాత్ స్వభావాత్ తద్వ్యవస్థితిః'
(సర్వదర్శన సంగ్రహము. చార్వాక.)

'అగ్ని వేడి. జలము శీతలము. వాయువు అనుష్ణాశీత స్పర్శము - ఇదియంతయు నెవనిచే చిత్రింపబడినది? స్వభావముచేతనే యీ వ్యవస్థ యేర్పడినది.'

స్వభావవాదులకు, 'నేచర్' వాదులకును కొంత భేద మున్నది. సృష్టియందు జరుగున దంతయు సృష్టినియమముల ద్వారా జరుగును. కాని నేచర్ వాదులు ఆ నియమము

లకు నియంతయగు నీశ్వరు డొకడు లేడందురు. సృష్టిపరమాణువులం దన్య ప్రయుక్తముగాని స్వస్వభావ మొండుగలదు. దానిచేతనే పరమాణువులు ప్రేరింపబడి విశేషరూపమున సంయోగ వియోగముల నందుచుండును. స్వభావవాదులు అగ్నిస్వభావము దహించుట, జలస్వభావము కలుపుట, వాయుస్వభావముఎగురుట, యెగుర జేయుటయు నందురు. అందువలన నీశ్వరు డనవసరమని వారి యభిప్రాయము.

ఇట్టియెడ ననేక ప్రశ్నలు పొడముును. అనంతము లయిన ప్రాకృతిక పరమాణువులలో నన్నిటియందును భిన్న భిన్న స్వభావముండునా? లేక కొన్నిటియం దొక విధమగు స్వభావము, మరికొన్నిటియందు మరియొకవిధమగు స్వభావము నుండునా? పరమాణువులు వేరైయున్నపుడు, సంయుక్తము లగునపుడు నొకేవిధమగు స్వభావముండునా? భిన్నావస్థలలో భిన్నస్వభావము లుండునా? జలమునకొక విశేషస్వభావ ముండునందురుగదా! ఆక్సిజన్, హైడ్రోజన్ వేరుగానున్న పుడు వానిలోనున్న స్వభావమే జలస్వభావమా? అంత కంటె భిన్నమా? ఆక్సిజన్, హైడ్రోజన్ అను నీరెండును భిన్నపదార్థములనుట సర్వతంత్ర సిద్ధాంతము. వానిస్వభావము భిన్నముగాక యొక్కటేయైన పక్షమున నవి రెండుపదార్థము లెట్లగును? ఆక్సిజన్, హైడ్రోజనుల స్వభావముకంటె జల స్వభావము భిన్నమగుటయు నిర్వివాద విషయమే. జలముతో జేయగల కార్యములను ఆక్సిజన్, హైడ్రోజనులద్వారా నిర్వహింప వలనుపడదు. ఆక్సిజన్ స్వభావము వేరు.

హైడ్రోజన్ స్వభావము వేరు. అవి స్వస్వరూపమున నున్న పుడు జలము లేదు; దాని స్వభావమును లేదు. అట్టిచో భిన్నస్వభావములు గల ఆక్సిజన్ హైడ్రోజనులు కలియు టెట్లు? కలియు స్వభావములేని భిన్నస్వభావములు గల ఆక్సి జన్ హైడ్రోజనులను కలుపున దెవరు? ఒకదాని కొకటి సమీపించినపుడు కలియునందురా? వానిని సమీపింప జేయున దెవరు? దూరదేశములనుండి వచ్చి కలియుటయే వాని స్వభావమందురా? అవి ప్రపంచమున వివిక్తములై (వేరుగా) లభింపకుండవలె. అట్లుగాక లంభించుచున్నవి. ఇంతియ గాక కొండొక విశేషపరిమాణముగల హైడ్రోజన్, విశేష పరిమాణముగల ఆక్సిజన్‌తో గలిసినపుడే జలమేర్పడును. అట్లుగాని పక్షమున జల మేర్పడదు.

(౧) ఆ రెండుపదార్థములు కలియుట.

(౨) ప్రత్యేక పరిమాణమున కలియుట.

(3) కలిసి యొక విశేషస్వభావము నుత్పాదింప జేయుట.

(౪) కలిసియే యుండక మరల విడిపోవుట?

(౫) విడిపోయినవి మరల కలియుట? మరల విడి పోవుట. ఈ పరిస్థితులన్నియు జూడ నిష్టమువచ్చినట్లు చేయు నొక చేతనశక్తి నంగీకరింపక ఆక్సిజన్ హైడ్రోజను లందుగల స్వభావము నంగీకరించినంతమాత్రమున నీ ఘటన లన్నిటిని బూర్తిగామీమాంసింప ననువు పడదు.

శ్రీ దర్శనానంద స్వాములవా రొకచో స్వభావ వాదుల నిట్లు ఖండించిరి. 'పరమాణువులు కలియుస్వభావము గలవగుచో నెన్నడు వియుక్తములు గా నేరవు. ఎల్లప్పుడు కలిసియే యుండును. వేరుగా నుండు స్వభావము కలవగుచో నెన్నడు కలియ నేరవు. ఏవస్తువు నేర్పడజాలదు. కొన్ని కలియు స్వభావముకలిగి, మరికొన్ని వేరగు స్వభావముగలిగి యున్నచో వీనిలో నేస్వభావముగలవి యధికమయిన వాని కార్య మగును. కలియుస్వభావముగల పరమాణువు లధికమయిన సృష్టి యేర్పడుచుండు నేగాని యెన్నడు నాశమొంద నేరదు. వేరగు స్వభావముగల పరమాణువు లధికమయిన సృష్టియే జరుగ నేరదు. రెండును సమానము లయినను సృష్టి యేర్పడ నేరదు.'

వాస్తవమున సృష్టి స్థితి లయములు మూడును గలిసి యొక చేతనశక్తి సృష్టికి కర్తయని బోధించుచున్నవి. కాబట్టియే వ్యాసుడు వేదాంతదర్శనమున నిట్లు సూత్రించి యున్నాడు.

'జన్మాద్యస్యయతః' ౧. ౧. ౨. బ్ర. సూ.

ప్రపంచముయొక్క యుత్పత్తి స్థితి లయములకు గారణము బ్రహ్మము; ప్రపంచమంతయు నొకే యవస్థయందున్నచో బరమాణువుల యాంతరిక స్వభావ మిందులకు గారణమని యంగీకరింప వీలుండెడిది. ప్రతిక్షణము పరివర్తించు వస్తువుల జూచుచు స్వభావమును గారణముగా నంగీకరించుటకంటె బెద్ద యంధవిశ్వాస మొండు లేదు. జడచేతనములలో గల భేదమేమి? జడవస్తువు స్వయముగా నెట్టికార్యమును జేయ

లేదు. చేతనసహాయమున నొకకార్యమును జేయగల్గిన నొకే ప్రకారమున జేయుచుండును. చేతనస్వభావము కార్యమును జేయుటకును, జేయకుండుటకును, విపరీతముగా జేయుటకును సమర్థమై యుండును. గడియారపుముండ్లను దీసికొనుము. అవి స్వయముగా నడువజాలవు. గడియారపు నిర్మాపకు డొక విధమున వానినమర్చి 'కీ' యిచ్చిన నవి నడచును. 'కీ' ఉన్నంతవరకు వానియందు గతి యుండును. లేనియెడల నాగిపోవును. కాని యవి తమయిష్టమువచ్చినట్లు వెనుకకు గాని, ముందునకుగాని నడువజాలవు. సృష్టిస్థితియు నిట్లే యెంచుడు. సృష్టియందుగల సమస్తపదార్థములు భిన్నభిన్న పరిమాణములందు గలియుటకును, వేరగుటకును గారణము జ్ఞానేచ్ఛాశక్తులుగల యొక చేతనపదార్థము. దానినే ఆస్తికులు ఈశ్వరు డందురు.

---

# అయిదవ అధ్యాయము

## విజ్ఞానము 'సైన్సు' - ఆస్తికవాదము

'సైన్సు ఆస్తికవాదములలో, చీకటి వెలుగుల కున్నంత యంతర మున్నట్లు చెప్పబడును. అనగా నవి రెండు నేకకాలికములై యుండ నేరవని భావము. లోకమున 'సైన్సు' వ్యాపింపకున్నంతవరకే యాస్తిక వాదరాజ్య ముండెను. ప్రస్తుతము (సైన్సు) విజ్ఞాన యుగ మరుదెంచినది. కాబట్టి ఆస్తిక వాదము తన తట్ట బుట్ట చంక బెట్టుకొని యెటకేని బోవలసి యున్నది. వెలుగులో చీకటి కేమిపని?'

కాని విచారించి చూచిన విజ్ఞానము (సైన్సు), ఆస్తిక వాదము రెండును కలసి యుండుట కెట్టియభ్యంతరము గాన్పింపదు. నిజ మారసిన అనాదికాలమునుండి యథార్థమైన యాస్తికత, యథార్థమైన విజ్ఞానము రెండు నొకదానితో నొకటి చేరియేయున్నవి. విజ్ఞానము నియమములను బోధించును. ఆస్తికత ఆ నియమములతో నియంతకుగల సంబంధము నన్వేషించును. నియమములు లేని నియంతగాని, నియంత లేని నియమములుగాని యెట్లు చరితార్థములగును?

విజ్ఞాన - ఆస్తిక్యములలోగల వైరము పురాతనము గాదు. ప్రాచీనాస్తికులు సృష్టినియమముల నవలోకించియే ఈశ్వరాస్తిత్వమును సిద్ధింపజేసెడివారు. శ్రీమదాద్యశంకరాచార్యులును వేదాంతదర్శనమున 'జన్మాద్యస్యయతః' అను సూత్రమునకు భాష్య మొనర్చుచు నిట్లు వ్రాసియున్నారు.

"అస్య జగతః నామరూపాభ్యాం వ్యాకృతస్య అనేక కర్తృ భోక్తృ సంయుక్తస్య ప్రతి నియత దేశకాలనిమిత్త క్రియాఫలాశ్రయస్య, మనసా ప్యచింత్య రచనా రూపస్య, జన్మస్థితిభఙ్గా యతః సర్వజ్ఞాత్ సర్వశక్తేః కారణాద్భవతి తద్బ్రహ్మ ఇతి వాక్యశేషః"

అనగా నీవిచిత్ర సృష్టియొక్క యుత్పత్తి స్థితి లయము లకు గారణము బ్రహ్మ మని తాత్పర్యము.

కాని కాలాంతరమున విజ్ఞాన, ఆస్తిక్యముల మధ్య తగవు లేర్పడినవి. సృష్టిరచనతో నీశ్వరున కెట్టిసంబంధము లేదని యాస్తికు లెంచసాగిరి. వారు తమ యిచ్చవచ్చిన గుణముల నీశ్వరునం దారోపింప మొదలిడిరి జ్ఞానమార్గ మంతరించెను. భక్తిమార్గ మొకటి బయలుదేరెను. ఈ భక్తిమార్గము అంధవిశ్వాసమును బెంపుచేసెను. దీనితో బాటు విజ్ఞానము (సైన్సు) నశించినది. కొలదికాలమునుండి పశ్చిమదేశములందు విజ్ఞానము పునరుద్ధరింపబడెను. నాడచట ఆస్తికవాదము లేకుండెను. కాని తన్నామధారులైన యంధ విశ్వాసు లటనుండిరి. కాబట్టి యంధవిశ్వాసమునకు, విజ్ఞానము నకు మధ్య విరోధ ముదయించెను. ప్రాచీనభారతీయులు జ్ఞానము నీశ్వరప్రాప్తికి- మోక్షలబ్ధికి సాధనముగా నెంచిరి. నేడు విజ్ఞానము నాస్తికతాచిహ్నముగా నెంచబడుచున్నది.

విజ్ఞాన ధర్మముల (ఆస్తిక్యము) తగవు ఐరోపాలో నారంభించినది. విజ్ఞాన పునరుద్ధరణ సమయమున నట క్రైస్తవ (మతము) ధర్మము రాజ్య మొనర్చుచుండెను. పోప్

చెప్పినదే సత్యమనుట క్రైస్తవధర్మప్రయోజనము. ఏ వ్యక్తికిని కన్నులు తెరచి నడువ వీలులేకుండెను. కాబట్టి యెవరేని కన్నులు విచ్చి సృష్టి నవలోకింప నారంభించిన ధర్మాధ్యక్షులు విరోధించిరి. తర్కమున కవకాశమిచ్చిన ధర్మమునుండియు నీశ్వరు నుండియు జనులు విముఖు లగుదురని వారెంచిరి. కాబట్టి స్వతంత్రవిచారముల నొనర్చినందులకు క్రొత్త యన్వేషణల నొనర్చినందులకు గెలీలియో మున్నగు వారిని కఠిన యాతనల పాలొనర్చిరి. ఇదియే తగవునకు మూలము. ఈ వైమనస్యమే వైజ్ఞానికుల హృదయమున మున్ముందుగా 'ఆస్తికవాదమే మన కష్టములకు గారణ' మను భావ ముదయింపజేసెను. ఆస్తికవాదులు తమ కల్పితేశ్వరుని నిరాధార సింహాసనమును విజ్ఞానపుదాడినుండి రక్షింప యత్నించిన కొలది వైజ్ఞానికుల కాస్తికవాదమును నిర్మూలించుటయందు విశ్వాసము మెండయ్యెను. ఇం దిరుపక్షములవారును ప్రమాదమునకు గురియైరి. కాని ధర్మాధ్యక్షుల ప్రమాదము పెద్దదనక తప్పదు. ఆస్తికులచే నీశ్వరుడని పూజింపబడు జగన్నియంత యధీనమున నున్న నియమములనే వైజ్ఞానికు లన్వేషించుచున్నారని ధర్మాధ్యక్షులు తలంచియుండిన విజ్ఞానము ధర్మవిరుద్ధము గాకపోగా, సత్యమైన యాస్తికవాదమహత్త్వమును బ్రకటింప బూనుకొని యుండెడిది. అంధవిశ్వాసులచే బ్రచారమొనర్పబడిన యంధవిశ్వాసములే ఆస్తికవాదము; అంతకంటె మిన్నగాదని యెంచుట వైజ్ఞానికుల ప్రమాదమై యుండెను. కాని, ఆస్తికవాద వ్యాజమున వైజ్ఞానికుల ప్రాణ

ములు తీయబడుచుండెను. వారికి చూచుటకు, వినుటకు, నాలోచించుటకు స్వాతంత్ర్యము లేకుండెను. అట్టిచో వారు చేయునదేమి? బాహాటముగా విరోధమునే సాగించిరి. వైజ్ఞానికులు ఆస్తికవాదమను పేరు వినుటకు నేవగించుకొనునంత వరకు నీయుద్ధము ప్రబలమయ్యెను.

వైజ్ఞానికులందరు నిట్టి విరోధపక్షపాతులే యన వీలు లేదు. నేటి విజ్ఞానోన్నతి కొండొకరూపమున గల్పింప బడిన ఆస్తికతయొక్క నిర్మూలమున సత్యమైనను, విజ్ఞాన ప్రకటిత నియమముల కొక నియంత యుండు టావశ్యకమని వైజ్ఞానికులకు నిశ్చయము కలిగించినది. కాని యీభావమున్నతశీలురైన విజ్ఞానవేత్తలది మాత్రమే. అనుయాయులయిన సామాన్యవైజ్ఞానికులు మాత్రము పూర్వమార్గమునే యనుసరించుచున్నారు. ధార్మికులలో నంధవిశ్వాసులున్నట్లు వైజ్ఞానికులలో ననేకు లంధవిశ్వాసులు లేకపోలేదు. వైజ్ఞానికులలో స్వతంత్రవిచారకులు విరళముగానే యున్నారు. అధికసంఖ్యాకులు 'మేము వైజ్ఞానికులము- మాకీశ్వరవాదముతో నే'మని కాలము గడుపుచుందురు.

వాస్తవ మారసిన విజ్ఞానమును ఆస్తిక్యమును పరస్పర విరుద్ధములు గావు. విజ్ఞాన మననేమి? ప్రాకృతిక ఘటనలను చక్కగా పరిశీలించి యవి నియమితములనియు, ఆ నియమములలో ననేకవర్గము లున్నవనియు బోధించుటయే విజ్ఞానకార్యము. విజ్ఞాన మున్నతి నందుకొలది సృష్టినియమము లధికాధికముగా దెలియబడుచున్నవి. ఈ నియమ

ముల నెఱింగి యట్టిపై బుద్ధిని కుంఠితమొనర్చి యీ నియమములు స్వయముగానే పనిచేయుచున్నవి; ఇచ్ఛాబుద్ధుల కెట్టి సంబంధమును లేదని యెంచుట విజ్ఞానపు మూలసిద్ధాంతములను రూపుమాపుట కంటె మరి యేమగును? నియమాన్వేషకుడైన ప్రతి వైజ్ఞానికుడు ప్రాకృతిక ఘటనలను నియమములచే బరస్పరసంబద్ధములుగా నెంచియే తన యన్వేషణ నారంభించును. అట్లు గానిపక్షమున నత డొక యడుగునైన ముందుకు వేయజాలడు. ఒక వైజ్ఞానికుడొకసీసాలో నీళ్ళను తీసికొని దానిని విశ్లేషించి యీ నీరు హైడ్రోజన్ - ఆక్సిజనుల విశేషపరిణామ సంఘటనలచే నేర్పడినట్లు తెలిసికొను ననుకొనుడు. ఆ సీసా నీటిలో తా నన్వేషించిన నియమమే సముద్రపుజలమునందును పని చేయుచున్నదను విశ్వాసమతనికి లేకుండదు.

ఇట్లు సమస్త విజ్ఞానమునకును మూలాధార సిద్ధాంతము 'ప్రాకృతికఘటనలన్నియు నసంబద్ధములుగాక కొన్ని నియమములచే నాబద్ధములై యున్న' వనుటయే. ఈ సిద్ధాంతము విజ్ఞానము శిశుప్రాయమున నున్నపుడున్నది. నేడింత వృద్ధిచెందినపుడు నట్లే యున్నది. ఇకముందు నుండును. ప్రపంచఘటనలు నియమబద్ధములై యుండుటేగాక యీ నియమములన్నియు మరియొక సూక్ష్మనియమముచే బంధింపబడి యున్నట్లును విజ్ఞానమంగీకరించును. ఇట్లే యీ సూక్ష్మనియమములు సూక్ష్మతరనియామములచే సూత్రింపబడియున్నవి విజ్ఞాన మింత తెలిసికొని యీనియమములకు నిచ్ఛాజ్ఞానశక్తి

మాత్రమైన నెరుగనివారును ఈ 'ఫాషన్'కు లోబడి నాస్తికుల మని చెప్పుకొనుచు విజ్ఞానము నప్రతిష్ఠకు లోనుజేయుచున్నారు.

విజ్ఞానమున కొక చుట్టుగీత గీచి విజ్ఞాన మింతకంటె నెక్కువ యంగీకరింపదని చెప్పుచు దానిని సంకుచిత మొనర్చుట వైజ్ఞానికులకు దగినపని కాదు. మనుష్యుని జ్ఞానమల్పమైనను దానియందు వర్ధనశక్తి లేకపోలేదు. విజ్ఞానమెన్నడు నొకేస్థానమున నిలువనేరదు. నూరుసంవత్సరములకు బూర్వము కనుగొనబడిన నియమములలో నేడు మార్పులు చూడబడుచున్నవి. ప్రతిదినము క్రొత్తనియమములు కనిపెట్టబడుచున్నవి. అనేక నూతన తత్త్వము లన్వేషింప బడుచున్నవి. కాబట్టి యొక విజ్ఞానిగాని, ఒక కాలపు వైజ్ఞానికులందరు గాని, నాస్తికులయినను విజ్ఞానము నాస్తికమని భావించుట విజ్ఞానపు టుజ్జ్వల నామమును కలంకమొనర్చుటే యగును. విజ్ఞానవేత్తలు స్వయముగా 'విజ్ఞానమపూర్ణము. అపూర్ణముగా నెల్లపుడు నుండు' నని చెప్పుచున్నారు. అనగా 'నే నన్నివిషయములు తెలిసికొంటిని. నాయుత్తరాధికారు లిక తెలిసికొనదగిన దేమియులేదు' అని చెప్పదగిన సమయ మెన్నడును గలుగబోదు.

కొందఱు తమ యాలోచన సంకుచితము కాదు. కాని నేటివరకు జరిగిన విజ్ఞానాన్వేషణమువలన నీశ్వరవాదము ఖండింప బడుచున్నది. అందు తాము చేయగల దేమున్న దందురు. కాబట్టి నేటివరకు జరిగిన విజ్ఞానాన్వేషణ

యీ నాస్తికవాదము నెంతవరకు ఖండింపగలదో యికముందు విచారింప యత్నించెదము. మొదట విజ్ఞానపు సాధారణా సిద్ధాంతములను తీసికొనుడు. ఈవిషయమున 'ఆమ్‌స్ట్రాంగ్' అను మహాశయు డిట్లు వ్రాయుచున్నాడు.

"సృష్ట్యుత్పత్తి విషయమున విజ్ఞానము చెప్పినదేమో చూడవలసి యున్నది. సృష్ట్యుత్పత్తికి బూర్వ మాకాశమున నొక సూక్ష్మద్రవ్యము వ్యాపించియుండెను. సూర్యచంద్రులుగాని, యుపగ్రహములుగాని లేవు. అంతట నీ ద్రవమే యొక్క విధమున వ్యాపించియుండెను. తరువాత నీ ద్రవము కొన్ని విశేష కేంద్రస్థానములందు చిక్కపడెను. ఈ కేంద్రములలో గతి యేర్పడెను. ఇట్లు ప్రతి కేంద్ర మొక గోళమయ్యెను. అది తన యిరుసుపై నతివేగమున భ్రమింప నారంభించెను. ఇట్లు తిరుగుటచే దానినుండి చిన్న చిన్న ఖండములు కొన్ని వేరయ్యెను. మొదట నివి శనిగ్రహమునకువలె పెద్దగోళములకు చుట్టు కంకణముభాతి నుండెను. అటుతరువాత వాని లోనుండి మరియు చిన్నగోళములు వేరయ్యెను. ఇవియు దమతమ యిరుసులపై తిరుగజొచ్చెను. పెద్దగోళములయిన సూర్యులచుట్టుగూడ తిరుగదొడగెను. వీనినుండియు చిన్న గోళములు వేరై చంద్రునివంటి వయ్యెను. అవి తమచుట్టు తిరుగుచు, తమ ప్రకృతిభూత గ్రహములచుట్టు తిరుగుచు వానికిని ప్రకృతిభూతములయిన ముఖ్య కేంద్రముల చుట్టును తిరుగ నారంభించినవి. విజ్ఞానము ఇతరగోళములలో ప్రాణు లున్నట్లు తెలిసికొననేరదు. కాని, భూమిపై ప్రాణులున్నట్లు

మాత్రము తెలిసికొనును. ప్రకృతి పరమాణువులు ప్రాణుల శరీరములకు మూలాధారములయిన వీర్యకోష్ఠము (ప్రొటోప్లాజమ్) లేర్పడునట్లు సంయుక్తములయినవని విజ్ఞానమునకు దెలియును. కాని సర్వధా భిన్నమైన చేతనత నుత్పన్నము చేయగల పరమాణుసంయోగ మెట్లు గలిగెనో దెలియదు.

ఇచ్ఛాశక్తిని ప్రపంచమునుండి బహిష్కృత మొనర్పనెంచి కొందఱు దార్శనికులు, గతినియమములకు లోబడి పరమాణువులు తద్భిన్నముగా ప్రవర్తింప నేరవందురు. ఇచ్ఛాశక్తి నపేక్షింపకయే కార్యజనకములగు కొన్ని స్వాభావికశక్తులు ప్రకృతియందు గలవని యంగీకరించినను, ఆరంభ మెట్లయ్యెనను ప్రశ్న వొడమక పోదు. ఒకేవిధముగా వ్యాపించి యున్న సూక్ష్మద్రవ ద్రవ్యము లెట్లు చిక్కబడినః? సమాన ప్రకారత నష్టమై విషమత యెట్లేర్పడినది? వికాసారంభమున కేదో యొకశక్తి యావశ్యకమగును. అనాదికాలము నుండి యొకవిధమున నాకాశమున వ్యాపించియున్న ద్రవ పదార్థ మన్యశక్తి నపేక్షింపకయే స్వయముగా స్థూలకేంద్రములుగా నెట్లయ్యెను ?

ప్రకృతి పరమాణువులలో నెన్నిగుణములు కల్పించినను మూడువిషయములు ముఖ్యముగా నంగీకరింపక తప్పదు. వానిలో నీశ్వరీయమగు ఇచ్ఛాశక్తి యొకటి. వికాసారంభము- జీవనారంభము- చేతనతారంభము- మనుష్య- పశు- పక్ష్యాదులలోగల చైతన్యము, పరమాణువులందుగల సూక్ష్మ- అవ్యక్త చైతన్య వికాసమే నని యంగీకరించినను, అహంకా

రానుభవమునకె పరమాణ్వతిరిక్తమయిన శక్తివిశేషము నొకదాని నంగీకరింపక తప్పదు.

వాస్తవమున విజ్ఞానము సృష్ట్యుత్పత్తి ప్రకారము జెప్పునుగాని కారణమును దెల్పదు. ప్రకారమును గారణ స్థానాపన్నమని యెంచుట గొప్ప ప్రమాదము. నాస్తికు లెల్లరు నీప్రమాదమునకు గురియైరి. నాదగ్గర నొకగడియార మున్నదనుకొనుడు. నేను దానియుత్పత్తి కారణము నెరుంగ గోరుచున్నాడ. అప్పుడొక వ్యక్తి దానిని విశ్లేషించి దాని యవయవములు మంటికణములనుండి యేర్పడినట్లు చెప్పి వానిని గలిపి యొకప్రకారమునుండి గడియారమేర్పడినదని చెప్పిన దాని యుత్పత్తిప్రకారము చెప్పినవాడగును. కాని యుత్పత్తికారణమును జెప్పినవాడు కాడు. దీని నిర్మించిన వా డెవడని నేనడిగిన నిర్మాణప్రకారమంతయు జెప్పితినిగదా? ఇంక జెప్పవలసిన దేమున్నదనిన నెట్లు పొసగును? ఇట్లే నాస్తికవైజ్ఞానికులు సమాధానమిత్తురు. నిజమారసిన డార్విన్ వికాసవాదముసైతము ఆస్తిక వాదమును ఖండింపదు. అదియు నొకవిధమగు సృష్ట్యుత్పత్తి ప్రకారమును బోధించును. ఆ ప్రకారము సరియగునా కాదా? అనునది విషయాంతరము. వికాసవాదములో దోషము లేకున్నను, ఆ వికాసమును నియమించుటకొక జ్ఞానమయమగు నిచ్ఛాశక్తి యావశ్యకము గాదను టెట్లు పొసగును?

పాశ్చాత్యులు డార్విన్ వికాసవాదమును గూర్చి పొంగి పోవుదురు. మానవమస్తిష్కములనుండి ఈశ్వర

వాదమును దూరమొనర్ప ననువగు సాధనము లభించినట్లు వారెంచెదరు. ధర్మాడంబరములనుండి లోకమును శుద్ధ పరుపగలమని వారి యాశ. ప్రాచీనకాలమున యథార్థముగ సృష్టినొనరించు నీశ్వరు డొకడుండి యుండినను డార్విన్ వికాసవాద ముద్భవించిన తరువాత నతడీలోకమునుండి లోక ముడువవలయుననియు, వారెంచుచుందురు. ఆస్తికవాదమును ఖండించుచు జెప్పిన వాక్సలే యుక్తి నొకదాని నతని సాధారణ వ్యాఖ్యానముల నుండి యుల్లేఖించుచున్నాము.

హేతువాదమునకు సంబంధించిన యుక్తి యీవిధముగ నుండును. 'అ' నామకవస్తువు 'బ' నామకప్రయోజన మును సరిగా సంపాదింప నుపయుక్త మగుచున్నది. కాబట్టి యదియు ప్రయోజన మొదగూర్చుటకే సిద్ధముచేయబడినది. 'పేలే' ప్రసిద్ధ యుదాహరణ మిది. గడియారపు టవ యవము లన్నియు సమయమును దెలుపునట్లు చేర్పబడి యున్నవి. దీనింబట్టి సమయమును దెలుపుటయే గడియారపు నిర్మాణప్రయోజనము. ఒకబుద్ధి యుక్త శక్తి పైప్రయోజ నమును దృష్టియం దిడుకొని గడియారపు టవయవములను విశేషప్రకారమున జోడించినది. ఈ ప్రయోజనమును సిద్ధింప జేయుటకు జ్ఞాతసాధన మిది యొక్కటే. గడియారము నొకపురు షుడు చేయలేదని యొకడు సిద్ధపరుచు ననుకొనుము. ఇది సమయమును సరిగా తెలుపని మరియొక గడియారపు పరివర్తితరూపము. ఈ రెండవ గడియారముకూడ గడియార మని చెప్పదగని మరియొక మూడవగడియారపు పరివర్తిత

రూపము. దానిలో సంకములు లేవు. ముందుకూడ ప్రారం భావస్థయం దున్నవి. ఇట్లు వెనువెనుకకు విచారించుచు సీగడియార మారంభమున తిరుగుచున్న యొక కాడమాత్ర మని సిద్ధపరుప గలిగె ననుకొనుము. ఆ నలికావయవము లందుగల యాంతరిక స్వభావమే యీపరివర్తనముల కన్నిటికి గారణమనియు నెంచుము. ఇతరపరిస్థితుల ప్రాభవమువలన నా జరుగు పరివర్తనము లన్నియు క్రమముగా నొకప్పుడు సమ యమును సరిగా తెలుపగలుగు గడియారము సిద్ధమగునట్లు చేయును. ప్రపంచస్థితి మరియొకవిధమున బరివర్తనము జరుగ వీలులేకుండున ట్లున్నపక్షమున 'పేలే' యుక్తియుక్తిశూన్యమే యగును. కారణమేమన, ఒకానొక విశేషప్రయోజనమును సిద్ధింపజేయు యంత్రమొకటి ప్రయోజనమును దృష్టియం దుంచుకొనని బుద్ధిశూన్య శక్తులచేతను సిద్ధమగును. బుద్ధి యుక్త శక్తివిశేషము చేతను సిద్ధమగును.

హక్సలే వాక్యముల ధోరణినిబట్టి చూడ నీవిషయము సిద్ధమగుచున్నది 'ఒకొ్కకప్పు డొక నిర్బుద్ధిమనుష్యు డొకవస్తువును నిర్మించును. అతడు తాజేయునదేమో యెరు గడు. ఆవస్తువు సిద్ధమైనపుడు దానివలన మరియొకవస్తువు నిర్మింపగలమని యతడెంచును. అప్పు డతడావస్తువును జేయును. ఈ రెండవవస్తువు మఱియొక విషయమును బుద్ధికి దెచ్చును. ఇట్లు పోగా పోగా నంతమున నొక విశిష్టవస్తువు సిద్ధమగును. ఆవస్తు వొక విశేషప్రయోజనమును సిద్ధింప జేయును' ఇట్లు ప్రథమమున విశేషప్రయోజనము బుద్ధి

యం దుండకున్నను క్రమముగా నొక విశిష్టవస్తువు సిద్ధమగు నెడల మొదటినుండియు విశేషప్రయోజనమును ముందిడుకొని యీసృష్టిని రచించు ఈశ్వరు నంగీకరింప నవసరమేల? ఈశ్వరు డొక విశేషప్రయోజన ముద్దేశించి బుద్ధిపూర్వకముగా మన శరీరము రచించునెడల ప్రప్రథమముననే యేల రచింపడు? ఇన్ని పరివర్తనము లేల? ఈశ్వరుడు సర్వజ్ఞుడగుచో నిన్ని చిన్నచిన్న సాధనాపద్ధతు లేల?

డార్విన్- అతని యనుయాయులును జెప్పు పద్ధతిజూడ సృష్టిక్రమ మంతయు నొక విశేషప్రయోజనము నుద్దేశింపకయే స్వాభావిక శక్తులద్వారా యేర్పడినదనియు, నందులకొక జ్ఞానపూర్ణశక్తి నొప్పుకొనుట యనావశ్యకమనియు తోచును. వారి సృష్టియందు నాలుగు నియమములు పనిచేయుచున్న వందురు. (౧) పితృనియమము (Law of Heredity) అనగా నొక వస్తువువలన దానికి సమానమగు మఱియొక వస్తువేర్పడుట (౨) పరివర్తన నియమము (Law of Variability) అనగా నుపయోగానుపయోగముల నిమిత్తమై వస్తువులలో బరివర్తనము జరుగుట. (3) అధికోత్పత్తి నియమము. (Law of overproduction) వస్తువులలో తమ యస్తిత్వస్థితికొఱకై యుద్ధము (Struggle for existence) జరుగవలసినన్ని పదార్థము లేర్పడుట. (౪) యోగ్య విజయము (Survival of the fittest) లేక స్వాభావికమయిన యెన్నిక (Natural selection) వస్తువులలో నేవి యన్నిటికంటె యోగ్యమైనవో అవియే జీవించియుండుట

మిగిలినవి నశించిపోవుట. మేమీగ్రంథమున వికాసవాదుల నియమములనుగాని సిద్ధాంతములనుగాని మీమాంసింపము. మనుష్యశరీర మారంభమునుండియు నిట్లే యేర్పడినదా? లేక క్రమికవికాసఫలమా? యను నీ విషయము నన్వేషింప యత్నింపము. ఇట గొంతతడవువఱకు నీ డార్విన్ సిద్ధాంతము సరియైనదనియే యంగీకరింతము. అయినను, ఉపర్యుక్త నియమము లన్నియు నొక నియంత నపేక్షింపకయే స్వయముగా సృష్టియందు పనిచేయగలవా యను ప్రశ్న వోడమక పోదు.

'ఒక వస్తువువలన తత్సమానమగు మరియొక వస్తు వేర్పడుట పితృనియమము. కాని యీనియమమేల? సమాన వస్తు వేల యుత్పన్నమగుచున్నది. సృష్టియంతయు వంధ్య యేలకావు. అచేతనముద్వారా శాసింపబడు నీసృష్టియందు సంతానోత్పాదక ప్రబంధమేల? ఉత్పాదక- ఉత్పాద్య వస్తువులు సమానముగా నేలయుండవలె? కప్ప- కప్పపిల్లలలోను నున్నంతవ్యత్యాసము జన్యజనక వస్తువులన్నిటిలో నేల యుండ రాదు? పెద్దజంతువుల సంతానము ఉత్పత్తిసమయమున తమ మాతాపితరులకంటె విభిన్నమైన పరిస్థితుల ననుభవించును. తరువాత నవి వానికి సమానాకృతులే యేలకావలె? భౌతిక విజ్ఞాన మీప్రశ్నములకు సమాధానము చెప్పనేరదు. కాబట్టి యీప్రశ్నలు వేయుటకాని వానికి సమాధానము చెప్పవలసిన యవసరముగాని లేదనరాదు. వీని కన్నిటికి నొక్కటే సమాధానమని నాయభిప్రాయము. అదియెద్దియన 'సర్వజ్ఞ

డీశ్వరు డొకడున్నాడు. అతడే యీప్రపంచము దీర్ఘకాలము వఱకు జీవనమున కాధారమై యుండవలయునని యిట్టి ప్రబంధము నేర్పరచి యున్నాడు." (ఫ్లింట్)

ప్రథమమాసమున మానవగర్భము మానవశరీరాకృతి నుండదు. ఆవు, పంది, కుందేలు, మానవుడు వీని గర్భాకృతులన్నియు బ్రథమమాసమున నొకే రూపమున నుండును. కొన్నిమాసములు గడచినతరువాత వానిలో భేదకచిహ్నము లేర్పడును. ఉత్పత్తిసమయమున సర్వథా భిన్నములై యుండును. స్త్రీశరీరమునందున్న గర్భము క్రమముగా కాలము గడచినకొలది పశుపక్ష్యాదుల శరీరాకృతిని పొందక మానవశరీర రూపధారణ నేలచేయువలె? దీనింబట్టి ప్రథమమున బహు మానవ గర్భముల రూప మొకటిగా నున్నను నియంతుని విచారధార ననుసరించి కాలక్రమమున మానవ గర్భము మానవాకృతిని, పశుగర్భము పశ్వాకృతిని ధరించుచున్నది. స్వర్ణకారుడు కంకణములకు, హారములకు నుపయోగించు బంగారమును బ్రథమమున నొకవిధముననే కరుగును. కడ్డీలు జేయును. రెండుకడ్డీలు చూచువారి కొకటిగా నే యుండును. కాని, స్వర్ణకారుడు మాత్ర మొకదానితో కంకణముల జేయవలయు ననియు, మరియొకదానితో హారము నొనర్పవలయుననియు నెఱుగును. కాబట్టి తరువాత వాని యాకృతులలో భేదముకల్గించును. ఇట్లే గర్భముల విషయము నని యెరుంగనగును. పితృనియమము ఆస్తికవాదమును ఖండింపదు.

"ఇంతియగాక, పరివర్తన నియమమువలన ఆది మధ్యాంతములలో బుద్ధి నవశ్యముగా నపేక్షించు ప్రయోజన మొందు రచింపబడుచున్నది. పరివర్తనల కంతములేని స్వభావ మేవస్తువునందును గానరాదు. ప్రతివస్తువునందును పరివర్తనము దాని యాకృతి ననుసరించియే కలుగుచుండును. డాక్టర్ హాక్సలే కథనానుసారముగా, హేల్ నందు పక్షము లేర్పడదగు పరివర్తన మెన్నడును గలుగదు. పక్షులలో హేల్ యొక్క యెముక లేర్పడగల పరివర్తనమును గలుగదు. కాబట్టి నియత పరివర్తనమువలన బ్రయోజనము సూచింపబడును. ఒక మనుష్యుడు కాలాంతరమున గడియారరూపమును ధరింపగల యొక తిరుగుచున్న నలికను బ్రబంధమున జేయగలిగిన, గడియారమును నలికను రెంటిని యొకేమాటు నిర్మించుటకై యతనిబుద్ధిని, వేరువేరుగా జేయగలిగినపుడు ప్రశంసింప దగినంతే ప్రశంసింపవలసి యుండును. డార్విన్ మతానుయాయుల దృష్టియందు బరివర్తన మొక నిశ్చితమార్గమున నడుచుచున్నది. దానికి విరుద్ధముగా నడవదు. ఇది ముందుకే నడుచునుగాని వెనుకకు నడువదు. దీనివలన నున్నతియే జరుగును గాని యవనతి జరుగదు. అట్లేల జరుగవలె? నియతపరిణామ మొసంగగల వస్తుసంయోగము బుద్ధిమత్తతో జేయబడుటయేకదా కారణము! (ఫ్లింట్)"

'అస్తిత్వమునకై యుద్ధమొనర్పవలసిన యగత్యమేర్పరుచు నధికోత్పత్తి నియమమును విచారింపుడు. ఈ నియమమువలన బుద్ధిమంతు డగు నీశ్వరుడే విశేషప్రయోజనము.ను

సిద్ధింపజేయు రచన నొనర్చినట్లు సూచింపబడదా? ప్రపంచమున నింతటి భిన్నప్రకారములయిన అధికజీవములు ఎందుకున్నదియు దీనిని బట్టియే తెలియుచున్నది గదా? దేని నధికోత్పత్తి యనుచున్నామో ఆ యధికోత్పత్తి యాయాజాతుల యస్తిత్వపు టావశ్యకతల నపేక్షించియే యున్నది. కాని యేజాతియు ప్రపంచమున దనకొఱకే జీవింపదు. భోజనసుఖాదులను బొందింపజేయదగు ప్రాణుల సంఖ్యను లెక్కించిన నుత్పత్తి యింత యధికముగా దోపక పోవచ్చు. వాస్తవమున ప్రాణు లన్నిటి యావశ్యకతలం గూర్చి విచారింపవలయును. కేవల మొకజాతిని గూర్చియో లేక యొక మానవునిగూర్చియో విచారింపతగదు. ప్రపంచమున నెంతమంది యతిథులకు నిరంతరము భోజనప్రబంధ మేర్పరుపవలసి యున్నదో లెక్క పెట్టగలిగినచో సృష్టియం దెట్టియపవ్యయము కనిపింపదని యొప్పుకొనకతప్పదు. అస్తిత్వసమర పరిణామము బాగే ననియు డార్విన్ అనుయాయు లంగీకరించుచునే యున్నారు. దుఃఖము - వేదన - వైమనస్యము నివియన్నియు నంతమున వ్యవస్థాసౌందర్యముల కేకదా? బుద్ధియుక్త ప్రాణులలో గల పూర్ణతల కీ యుద్ధమే కారణము. దీనివల్లనే సింహమునకు శక్తి, హరిణమునకు వేగము, కుక్కకు బుద్ధియు లభించుచున్నవి. దీనింబట్టి, యీ పూర్ణతలన్నియు నీయుద్ధము ద్వారానే గలుగవలసి యున్నవని స్వభావముగా ననుమానింప గలుగుచున్నాము. ఈ ప్రయోజనముకొఱకే యీ యస్తిత్వ సమరయోజన చేయబడినది. ఈ యుద్ధమువలన

గలుగు వేదనవలన, ప్రాణులు కేవలము సుఖమనుభవించు టకుగాక విశేషప్రయోజనముకొఱకై పుట్టింపబడుచున్నవని ప్రకటమగుచున్నది. లేక, ఈశ్వరునకు ప్రాణుల సుఖము నందున్నంత ధ్యానమే వాని యున్నతియందును గలదు. కాని దీనిచే, ఈ యుద్ధమువలన గలుగు ప్రయోజనము కొఱకిది యోజింపబడలేదను విషయము ఖండింపబడదు. మఱియు, ఈ యుద్ధము అస్తిత్వముకొఱకేగాక, అత్యంతసుఖముకొఱకు, తన శక్తుల స్వతంత్ర వికాసము కొఱకు నై యున్నది. ఈ ప్రయోజనములన్నియు గేవల మొక పెద్దబుద్ధిద్వారా నిర్మింప బడగలవు. వీనివలన దైవీబుద్ధికార్యము చక్కగా ప్రకాశింప బడుచున్నది.'

'స్వాభావికమైన యెన్నిక (Natural Selection)ను నియమమని చెప్పుటకును వీలులేదు. భౌతిక విజ్ఞాన మొన ర్చిన ఖండనమండనములను బట్టి యీనియమ తాత్పర్యమేమన, ఒకానొక కారణముచే నుత్పన్నమైన యేపరివర్తన మొకజాతి వ్యక్తులకు లాభకారి యగుచున్నదో యది యావ్యక్తులకు తప్పక లాభమొడగూర్చుచుండును. వాని సంతానములకును లాభముకూర్చ నవకాశముండును. దానివలన నాసంతానములు జీవించి యభివృద్ధినొందు సౌభాగ్యము గలవగును. వాని శత్రువులు అనగా నంతశక్తి లేనివి నశించును. కాని యీ స్వాభావికమైన యెన్నిక రచనా (Design) విరుద్ధము కాకపోగా ప్రబంధనిర్వహణము కాదగు రీతిని ప్రకటించును. ప్రబంధనిర్వహణమునకు మరియొక మార్గము నుండునని

కొందఱు తలంపవచ్చును. అట్లుకానిపక్షమున కేవలము చమత్కారముద్వారా జరుగగలదు. స్వాభావిక నియమమగు నెన్నిక యుండుటయేగాక ఆయెన్నికయు జడశక్తుల అచేతన నియమములద్వారా మాత్రమే జరుగునని డార్విన్ మహాశయుడు, నతని యనుచరులలో పలువురు నందురు. ఇచ్ఛాశక్తికిగాని, బుద్ధికిగాని యిందు తావులేదు. దీనికి వారు చూపు ప్రమాణమేమి? ప్రమాణమొందు చూపలేకుండుట విచారకరము! వీరు కేవల మాజడశక్తుల వైపునకును, బుద్ధిశూన్య నియమముల వైపునకును సంకేతింతురు. వాని వలన నవి తమపనుల నెట్లు నెరవేర్చుచున్నవో తెలియును అయినను వారా శక్తులవలనను నియమములవలననే సమస్త సృష్టి సమస్యను బరిష్కరింపవచ్చునని విశ్వసింతురు. వీనిని ఆలోచనాపూర్వకముగా గ్రమమున నుంచి పనిచేయించు విశ్వవ్యాపిబుద్ధి కిందు బ్రవేశమే లేదందురు. సృష్టియందు గలవ్యవస్థను, సౌందర్యమును సంపాదించు భౌతికసాధనములు ఉపాయములు వారికంటికి గనబడుచున్నవి. బుద్ధి, ఆలోచన వారికి గోచరమగుటలేదు. అందువలన వానికి నస్తిత్వమే లేదు. వారు తమ యింద్రియములద్వారా తెలియనగు యంత్రమునుమాత్రము వివరింతురు. అది స్వయముగానే సిద్ధపడి స్వయముగానే నడచుచున్నది. కారణమేమన, దానిని నిర్మించి నడుపు మస్తిష్క మొందు వారికి గనబడదు. 'ఆత్మ కనిపింపదు. కాబట్టి యదిలేదు' అని యీయుక్తుల తాత్పర్యము.

జడశక్తులే పనిచేయుచుండును. వానివలన చేతన శక్తులచే సంపాదింపదగిన ఫలమే సంపాదింపబడును; అని స్వాభావికమతు మెన్నికవిషయమున నొసంగబడు నుదాహరణము లన్నియు నప్రాసంగికములు. వారు వేనిని ఖండనాత్మకదృష్టితో నుదాహరింతురో యవన్నియు ఆస్తికుల దృష్టిలో మండనాత్మకములే యగును. ప్రొ. హాక్సలే యిట్లుదాహరించును! బిస్కా ఖాఖీ తరంగములు - వాయువీచికలు బ్రిటన్ తీరమున నతిజాగరూకతతో సంఖ్యా పరిమాణముల ననుసరించి భిన్నభిన్నరూపముల నొనర్చును. రాత్రియందు కురియు మంచు తోటలోని దుర్బలమైన మొక్కలను నశింపజేసి బలముగల మొక్కలను వేరుచేయును. పెనువాత మొక యంకురము నొకచోటినుండి తీసికొనిపోయి మఱి యొక దూరస్థానమున నాటును? కాని హాక్సలే తాను సిద్ధపరపదలచినదేదో బొత్తిగా మరచిపోవును. బాష్పయంత్రమున అగ్ని, జలములు అద్భుతకార్య మొనర్చుచున్నవి. కాని అగ్ని, జలములు జడములుగాబట్టి వానిద్వారా విశేషకార్యమును నిర్వహింపజేయుటకు బుద్ధి యనవసర మను మానవుని తర్కబుద్ధి నేమనవలెను? ప్రొ. హాక్సలే యుక్తియు నిట్టిదే. అతడు అగ్ని జలములను వేరువేరుగా జూచునుగాని, బాష్పయంత్రము (ఇంజన్) వంకచూడడు. వ్యవస్థానియమములతో గూడిన యీ సృష్టియందు భౌతికసంయోగమువలన పరిస్థితుల వలన నొకానొక ఫలము సిద్ధించుచున్నది. కాబట్టి బుద్ధి-యాలోచనముల కవసరములేదని యత డెంచును. ఇది యనుచితము.

కము నని నేనందును. ఇంద్రియములద్వారా కేవ
'తికపదార్థములు భౌతికఘటనలు కనబడును; కాబట్టి
ముగాని, చేతనశక్తిగాని యొక వస్తువే గాదని దీని
ము. బుద్ధిని ఖండించుటకై యతడు బుద్ధినపేక్షించు
్రకనే యంగీకరించుచున్నాడు. దీనినే యన్యోన్యా
ందురు.' (ఫ్లింట్).

)ంగసంబంధమైన యెన్నిక నియమమును (Law of
selection) నియమమనుట సమంజసము గాకు
వలన నాలోచనాశక్తి సిద్ధించుచున్నది. ఆకారమునకు,
సంబంధించిన సౌందర్యసంపాదనమే దీని ప్రయోజ
ఉడములయిన భౌతికశక్తులు బుద్ధిసహాయము లేకయే
మువంటి యద్భుతవస్తువును సృష్టింపగలవా?' ఫ్లింట్
కూడ మాపై నొకయాక్షేపము జేయనగును. అది

'మేము డార్విన్ సిద్ధాంతముల వలన నతడు
ంతని యనుయాయులుగాని, యొప్పుకొనని విష
సిద్ధముజేయ యత్నించితిమి. ఫ్లింట్ ఈశ్వరవాది
ే నతడు వైజ్ఞానికవిషయములందు ప్రామాణికుడు
. అతడు డార్విన్‌సిద్ధాంతముల నిటునటు లాగి
మును సిద్ధింపజేసెను.' ఈ విషయమున మేము
'టలు చెప్పుచున్నాము. మొదటిమాట ఫ్లింట్
న వైజ్ఞానికుని సిద్ధాంతములద్వారా డార్విన్‌సిద్ధాంత
ద్ధ మొనర్చిన నందుచేసిన పాపమేమి? బాగుగా విచా
కమున డార్విన్ కూడ ఆ పరిణామమునకే వచ్చియుం

డెడి వాడేమో! రెండవమాట యేమన? మాపక్షము మఱి యొక ప్రసిద్ధ పరిణామవాదిచేతను బోషింపబడుచున్నది. ఆల్ఫ్రేడ్ రసెల్ వాలెస్(Alfred Russel Wallace) నామమును ప్రతి పరిణామవాదియు ప్రతి విజ్ఞాన వేత్తయు, నెఱిగియుండును. అతడు డార్విన్ సహకారియు నైయుండెను. డార్విన్ కు తరువాతకూడ నత డతని మార్గము ననుగమించినవాడు. అతడు తన యర్థశతాబ్దాన్వేషణమునకు వెనుక జీవనజగత్తు (The world of life) అను గ్రంథపీఠికలో నీ నిగూఢ విషయమును వ్రాసియుండెను. అది చూచినపుడైన వైజ్ఞానికులకు తెలిసియుండవలెను.

'...నాపుస్తకమునను్న గొప్పవిశేషమేమన, డార్విన్ బుద్ధిపూర్వకముగా దనశక్తికి మించినదని యెంచి గ్రంథమున వ్రాయక విడిచిన నియమములను సరలమేగాక, యతిగంభీరమైన పరీక్ష నొనరించియున్నాడ. జీవనమన నేమి? దానికి కారణములేమి? విశేషముగా జీవనమున వృద్ధి, సంతానోత్పత్తికిగల విచిత్రశక్తులు, వానికారణములు నెట్టివి? అను నియమము... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

...... నే నీ నిర్ణయమునకు వచ్చితిని పక్షులు, క్రిమికీటాదులకంటె ముందు ఒకయుత్పాదకశక్తి యున్నట్లు తెలియుచున్నది. అది యీ ప్రకృతి నాశ్చర్యజనకములకు ఘటనల నొనర్చునట్లు చేసియున్నది. ఇదిగాక మఱియొక సంచాలకబుద్ధియు నున్నట్లు తెలియుచున్నది. అది వృద్ధిలోగలుగు ప్రతిదవస్థకు నవసరమై యున్నది. మన మీవృద్ధిని మీమాం

సింప నవసరములేనంత సాధారణ వస్తువుగా నెంచుచున్నాము. మఱియు, నూతమున, భూగర్భమునకు సంబంధించిన యుగ యుగాంతరములం దీ సమస్త విశాలజీవనజగత్తుయొక్క దీర్ఘ కాలపు పరిణామయంత్రమందోతప్రోతమై యున్న యంతిమ ప్రయోజనము తెలియబడుచున్నది.

ఈ విధముగా డార్విన్ పరిణామవాదముచేత ఆస్తిక వాద మెన్నడును ఖండింపబడదు. ఈశ్వరుని విచిత్రబుద్ధియే యుల్లేఖింపబడును. భిన్నభిన్నములగు చెట్లయు, కీట పతంగ ములయు నాకారమును, వాని స్వభావమును, రీతి మున్నగు విషయములను గురించి డార్విన్ వ్రాసిన గ్రంథములనుబట్టి సృష్టిలోగల యద్భుతసౌందర్యము దానివలనకలుగు నపూర్వ జ్ఞానము తెలియనగును. వాలెస్ మహాశయుని మతము నియ్యదియే.

కాని దీనింబట్టి యాస్తికులకు బరిణామవాద మంగీక రింప వలయునని తాత్పర్యము కాదు. మే మిట బరిణామ వాదము నండగాగొని యాస్తిక్యమును ఖండింప నెంచుట యను చితమేగాక యసంభవమని చూపుటకే యత్నించితిమి. కాబట్టి దీనివలన మేము పరిణామవాదులమని యెంచజనదు.

వాస్తవమున పరిణామవాదమును సిద్ధాంతముగా నంగీక రించుట ప్రస్తుతము పెద్దపెద్దవైజ్ఞానికులను మించి ముందంజ వేయుట యగును. ఇంతకాలము గడచినతరువాతగూడ పరి ణామవాదము కేవల మొక వాదము(Theory)మాత్రమే యగు

చున్నది. వైజ్ఞానికులుగూడ దీని నెంతవఱకు నెట్లు విశ్వసింపవలయునో నిశ్చయింప జాలకున్నారు. క్రొత్తక్రొత్తగా జేయబడు పరిశోధనలందు వెలువడు శృంఖలలు డార్విన్ చే నిర్మింపబడిన పరిణామభవనము నెక్షణమున గూల్చునో చెప్పజాలము. డార్విన్ మతమునకు నేడనేక విశేషణములు చేర్పబడినవి. డార్విన్ చెప్పునది వాలెస్ మహాశయుడు చెప్పడు. డార్విన్ సుపుత్రుడు ప్రొ. జార్జ్ డార్విన్ తా౧౯-౮-౧౯౦౫న దక్షిణాఫ్రికాలో జరిగిన బ్రిటిష్ అసోసియేషనుకు అధ్యక్షుడై యిట్లు చెప్పెను. '(The mystery of life remains as impenetrable as ever) జీవనరహస్యము నేడును బూర్వమున్నంత నిగూఢముగా నే యున్నది.'

ఎబర్డీన్ యూనివర్సిటీలోనున్న ప్రొ. జె. ఎ. తామ్సన్ ఎడింబరో యూనివర్సిటీ ప్రొ. పెట్రిక గేడీస్ వీ రిరువురు పరిణామవాదమును గూర్చి యిట్లు వ్రాసిరి.

'మనుష్యు డెక్కడినుండి ఎందులకువచ్చెనో మే మెరుగము. మనుష్యుని పరిణామప్రమాణము సందిగ్ధమని యంగీకరింపవలెను. విజ్ఞానమున నతనికి స్థిరస్థాన మొందు లేదు.'

ది ౯-౬-౧౯౦౫ టైమ్సు లిటరరీ సప్లిమెంటులో, పరిణామవాదులలో ననేకులకు జరిగిన వాదవివాదవిషయమును గూర్చి యిట్లు వ్రాయబడెను.

'ఇట్టి గందరగోళము పూర్వ మెన్నడును జూచియుండ లేదు. వీరందరు తమ్ముదాము విజ్ఞానమునకు ప్రతినిధులమని

చెప్పుకొనుట వింతగా నున్నది...... నిజమేమన, కొందఱు ఒకటిరెండు విషయములందు సహమతులయి యున్నను అందరకు సమ్మతమగు విషయ మొక్కటైనను గానరాదు. వీరు పరిణామవాదమునుగూర్చి యుద్ధ మొనర్చి దానిని ఖండఖండము లుగా జేసిరి. ఇప్పుడిది నిశ్శేషమనదగియున్నది. యుద్ధక్షేత్ర మున మాత్రము కొన్ని తునుకలు అక్కడక్కడ చెదరి పడి యున్నవి.'

మనుష్యుడు కోతినుండి పుట్టినాడనువిషయమున సర్. జె. డబ్ల్యు. డాసన్ ఇట్లు చెప్పెను. 'No remains of intermediate forms are yet known to science' 'వానర - మానవులకు మధ్యనున్న యాకృతులనుగూర్చి విజ్ఞానమునకేమియు దెలియదు' మఱియు మనుష్యుని ప్రాచీన తమములయిన యెముకలు నేటి మనుష్యుని యెముకలవలెనే యున్నవి. వీనింబట్టి మానవశరీరమునకు బూర్వమయిన పరిణామము తెలియకున్నది.

ప్రొ. ఓవెన్ చెప్పిన దేమన, 'మనుష్యుడు తాను ప్రత్యేకజాతికి సంబంధించినవాడు. తనజాతికి దానే ప్రతినిధి'.

ఇంతియగాక, మనుష్యుడు దినములు గడచినకొలది యవనతి నొందుచున్నాడని పలువురు వైజ్ఞానికుల మతము. సిడ్నీ కాలెట్ తన The scripture of Truth అను పుస్తకమున నిట్లు వ్రాసెను.

'మనుష్యుడు అవనతినుండి యున్నతి నందుటకు బదు లున్నతదశనుండి యవనత దశను బొందుచున్నాడనుటకు విజ్ఞానము సాక్ష్యమిచ్చుచున్నది.'

హొరాషియోహేల్ వ్రాసిన లేఖయం దతడిట్లు నిర్ణయించెను. 'ఆదియందు మానవునిబుద్ధి నేడతని సంతతి యందున్నంత ఉత్తమముగానే యున్నది.' మఱియు డాసన్ గూడ ఈ విషయమును గురించి 'మానవుని యాదిమావస్థ యన్నిటికంటె నున్నతమైయుండె' నని వ్రాసియున్నాడు.'

ఈ విషయముల నన్నిటి విచారించిన డార్విన్ పరిణామ వాదము నంగీకరించుట దుస్సంభవము. కాని పరిణామ వాదియైనను, కాకున్నను, ఈశ్వరు నంగీకరించుట కెట్టి యాటంకమును గానరాదు.

ధర్మధురంధరులలో ననేకులు విజ్ఞానవృద్ధివలన తన ధర్మమునకు హానికలుగుననియు, విస్సనచెప్పినది వేదము అని నమ్మించి తన యనుయాయులను మోసగింప వీలుండదనియు, నెంచి విజ్ఞానమును ద్వేషింతురు. వాస్తవమున వారు ధార్మికులుగారు. వారు చేయునది ధర్మముకాదు. వారు తమ స్వార్థమును ధర్మమనుచున్నారు. స్వార్థముతోనే యనేక ధార్మికసాంప్రదాయము లేర్పడినవి. అనుచరులు కన్నులు విప్పుకున్నంతవరకే వారిస్వార్థము సిద్ధించును. యథార్థమైన విజ్ఞానమువలన యథార్థమైన ఆస్తిక్యమున కెట్టిభయమును లేదు. సరియైన విజ్ఞానము ఆస్తిక్యమునకు సహాయక

మగును. సృష్టియందుగల యజ్ఞాతఘటనల నన్వేషించి వాని రహస్యమును వెల్లడించుటచే నీశ్వరుని మహత్త్వ మధికముగా గోచరించును.

విజ్ఞానమే లేకున్న మనకు నీశ్వరజ్ఞానము గలుగ నేరదు. మనము కనులువిచ్చి సృష్టిని పరిశీలించసాగిననాడే విజ్ఞాన ముదయించును ఈ నిరీక్షణఫలమే నేడు విశాలమైన విజ్ఞానాన్వేషణాలయములం దనేకులు విశేషజ్ఞులు, దత్తచిత్తు లయి పనిచేయుచుండు రూపమును దాల్చినది. వారి పరిశ్రమము పెరిగిన కొలది యీశ్వరమహత్త్వము మన కధికముగా గోచరించును. సర్. ఆలివర్ లాడ్జ్ చక్కగా వర్ణించియున్నాడు.

'ధర్మక్షేత్రము, పూర్ణమైన విజ్ఞానక్షేత్రము రెండును నభిన్నములే.'

---

# ఆరవ అధ్యాయము

## ఈశ్వరగుణములు (౧)

మనము నివసించు నీ విశాలసృష్టిని దిలకించినపుడు జ్ఞానేచ్ఛాశక్తులుగల యదృష్టసత్వమొండు సృష్టికర్తృత్వమును వహించుచున్నట్లు తెలియనగును. సృష్టిలోగల మహాత్వమును బోధించు వ్యవస్థ జ్ఞానేచ్ఛాశక్తులు లేక కలుగనేరదు. గడియారమునగల చక్రముల నన్నిటిని వేరుపరచిన నవిస్వయముగా మరల గడియారరూపము నొందజాలనట్లు సృష్టిలోగల పరమాణువుల నన్నిటిని వేరుచేసి వానిని క్రమమున నుంచకున్న నవి స్వయముగా సృష్టిని సృష్టింపనేరవు.

కాని జ్ఞానేచ్ఛాశక్తులతో నొప్పు సత్త్వమొండు కలదని యంగీకరించిన మాత్రమున ఆస్తికులయు, ధార్మికులయు ప్రయోజనము సిద్ధింపనేరదు. వారీశ్వరునందు సృష్టిని రచింప నవసరమగు నీరెండుగుణములనే యారోపించి తృప్తిపడజాలక పోవుటయే దీనికి కారణము. ఈశ్వరునందు వారారోపించు గుణములలో నెన్నియో ప్రమాణవిరహితములై యున్నవి. ఈశ్వరగుణములలో గొన్నిటిని బట్టి యతడు సృష్టికర్త యనబడుటకే తగడని తోచును. ఈశ్వరుడు నొకసత్త్వమై కొండొకవస్తువును రచించుచో నా రచన మనసృష్టికి భిన్నమై యొటనో మన కజ్ఞాతమై యున్నట్లును దోచును. అదియెట్లున, సృష్టిలోగల సమస్తఘటనలు నియమపూర్వకముగా జరుగుచున్నవి. కాబట్టి విచారశీలుడయిన నియంత యొకడుండుట యవసరమని

రొకవంక నుడువుదురు. మరియొకవంక చమత్కారములను జూపుచు, నీశ్వరుడు సర్వము చేయగలడు; కాబట్టి నియమో ల్లంఘనము నొనర్పగలడందురు. వాస్తవమున చమత్కారము లకు ఆస్తిక్యమునకు నెంతో ఘనిష్ఠసంబంధ మేర్పడినట్లు తోచుచున్నది. అందువలననే తన్ను దా సందేశవాహుడని (పైగంబర్) ప్రకటించుకొన్న ప్రతివ్యక్తికి జమత్కారములను జూపుట యనివార్యమయ్యెను. కాబట్టి మహమ్మదీయ (ఇస్లామ్) మతస్థాపకుడైన మహమ్మదు విషయములో ననేక చమత్కారములు వర్ణింపబడుచున్నవి. ఇట్లే క్రైస్తవ ధర్మ స్థాపకుడైన క్రీస్తును గురించియు జెప్పబడుచుండుట నెల్ల రెఱింగినవిషయమే. ఇతర ధర్మావలంబులును 'ఈశ్వరుడు సర్వ మొనరిప గలడ'ను రాగము నాలాపించుచు దురు. అందుచేత నాస్తికులు 'మీరు సృష్టిని నియమవతమని యో లేక యనియమవంతమనియో నొప్పుకొనుడు. ఆస్తిక్యమును సిద్ధింపజేయుటకై ముందుగా సృష్టి నియమవంతమని యొప్పు కొని తరువాత నియమవంతమనుట తగద'ని యందురు.

ఇట్లే 'బ్రహ్మసత్య - జగన్మిథ్యా' అని యొప్పుకొను భ్రమవాదులు ఆస్తిక్యమును స్థిరపరుచుటకై యొసంగు ప్రమాణ మేమి? జగము మిథ్యామాత్రమయిన నది ప్రమాణకోటిలో నెట్లు చేర్పబడును? దానివలన బ్రమేయ మెట్లు సిద్ధించును? ఒకానొక యంత్ర మతివిలక్షణమైనది కాబట్టి దాని నిర్మాతయు నతిబుద్ధిశాలియై యుండవచ్చునని చెప్పి, యటుపై నాయం త్రము వాస్తవమైనదికాదు. మనయింద్రియముల భ్రమజన్యమే

యని నుడువుచు నేని ఆ యంత్రాధారమున నూహింపబడిన యంత్రకర్తృతయు నతని బుద్ధికుశలతయు నెట్లు సిద్ధింపగలవు? జగమసత్యమైన పక్షమున నది యుదాహరింప ననువైనది కానేరదు. కాని, జగన్మిథ్యావాదులైన శ్రీశంకరాదులు తమ సిద్ధాంతములను ఋజువుపరప నీ యసత్యజగత్తునే యుదాహరించి యున్నారు.

(౧) 'అస్మిన్ వాక్యే జన్మస్థితి ప్రలయానాం క్రమ దర్శనాత్'

(౨) 'అస్యజగతో నామరూపాభ్యాం వ్యాకృతస్యానేక కర్తృభోక్తృసంయుక్తస్య, ప్రతినియత దేశకాలనిమిత్త క్రియాఫలాశ్రయస్య, మనసా ప్యచింత్యరచనారూపస్య జన్మస్థితిభంగా యతః సర్వజ్ఞాత్ సర్వశక్తేః, కారణాద్భవతి తద్బ్రహ్మేతి వాక్యశేషః. వేదాంతదర్శనమ్ ౧. ౧. ౨

(3) 'అతః సమానః పశ్వాదిభిః పురుషాణాం ప్రమాణప్రమేయ వ్యవహారః. వే. ద. ౧. ౧. ౧

(౪) వేదస్యహి నిరపేక్ష్యం స్వార్థే ప్రామాణ్యం రవేరివ రూపవిషయే. వే. ద. ౨. ౧. ౧

(౫) యతస్తత్రాపి పయోఽంబు నోశ్చేతనాధిష్ఠితయోరేవ ప్రవృత్తిరిత్యను మిమీహే. వే. ద. ౨. ౨. 3

(౬) ధేన్వైవ ధేహ్యుపయుక్తం తృణాదిక్షీరీ భవతి వే.ద. ౨. ౨. 3.

అని యిట్లు జగత్తు నుదాహరించుట వీరి కనధికారచేష్టయై యున్నది. వాస్తవమున జగత్తు మిథ్యయగు నే

జగత్తునకు గారణభూతమైన మస్తిమ్మకుగూడ భ్రమాత్మకమై యుండవలయును. బ్రహ్మ యెన్నటికిని కాజాలదు. కాబట్టి బ్రహ్మ జగత్తుయొక్క జన్మ స్థితి లయములకు కారణ మనుట పొసగదు.

వాస్తవముగా జగత్తును మిథ్యగా భావించి మన మొక యడుగైనను ముందుకు సాగనేరము. సమస్త జ్ఞాన విజ్ఞానములకు మూలసాధనములు మన ఇంద్రియములే. వీనిని విశ్వసించుట మనకు స్వాభావికము. ఇంద్రియములు మనలను వంచించి భ్రమింప జేయుట కేని యిట్టివానితో నిత్యసంబంధ మేర్పడుటకై మనము చేసిన యపరాధమేమి? ఇంద్రియములు మనకు జ్ఞానసాధనములు గాకున్న నవి యెట్టివి? ఇంద్రియములను విశ్వసింపకున్న జగత్తు మిథ్యయనియు మన కెటు తెలియును? అందువలననే గౌతమముని న్యాయదర్శనమునందు ఇంద్రియములను తప్పుడుసాక్షులుగా వర్ణింపక ప్రామాణ్యపరీక్షణార్థము కొన్ని నియమములను మాత్రము సూచించి యున్నాడు. ఆ నియమముల ద్వారా సత్యాసత్యములను నిర్ణయింప గలుగుదుము. వానినే ప్రత్యక్షానుమానోపమానశబ్దములను పేర్లతో బ్రమాణచతుష్టయమని చెప్పియున్నాడు. మనము మన యింద్రియములద్వారా యనేక విషయములను తెలియజాలమనుటలో నెట్టిసందేహమును లేదు. కాని, సూక్ష్మవిషయక జ్ఞానమును సంపాదించుట కవసరమగు సూక్ష్మబుద్ధి వికాసమున కాధారము యింద్రియజన్య జ్ఞానమే. ఉదాహరణార్థము బీజగణితమున మనము $\sqrt{-૪}$ లేక $\sqrt{-૫}$

మున్నగు కరణుల (Surd)జ్ఞానమును సంపాదించుచున్నాము. గణితశాస్త్రము తెలిసిన ప్రతివ్యక్తియు, $\sqrt{-3}$ లేక $\sqrt[3]{-5}$ యొక్క యర్థము నెఱుగగలడు. కాని, అతనికీజ్ఞాన మేయింద్రియమువలన కలిగినదని యడిగిన నతడు చెప్ప నేరడు. అయినను 5 - 4, వర్గమూలము, ఘనమూలము, శేషము, కూడిక, మున్నగు వాని జ్ఞానమంతయు నతనికి బంచేంద్రియములవల్లనే ప్రాప్తించినవి. అజ్ఞానాధారముననే సంపూర్ణమైన గణితశాస్త్ర భవనము నిర్మింపబడినది. ఇట్లు మనకు మనయింద్రియములు వంచకములుగావనియు, ప్రపంచము మిథ్యకాదనియు స్పష్టపడుచున్నది. భ్రమనొప్పుకొని యాస్తిక్యమును నిలుపనెంచుటయు నసంభవము. శ్రీశంకరాచార్యుడు,

'అవిద్యావద్ విషయాణ్యేవ ప్రత్యక్షాదీని, ప్రమాణాని శాస్త్రాణిచ'

అని ప్రత్యక్షాది ప్రమాణములు, శాస్త్రములు అజ్ఞాన విషయములని వర్ణించుట సరిగా దోపదు. ఉపనిషదాది శాస్త్రములను విద్యావిషయకములనుచు శంకరుడు తనమతమును స్థాపించుటకు వానినే యాధారముగ గొనియున్నాడు. ఇంక వారిచ్చిన యుక్తియు సముచితముగా దోపదు.

"పశ్వాదిభి శ్చావిశేషాత్ యథాహి పశ్వాదయః శబ్దాదిభిః శ్రోత్రాదీనాం సంబంధే సతి, శబ్దాది విజ్ఞానే ప్రతికూలే జాతే, తతో నివర్తంతే, అనుకూలే చ ప్రవర్తంతే, యథా దండోద్యతకరం పురుష మభిముఖ ముపలభ్య మాం హంతు మయ మిచ్ఛతీతి పలాయితు మారభంతే. హరిత తృణ పూర్ణ

షాణే ముపలభ్య తం ప్రత్యభి ముఖీ భవంతి. ఏవం పురుషా అపి వ్యుత్పన్నచిత్తాః, క్రూరదృష్టీనాక్రోశతః ఖడ్గోద్యత కరాన్ బలవత ఉపలభ్య తతో నివర్తంతే తద్విపరీతాన్ ప్రతిప్రవర్తంతే. అతః సమానః పశ్వాదిభిః పురుషాణాం ప్రమాణ మప్రమేయ వ్యవహారః పశ్వాదీనాంచ ప్రసిద్ధోఽవివేక పురస్సరః ప్రత్యక్షాది వ్యవహారః తత్సామాన్య దర్శనాద్ వ్యుత్పత్తి మతామపి పురుషాణాం ప్రత్యక్షాది వ్యవహారస్త త్కాలః, సమానః ఇతి నిశ్చీయతే" (శారీరిక భాష్యభూమికా)

ఇట శంకరాచార్యులు ప్రత్యక్షాది ప్రమాణములు అవిద్యావిషయకములని సిద్ధపరుపవలసి యుండిరి. ఇందుకు వారిచ్చిన యుక్తి 'పశ్వాదులతో సమానమగుటవలన' అని. పశువులు దండమునెత్తి పట్టుకొనివచ్చు పురుషునిజూచి పారి పోవును. పచ్చిగడ్డితెచ్చు పురుషునిజూచి యభిముఖముగా నరుదెంచును. ఇట్లే మనుజులును ఖడ్గధరునిజూచి పారిపోవు దురు. కాబట్టి పశువులు మనుష్యులు తుల్యులు. పశువులు జ్ఞానములేనివని ప్రసిద్ధమగుటచే మనుష్యులు నజ్ఞానులని నిశ్చ యింపబడుచున్నది.

ఇది యెంతయసంగతయుక్తియో పాఠకులు గ్రహింతురు గాక. ఆయుక్తి శ్రీ శంకరాచార్యులవంటి ధురంధర దార్శ నికుల పుస్తకమున నుండక యన్యగ్రంథముల గోచరించిన పరిహాసింపనివా డుండనేరడు. పశ్వాదులు దండోద్యతకరుని జూచి పారిపోవుటవలన నజ్ఞాను లనబడుటలేదు. ఇట్లే మను ష్యులును ప్రత్యక్షాది ప్రమాణములను విశ్వసించి ఖడ్గధరుని

జూచి పారిపోవుటచేతను మిష్టాన్నహస్తుని జూచి యెదురొ్కను టచేతను అజ్ఞాను లనబడుటలేదు. అనుమానాది ప్రమాణములను యథోచితముగా నుపయోగించి జ్ఞానము సంపాదింపనేరవుగాన పశువులు జ్ఞానములేనివిగా నెంచబడుచున్నవి. పశువులలోను మానవులలోను కొంత సామ్యము లేకపోలేదు. కాని యనేకవిషయములందు మానవులు పశువులకంటె భిన్నులగుచున్నారు. పై వర్ణించిన శంకరుని యుక్తినిబట్టి ప్రత్యక్షాది ప్రమాణములు, అవిద్యయని సిద్ధింపనేరవు. ఈ యవిద్య యనెడి యిసుకగోడలమీద 'జగత్తు మిథ్య' యనెడి యిల్లుకట్టుట సంభవము కానేరదు.

వాస్తవమున నిట్టియుక్తులు మానవులను ఆస్తిక్యము నుండి తొలగించి నాస్తిక్యము నవలంబింపజేయును. మఱియు నొక్కొక్కప్పుడు మానవుడు ఈశ్వరుడున్నాడనిగాని లేడని గాని చెప్పజాలనంతటి సంకటపరిస్థితియందు చిక్కుకొని

'సంశయాత్మా వినశ్యతి'

అను గీతావాక్యమునకు లక్ష్యుడగుచున్నాడు. బాగుగా విచారించినపక్షమున, తత్వము తెలియని యాస్తికులు వైజ్ఞానికులనుమించి లోకమున నాస్తిక్యమును వ్యాపింపజేసిరనవలసి వచ్చును. ఇట్టి యాస్తికులు పేరున కాస్తికులై యీశ్వరవ్యాజమున నానాప్రకారములైన యత్యాచారముల నొనర్చుచుండిరి. ఈశ్వరవ్యాజమున నాట్యరంగములు వెలిపించిరి. బాలహత్య, మానవహత్య, గోహత్య మున్నగు ననేకహత్యలు చేయబడుచున్నవి. ఈశ్వరుని పేరిట మానవులు ప్రాణము

లతో దగ్ధముచేయబడిరి. వీరు తమయిష్టమువచ్చినట్లు కల్పించిన విగ్రహముల నెదుటనుంచుకొని యథార్థమయిన జగన్నియామకుని సర్వథా విస్మరించిరి. వైజ్ఞానికు లాధ్యాత్మిక ప్రపంచమున నున్నతి సంపాదింపక ఈశ్వరనామమును తిరస్కరించినను భౌతికప్రపంచమున దృగ్గోచరములగు నియమముల నాదరదృష్టితో జూచుచున్నారు. కాబట్టి ఆస్తికులనబడువా రక్కరకు రాకపోగా నాస్తికులు భౌతికభాగమున నైనను సఫలులగుచున్నారు.

నాస్తికులకును చాల హానికలిగినది. కారణమేమన, వాస్తవికశాంతి నొసంగగల మహాశక్తికి వారు దూరులైరి. కాని యీశాంతి యీశ్వరవిషయమున ప్రత్యక్షాది ప్రమాణములను సరకుగొనక యిష్టమువచ్చినట్లు కల్పనల నొనరించు ఆస్తికనామధారులయిన నాస్తికులకును లభింపదయ్యె.

మేమింతవఱకును దృశ్యమానదృష్టివలన జ్ఞానేచ్ఛాశక్తులుగల సత్వమొండు దీనిని రచించుచున్నదని సిద్ధపరచియుంటిమి.

ఇకమీద నీసృష్టివల్లనే జ్ఞానేచ్ఛాశక్తులుగల సత్వము ఈశ్వరుడొక్కడేగాని యనేకులు గారని తెలియుచున్నట్లు నిరూపింప యత్నించెదము. ఈప్రపంచమున నామహచ్ఛక్తిగాక యనేక చిన్నసత్వములు గోచరించుటలో నెట్టిసందియము లేదు. మనుష్యులు ఇతరప్రాణులును వానివాని విభాగములందు భిన్నభిన్నకార్యముల నొనరించుచున్నవి. అదియెట్లన, నన్నొక సత్వముగా భావింపుడు. నేను నాశరీరమును నడుపగలుగు

దును. నా చేతితో వ్రాయుదును. నాజిహ్వతో మాట్లాడుదును. కన్నులతో చూతును. నే ననేకవస్తువులను విరిచి మడిచి యిష్టమువచ్చినట్లు చేయగలను. నావంటిమనుజులు లోకమున కోట్లకొలది యున్నారు. వారిలో చాలమంది నాకంటె మించినకార్యములను జేయువారు నుందురు. వీరుగాక యర్బుదములకొలది పశుపక్షికీటపతంగాదు లయిన ప్రాణులు తమకు తగినట్లు పనులొనర్చుచు భిన్నసత్తా కలిగియున్నవి. కాని యీసత్వములకును సృష్టిని శాసించు నాప్రథమ సత్త్వమునకును భేదముగలదు. చిన్నసత్త్వములు కొన్ని విశేష నియమములకు లోబడియే కార్యకరములగును. సృష్టినియమములను పాలింపవలసిన బాధ్యత వీనిపైనున్నది. ఇవి నియమములను శాసించునవిగాక వాని ననుగమింపవలసినవై యున్నవి. మానవుడొక గృహమును నిర్మింపగోరు నేని గృహనిర్మాణమున కనువగు నియమముల నెఱుగవలసియుండును. వానియం దేమాత్రము ప్రమాదమొనర్చినను గృహము సరిగా నిర్మింపలేడు. చిన్నసత్వములలో చేతనములకు నచేతనములకు గలభేదమేమన, జడవస్తువులు జ్ఞానములేకయే సృష్టి నియమముల పాలించుచుండును. అవి సృష్టినియమముల నుండి కొన్నిటిని తమకై వేరుపరుచుకొనుశక్తి గలవికావు. కాని చేతనములు సృష్టిలోగల యనేకనియమములనుండి తమ కనువైన వానిని వేరుజేసి వానిని పాలించుశక్తి గలిగియుండును. ఎట్లన, నేను కృషినియమముల నెఱింగి వానినిపాలించిన పొలమున వడ్లు పండింపగలుగుదును. వడ్లు పండింపకుండుటకు దగిన

నియమముల నతిక్రమింగి పండింపకుండగలను. కాబట్టి వీనిలో నాయిష్టమువచ్చిన నియమముల నేననుసరింప గలుగుదును. కాని జడపదార్థము లిట్లు నియమములలో గొన్నిటి నెన్నుకొనజాలవు. నియమములే వానినొక పద్ధతిని నడుపుచుండును.

కాని ఈ నియమములను నడుపుశక్తి చాలపెద్దది. దాని ప్రభావ మీసృష్టియందు వ్యాపకముగా గోచరించును. ప్రస్తుత మీశక్తి యేకమా లేక అనేకమా యని చూడవలసి యున్నది. సృష్టినియమములను విచారించినపుడు, ప్రపంచమున వ్యక్తిగతఘటనలు వాస్తవమున నొకనియమముద్వారా పరస్పరసంబద్ధములై యున్నట్లు వివరించియుంటిమి. ఉదాహరణమునకై 'క' నామముగల వస్తు ఒకపొలమున విత్తబడిన దనుకొనుడు. దానిని 'ఖ' నామక పరిస్థితిలో నుంచిన, దానిలో వడ్లు పండును. ఇట్లే మరియొక దూరదేశమున 'గ' నామముగల వడ్లు విత్తి 'ఖ' నామకపరిస్థితిలో నుంచిన వడ్లే పండును. దీనింబట్టి 'క' 'గ' నామములుగల వడ్లగింజలు రెండును ఒకానొక 'ఘ' యనెడి విశేష నియమమున బంధింపబడి యున్నట్లు తెలియుచున్నది. ఇక్కడ 'ఘ' యనెడి నియమము 'క' 'గ' గింజల నాశ్రయించి యుండ లేదని గుర్తింపవలయును. ఇది 'క', 'గ' ల నాశ్రయించి యుండిన రెండునియమములు గావలసియుండును. కారణ మేమన: 'క, గ'లు పరస్పరము దేశకాలములచే దూరములై భిన్నములయి యున్నవి. రెండునియమములను వేరువేరుగా నేల యంగీకరింపరాదందురేని వ్యక్తి-నియమము నను నీరెంటి

యందును గలభేదమేమి? 'క' యొకవ్యక్తి. అది స్వయముగా నియమరూప మెట్లగును? అట్లే 'గ' యనువ్యక్తియు నియమ తాదాత్మ్యమును బొంద నేరదు. తనయం దనేక యంతర్ఘటనలు గలదే నియమమనఁజెల్లును. కాబట్టి వరికంటె మరి యొకసన్య మేర్పడునియమము 'క' 'గ'ల నాశ్రయించి యుండదు. 'క' 'గ' లే యానియమము నాశ్రయించియుండును. ప్రస్తుత మీనియమమునకు స్థితి యెక్కడ? అనునది విచారింప వలసియున్నది. నియమము తనవ్యక్తులను విడిచి యన్యత్ర నుండఁజాలదు. వ్యక్తులు దేశకాలముల ననుసరించి యత్యంత భిన్నములు. అందువలన హారమునందుగల ముత్యములలోని దారమువలె నానియమ మాభిన్న దేశ భిన్నకాలిక వ్యక్తులం దోతప్రోతమై యుండుననఁ వీలులేదు. అందువలన వ్యక్తులను నియమాశ్రితములై యుండునట్లు నిర్బంధించు నొక బుద్ధివిశేషమునందే యానియమమునకు స్థితియని యొప్పుకొనక తప్పదు. ఈవిషయము మఱియొక యుదాహరణమువలన బాగుగా స్పష్టపడగలదు. 'అ' నామకమనుష్యుఁ డొకఁడు లండన్‌లో నొక యపరాధ మొనర్చు ననుకొనుఁడు. అతనికి 'స' నామక దండన లభించినది. కలకత్తాలో 'బ' నామక మరియొక మనుష్యుఁ డాయపరాధమునే చేయును. అతనికిని 'స' నామక దండనయే లభించును. ఇదియొక నియమము. ఈ నియమము స్థితి 'అ' 'బ' వ్యక్తులం దుండదు. అది 'రాజ్యము' నబడు బుద్ధియందో, బుద్ధిసమూహమునందో యుండును. 'లండన్' 'కలకత్తా'లు రెండును ఆరాజ్యాధీనమున నుండును.

అనేకవ్యక్తు లొక నియమాశ్రితులైనట్లు నియమములు కూడ వ్యక్తిరూపమున పెద్దనియమములకు లోబడియుండును. ఆనియమములు తమకంటె గొప్పనియమముల నాశ్రయించి యుండును. ఇట్లు క్రమముగా నంతమున సమస్తసృష్టియు నొక గొప్పనియమము నాశ్రయించి యుండును. దానినే వేదమున 'ఋతము' అందురు. ఈ 'ఋతము' ఒక్కటే. అనేకముగాదు. సమస్తసృష్టి యీఋతము నాశ్రయించి యుండును. ఈ'ఋతము' ఆస్తికులచే నీశ్వరుడని పేర్కొన బడు నాయపారబుద్ధియందు నిహితమై యున్నది. వేదమంత్ర మున నొకచో,

"ఋతంచ సత్యం చాభీద్ధాత్తపసో ఽ ధ్యజాయత" ఋ.౧౦.౧౯౦.౧. 'ఋతము- సత్యము అభీద్ధతపస్సునుండి యుద్భవించినవి' అని వర్ణింపబడియున్నది. 'ఋతము' ననేమో పైన వర్ణించియున్నారు. ప్రపంచమున నేర్పడు ప్రతిఘట నయు, ప్రతివస్తువును, ఉపర్యుక్త నియమాధీనమున నుండు నట్లు నిర్బంధించుశక్తియే సత్యమనబడును. ఋతమునుంచు బుద్ధి అభీద్ధ యనియు, సత్యమునుంచుశక్తి తపస్సు అనియు, నీబుద్ధి శక్తులు రెండును ఈశ్వరుడని చెప్పబడు పదార్థమునకు గుణ భూతము లనియు తాత్పర్యము. ఇట్లీశ్వరు డొక్కడే యని భావము. ఈశ్వరుని యేకతనుగూర్చి యథాస్థానమున విశేష ముగా వర్ణింపగలము.

ఈశ్వరుడు సర్వవ్యాపకుడా? యనునది మఱియొక ప్రశ్న. జె. ఎస్. మిల్ మహాశయుడు తన (Three

Essays on Religion) పుస్తకమున నీప్రశ్ననుగూర్చి మీమాంసించియున్నాడు. వాస్తవమున నీప్రశ్న యతి గూఢమగుటచే విచారణీయమే. గడియారమును జేయువాడు దానియందు వ్యాపకుడై యుండడు. నాచే వ్రాయబడు నీపుస్తకమున నేను వ్యాపకుడనుగాను. పుస్తకము పాఠకులచేతిలో నుండ నేను కొన్నిక్రోసుల దూరమున నుందును. ఇంజన్ నిర్మించువాడు దానియం దెకడ వ్యాపకుడై యుండును? కుమ్మరి ఘటమున నుండునా? ఉండడు. కాని గడియారము, పుస్తకము, ఇంజన్, ఘటము నన్నియు తమతమ పనులను చేయుటలేదా? అల్పుడైన కుమ్మరిచే నిర్మింపబడిన ఘటమనేకవత్సరముల కాలము కుమ్మరి వ్యాపకత నపేక్షింపకయే యుపయోగి యగుచున్నది. అట్టియెడ నపారశక్తిశాలి యని వర్ణింపబడు నా సర్వేశ్వరుని వ్యాపకత నపేక్షింపకయే యతనిచే నిర్మింపబడిన యీసృష్టి కార్యకారి యెందులకు గారాదు? అత డీ సృష్టియందేల నిండి యుండవలె? వేదాంతులు నీశ్వరుని నిమిత్తకారణమనక యుపాదానకారణ మందురు. శ్రీ శంకరాచార్యులు:

"తదనన్యత్వ మారంభణ శబ్దాదిభ్యః" వే.ద. ౨.౧.౧౪ అను నీ సూత్రమునకు భాష్యమొనర్చుచు ఛాందోగ్యోపనిషత్తులోని యీవాక్యము నుద్ధరించియున్నారు.

"యథా సౌమ్యైకేన మృత్పిండేన సర్వం
మృణ్మయం విజ్ఞాతం స్యాత్. వాచారంభణం
వికారో నామధేయం మృత్తికేత్యేవసత్యమ్."

ఘటమున మట్టివలె నీశ్వరు డీ సృష్టియందంతట వ్యాపించియున్నాడని భావము. ఈ విషయమునుగూర్చి మేము వేరుగా విచారింతుము. ప్రస్తుతమిట మిల్ మున్నగు పాశ్చాత్యదార్శనికులే కాక యితర ధర్మావలంబులును "ఈశ్వరుడన్న నతడు వ్యాపకుడు కావలసిన యావశ్యకత గానరాద"ను సమస్యలో చిక్కుకొనియున్నారు. వేదాంతులు ఈశ్వరుని సర్వవ్యాపకత్వమును నిషేధింపరు గాని నిమిత్తకారణత్వమును నిషేధింతురు. ఇదియు నొకవిధముగ సత్యమైన యాస్తికతామూలముపై కుఠారాఘాతమనకతప్పదు. కాని యితర సాంప్రదాయికులు, ఏడవయాకాశముననో, నాలుగవయాకాశముననో, క్షీరసముద్రముననో, వైకుంఠముననో, కైలాసముననో ఈశ్వరుదున్నట్లు ఎంచుచుందురు. ఇదియెంతయు చిత్రము. వీరొకవంక సర్వవ్యాపకు డనుచు మరియొకవంక నీశ్వరుడు స్థానవిశేషమున నుండుననుచుందురు. ఈ పరస్పర విరుద్ధ సిద్ధాంతమును సంగతపరుచుటకు విలక్షణ వ్యాఖ్యానములను సైతము జేయుచుందురు. ఇందు వాక్ఛల మధికముగా గాననగును. కొందఱు, సూర్యుడు ఆకాశమున నొక విశేషస్థానముననుండి తన ప్రకాశముద్వారా సమస్త భూమండలమున వ్యాపించునట్లు ఈశ్వరు డొకస్థానముననుండియు సమస్తసృష్టియందు వ్యాపకుడై యుండునందురు. ఈశ్వరుడు స్వతః వ్యాపకుడు గాకున్నను ప్రకాశముద్వారా వ్యాపకుడని వారిభావము. జార్జి చక్రవర్తి లండనులో నుండి భరతవర్షమును శాసనమొనర్చునట్లు ఈశ్వరు డొక

స్థానముననే యుండి తన శక్తిద్వారా సమస్తసృష్టియందు వ్యాపించియున్నాడని మరికొంద ఱందురు.

ప్రప్రథమమున "నిమిత్తకారణము కార్యమున వ్యాపకమై యుండునా?" యను విషయమును విచారింతము. కర్త తానులేని స్థానమున నెట్టిక్రియను జేయజాల డను విషయము నెల్లరు సమానముగా నంగీకరింతురని యెంచెద. నాచేతిలో నున్న వస్తువుపై నా కధికారముండును. నేను చేరలేని స్థలమున నాద్వారా నెట్టిక్రియయు జరుగనేరదు. ఒక క్రియయం దనేక చిన్నచిన్న క్రియలుచేరుట యప్పుడప్పుడు సంభవించును. వానిలో నొకదాని నొకపురుషుడు చేయును. మిగిలినవాని నన్యులు చేయుదురు. కాని వ్యవహారమునకై యాక్రియలన్నియు నొకనిచే జేయబడినట్లు చెప్పుటయు గలదు. అది కథనము మాత్రమేకాని వాస్తవముకాదు. అది యెట్లన, షాజహాన్ తాజమహాల్ నిర్మాత యందురు. తాజమహాల్ నిర్మాణ మొక క్రియకాదు. అందు లక్షలకొలది క్రియలు చేరియున్నవి. షాజహాను దాని నిర్మింపగోరి యుండును. అందులకగు వ్యయము నిమ్మని యాజ్ఞాపించి యుండును. ఒకడో, లేక యనేకులో దాని 'ప్లాన్' నిర్మించి యుందురు. రాళ్లు రప్పలు నితరులు సంపాదించి యుందురు. షాజహానునిచే నిర్మింపబడినదని లోకవ్యవహారమున్నను లక్షలకొలది మానవులు పనిచేసియుందురు. అటుపై తాజమహాల్ సిద్ధమై యుండును. ఇందు షాజహానుచేసిన క్రియావిషయమున నా క్రియ జరిగిన దేశకాలములందు షాజహాను ఉపస్థి

తుఁడై యుండెను. అన్యుల క్రియలవిషయమున నన్యులు నుపస్థితులై యుండిరి. అందొక్కరు లేకున్నను వానిచే జేయ బడిన క్రియ జరిగియుండదు. తాజమహాల్ కూడా నిర్మింప బడియుండదు. ఇంతియగాక మనచే విచారింపబడని క్రియలు నంద నేక ముండియుండును. ఎట్లన, తాజమహాల్ నిర్మించు నపుడు షాజహాను, మానవులచే నిర్మింపబడదగిన క్రియలకు మాత్రమే యోగ్యులయిన మనుష్యుల వెదకి తెప్పించి యుండును. మానవసహాయము లేకయే జరుగుక్రియలు వందలకొలది యుండును. వానిసహాయము లేకున్న మహాల్ నిర్మింపబడుటయు నసంభవమగును. సమయమునకు సూర్యోదయాదులగుట, కాలానుగుణ్యముగ వర్షాదులేర్పడుట, భూమ్యాకర్షణలో నెట్టిమార్పు కలుగకుండుట మున్నగు క్రియ లన్నియు నిందుదాహార్యములు. ఇట్లు తాజమహాల్ నిర్మాణమున షాజహాను, అతని యనుచరులు కూలివారు మున్నగు ననేకవ్యక్తుల క్రియలేగాక, యితర శక్తుల (మానవ క్రియల కాధారభూతమయిన) సహాయము నెంతోగలదు. ఏయంశము నకు మానవుడు కర్తయై యుండెనో ఆ యంశమున నతడు వ్యాపకుడై యుండెను. ఏ యంశమున మనుష్యాతిరిక్తశక్తులు కర్తృత్వమును వహించుచున్నవో యట మానవవ్యాపకతకు జోటు లేదు.

గడియారమునుగూర్చి విచారింపుడు. ఇందులో ననేక క్రియలు చొప్పింపబడి యున్నవి. గడియారమును నిర్మించు వాడు, అంతమున అవయవముల నన్నిటిని క్రమముననుంచుట

యను క్రియనుమాత్రము చేయుచున్నాడు. ఈక్రియను వాడు తానున్నచోటనే చేయగలడు. అతనిచే జేయబడిన క్రియకు పూర్వమనేక క్రియలు జరిగియున్నవి. అవిజరుగకున్న నతడు గడియారమునుగూర్చ నసమర్థుడై యుండును. వానిలో గొన్ని మానవక్రియలు మఱికొన్ని యమానుషక్రియలునై యుండును. లోహపుగనినుండి లోహమును ద్రవ్వి తెచ్చుట, దానిని శుద్ధపరచుట, కరుగుట, చక్రములు మున్నగు నవయవములను నిర్మించుట మున్నగుక్రియలతో వేలకొలదిమంది మనుష్యులకు సంబంధముండును. వారందరు వారివారి పనులను జేసినపుడు వారాక్రియలలో వ్యాపకులై యుండిరి. ఇవిగాక యమానుష క్రియలనేకము లున్నవి. లోహకారులు తమపనికై వినియోగించిన లోహమునందుగల పరమాణువుల పరస్పర సంయోగమనెడి క్రియ, లోహకారులచే జేయబడదు గదా? వారా పరమాణువుల సంయోగమునకు కర్తలు కారు గదా? వారు వానిని చేర్చరు, విడదీయలేరు. ఉన్నపరిస్థితిలో దానినుపయోగింతురు. ఇట్లు గడియారమును జేయువాడు గడియారమున వ్యాపకుడు కాకున్నను దానిని నడుపుచున్నాడనుట తగదు. అతడేక్రియకు నుత్తరదాతమో యందతడు వ్యాపకుడై యుండక తప్పదు. గడియారపు సంచాలనమున కతడు కర్త గాడు. అట్లయిన నది విరిగి చెడినపుడు వాడేల యుత్తరదాతగాడు?

నిమిత్తకారణము కార్యమున వ్యాపకమైయుండ నవసరము లేదనినప్పుడు మనము కార్యమున నొకయంగముమీద నే

దృష్టి నుంతుము. సంపూర్ణకార్యము మనదృష్టియం దుండదు. దీనిని మఱియొక దృష్టాంతముద్వారా స్పష్టపరచెదము. నీవు నాయరచేతియం దిసుకకణములతో 'అ' ను వ్రాసి దానినొక పురుషునికి చూపి రమ్మని చెప్పితి వనుకొనుము. అప్పుడు నీవు 'అ' ను వ్రాయుటకు మాత్రమే కర్తవు. అరచేతియం డాయక్షరము నట్లే స్థిరముగా నుంచుట నాపని; నీది కాదు. కాబట్టి దానికి నీవు నిమిత్తకారణము కాజాలవు. నేనే యగుదును. నేను దానిని మధ్యలో జెడగొట్టుటకు నధికారము కలిగియుందును. కాని నీవు నన్ను చెడగొట్టనివానినిగా విశ్వసింపవచ్చు. ఇట్లే గడియారములోని యావయవములను నొకచో క్రమముగా జేర్చుటలో నిర్మాపకుడు నిమిత్తకారణము. కాని యాచక్రములు వాడు విశ్వసించినంతకాలము విశ్వసించిన రూపమున నడుచుటకుగాని నడవకుండుటకుగాని యతడు నిమిత్తకారణము కాజాలడు. దానికి నిమిత్తమొక యదృష్టశక్తి. కాబట్టి ప్రపంచమున మానవనిర్మిత వస్తువులను జూచినపుడు ఆవస్తువులకు మానవుడే నిమిత్తకారణముకాక అదృష్టశక్తులును నిమిత్తకారణములయి యున్నవని తెలిసికొనవలసి యున్నది. మనుష్యుడొక యంశమునకు మాత్రము నిమిత్తకారణము. అందువలన నిమిత్తకారణము క్రియతో నుండునని తెలియవలెను. నిమిత్తకారణ మున్నంతవఱకే క్రియజరుగునని తాత్పర్యము.

దీనినిబట్టి సృష్టియందు ఈశ్వరుడు సర్వవ్యాపకుడై యున్నట్లు స్వయముగా సిద్ధించుచున్నది. కారణమేమన,

పర్వతము లేర్పడుట, నదులు ప్రవహించుట, సూర్యుడుద యించి యస్తమించుటయే సృష్టి యనబడను. రెండు పరమాణువులు కలియుట, కలిసినతరువాత నాస్థితిలోనుండుట, మఱియు నొకప్పుడు విలక్షణరూపమున వేరగుట మున్నగు కార్యములన్నియు సృష్టిలో జేరినవే. ఈయసంఖ్యక్రియలు ప్రతిక్షణమునను బ్రతిస్థానమునందును జరుగుచుండును వీనిలో ననేకక్రియ లతిసూక్ష్మములు. అనేకక్రియ లతిస్థూలములునై యున్నవి. సూర్యుడుదయించుట స్థూలక్రియ. కాని సూర్య కిరణములలో నేడురంగులు కలియుట, కలిసియుండుట విభిన్న పరిస్థితులలో వేరగుట మున్నగునవి యతిసూక్ష్మములు. కాబట్టి యాక్రియల యుత్పత్తి స్థితి లయముల కొఱకొక సూక్ష్మముకంటె సూక్ష్మమును స్థూలముకంటె స్థూలమునగు సత్త్వవిశేష ముండుటావశ్యకము. అందువల్లనే గడియారము, యింజన్ మున్నగు దృష్టాంతములును ఈశ్వరుడు సూక్ష్మాతి సూక్ష్ముడై సర్వవ్యాపకుడై యున్నాడనియే బోధించును. గడియారపు నిర్మాపకునితో సమానుడైన యీశ్వరుడు గడియారమువంటి సృష్టికి భిన్నుడై యున్నచో, రాజ్యమును నడుపుటకు చక్రవర్తి సేవకుల నాశ్రయించినట్లు సృష్టి చక్రమును నడుపుటకై యీశ్వరు డన్యశక్తుల నాశ్రయింపవలసినవా డగును. సేవకుల మానసములు చక్రవర్తి యధీనమున నుండని ట్లాయితర శక్తులపై నధికార మీశ్వరున కుండజాలదు. సేవకులు చక్రవర్తి యాజ్ఞలనుమించి వర్తించిన దండనార్హులగుచుందురు. అట్లే యితర శక్తులు నీశ్వరునకు వ్యతిరేకముగా

సృష్టిని ఛిన్నభిన్నములగునట్లు చేయును. సామ్రాజ్యమున చక్రవర్తి వ్యాపకుఁడుగానుండుటచే ప్రజలు పలువిధముల వ్యతిరేకవర్తనల నాచరించుచుందురు. కాని సృష్టి నవలోకించి నపు డీక్రిందివిషయములు మనకు గోచరించును.

(౧) సృష్టి నియమానుకూలమై యున్నది.

(౨) నియమములనుబట్టి యపారబుద్ధి యూహింపదగి యున్నది.

(3) నియమములు దృఢమైనవి.

(౪) ఈ నియమములు సూక్ష్మాతిసూక్ష్మములైన వస్తువులను శాసించుచున్నవి. కాబట్టి యీశ్వరుడు,

(౧) నియంత,

(౨) జ్ఞానవంతుడు = సర్వజ్ఞుడు.

(3) ఏకరసుడు.

(౪) సూక్ష్మాతిసూక్ష్ముడు మరియు సర్వశక్తిమంతుడు, వని సిద్ధమగుచున్నది.

మొదటి మూడువిషయములను ఆస్తికులెల్లరు విశ్వసింతురు. నాలుగవ విషయమున చాల మతభేదము లున్నవి. ఈ మతభేదమును మరియొకవిధమున చెప్పదగును. ఈశ్వరుడు సూక్ష్ముడు సర్వశక్తిమంతుడు ననుట నేయాస్తికుడు నిషేధింపడు. కాని దీనితో బాటు అనేకులు ఈశ్వరుడు సాకారుడనియో లేక సాకారుడు కాగలడనియో నమ్ముచుందురు. సాకారనిరాకార వాదులలో దీర్ఘకాలమునుండియు వివాదములు, కలహములు జరుగుచునే యున్నవి. దీనివలన ననేక మతభేదములు

నేర్పడినవి. ఈ వివాదములు పరిష్కరింపబడినేని ప్రపంచము లోని యాస్తికులెల్లరు పరస్పరము కలియుటకును, నాస్తికులు తమ నాస్తిక్యమును వీడుటకు నవకాశ మేర్పడునని నావిశ్వాసము. కాని భిన్నమతులు భిన్నరూపముగ విచారింతురు.

సాకారమునకుగల యర్థమును విచారింపవలసి యున్నది. ఆకారమునకు మన ఇంద్రియములతో సంబంధ మున్నది. (సాకారవస్తువును కన్నులతో జూడగలము. చేతులతో స్పృశింపగలము.) చూచుటకును స్పృశించుటకును వీలు గాని వస్తువు నిరాకారమనబడును. ఈ రెండువిధములయిన వస్తువులును సృష్టియం దున్నవి. శతపథ బ్రాహ్మణమున నిట్లు వ్రాయబడియున్నది.

“ద్వేవావ బ్రహ్మణో రూపే మూర్తంచైవామూర్తంచ” (౧౪.౫.౩.౧) అనగా సృష్టికి మూర్తామూర్తములను (సాకార నిరాకారములు) అని రెండురూపము లున్నవి. నీరు బాష్పమై యెగిరిపోయినపుడు నిరాకారమగును. కాబట్టి దృష్టిగోచరము కాదు. కాని బాష్పము ఘనీభవించి మేఘములయినపుడు సాకారమగును. వాయువు నిరాకారము. ఆకాశము నిరాకారము. వానిని జూడనేరము. ఈశ్వరుడు నిరాకారుడా? సాకారుడా? యనునదొక ప్రశ్న. (సాకారవస్తువు తప్పక స్థూలమగును. సృష్టి యందుగల స్థూలవస్తువులు సూక్ష్మవస్తువులందు వ్యాపకములు గానేరవు. అందువలన ఈశ్వరుడు సాకారుడైన సర్వవ్యాపకుడు కాజాలడు. సర్వవ్యాపకుడైన సాకారుడు కాజాలడు. సాకారుడై సర్వవ్యాపకు డగుట యసంభవము. సాకారు

డని చెప్పఁగొని సర్వవ్యాపకత్వమును త్రోసివేయుదమనిన
ఈశ్వరుడు సృష్టికర్త యగుటకును వీలుండదు. కర్తృత్వమును
విడిచిన నీశ్వరుని యీశ్వరత్వమునకే లోటు గలుగును. ఆస్తిక్య
భిత్తి యొక్క పెట్టున కూలిపోవును. కాబట్టి యాస్తికు లీశ్వరుని
సాకారుడని చెప్పుకొనుట స్వమత ఖండనము చేయుట
కన్న వేరుగాదు. ఇంతియగాక యీశ్వరుడు సాకారుడగునేని
కంటికి కనబడవలయును. మఱియు సూక్ష్మవస్తువులందు
వ్యాపింపకుండును. సృష్టిలోగల నియమములు అతిసూక్ష్మము
లగుటంబట్టి వానిపై స్వత్వముగల యీశ్వరునకు సాకారముగుట
యేవిధమునను పొసగదు.

కొందఱు నిరాకారవస్తువులు శక్తిలేనివిగా నెంతురు.
కాబట్టి సర్వశక్తిమంతుడగు నీశ్వరుడు సాకారుడు కావలసి
యుండునని వారిమతము. ఇట్టి యాలోచనలు దార్శనికులకు
జెందినవి కావు. కాని, వ్యవహారమున బుద్ధిమంతులనఁబడు
వారు కొన్నిసమయముల నిట్లు తలంచుచుందురు. ఈశ్వరునకు
చేతులులేకున్న సృష్టి నెట్లుచేయగలడు? కన్నులులేకున్న
నెట్లుచూడఁగలడు? అని లోకులు ప్రశ్నింతురు. కాని పాపము
వారికి నిరాకార వస్తువుకంటె సాకారవస్తువులు నిర్బలములై
యుండునని తెలియదు. నిరాకారవస్తువు సాకారవస్తువును
శాసింపఁగలిగియుండును. సాకారవస్తువును నిరాకారవస్తువు
శాసింపజాలదు. నాశక్తి నిరాకారమైనది. అది సాకారమైన
నాహస్తమును తన యిష్టమువచ్చినట్లు చలింపజేయును.
చేతితో నొకప్పుడు వ్రాయుదును. ఒకప్పుడు భోజ్యమును

నోటిదనుక తీసికొనిపోవుదును. ఒక సమయమున తల గోకుదును. కాని యీశక్తి చేతియందు వ్యాపకమయ్యు దానికంటె భిన్నమై యున్నది. ఈశక్తి దానినుండి విడివడినపు డా చేతిలో సాకారత్వము, స్థూలత్వము నల్లేయుండియు కార్యమును జేయజాలదు. సింహముగాని, ఏనుఁగుగాని మనుష్యునికంటె స్థూలకాయము నొందును. కాని మనుష్యునియందున్న సూక్ష్మబుద్ధి వానియందు లేదు. ఆ సూక్ష్మబుద్ధియే మదలగొట్టు సింగములను, నేనుగులను వశపరుచుకొనగలుగును. ఈ బుద్ధి స్థూలమైన మాంసముగాని, రుధిరముగాని, ఎముకలుగాని కాదు. అదియొక సూక్ష్మవస్తువు. విద్యుత్తంత్రులు సూక్ష్మములే. కాని విద్యుత్తు అంతకంటె సూక్ష్మమైనది. అది తంత్రులను కంపింపఁజేయును. ఇనుములో జంబకశక్తిని ప్రవేశింపజేసిన దానిశక్తి యినుమడించును. కాని శక్తి యినుముకంటె సూక్ష్మమైనది. కాబట్టి స్థూలములను శక్తిసంపన్నములుగాను, సూక్ష్మములను శక్తిహీనములుగా నెంచుట గొప్పపొరపాటు. ఈశ్వరుడు సర్వశక్తిమంతుడు సర్వవ్యాపకుఁడు కావలయునన్న నతఁడు నిరాకారుఁడై యుండితీరవలయును.

బాష్పము నిరాకారమయ్యు మేఘరూపమున సాకారమయినట్లు నీశ్వరుడు నిరాకారుడైనను అవసరములనుబట్టి సాకారుడు కాగలడనిన హానియేమని కొందఱందురు. ఇంతియుగాక యీశ్వరు డన్యవస్తువులను నిరాకారమునుండి సాకారమునకు తేగలిగినపుడు తానేల సాకారుడు కాజాలడు ?

ఇట్లు వాదించువారు యథార్థము నాలోచింపగోరరు. బాష్పము మేఘములగుచున్నదనిన యర్థమేమి? బాష్పము నీటిపరమాణువులు వేరువేరుగా నాకాశమున వ్యాపించుటకంటె మిన్నగాదు. అవి యొకచో చేరినపుడు రూపొంది కనిపించును. నీటిపరమాణువులు భిన్నభిన్న పరిమాణములలో సంయుక్తము లగుటచేతనే బాష్పము, మేఘములు, వడగండ్లు, మంచు గడ్డల రూపముల నేర్పడుచున్నవి. ఇనుపగుండును జూడ నిట్లు తుత్తునియలుగా నగ్ని కంటికగపడకుండునట్లు చేయఁగ... గుండునను. వానినికలిపి స్థూలరూపము నొందింప నగును.

దీనింబట్టి స్థూల(ప్రాకృతిక)వస్తువులన్నియు ననేకయణువుల పరస్పరసంయోగముచే నేర్పడినవనియు మనకు దెలియుచున్నది. ఈశ్వరుడో ఒక్కడు - ఏకరసుడు. కాబట్టి నిరాకారుడు సాకారుడు కాజాలడు. అట్లుగావలయునన్న ననేక సంయోగ మవసరము. రెండవవిషయమేమన స్థూలవస్తువు వ్యాపకము కాజాలదు. కాబట్టి యీశ్వరుడు సాకారుడు కాడు. కాజాలడు.

స్థూలవస్తువు లేకదేశమున నుండును. వానికాద్యంతము లను రెండుకొనలుండును. నిరాకారవస్తువులలోను గొన్ని యేక దేశములు కావచ్చును. కాని సాకారవస్తువులలో నొక్కటియు సార్వదేశికము కానేరదు. కాబట్టి యీశ్వరుని సాకారుడని యెంచుట వాస్తవముగా నిరీశ్వరవాదులగుటయే యగును.

సర్వశక్తిమంతుడను పదమునుగూర్చి యిపుడు విచా రింపుదము. సృష్టిలోగల సమస్తవస్తువులను నియమములద్వారా

తన స్వాధీనముననుంచుకొను సత్వమునే యీశ్వరుడందుమని వ్యక్తీకరించియుంటిమి. ఒకానొక వస్తువును శాసింపవలయునన్న నంతకుమించిన శక్తియవసరము. ఈశ్వరుడు సృష్టిలోని జడ వస్తువులనేగాక సజీవపదార్థములనుసైతము తనవశమున నుంచు కొనును. సర్వప్రాణులకంటె బలవంతుడనిచెప్పదగు మను ష్యుడు ఈశ్వరాధీనుడై యుండును. 'మనుష్యప్రయత్నము' అను పదార్థమునందు మనుష్యుడు బలవంతుడయ్యు బలహీనుడే. అతనికి మించినశక్తి యొకటి లోబరచుకొనియున్నదని వర్ణించి యుంటిమి. సృష్టిలోనున్న సమస్తపదార్థములకంటె నధికబల వంతుడై వానిని శాసించుచున్నప్పుడు ఈశ్వరుడు సర్వశక్తి మంతుడెట్లో సంశయమేమి? పూర్వాచార్యులందరు సృష్టియందలి [illegible] నొకశక్తి యధీనమున నున్నట్లు చెప్పి యుంటిమి. [illegible] నానావిధములతో భిన్నభిన్నశక్తులన [illegible] శక్తి [illegible] తన యధీనమున నుంచుచు [illegible] శక్తియందు [illegible] డుగుచున్నాము. [illegible] సర్వశక్తులన్నియు నొక్కశక్తికి సంబంధించిన భిన్నభిన్న రూప ములే. ఆశక్తి యీశ్వరాధీనమున నుండును. అందువలన కొన్నికొన్నిచోట్ల యీశ్వరుడు శక్తి నామముతోను బేర్కొనబడుట గలదు. వాస్తవమున నీశ్వరుడు శక్తిగాదు. శక్తిమంతుడు. కాబట్టి సర్వశక్తులు కలవాడు శక్తిగల పదార్థములన్నిటికంటె నధికుడు నను రెండర్థము లీశబ్దమున కొప్పియున్నవి. ప్రపంచ మున పిపీలికలు మొదలు మనుష్యులవఱకు నున్న ప్రాణు లన్నియు శక్తిగలవే. నేను ఇటుకల నెత్తగలను. జడవస్తువు

లను సంయోగింప జేయుటకును, వియోగింపజేయుటకును సమర్థుడను. చీమలు గింజలను తమబిలములలోని కీడ్చుకొని పోగలవు. పతంగము లెగురగలవు. ఇవన్నియు కొంచెమో గొప్పో శక్తి కలిగియుండుటంబట్టి శక్తిమంతము లనబడుచున్నవి. కాని, వేలకొలది పదార్థములు నాశనము కానివ్వక [illegible] యుతక ప్రాణింపకుడు. కాబట్టి శక్తి కలిగియున్న [illegible] యున్నవి. ఈశ్వరుడు [illegible] చేతితో [illegible] నేడే [illegible] [illegible] [illegible] కాలులు. కాబట్టి శక్తిగలవస్తువుల కన్నిటికంటె అధికశక్తిగల వాడగుటచే నీశ్వరుడు సర్వశక్తిమంతుడని తేలుచున్నది.

ఈశ్వరునం దంగీకరింపబడు శక్తులెయ్యవియైన అవి యసంఖ్యాములౌనే లేక వానికొక నియమితసంఖ్యగలదా? సర్వశక్తిమంతుడను శబ్దమునగల సర్వశబ్దము సాంతవాచకమా? యనంతవాచకమా? వ్యుత్పత్తినియమముల వ్యాఖ్యానమునుబట్టి [illegible] మొక్కటికే యసంఖ్యాకములని చెప్పబడెను. ప్రతినియమము అసంఖ్యాకములని తోచుచున్నది. సృష్టియు ననంతము. భూతభవిష్యద్వర్తమానకాలములను చూచి యాలోచించిన ఘటనల కంతము కానిపింపదు. కాబట్టి యనంతనియమముల ననంతశక్తులుగా నంగీకరించిన, ఈశ్వరునందుగల శక్తులు ననంతములే యగును. నియమానుసారముగా వాటి

వలను, పదార్థములను వశమునందుంచుటయే శక్తులన్ని మగును కొండొకవస్తువును శాసించుట యనగా దాని త్రగలుగుట, క్రిందపడవేయగలుగుట, ఇటునటు విసరగల రెండవవస్తువుతో దానిని మేళవింపగలుగుట మరల వేరు గలుగుటయూ నని యర్థము. ఇట్లు సృష్టియందుగల సూక్ష్మపరమాణువుల నన్నిటిని, ఈశ్వరుడు పైనజెప్పినట్లు కలవాడు గనుక నతడు సర్వశక్తిమంతుడు. ఈశ్వరాని నమునకు లోబడని వస్తువనునది ప్రపంచమున గాన

ఆస్తికులలో సర్వశక్తిమంతుడను శబ్దమునుగూర్చి భేదాభిప్రాయములున్నవి. ఈశ్వరుడు సర్వశక్తిమంతు సర్వము చేయగలిగియుండునని లోకులు సామాన్య నెంచెదరు. కాని వారు సర్వమనుశబ్దార్థమును విచారి సర్వమనగా పైనవక్కాణించిన ప్రాకృత పదార్థముల యొక్క స్థైర్య [illegible] క్రియలని చెప్పి [illegible] ఇంతకంటె మించిన మరియొక యర్థమేమి? కొండొక ప్ర గూర్చి యతనికి దనప్రజలపై సర్వాధికారమున్నదని వాడు తనప్రజల నిష్టమువచ్చినట్లుంచగలడనియే యర్థము ఇట్లే ఈశ్వరుడు సర్వశక్తిమంతుడన నతడు సృష్టియం పరమాణువులను, వస్తువులను, ప్రాణులను, అన్నిటిని తన నమున నుంచగలడనియే భావింపవలయును.

కాని యనేకులీ 'సర్వము నొనరింపగలడు' అను కట్టియర్థము గ్రహింపరు. అది వారిసిద్ధాంతములనుబ కలియుచున్నది. అదియెట్లన, కొందఱీశ్వరు డవతరింపగ

దురు. కొందఱు శూన్యమునుండి పదార్థములను సృష్టింపగల డందురు. కొందఱీశ్వరుని యిచ్ఛలేక యాకుసైతము కదల దందురు. మఱికొందఱీశ్వరుడు సర్వశక్తిమంతుడు కాబట్టి మనుష్యులచే నబద్ధమాడించుచున్నాడందురు. ఇట్లీశ్వరుని సర్వశక్తిమత్త గారడివాని సంచియని యెంచబడుచున్నది. దానిలో మంచి చెడుగు లన్నియు నిమిడియున్నది. ఇందుల కుదాహరణము లేమనిన, ఈశ్వరుని సర్వశక్తిమత్తవలననే క్రీస్తు తండ్రిలేకుండగనే జన్మించెను. మహమ్మదు చంద్రుని రెండుతునుకలు చేసెను. శ్రీకృష్ణుడు గోవర్ధన పర్వతము నతిబాలికేనవ్రేలిపై నెత్తగలిగెను. ఈశ్వరుడు ప్రహ్లాదుని రక్షింప నృసింహాకారుడగు టెట్లుపొసగెను? సర్వశక్తిమత్తవలననే. వాస్తవముననీశ్వరునిలోనుండి యిట్టిచమత్కారాత్మకమయిన సర్వశక్తిమత్త తొలగింతుమేని ప్రపంచమునుండి యనేకసంప్రదాయములు రూపుమాసిపోవును. నానావిధపూజలును నామావశిష్టములగును. లక్షలకొలది పూజారుల జీవిక నశించును. కాబట్టి సత్యమువీడి యనేకమతమతాంతరముల యస్తిత్వమును కాపాడుటకును, పూజారుల పొట్టలు నింపుటకును ఈశ్వరుని యందిట్టి నిరర్థక సర్వశక్తిమత్తను గాపాడవలసియున్నది. నియమముల పాటింపక యుచ్ఛృంఖలవృత్తిగలదుండగీండ్రు శక్తిశాలురని లోకమున వ్యవహరింపబడుచున్నట్లు ఈశ్వరుని సర్వశక్తిమత్తయు నెంచబడుచున్నది. ఈశ్వరుడు చేయరానిపనిగాని చేయనిపనిగాని యొండులేదు. ఈశ్వరుడు

శక్తిగలిగి జ్ఞానములేకున్న స్థిరములు, సువ్యవస్థితములునగు నియమముల నిర్మింపజాలరు. జ్ఞానము, శక్తి, రెండునులేని వానినిగూర్చి వ్రాయవలసిన దేముండును?

సృష్టియందు స్థిరనియమముల యునికియే యీశ్వరాస్తిత్వమునకు ప్రమాణమని పలుకరాదు స్పష్టపరచియుంటిమి. ఈ నియమములే స్థిరములు కానున్న [illegible] నవి నియమములని చెప్పబడనేరవు. [illegible] ప్రకరణమున వైజ్ఞానికుల విజ్ఞాన [illegible] బాధింపబడిన [illegible] [illegible] [illegible] [illegible] సత్పురుషుల [illegible] సరి [illegible] [illegible] [illegible] ప్రమాణము [illegible] డుండును? జ్ఞాత [illegible] నియమములులేని రాజుగారి రాజ్యము నరాజక [illegible]; కాని, శక్తిశాలి రాజ్యమని చెప్పనేరము. ఇట్లే యీశ్వరుండు తన సర్వశక్తిమత్తగాని, స్వతంత్రతగాని, ప్రాముఖ్యముగాని, చూపింపదలచి నియమముల నుల్లంఘించిన, నీక్రింది రెండుకారణములలో నొకటి తప్పక యుండితీరవలయును. ఒకటి నియమముల నిర్మించునప్పు డొకానొక నియమము భవిష్యత్తున లాభమునకు బదులు హాని నొనరించునని యాలోచించి యుండకపోవచ్చు. ఎట్లన, క్రైస్తవధర్మగ్రంథమైన బైబిలులో నిట్లు వ్రాయబడియున్నది. "సృష్టియందు పాపములేకుండవలెగా, నేనిట్టి పాపభూయిష్ఠమైన సృష్టి నేలచేసితినని దుఃఖించెను." ఈస్థితి యీశ్వరుని యజ్ఞానమును సూచించుచున్నది. రెండు, ఈశ్వరుడు నియమపాలనచేయుచు బరిశ్రాంతుడై నేడు వానిని బరివర్తన

చేయు నవసరముకలిగినదని తెలిసికొనను. ఇట్లు నియమాల్లం ఘన మీశ్వరాధీనమని యెంచితిమేని యీశ్వరుఁడే సిద్ధింపడు.

శ్రీమద్దయానందస్వాములవారు ఈశ్వరుడు సర్వమొనరింప గలడనువిషయమున దోషముచూపుటకై రెండు ప్రశ్నలు వేసియున్నారు.

(౧) ఈశ్వరుడు తన్ను నష్టపరచుకొన గలఁడా?

(౨) ఈశ్వరుడు తనవంటి యీశ్వరుని మఱియొకని సృష్టింపగలఁడా?

ఈ రెండు కార్యము లీశ్వరశక్తికి బాహ్యములనియే యందఱు నంగీకరింతురు. సమస్తవిశ్వమునందు వ్యాపించియున్న సత్త తన్నుదా నెట్లు నశింపజేయగలదు? సత్పదార్థమేదియు ప్రపంచమున నాశమొందనేరదు. తనకు సమానుఁడైన యీశ్వరుని చేయుటయు నసంభవమే యగును. ఉన్నయీశ్వరుడు వేఱొకనిని సృష్టింపనుకొనుఁడు. అయినను వారిలో భేదమెట్లు లేకుండును? ఒకఁడు నిర్మింపఁబడినవాఁడు, మఱియొకఁడు నిర్మించినవాఁడు నను భేదమున్నఁడు నశింపనేరదు గదా? ఇట్లైన నొకడు ప్రాచీనుఁడు, మఱియొక డర్వాచీను డగును. కాబట్టి సమానత యెట్లుపొసగును? ఒక క్రైస్తవ విద్వాంసుడును మఱియొక ప్రశ్న నొనర్చెను. అదియు సంగతమే. ఈశ్వరుడు (వ్యభిచారిణియైన) వేశ్యను కుమారికగా (శాశ్వతబ్రహ్మచారిణిగా) నొనర్పగలడా? వేశ్య యేవిధముగను కుమారిక కానేరదు. ఇవిగాక మఱియు ననేకవిషయము లీశ్వరుడు చేయనివి చెప్పవచ్చును. వాని నొనర్చుట కీశ్వరు

నిలో శక్తిలేదు. కారణమేమన నత డీశ్వరుడు. తనకు యోగ్యమగు కార్యమునే యీశ్వరు డొనర్చును. అనుచితము ననియు మవంతము నైన కార్యము నీశ్వరు డెట్లు చేయును?

ఈశ్వరుడొక త్రికోణమును వృత్తము చేయగలడా? లేనిచో నేలకి సృష్టిలోగల పరమాణువులన్నియు నతనియధీనములో నున్నవిగదా? అవును సృష్టిలోగల పరమాణువులన్నియు నతని యధీనముననున్న విషయము నిజమే. కాని వానిని త్రికోణరూపమున నుంచిన త్రికోణమగును. వృత్తరూపమున నుంచిన వృత్తమగును. త్రికోణరూపమున నుంచుచుండ వృత్తమెన్నడునుగాదు. కోణములన్నియుగలిసి రెండు సమకోణములకంటె నెక్కువో తక్కువో కాగలత్రికోణము నీశ్వరుడు నిర్మింపజాలడు. కారణము? ఏత్రికోణమైనను దాని కోణముల యోగము రెండుసమకోణములకంటె నెక్కువ తక్కువలుగాక సమముగానే యుండును.

ఈశ్వరుడు దొంగతనము చేయగలడా? తనవంటి యీశ్వరుని సృష్టింపగలడా? యని యడిగినపుడు, వెంటనే కొందఱు. అవును 'చేయగలడు కాని చేయడు. పుట్టింపగలడు.' కాని పుట్టింపడు.' అని సమాధానముల నిత్తురు.

ఈసమాధానము వాస్తవమున వారికి సహాయమొనర్పజాలదు. కొంతతడవది యొకసమాధానముగా తోచవచ్చు. మనస్సును సంతోషపెట్టవచ్చు. కాని, వాస్తవమున భూతభవిష్యద్వర్తమానకాలములలో నెన్నడు నీశ్వరునిచే నాచరింపబడని కార్యముల నీశ్వరున కంటగట్టుట వ్యర్థము. ఎవరో

కొందఱనాలోచితముగా నీశ్వరుడు నియమానుకూలముగా నుండనవసరము లేదని యెంచి యిట్లు సమాధానములు చెప్పుచుందురు. ఈశ్వరుని స్వరూపశక్త్యాదులకు సంబంధింపని కార్యములతో నతనిని సంబద్ధపరుచుట యవివేకమేగాక, యీశ్వరుని యీశ్వరత్వమును నశింపజేయుటయగును.

---

# ఏడవ అధ్యాయము

## పాపము - దుఃఖము

ఈశ్వరుని సర్వనియంతృత్వము, సర్వశక్తిమత్త్వము నెఱింగినతరువాత నతని కళ్యాణకారితనుగూర్చి తెలిసికొన నభిలాష పొడమును. కళ్యాణమనగా మేలు-శుభము. నియమములతో శుభమునకు ఘనిష్ఠసంబంధమున్నది. శుభములకొఱకే నియమము లేర్పాటుచేయబడినవి. ప్రపంచమునగల కఠిననియమములలో కూడ శుభములు దాగియుండును. అనియమము శుభమునకు శత్రువు. పూర్వాధ్యాయములందు సృష్టిలో శుభభావము ప్రయోజనము నున్నట్లు పలుమారు వర్ణించి యుంటిమి. ప్రయోజనాదులద్వారా ఈశ్వరుడు బుద్ధిమంతుడై యుండవలయునని సిద్ధపరచి యుంటిమి. బుద్ధిమంతుడు- శక్తిమంతుడు నీయిరువురను సంస్కృతమునం జేతనశబ్దమున వ్యవహరింతురు. జ్ఞానము, ప్రయత్నము (బుద్ధి, శక్తి) రెండునుగలది చేతనమనబడును. కాబట్టి యాస్తికు లీశ్వరుని చేతనస్వరూపుడని యందురు. జ్ఞానయుక్తప్రయత్నమొకానొక విశేష ప్రయోజన మపేక్షింపక జరుగనేరదు. ప్రయోజనము కల్యాణ (శుభ) రూపమే యగును. ప్రపంచమున శుభభావము లేకున్న జీవులందరు ప్రయోజన రహితు లగుదురు. ప్రయోజనములేకున్న శక్తి, నియమము నుద్భవింపనేరవు. అందువలన నీశ్వరుడు కల్యాణకారి - శుభంకరుడనుట సిద్ధము. అథవా, దయాళుడు - న్యాయకారియనియు జెప్పనొప్పును. వీనిభావ

మంతయునొక్కటే. అవస్థాభేదము ననుసరించి భిన్నభిన్న శబ్దములు వాడబడుచుండును. వీని వ్యాఖ్యానము ముందుచూడ నగును.

సృష్టినియమములనుబట్టి శుభమునకెంతో ప్రబల ప్రమాణము లభించుచు. అందువలననే విద్వాంసులు దీని నీశ్వరాస్తిత్వమునందు ప్రమాణముగా నంగీకరింతురు. శ్రీమద్దయానందమహర్షి సత్యార్థప్రకాశమున నిట్లు వర్ణించియున్నాడు.

'ఆత్మ మనస్సును, ఇంద్రియములను చౌర్యము మున్నగు నశుభకార్యములందో, లేక పరోపకారాది శుభకార్యములందో చొప్పించి కార్యమారంభించు క్షణమున జీవుని జ్ఞానేచ్ఛాదులన్నియు నాయభీష్టకార్యమున లగ్నముచేయబడును. కాని ఆక్షణముననే యంతరాత్మలో చెడుకార్యమొనరించుచున్న భయశంకాలజ్జలు, శుభకార్యమాచరించుచున్న నిర్భయ-నిశ్శంకానందోత్సాహాదులు కలుగును. అవి జీవాత్ముని వలనగాక పరమాత్మునివలన గలుగును. జీవాత్ముడు శుద్ధుడై పరమాత్ముని విచారింప తత్పరుడగుచో నతనికాసమయమున నాత్మపరమాత్మలు ప్రత్యక్షమగును.

సత్యార్థప్రకాశమున నది యీశ్వరసిద్ధిప్రకరణము. అందువలన మనుష్యుల యంతఃకరణమునగల ఉచితానుచితముల భేదించుశక్తి యీశ్వరప్రదత్తమగుటంబట్టి యదియు నీశ్వరాస్తిత్వమునకు ప్రమాణమే యని శ్రీమద్దయానంద మహర్షి యభిప్రాయము. ఆంగ్లేయమున నీశక్తినే కాంషన్స్ (Conscience) అని అందురు.

"కొంతమంది గ్రంథకారులు మనుష్యుని యంతఃకరణముద్వారా తెలియనగు సదాచారసంబంధమగు నియమము నీశ్వరాస్తిత్వమునకు ప్రబలప్రమాణముగా నంగీకరించియున్నారు. వారిదృష్టిలో నితరప్రమాణములే యనవసరములు. మనుష్యుడు తన తర్కబుద్ధి నీశ్వరవిషయమున బ్రయోగించినకొలది భ్రమజాలమున జిక్కుకొనునని తనతర్కబుద్ధితో నిర్ణయింపనెంచిన కాంట్ (Kant) మహాశయుడే వ్యావహారికబుద్ధి, యంతఃకరణము నొసంగుసాక్ష్యముంబట్టి సందేహవాదమున కెట్టితావును లేదని యంగీకరించియున్నాడు. 'మనుష్యునిలోగల యాచారసంబంధమైన జ్ఞానప్రాప్తి నొనరించు యోగ్యతయే యీశ్వరాస్తిత్వమునకును జీవునియమరత్వమునకు నుత్తమప్రమాణము'ని సర్ విలియమ్ హేమిల్టన్ కూడ నొప్పుకొనియున్నాడు. 'డాక్టర్ జాన్ న్యూమాన్' అంతఃకరణమును ధర్మమునకు మూలాధార మనుచున్నాడు. ఇంతియగాక ప్రాకృతిక ధర్మసిద్ధాంతముల నీ ముఖ్య నియమాధారముననే నిశ్చయింపవలయుననియు నతనిదృఢాభిప్రాయము. జర్మనీలోని జీవితాస్తికవాదియైన డాక్టర్ శైంకిల్, తన సమస్తాస్తికవాదభిత్తి కంతఃకరణమునే పునాదిగా నుంచెను. అంతఃకరణ మాత్మయొక్క ధర్మసంబంధమైన యింద్రియము నియు దానివలననే మన మీశ్వరుని బ్రత్యక్షమొనరించు కొనగలమనియు నతని యారంభికసిద్ధాంతము" (ఫ్లింట్. ఆస్తికవాదము. ౨౧౦-౧౧ పుటలు.)

"అంతఃకరణమునుండి యారంభింపబడని యీశ్వరసంబంధమైన వ్యావహారిక విశ్వాసమొందుట గానరాదు. కార్యకారణవాదము సృష్టిద్వారా సూచింపబడు విశిష్టజ్ఞాన ప్రశంస మాత్రమే. అదియెల్లపుడు నీశ్వరుని ధ్యానమును మనుష్యుని హృదయమునందు స్థిరపరుపనేరదు. ఇట్లే ప్రకృతికి సంబంధించి నట్టిదో లేక మానవసమాజమునకు సంబంధించినట్టిదో యొకఘటనను విచారించినంతమాత్రమున మనుష్యుని హృదయమున నీశ్వరప్రత్యక్షముగాని, ఈశ్వరునితో దనకుగల సంబంధముగాని బాగుగా దెలియబడనేరదు. 'మనమీశ్వరునకు సన్నిహితులము. అతడు మనతోను, మన మతనితోను బరస్పరము సంబద్ధులమై యున్నాము' అను ప్రత్యక్షజ్ఞానము మనకేర్పడవలయునన్న నుత్తేజితము, వికసితమునైన యంతఃకరణము మిక్కిలి యావశ్యకము. మనలో సదాచార విషయిక జ్ఞానమే లేకున్న నీశ్వరస్వభావ సామ్రాజ్యములు శుభములో లేక యశుభములో మన మెన్నడు నెఱుగజాలము. మన మతని శక్తియొకటి కంపింపవచ్చు. అతని బుద్ధిమత్తను బ్రశంసింపనువచ్చు. కాని, యతని శుభంకరిత మనకు గోచరించి యుండదు. అతని నైతిక నియమముల నెఱుగ జాలకుందుము. మఱియు నతని సంకల్పము మనకు ప్రాకృతిక హానిలాభముల కంటె మిన్నగాకుండెడిది. కాని, శుభంకరుడుకాని, యీశ్వరు డీశ్వరుడు గాడు. సదాచారశూన్యమైన యుపాసన యుపాసనగాదు. అంతఃకరణ దర్పణమునందు మాత్రమే యీశ్వరుని కళ్యాణకారిత చూడనగును. శక్తి, బుద్ధిమత్త, మున్నగు

గుణములు మనలో భయము, ఔత్సుక్యము మున్నగు వానిని కల్పింపఁగలవు. కాని సత్యోపాసన కవసరమగు శ్రద్ధాభక్తులు అంతఃకరణము ద్వారముననే యుత్పన్నములగును. వాస్తవమున నీశ్వరాస్తిత్వసిద్ధికి నంతఃకరణమున కెంతో గూఢసంబంధ మున్నది. (ఫ్లింట్. ఆ. వా. బ. ౨౧౩.)

ఈశ్వరునిలో ననేకగుణము లున్నవని చెప్పినప్పటికి నతనితో మనకు ఘనిష్ఠసంబంధ మేర్పడుటకు గారణ మీశ్వరుడు కల్యాణకారియగుటయే. మన మతని నుపాసించిన శుభములు కలుగును. వాస్తవమున మనహృదయమునం దీశ్వరుని కల్యాణకారితాబీజములే లేకున్న మనమతనినిగూర్చి యింతగా నాలోచింపజాలము. మెఱుపులు మెఱయుట, అగ్నిముఖపర్వతములనుండి యగ్ని ప్రజ్వరిల్లుట మున్నగు ననేక విచిత్రదృశ్యములను జూచుచున్నాము; కాని, వానితో నెన్నడు నట్టిసంబంధమును గలిగింప నెంచము. అంతగా విచారింపము. బలవంతుడగు శత్రువు మనలో భయము నుద్భవింపజేయ గలడుకాని, ప్రేమ నుదయింపజేయ నేరడు. ఈశ్వరుడు శుభకరుడై శుభముల నొనరించుటచేతనే సృష్ట్యాదినుండి మానవసమాజము నత డాకర్షించుచున్నాడు. ఆస్తికుల నీశ్వరునుండి విముఖులను జేయుటకై నాస్తికు లుపయోగించు గొప్పసాధన మీసృష్టి దుఃఖపూర్ణమనుటయే. ఈశ్వరుడు దయాళుడయిన నిట్టి సృష్టి నెన్నడు రచింపడు. ఈశ్వరుడే లేడనుటకు వీరు భూకంపములను, జ్వాలాముఖపర్వతములను, అతివృష్ట్యనావృష్టులను, నానావిధ రోగముల నుదాహరింతురు. సృష్టినియమములు మానవుని నాశ

వమునకేగాని వానికి సుఖముల నందింపజేయగాదని యేమేమో చెప్పెదరు. కాని, దుఃఖిత బాలుడు పరులనుండి కలిగిన భయమును బోనాడుటకై తల్లియొడిని జేరునట్లు వ్యక్తులుగాని సమాజములుగాని తమపై సంకటము లాపతిల్లినపు డీశ్వరునే శరణు జొచ్చెనని చరిత్రలు సాక్ష్యమిచ్చుచున్నవి. ఇదియేల? మనుష్యుని యంతఃకరణమున నుచితానుచితముల నెఱుంగగల శక్తి యుండుటచేతను నది కల్యాణకరుడైన యీశ్వరునిదిశకు తన్నా కర్షించుట చేతనేగదా?

నిజమునకు, సృష్టి ప్రయోజనము లేనిదైనను, లేక మన శుభముకొఱకు ప్రయోజనము కలదైనను, ఉచితానుచితముల భేదించువాసన మెదగును? ఔచిత్యానౌచిత్యములను నిర్ణయించు నదేది? శబ్దముల భావమేమి? సృష్టికర్త విశేషప్రయోజనము నుద్దేశించి సృష్టిని రచింపకున్నయెడల సృష్టి నియమ రహితమగుటయేగాక యుచితానుచితములకు సృష్టియం దొకస్థానముండెడిదికాదు. కారణమేమన, సత్ప్రయోజనమునకు సాధకమే యుచితమనియు, సత్ప్రయోజనమునకు బాధకమే యనుచితమనియు నర్థము. సత్ప్రయోజనము దృష్టియం దుంచుకొనకున్న నుచితానుచితములు శశశృంగములే యగును. ఉచితానుచితములు భావములే కావందురేని మానవాంతఃకరణము వాని కొఱకేల ప్రాకులాడుచున్నది? ప్రకాశమే లేకున్న కన్నులేల? శబ్దములు లేకున్న చెవులేల నిర్మింపబడును? స్పర్శయే లేకున్న త్వగింద్రియ నిర్మాణఫలమేమి? మన యింద్రియములే వినిభావములను రుజువు చేయుచున్నవి. ఇట్లే మనయంతఃకరణ

మను నింద్రియము కూడ నుచితానుచితములను భావపదార్థ ములుగా సిద్ధపరుచుచున్నది. వానివలన నీశ్వరుడు శుభంకరుడని ప్రమాణీకరించు విశేషప్రయోజన మీసృష్టియందు సిద్ధమగు చున్నది.

ఇట నొకటిరెండు భయంకరప్రశ్నము లుదయించుచు న్నవి. అందు మొదటిది:- ఈశ్వరుడు దయాళుడు, కల్యాణ కారియునైన పక్షమున లోకమునందు దుఃఖమేల యేర్పడు చున్నది? సూర్యుడు ప్రకాశించుచుండ నంధకారము వ్యాపిం చుట సంభవమా? అగ్ని జ్వలించుచుండ శీతముండునా? ప్రపంచము దుఃఖాకరము కాదని యెవరనగలరు. మహామహా లయిన యాస్తికులు సైతము ప్రపంచము నిస్సారము దుఃఖ మయము నందురుగదా? దుఃఖమయమైన ఈలోకమీశ్వరునిచే నిర్మింపబడినచో దుంఃఖముగూడ నీశ్వరునిచే నిర్మింపబడి నట్లేగదా? అట్టియెడ నతడు దయాలుడు, కల్యాణ కరుడు నెట్లగును? లోకమున కొందఱు పుత్రశోకముచే నేడ్చుచుండ కొందఱు పతివియోగముచే వికలులగుచున్నారు. మఱికొం దఱు పితృవియోగముచే ననాథులై యలమటించుచున్నారు. సృష్టి నరకమునకు సాక్షాత్తుగా సాక్షియనవలయు ననిన ప్రాతఃకాలమున జికిత్సాలయములకు వెళ్ళుము. మనుష్యశరీర మున నెట్టి భయంకర రోగములు పుట్టి పీడించుచుండునో యట జూడగలవు. ఇవిగాక లోకమున నొకవంక దరిద్రత, మఱియొకవంక కలహములు, వేరొకవంక మిత్రవియోగములు, ఇవి యవి యననేల యున్నియు దుఃఖములే. అయినను ఆస్తికు

లీశ్వరుని కళ్యాణకారియందురు. అయిన దుఃఖముల నెవరుద్భ వింపజేసిరి? దుఃఖములనొకరు, సుఖములనొకరును గలిగించిరా? యథార్థమున దుఃఖమయమగు సృష్టిని సైతాను, సుఖమయ ప్రపంచము నీశ్వరుడును రచించిరా? ఈశ్వరుడింత నిర్బలుడా? అతని యిష్టమునకు వ్యతిరేకముగా సైతాను లోకమున దుఃఖములను వ్యాపింప జేయుచున్నాడే!

రెండవప్రశ్న:- లోకమున పాపమింత యధికముగా నెందులకున్నది? లోకమున ధార్మికులు తక్కువ, అధార్మికులు (పాపులు) ఎక్కువయని యాస్తికులు సాక్ష్యమీయరా? ఇట్లే సత్యవ్రతులు తక్కువ. యసత్యవంతు లెక్కువ. విశ్వాస పాత్రులు తక్కువ. అవిశ్వాసపాత్రు లెక్కువ అనరా? ధర్మ మార్గమున నడుచుట ఖడ్గధారపై నడుచుటవంటిదని యాస్తికు లందురు. అదియేల? దయాళువైన పరమాత్ముడు ధర్మమార్గ మును పుష్పమార్గముగా నేలచేయడయ్యె. అట్లయిన అందఱు ధర్మాత్ములగుట కవకాశముండడిదే? మానవులందఱు ధర్మాత్ములగుచుండ జూడజాలకపోయెనా? ఈశ్వరునకు మానవులతో నింత వైరమేల? పౌరాణికుల యమరేశ్వరుడైన యింద్రునివలె ధర్మము ననుసరించి యింద్రాసన మధిగమించు మానవులపై నీశ్వరున కింత యీర్ష్య యెందుకు? నిజముగా నీసమస్య విచారణీయమే. దుఃఖమువలె పాపముకూడ సైతాను సృష్టిలోనిదేనా? ఈశ్వరుడు తన కల్యాణకారితను నీటగలుపు సైతాను నేలసృష్టించెను? లేక, సైతాను తనముం దీశ్వ

రుని యాటలను సాగనీయని పరమశక్తిసంపన్నమైన స్వయం భూశక్తియా?

ఈ రెండును మిక్కిలి కఠినప్రశ్నలు. నాస్తికు లీశ్వరు డను నొకవస్తువే లేదనిచెప్పి వీనిని దాటబుత్తురు. ఇవన్నియు మూర్ఖమానవ మస్తిష్క కల్పనలందురు. కాని, యాస్తికులు వీనినిట్లు దాటవేయజాలరు. దాటవేసినందువలన లాభమును లేదు. వాస్తవమున నాస్తికులుకూడ నీప్రశ్నలను జాగ్రత్తగ నాలోచించుట యవసరము. నాస్తికులైనను, ఆస్తికులైనను సృష్టియందే యుండవలసియున్నారు. నాస్తికుడైనంత మాత్రమున దీనినుండి ముక్తి కలుగనేరదు. సృష్టినియమము లను బాలింపవలసియే యుండును.

కొంచెము బాగుగా విచారించినయెడల నీప్రశ్న లను కానినంత జటిలములు కావని తోపకపోదు. మొదట మేము రెండవప్రశ్నను విచారించెదము. సృష్టిలో బాపములెందు కున్నవి? వీని కీశ్వరు డెంతవర కుత్తరదాతయై యున్నాడు? మొదట పాపమననేమో విచారింపవలసి యున్నది. మనుజుడు చేయు పనులన్నియు నొకప్పుడవి పుణ్యములనియు మఱి యొకప్పుడవియే పాపములనియు జెప్పబడగలవు. స్వయముగా నేపనియు పుణ్యముకాదు; పాపమును కాదు. ఉదాహరణము కొఱకు బాఠశాలలోని పరీక్షార్థులను దీసికొనుము. ప్రయాగ విశ్వవిద్యాలయములో, బి.ఎ. క్లాసు పరీక్ష జరుగనున్నదను కొనుము. ప్రశ్నపత్రములు రిజస్ట్రార్ దగ్గరనున్నవి. నియతతిథికి నియతసమయమున నతడు వానిని పరీక్షార్థులకు బంచియిచ్చును.

పదిగంటలకు నియతసమయ మనుకొనుము. ఒకవిద్యార్థికి రిజిస్ట్రారు ప్రశ్నపత్రము నర్ధగంటముందే యిచ్చినచో రిజిస్ట్రార్ పాపమొనర్చె నందురు. పదిగంటలకా ప్రశ్నముల నీయక సమయము దాటవేసినను పాపముచేసెనందురు. స్వీకృత పరీక్షార్థికి స్వీకృత ప్రశ్నపత్రము నిచ్చుట యను కార్య మొక్కటే. కాని యొక యవస్థయందు ప్రశ్నపత్రము నిచ్చుట పాపము, ఇయ్యకుండుట కర్తవ్యపాలనము పుణ్యము నై యున్నది. రెండవ యవస్థయందు ప్రశ్నపత్రము నిచ్చుట పుణ్యమును, ఈయకుండుట పాపము నై యున్నది. ఒకేపనికి రెండువిధములగు వ్యవస్థ లేల?

ఈ వ్యవస్థాభేదము కేవలము పాఠశాలలవఱకే వ్యవస్థితము కాదు. మనుష్యజీవనమున నెల్లయెడల నిందుల కుదాహరణములు లభించును. మనుష్యుడు జీవనారంభమునుండి యంతమువఱకు నేదియో యొకపని నాచరించుచుండును. వానిలో ప్రతికర్మయు పుణ్యమో లేక పాపమో యైనదగి యుండును. ఒక్కొక్కప్పుడు సాధారణపాపములను నన్యశబ్దములతో వ్యవహరింతురు. అనగా గొన్నిటిని దౌర్బల్యమనియు, గొన్నిటిని దోషమనియు, గొన్నిటి నపరాధమనియు త్రోసిపుచ్చెదరు. వీనికి మించినవానిని పాపమందురు. కాని యివి యన్నియు పాపభేదములే. అనేకకర్తవ్యచ్యుతులను మానవసమాజము లక్ష్యపెట్టకయే విడుచుచుండును. కొన్ని కర్తవ్యములను మానవుడు పాలింపకున్నయెడల సమాజము వానిని గుర్తించియు దండింపకయే విడుచును. కొన్నిటికి మానవసమా

జన్మో, రాజ్యసంస్థయో దండించును. రాజదండనయు లభిం పని మఱికొన్ని భయంకరనేరములు మానవులచే జేయబడు చుండును. అట్టివానికిసృష్టి కంతటికి రాజైన పరమేశ్వరుడే దండనాధికారి యగును. కాని ఇవియన్నియు పాపమున కంత ర్గతములే యగును. పాపమునుగూర్చి నుడివినట్లే పుణ్యమును గురించియు జెప్పబడును. అందును జిన్నపెద్ద భేదములుండును. ఒకానొక సమయముననో, యవస్థయందో పాపమనబడునది మరియొక సమయావస్థలందు బుణ్యమనబడును.

ఏకార్యమునందును స్వతః పుణ్యపాపములు లేకున్న దానిని పుణ్యపాపమనెడు వస్తుపద్ధియని విచారించుట ఆవశ్యకమై యున్నది. వస్తుస్థితినిబట్టి యేకార్యముగాని, తాను స్వతంత్రస్థితి కలదికాదు. దానికొక నియమముతో సంబంధముండును. కార్యములును బరస్పరసంబద్ధములై యుండును. నాముక్కుగాని, నానేత్రముగాని, స్వయముగా నవి తమ కొఱకే నిర్మింపబడి యుండలేదు. వానికర్తవ్యములు శరీరావశ్యకతల నపేక్షించియుండును. శరీరము లేకున్న నేత్రములు నుండవు. అవి స్వతంత్రస్థితిగలవే యైనపక్షమున వానిద్వారాప మిప్పటికంటె విలక్షణమై యుండును. ఇట్లే కొండొక ప్రయోజనసిద్ధికై కార్యశృంఖలయొకటి యవసరమగును. ప్రపంచమున నియమము లెన్నిగలవో యన్ని ప్రయోజనములు, కార్యశృంఖలలు నున్నవి. ఒకకార్యము తనశృంఖలలో నున్నంతవరకది పుణ్యమనబడును. ప్రతికార్యము నియమరూప శృంఖలమున కవయవభూతముగా నున్న బుణ్యమగును. అట్లు కానిపక్షమున

పాపమగును. ఉదాహరణ మేమన, ఒకతల్లి తనబిడ్డ డనుచితము, హానికరము నగు కార్య మాచరించుచుండ జూచి వానిని మరల్చుటకై యొకచెంపదెబ్బ కొట్టు ననుకొనుడు. ఆదెబ్బకొట్టుట పుణ్యమగును. ఆమె నిష్కారణముగా నెవనినైన చెంపదెబ్బ కొట్టునేని పాప మాచరించినదగును. ఒకరాజొక ఘాతకునకు ప్రాణదండన విధించిన పుణ్యమాచరించినవాడగును. అతడే నిష్కారణముగా నొకవ్యక్తి నురితీయించునేని మహాపాపి యగును.

పాపపుణ్యములతో నెక్కుడు సంబంధముగల మఱియొక విషయము గలదు. అదియే కర్తృస్వాతంత్ర్యము. "స్వతంత్రః కర్తా" ఇది పాణినీయ సూత్రము. స్వతంత్రుడు కర్తయని దీనియర్థము. కర్తృకరణములలో గలభేద మిదియే. కర్త స్వతంత్రుడగును. కరణము కర్తచేతిలో పరతంత్రమై యుండును. నేను చేతితో వ్రాయుచున్నాను; లేక నాచేయి వ్రాయుచున్నది. ఇట్లు రెండువిధములగు ప్రయోగములు సాధువులేకాని, చేయి వ్రాయుటలో స్వతంత్రము కాదు. నేనాజ్ఞ యిచ్చినపు డది వ్రాయును. నిషేధించినపుడు వ్రాయ నేరదు. కాబట్టి కర్తృత్వమున స్వతంత్రత గలదు. స్వాతంత్ర్యము లేకున్న గర్తృస్థానము కరణ మాక్రమించును. రాజాజ్ఞను బొంది వధికుడు దండితునితల నుత్తరించును. కాని యతడుచితానుచితములకు బాధ్యుడుకాడు. అతని కర్తవ్యము కేవలము రాజాజ్ఞను పాలించుటయే. ఒకపురుషుడు నిర్దోషియైనను, వధికుడు రాజాజ్ఞనుబొంది యతనిని చంపకున్న వాడే

దోషియగును. దండితుని దోషాదోషములను నిర్ణయించు నధికారము (స్వాతంత్ర్యము) వధికునకు లేదు. అతడు కరణ మాత్రుడే. కాని, యతడు రాజాజ్ఞను పాలించుటా లేక పాలింపకుండుటా? యనువిషయమున స్వతంత్రుడు. పాలించెనేని నిర్దోషియగును. పాలింపకున్న దోషియగును. ఇట్లు వధికునకు స్వాతంత్ర్యమున్నంతవఱకు బుణ్యాపాపములతో నతనికి సంబంధముండును. స్వాతంత్ర్యము లేనిచోట నతనికి కర్తృత్వము లేదు. అక్కడ పాపపుణ్యములు నతని నంటవు. ఒకపురుషు డొకయంశమున స్వతంత్రుడు, మఱియొక యంశమున పరతంత్రుడు నగును. ఒకానొక రాజుగారి కారాగారమున నొకఖైదీ యున్నాడనుకొనుము. అతని కొక యపరాధమున రెండు సంవత్సరములు శిక్ష లభించినది. ఖైదీ యగుటవలన ఖైదీలు చేయదగిన పనులలో నతడు పరతంత్రుడు. గొంగళ్లు నేయుట, తిరుగలి త్రిప్పుట, మలమూత్రములను శుద్ధిచేయుట మున్నగు కార్యములలో నతడు పుణ్యాపాపములకు భాగి కాడు. జైలరు పిండివిసురుమనిన నతడు సరే యనును. ఇందు ఖైదీ కర్త కాక కరణమే యగును. జైలర్ గొంగడినేయుటకు బదులు పిండివిసిరించిన నందలి దోషము జైలరునకే గాని ఖైదీకేమియు నుండదు. కాని జైలర్ ఆజ్ఞల నంగీకరించుటలోను అంగీకరింపకుండుటలోను ఖైదీ స్వతంత్రుడే. అందువలన స్వాతంత్ర్య మున్నచోట నతనికి కర్తృత్వము నుండును. ఇట్లొక మనుజున కొకపనిచేయుటకుగాని చేయకుండుటకుగాని స్వాతంత్ర్య మున్నది. ఆతడాపనిని బ్రయోజనసిద్ధికొఱ

కుచితమని యెంచియు చేయకున్నయెడల పాపమగును. తద్విప రీతము పుణ్యమగును.

నాస్తికులలో ననేకులిట మనుష్యసమాజ ప్రబంధోదాహరణములను ఈశ్వరుని విషయమై యేల యుదాహరించుచున్నారు? ఈశ్వరుని యెడల నిట్లే పుణ్యపాపములు వర్తించునా? యందురు. దీనికి సమాధాన మేమన పుణ్యపాపముల సమస్య నాలోచించునపుడు మనుష్యసమాజమునుండియే వీరారు నుదహరింతురు గదా? ప్రపంచమున బాపాధిక్య మేల? అని ప్రశ్నించినపుడు దానిని రుజువుపరచుటకు మానవ ఘటనాతిరిక్తమయిన శోధకసాధన మేమున్నది? వాస్తవమున పాపపుణ్యముల నిట మేమేవిధముగా నుదాహరణముల ద్వారా వివరించితిమో యింతకంటె మిన్నగా నెవరు నేదేశ కాల పరిస్థితులందును నిర్ణయింపజాలరు. పాపపుణ్యశబ్దముల నెవరు ప్రయోగించినను యిట్టియర్థములందే వాడియున్నారు. కాబట్టి మానవసమాజము నుండి యుదాహరణముల నిచ్చి ఈప్రశ్నల నుద్ధరించితిమేని యందుగల దోష మావంతయు గానరాదు.

పైకర్యుక్త పాపపుణ్య లక్షణముల ననుసరించి రెండు విషయములు తెలియనగుచున్నవి.

(౧) మనుష్యుడు తనపనులకు ప్రయోజనరూప శ్రేయముగ స్థానము వెదకగలడు; అనగా నేకార్య మేప్రయోజనము సిద్ధింపజేయునో యతడెఱుగ గలిగియుండును.

(౭) ఒకానొక కార్యము నాచరింప మనుష్యునకు స్వాతంత్ర్యమున్నది. మొదటివిషయమున నొక ప్రశ్న గలుగ వచ్చును. దాని నిటనే వివరించుట తగును. ఒకానొక విశేష ప్రయోజనమునకు సాధకము పుణ్యము, బాధకము పాపము నగు నెడల ప్రతికర్మముయొక్క యౌచిత్యానౌచిత్యములను నిర్ణయించుటకు దానిపరిణామముపై నాధారపడవలసి వచ్చును. ధర్మము, సదాచారము సాపేక్షకములగును. నిరపేక్షకములు కానేరవు. ప్రత్యధార్మికుడును తనయుధర్మమును జూడ తన ప్రయోజనసాధకమగుటచే ధర్మముగా నెంచును. ఆంగ్లేయమున నొకసామెత కలదు. సాధ్యమే సాధననిర్ణాయకము. (End justifies means) ఈ లోకోక్తి ప్రపంచమున నెంతయు దురుపయోగము చేయబడినది. అందువలన నది కలంకితమైనది. సామాన్యజనులకు నభీష్టప్రయోజన సాధకమే పుణ్యమని తెలిసినయెడల నసత్యములు, భయంకరహత్యలు, మేర లేని యత్యాచారములు, నన్నియు ధర్మములే యగును. మనుష్యసమాజమున భయంకరపశుత్వము రాజ్యమొనర్ప నగును.

ఈ స్థానమున నీ ప్రశ్నను విస్తారముగా మీమాంసించుట యప్రాసంగిక మగును. కాని ధర్మాధర్మ వ్యవస్థ క్షుద్ర ప్రయోజనములద్వారా సిద్ధింపదను సమాధానము పర్యాప్త మగును. ఒకొక్కప్పుడు అసత్యభాషణము చిన్న చిన్న ప్రయోజనములకు సాధనము కావచ్చు. సత్యము బాధకము కావచ్చును; కాని, యల్ప ప్రయోజన మధిక ప్రయోజనమున

నంశమగును. ఒకచో నొక యల్పప్రయోజనము సిద్ధించిన నది ముఖ్యప్రయోజనమునకు బాధకమగుచో నధర్మమే యన బడును. ఒక మనుష్యుడు రోగగ్రస్తు డయ్యె ననుకొనుడు. అతని యభీష్టము రోగనివృత్తి. కాని, యతనిమనస్సు హానికర మగు వస్తువు తిన నుద్యుక్తమయ్యెను. ఇప్పుడు రోగనివారణ రూప ముఖ్యప్రయోజనమునకు మధ్య గౌణప్రయోజనము సంభవించినది. కాని, యీగౌణప్రయోజనము కొఱకు ముఖ్య ప్రయోజనము విడుచుట పాపమే యగును. పుణ్య మెంత మాత్రమును కాదు. పాపపుణ్యముల వ్యవస్థ జీవనోద్దేశమును బట్టి నిర్ణయింపబడును. కాబట్టి యివి సాపేక్షికములు. అపేక్షిత వస్తువు సామాన్యదృష్టి కందుబాటులో లేనిది. సామాన్య మను జుడు దీని నెఱుంగజాలడు. కాబట్టి సామాన్య మనుష్యులకు నిరపేక్షిక ధర్మమే బోధింపః బడును. అంతిమ ముఖ్యప్రయో జనమును దృష్టియం దిడుకొని పుణ్యాపుణ్యములను నిర్ణయిం చుట సామాన్య మానవుల కందుబాటైన విషయముగాదు. అందువలననే యీ కార్యమును నిష్పాక్షికులు, జ్ఞానులునైన పురుషుల యధీనమొనర్చి యున్నారు. వారినే శాస్త్రకారు లాప్తులందురు.

"ఆప్తోపదేశః శబ్దః"

అంతిమోద్దేశమును సదా దృష్టియం దిడుకొని వ్యవహ రించువారే యాప్తులు. ఉపనిషత్తునం దొకచో మైత్రేయి

"యేనాహం నామృతాస్యాం తేనాహం కిం కుర్యామ్"

అమృతప్రయోజనమును సిద్ధింపఁ జేయనిదానితో తనకేమి

ప్రయోజనము? అనును. కాని ప్రపంచములోని వారందరు మైత్రేయి కాజాలరు. అందువల్లనే వారికి నిరపేక్ష ధర్మమే యుపదేశింపబడినది.

(సత్యంవద- ధర్మంచర) సత్యము చెప్పుము. ధర్మమాచరింపుము.

కాని ప్రపంచమున వ్యవహారముననున్న దుఃఖమును గాని, పాపమునుగాని మీమాంసింప నెంచితిమేని అపుడు మనకు ప్రశ్నతలమున కేగక తప్పదు. కాబట్టి జీవనము యొక్క యంతిమ ఉద్దేశమును పూర్తి చేయునదియు, కర్తృ స్వాతంత్ర్యముగలదియు పుణ్యమని చెప్పుచుంటిమి. ఈ రెండు షరతులు నావశ్యకములే. ఇందు స్వాతంత్ర్యము ముఖ్యము.

ఇప్పుడు మూలప్రశ్నను తీసికొనుడు. ఆక్షేప మేమన, ప్రపంచమున నీశ్వరుడేల పాపమును సృష్టించెను? ఈప్రశ్నకు రూపాంతర మిట్లగును.

ఈశ్వరుడు మనుష్యున కంతిమోద్దేశపు జ్ఞానము, దాని సాధనములను పొందుటకు, పొందకుండుటకు స్వాతంత్ర్య మేల యిచ్చెను?

సృష్టినొనర్చుటకు పూర్వము మన యీప్రశ్నకర్తలను 'మీరుసంతుష్టులగుటకై సృష్టినెట్లు రచింపవలయును?' అని యీశ్వరుడు ప్రశ్నించెననుకొనుడు. అట్టిచో స్వాతంత్ర్య విషయము న వీరప్రసన్నులు నసంతుష్టులు నయి యుందురని తోచు చున్నది. కనుక నర్థాపత్తివలన వీరు పరతంత్రతాపక్షమును

ప్రేమింతురని సిద్ధమగుచున్నది. ఇంతకంటె మధ్యమమార్గము మఱియొకటి లేదుగదా?

సామాన్యజనులు సృష్టియందు పాపముండక పుణ్యమే యుండునట్లీశ్వరుడు రచించియున్న నెంతో బాగుండెడిదని యెంచెదరు. అనగా నర్థమేమి? ఈశ్వరుడు మానవుని స్వతంత్రునిగా విడువకున్న వారు తమస్వాతంత్ర్యమును దురుపయోగము చేయరనియేకదా! కాని, యిట్టిసృష్టియందును మన నాస్తికసోదరులు సంతుష్టులుగా నుండరని యాలోచన వలన దెలియగలదు. అప్పుడు వారు 'ఈశ్వరు డెట్టి క్రూరుడు? సృష్టిని కారాగార మొనర్చినాడు. మనకు కన్నులతో స్వేచ్ఛగా జూడ స్వాతంత్ర్యములేదు. కాళ్ళతో నడువవీలు లేదు.' అని యాక్షేపింప దొడంగుదురు. కన్నులకు గంతలు కట్టఁబడి కష్టపెట్టఁబడుచుండక యేమి ముక్కుసూటిగా బరువెత్తు బండి గుఱ్ఱమువలె మనుష్య మహాశయు లుందురు. ఆ యవస్థయందీ నాస్తిక వర్గమునకు నిట్టి ప్రశ్న నొనరించు స్వాతంత్ర్యము మాత్ర మెక్కడ లభించును? స్వరాజ్యప్రాప్తి కొఱకై యాలోచనాదులు పలుపుటకుగాని, బుద్ధినివినియోగించుటకుగాని, కన్నులు తెరచుటకుగాని యాజ్ఞ లభింపని స్వదేశ సంస్థానము పగిది వారి యవస్థ యెంతయు శోచనీయమయి యుండును.

ఇట్టి యవస్థ కొందఱికి ప్రియకరమగుట యసంభవము కాకపోవచ్చు. పారతంత్ర్య మందఱికి నప్రియమగుటచే ప్రపంచము దీనిని సహింపనేరదు. కాని విలాసప్రియతను ఆల

స్యమును అభ్యసించు మనుష్యులు పారతంత్ర్యమును గూర్చి ప్రేమింతురు. దీర్ఘకాలము గారావాసమునందున్న మానవులు చాలమంది కారాగారము విడిచిన దుఃఖింతురు. కాని, మనుష్యుడు స్వభావతః మాత్రము పరతంత్ర ప్రియుడు కాడు. ఒకప్పు డెవడైనను పారతంత్ర్య మనుభవించుచున్న నందుల కేదో నిమిత్త ముండియుండును. వాస్తవమున మనుష్యుడననేల పశుపక్ష్యాదులును బరతంత్రములై యుండ నిచ్ఛగింపవు.

ఇంతకంటె గంభీరముగ విచారింతుమేని మఱియొక విలక్షణ ప్రశ్న యుపస్థితమగును. మనుష్యుడు పరతంత్రుడే యైనచో అతని జీవనోద్దేశ మేమగును? మఱియు నది దేని నపేక్షించి కలుగును? మనుష్యునకు దన యపేక్షవలననా? లేక ఈశ్వరాపేక్షవలననా? ఈశ్వరు డెప్పుడును దనకొఱ కేమియు నాచరింపడు. దీనింబట్టి యీశ్వరున కేప్రయోజనమును సిద్ధింపదు. అట్టిచో బరతంత్ర మనుజుని ప్రయోజనము నిర్ణయించున దెవరు? అది యెట్లు సిద్ధించును? ప్రయోజనమే లేకున్న గార్యము లెందుకు జేయబడును? నాకొక విశేషస్థానమునకు వెళ్ళవలసిన పని లేకున్న యాత్రాకష్టమును నేనేల సహింతును? మఱియొక యుదాహరణమును గైకొనుము. అధ్యాపకుడు శిష్యులకు శిక్షనొసంగును. అతడు ప్రతిదినము పరీక్షించును. శ్రేణియందు యేబది మంది విద్యార్థులున్నారు. వారికి బ్రశ్నపత్ర మీయబడినది. ఏబదిమందికి నుత్తరములను వ్రాయుటకును, వ్రాయకుండుటకును స్వాతంత్ర్య మున్నది. ఉచితమైన జవాబులను గాని, అనుచితములైనవిగాని వ్రాయవచ్చు. కాని, యుచితమైన

యుత్తరములను వ్రాసినవారు ఉత్తీర్ణులగుదురు. అన్యులను త్తీర్ణులగుదురను నియమము మాత్రమొండుగలదు. విద్యార్థులందరు జవాబులను వ్రాయుదురు. కొందఱు సరిగా వ్రాయుదురు. కొందరు సరిగా వ్రాయరు. ఒకని జవాబు నందొక దోషము, మఱియొకనిదానిలో ననేక దోషములు నుండును. ఒకడు వందల కొలది యశుద్ధులను వ్రాయును. అట్టియెడ మన నాస్తికమహాశయులందురుగదా? "ఇది యెంత చెడ్డ నియమము! విద్యార్థుల కుచితానుచితోత్తరముల వ్రాయుటకై స్వాతంత్ర్యమేల యీబడెను? అధ్యాపకుడే యందరిచే నుచితోత్తరముల నేల వ్రాయింపక పోయెను? అశుద్ధులే లేకుండెడివి గదా?"

ఈ యాక్షేప ముచిత మగునా? పారతంత్ర్యముద్వారా సంపాదించిన శుద్ధపత్రములన్నియు విద్యార్థులకు హితకరము లగునా? విద్యార్థులకు బహిశ్రమము తప్పుననుట నిస్సందిగ్ధము. కాని, వారిని మనము విద్యార్థులని వ్యవహరింపగలమా? వారు రాతిముక్కలవలె జ్ఞానరహితులు, క్రియారహితులును కారా? వారికిని వారు కూర్చుండు బల్లలకును భేద మేమి యుండును? ధర్మాధర్మ మార్గములలో నొకదానిని త్యజించి యొకదాని నవలంబించుటకై, జ్ఞాన మవసరమగుచున్నది. అట్లు చేయకున్న జ్ఞానక్రియల యస్తిత్వము నిష్ప్రయోజనమగును. పాఠశాలలో విద్యార్థులకు స్వాతంత్ర్యమే లేక యధ్యాపకు డుత్తమోత్తమ సమాధానముల నే వ్రాయించినచో పాఠశాలలు తెరుచుట, పరీక్షించుట, సమాధానము వ్రాయించుట మున్నగు క్రియల ప్రయోజన మేముండును?

వాస్తవమున మనకు స్వాతంత్ర్యమే లేకున్న మనలో నీ భేదమే కలుగదు. జ్ఞాన ముండదు. కార్యకరణాభిలాష యుండదు. అట్టిచో మనమేల యుందుము ? ఈసృష్టి యేల యుండును?

ఈశ్వరుడు మనుష్యునకు పాపము చేయ నేలయాజ్ఞా పించునని ప్రశ్నించు కొందఱు మహాశయు లీశ్వరుడు పాపము చేయ నాజ్ఞాపింపడనియు, పాపము సహింపడనియు నెఱుగరు. పరీక్షార్థియు నుచితసమాధానమును వ్రాసిన నధ్యా పకుడు వానిచే నట్లు వ్రాయించెననిగాని, అనుచితసమా ధానమును సహించుననిగాని, యెంచుట వెఱ్ఱితనమగును. ఉచిత సమాధానముల నొసంగువానితో బాటు అనుచిత సమాధానములనిచ్చు పరీక్షార్థినిగూడ నుత్తీర్ణునొనర్చె నేని నధ్యాపకు డాజ్ఞాపించినట్లును, సహించినట్లును, నెంచవలసి యుండును. అధ్యాపకుడు తన వాక్కర్మలద్వారా యనుచిత సమాధానముల నొసంగువాడు అనుత్తీర్ణుడగునని ప్రకాశముగా చాటుచుండ నతడాజ్ఞాపించెనని గాని యనుచితోత్తరములను సహించెననిగాని దోషినొనర్చు టెట్లు పొసగును?

అట్లే యీశ్వరుడు పాపపుణ్యముల నెఱుంగగల జ్ఞాన సాధనముల నొసంగి, పాపమొనర్చిన దుఃఖరూపమునను, పుణ్యమొనర్చిన సుఖరూపమునను ఫలముల నిచ్చుచుండ నతడు పాపమొనర్ప నాజ్ఞాపించినట్లును పాపమును సహించి నట్లును దోషారోపమొనర్చుట యన్యాయమేగాక దర్శన శాస్త్రముల దురుపయోగ మొనర్చుట యగును. మను

ష్యుడు కర్మనాచరించుటలో స్వతంత్రుడు. ఫలప్రాప్తియందు బరతంత్రుడు నైయున్నాడు. స్వాతంత్ర్య మతని యున్నతి కావశ్యకము. ఈశ్వరుడు పాపములను సహింప డనుటను ఫలపారతంత్ర్యము సూచించుచున్నది. అందు వలన గర్మచేయు టయందలి స్వాతంత్ర్యము, ఫలప్రాప్తియందలి పారతంత్ర్యము, రెండును మానవునకు హితకరములే.

ఈశ్వరుడు జీవుల నన్నివిధముల ధర్మాత్ములగు నట్లేల సృష్టింపడయ్యెనని కొందఱు ప్రశ్నింతురు. అంధుని బిలువ కున్న నొకని కిరువురేల రావలసివచ్చెదరు? వాస్తవమున నీ ప్రశ్న మాస్తికులలోగూడ ననేకులను భ్రమింపజేసినది. ఫ్లింట్ మహాశయు డీ విషయమున నిట్లు వ్రాయుచున్నాడు.

“ఈశ్వరుడందరిని ధర్మాత్ముల నేల చేయులేదని నీవడిగిన నేను సమాధాన మొసంగజాలను. ఆప్రశ్నకు సమాధానమే కుదరదు. దానివలన లాభము లేదు. ఈశ్వరుడు మానవుల నేల దేవదూతలతో సమానులనుగ సృష్టింపలేదని ప్రశ్నింతువేని వారికంటె నుత్తములుగా నేల సృష్టింపలేదనియు ప్రశ్నింపగలుగుదువు. ఇట్లనవస్థాదోష మాపాదించును.”

ఫ్లింట్ మహాశయుని యాస్తికతయే విలక్షణమగుటచే నతడిట్టి నిస్సారసమాధాన మొసంగెను. వారియాస్తికత నిష్ప్రామాణికము. వారీశ్వరుని మాత్ర మనాదిగా నెంతురు. ఈశ్వరుడే జీవాది సృష్టినంతయు స్వయముగా రచించెను. ఇట్లగుచో నాస్తికులు ‘నిత్యకలహములు, పాపము ప్రసరించునట్టి సృష్టి నీశ్వరుడేల సృష్టించెను?’ అని ప్రశ్నించుట సము

చితమే యగును. కారణమేమన, ఈశ్వరుడన్నిట స్వతంత్రుడే గదా? ఈశ్వరునికంటె భిన్నయగు ప్రపంచమే లేదుగదా? ఈశ్వరుడు తనగౌరవమును ప్రకటింప సృష్టినొనరించె నేని నెవరికి దనగౌరవమును ప్రకటించును? ఇట్టి యీశ్వరాస్తిత్వమును నిరూపించు ప్రమాణ మొండును గానరాదు. మేముకూడ నీపుస్తకమున నిట్టి యీశ్వరుని సిద్ధపరచి యుండము. సృష్టి నియమములద్వారా, పరమాణువులను జీవులను సృష్టిరూపమున బరివర్తింపజేయు నొక విశిష్టసత్త్వమే యీశ్వరుడని మేమిందు నిరూపించి యుంటిమి. ఈశ్వరుడు జీవులను సృష్టింపడు. వానిమేలుకొఱకు సృష్టిని మాత్రము రచించును. వానియున్నతి కనువగు సాధనముల నుత్పన్నము చేయును. ఈశ్వరుడు జీవులలోనుండి ధర్మమునకై ప్రేరించును. మఱియు సన్మార్గమును విడిచినపుడు తండ్రి బిడ్డనువలె దుఃఖరూపమున దండించును. దానివలన జీవులు మరల సన్మార్గమునకు వత్తురు. ఇందీశ్వరున కెట్టి యభీష్టమును లేదు. అతడు తన గౌరవమునకో, యానందమునకో లేక యన్యస్వార్థముకొఱకో సృష్టిని రచింపడు. జీవులు, పరమాణువులు నీశ్వరునివలె ననాదులు. కాని యీశ్వరు డధిపతి. మిగిలినవి వాని యధీనములై యున్నవి. పరమాణువులు జడములు. జీవులు చేతనములు. ఈశ్వరునియందపూర్ణత లేదుకాబట్టి యతని కున్నత్యవనతులతో సంబంధము లేదు. పరమాణువులు జడములు కనుక వానికి నీసమస్యతో సంబంధముండదు. ఇది జీవులకు మాత్రమే వర్తించును. వారు పుణ్యమాచరించుచు నున్నతి నందగలరు. పాపమాచరించుచు

నవనతిని బొందుదురు. పరమాణువులద్వారా జీవుల శరీరములను, వాని పాలనపోషణములకు వలయు నన్యపదార్థములను సృష్టించుటయే ఈశ్వరకృత్యము. ఇదే సృష్టిప్రయోజనము. ఇదే సృష్టిరచనోద్దేశము. జె ఎస్. మిల్ మహాశయుని వాక్యము నొకదానిని మేము మూడవ యధ్యాయమున నుల్లేఖించి యుంటిమి. దానియం దతడు 'ప్రపంచమున నొక స్థాయితత్త్వము, మఱియొక యస్థాయితత్త్వము నున్నద'ని చెప్పియున్నాడు. జీవులు, ప్రకృతి,పరమాణువులు స్థాయితత్త్వములు. జీవశరీరములు అస్థాయితత్త్వములు. ఈశ్వరుడు స్థాయితత్త్వములను నిర్మించువాడే కాడు. వానిపై శాసన మొనర్చును. అతడు వానిని నిర్మింపడు, నష్టపరుపడు. అతడు తాను నిర్మించిన దానినే నష్టపరుపగలడు ఈసిద్ధాంతము నంగీకరించు నెడల 'ఈశ్వరు డందరిని ధర్మాత్ములుగా నేల చేయడయ్యె' నను ప్రశ్నయే కలుగదు. జీవు లీశ్వరునివలె ననాదులయియుండ వానిస్వభావముల నతడెట్లు మార్చును? అతడు కేవలము వాని యున్నతికొఱకై సృష్టి నొనరింపగలడు. తద్ద్వారా జీవులు పరమోన్నతిని బొందగలుగుదురు, జీవులు పరమేశ్వరునిచే దమ యున్నతికై యొసంగబడిన సాధనముల వలన లాభమును పొందకున్న నందీశ్వరుడు చేయునదేమి?

వాస్తవమున మనము బాగుగా విచారించిన నీసృష్టికంటె మించి జీవుల యున్నతికి సాధనము కాదగు సృష్టి మరియొండు నిర్మింపబడ నేరదని తెలియగలదు. జీవునకు జ్ఞానమవసరము. కాబట్టి యతనికి పంచజ్ఞానేంద్రియము లొసంగ

బడినవి. ఇంద్రియానుకూలమయిన విషయములు నొసంగబడెను. సృష్టియందు రచింపబడిన దంతయు జీవుల మేలు కొఱకే. లోకులు పాపబీజమని యెంచు స్వాతంత్ర్యము పుణ్యమున కాధారశిలవంటిది. ఈ స్వాతంత్ర్యము నవలంబముగా గైకొనియే మానవుడు ధర్మాత్ముడగుట కుద్యమించును. ప్రపంచమున ధర్మాత్ముడగుటకు కావలసినంత ప్రేరకసాధనములు లేవనుట యసత్యము. వాస్తవమున ప్రపంచమంతయు మనలను ధర్మాత్ములగుటకే ప్రేరించుచున్నది. ఈశ్వరుడు మనలను స్వతంత్రుల నొనర్చుటయేగాక మనమార్గముల కిరుప్రక్కలను వానిని దొలగకుండుటకును, తొలగినను విశేషహాని కలుగకుండునట్లును ముండ్లకంచెలను నిర్మించియున్నాడు.

మనలను సత్పథమున నుంచుటకు మన యంతఃకరణమే యన్నిటికంటె పూర్వ ముపస్థితమై యుండును. దానినే పరమర్షి దయానందుడు పరమాత్ముని యుపదేశ మనుచున్నాడు. నిజముగా నంతఃకరణ మెంత పెద్ద రక్షకము! ప్రపంచమున నెందరో జీవు లీయంతఃకరణపు మాటలను వినియే సత్పథమునుండి విచలితులు గాకైరి. భవసాగరమున నీదులాడు జీవన నౌక కిదియొక గొప్ప జ్యోతిస్తంభము(Light House) దాని సహాయమున పాపమను కొండల తాకిడినుండి తప్పించుకొన వీలగును. పతితులగు వారికి జేయూత యంతఃకరణమే. అంతఃకరణము మనకు ధర్మాధర్మముల నుపదేశింపకున్న మన మెంతటి పాపపు గర్తలోబడెడి వారమో చెప్ప నేరితరము? ప్రపంచమునగల యుపదేష్టలు పరిశ్రాంతులైనపుడు, సమస్త

ప్రాకృతిక ప్రకాశ మస్తమించినపుడు, అంధంతమరాత్రులందును, ఘోరారణ్యములందు మనుష్యుల యంతఃకరణము తన యూతుల ప్రకాశముద్వారా మనుజునకు సన్మార్గమును జూపును. లెక్కవేయగలిగినచో నూటికేనలుగు రైదుగురో యీ ప్రకాశమును జూడనివారు లభింపగలరు. ప్రపంచమున నెక్కరీయంతఃకరణోపదేశములను వినియే యసత్యమార్గమునుండి తొలగుదురు.

అంతఃకరణజ్యోతిని తిరస్కరించునట్టియు, ప్రపంచమును పాపపూరితమని యంగీకరించునట్టియు నోమానవులారా! పాపుల హృదయమున ప్రవేశించి చూచితిరా? అక్కడ నేమి జరుగుచున్నదో. మీరెన్నడైన దుర్బలాతి దుర్బలులు, నీచాతి నీచులు నైన మానవుల మనోగతిని నిరీక్షించితిరా? నిరీక్షించిన సత్యము చెప్పుడు. వారి యంతఃకరణము వారినెన్నడు పాపమునుండి రక్షింపదా? వారిదగ్గర నంతఃకరణరూపమగు నస్త్రము లేకున్న వారెంతటి పాపులై యుందురోకదా? ప్రపంచమున పాపము రాజ్యమొనర్చుచున్నదనువారు ప్రమాదమొనర్చుచున్నారు. అతిపాపియు నధికసమయము పాపమునకై వెచ్చింపనేరడు. నూటికి బదికార్యములను గొండొకపురుషుడు పాపమయమొనర్చెనేని సమస్తప్రపంచ మతనిని ఘృణితదృష్టితో జూడనారంభించును. అతడు తనజీవితమునే భారముగా నెంచవలసినవాడగును. ఎందువలన? ధర్మప్రచారమునకై సృష్టి రచింపబడినందువలననే. తోటచుట్టు నుండు ముండ్లకంచెను చూచి తోటయంతయు ముండ్లపొదలని యెంచువారు మతిమంతు లగుదురా?

పామరులారా! ప్రపంచమున ముండ్లున్నచో నవి మిమ్ములను పాపములనుండి రక్షించుటకే. పాపమున లీనము జేయుటకు గాదు. వ్యక్తులయు, సమాజములయు హృదయమున బాపముగూర్చి యింతటి జుగుప్సయేల? పాపియొకడు ప్రబలుడగుచుండ జూచి మన మేల విద్రోహమొనర్చుచున్నాము? ప్రపంచమాతయు సదాచార మపేక్షించుటయే యింతకు గారణము. సదాచారము మీాదనే ప్రపంచ స్థితియున్నది. సృష్టిరచనోద్దేశము సదాచారము. ప్రపంచ నియమము లన్నియు మనలను సదాచారము వంకకే నడుపుచున్నవి. ప్రపంచమున స్వతంత్రత యున్నచో నదియు జనులకు ధర్మమూల్యము బోధపడుటకే. పాప మొకింత లోకమున నున్నయెడల నదియు బుణ్యముతో దులదూగి పుణ్యజ్యోతిని బాగుగా బ్రకాశింప జేయుటకే.

పాపవిషయమున లోకమున నత్యుక్తి యున్నట్లు దుఃఖ విషయమునను గలదు. ఈశ్వరుడు మంచివాడైన లోకమున దుఃఖ ముండరాదని లోకులెంచెదరు. పాపవిషయమున వ్రాసిన దానినిబట్టి పాఠకు లీశ్వరుడు మంచివాడే యని తెలిసికొని యుందురు. ప్రపంచమునగల దుఃఖముకూడ నట్లే యీశ్వరుని మంచితనమును బోధించుటకేయని యెఱుగవలయును అది వాని దయను సూచించునదేగాని నిర్దయనుగాదు. ఈ దుఃఖము మనుష్యుని పాపమునుండి రక్షించుచున్నది. పాపపరిణామము దుఃఖము కాకున్న పుణ్యమున కున్నతి యెట్లుకలుగగలదు. ఒక మంచి రాజుయొక్క రాజ్యమున దండనాలయములు, కారాగారములు నున్నవనిన వాని స్థితికి రాజుగారి సదయతయే కారణ

ముగాని నిర్దయత కానేరదు. కాని వాని పరిమాణము సీమనుల్లం
ఘింపరాదనుట సత్యము. సర్వదా దండాభావమున నరాజ
కత కలుగునట్లు దుఃఖాభావమువలన నున్నతియు గలుగ
నేరదు.

దుఃఖమును మీమాంసించితిమేని మనకా దుఃఖము రెండు
విధములని తోచును. ఒకటి యున్నతికై ప్రేరేపించును. మరి
యొకటి పాపమునుండి రక్షించును. మొదటిది దుఃఖమే కాదు.
అప్పుడప్పుడు మనుష్యుడు తన యావశ్యకతలనే దుఃఖమను
చుండును ఆకలియగును, దప్పికకలుగును. వస్త్రములు చిరిగి
పోవును; క్రొత్తవికావలసి యుండును. ఇవి యనాయాసముగ
లభించిన, మనుష్యుడు తాను సుఖమనుకొనును. వానికొరకు
గాళ్లుచేతులాడించి పరిశ్రమ మొనర్పవలసియున్న దుఃఖమను
కొనును. ఆవశ్యకతలను పూర్తి మొనర్చు సాధనసామగ్రుల
యనుపస్థితిని దుఃఖమని యెంచుట పొరబడుట గాక మరే
మగును? వీనిని సంపాదించుటకై కాలుచేతు లాడింపకున్న మను
జానకు బనిచేయవలసిన యవసరమేమి? పనిచేయకున్న వానిలో
శక్తులు వికసించుటెట్లు? ప్రయోగించు నవకాశమున్నపుడే
శక్తులు వికసించును. సామగ్రులు సిద్ధముగాలేనపుడే శక్తు
లను ప్రయోగింపవలసివచ్చును. ధనికులు, సంపత్తికాలురు
విషయభోగములందు చిక్కుకొని తమ శక్తులను శీఘ్రముగానే
నష్టపరుచుకొందురు. ఇందులకై వ్యక్తులు, జాతులు, సామ్రాజ్య
ములు, వ్యాపారులు నెల్లరు నుదాహరింపదగియే యున్నారు.
తివాసమే యిందుకుసాక్షి. ఎవరిజీవనము సంగ్రామసంకటమున

చిక్కియుండనో వారే లోకమున నున్నతి నందిరి. సుఖనిద్ర నందువారు నిద్రనుమించి వారు చేయునదేమియు లేదు. ధనాఢ్యుల ధనాఢ్యతాచరిత్రమును దిలకింపుము. వారి పూర్వులు దారిద్ర్యముచే బీడితులై పరిశ్రమశీలురైరి. అలఘుప్రయత్నములనొనర్చి ధనమును సేకరించిరి. ఇప్పుడు వారి సంతానముల స్థితియేమి? వారిలో వారిపూర్వుల తపోబలమున్నదా? వారివలె పురుషార్థమొనర్ప గలరా? సుఖములన్నియు ననాయాసముగ ప్రాపించు నెడల ఉన్నతినొనర్చుటకు సాధనమొక్కటియు నుండదు. సంగ్రామరంగమున యుద్ధమాడువారికే విజయము లభించును. కష్టములను సహించువారికే యశస్సు లభించును. సంగ్రామమున పోరాడుట, కష్టసహనము, దుఃఖములుగావు. సుఖపూర్వరూపములు. వీని దుఃఖమనుట పెద్దపొరపాటు. ఆల్ఫ్రెడ్ రసెల్ వాలెస్ తనజీవనజగత్తు (The world of life) నందు దుఃఖమును విస్తారముగా మీమాంసించియున్నాడు. అతడు నాస్తికుల యాక్షేపముల నాలోచించుచు నిట్లు వర్ణించియున్నాడు.

'ప్రపంచమున దుఃఖమునుజూచి మన కేవగింపుకలుగును. కాబట్టి సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, దయాళుడు నగు నీశ్వరునిచే సృష్టి రచింపబడియుండదని చెప్పెదము'

కాని యితడీమతమును స్వీకరింపడు. ఈశ్వరునిపై దండెత్తునట్టియు, ప్రపంచమున సుఖకిరణములను జూడనేరనట్టియు, పరిణామవాదుల విషయమున నువ్యక్తమహోదయుడే యిట్లు నుడివియున్నాడు.'

'ఈ లేఖకులు, పరిణామవాదులు నెన్నడు దుఃఖమూలము నుచేర యత్నించియుండరు. దుఃఖము వికాసమునకెంతో యవసరమని వారెఱుగరు. ప్రాణివర్గమున దుఃఖము నుత్పన్నముచేయుటకాక విశేష ప్రయోజనమున్నదనియు వారికి దెలియదు. వాస్తవమున నుపయోగమున్నంత పరిమాణముననే లోకమున దుఃఖమున్నది'. (జీవనజగత్తు. పు. ౩౭౨.)

తరువాత నతడిట్లు వ్రాయుచున్నాడు.

'ఒక నియమమునుగూర్చి డార్విన్ విశేషముగా బలపరచి యున్నాడు. అదియేమనగా ఇంద్రియము, శక్తి-లేక వేదన యనునవి యొకప్రాణియందు దాప్రాణికి సంబంధించిన జాతి కుపయోగము కలుగనంతవఱకు జన్మింపవు. కాబట్టి ప్రతిప్రాణివర్గమునందును దుఃఖముకూడ దానికవసరమైనంతయే యుత్పన్నమై యుండును. అంతకంటె నెక్కువ యెన్నడు నేర్పడియుండదు'. (జీవన్ జగత్)—పు. ౩౭౯.

ఈవిషయమునే ఫ్లింట్ మహాశయు డిట్లు లిఖించియున్నాడు. 'దుఃఖము ప్రయత్నమునకు ప్రేరేపించును. ప్రయత్నముద్వారా మనశక్తులు నియమితములు - వికసితములును గాగలవు. కోరిక యావశ్యకతను దెలిసికొనును. ఆవశ్యకతానుభవమే దుఃఖము. కాని జీవులలో నిచ్ఛలు, వానిద్వారా కలుగు ప్రయత్నములు లేకున్న జీవు లెందుకు? వారిప్పుడున్నట్లు విశాలురు-సుందరులునై యుందురా? కుందేలునకు భయమే లేకున్న నేడు చూడబడునంత తీవ్రగమనమలవడునా? సింహమున కాకలి లేకున్న నేడది యెంతబలి

ష్టమో యట్లుండునా? మనుష్యున కెవరితోను గలహాముప్పతిల్లకున్న వాడు నేమున్నంత బుద్ధిమంతుడు ప్రయత్నశీలుడు చతురుడు శిక్షితుడునై యుండునా? దుఃఖమే ప్రాణుల పూర్ణతకు గారణము. అనగా దుఃఖపరిణామము మేలగునని భావము. పరిణామము వలననే దాని యుపయోగిత స్పష్ట మగును. పూర్ణతకంతము ఆనందము కాని సమయమునను ఈయుపయోగిత సిద్ధమేయగును. పూర్ణత స్వయముగా నొకయుచ్చకోటికి జెందిన సాధ్యము. ఈసాధ్యమును సిద్ధింపజేయు దుఃఖమెన్నడును చెడుగు కాదు. ఈయాక్షేపముకొఱకు జింతించుట వ్యర్థము. ప్రాణివర్గపు జీవనాకర్షము బలము కలుగునట్లు పెంచబడి, కార్య మొకించుకేని చేయనవసరము లేక వధకును పనికిరాని సూకరమువంటిదని నేనెంచజాలను. ప్రాణివర్గపు శక్తుల వికాసమునకును వాని ప్రకృతుల యున్నతికిని ఆవశ్యకమైనంత దుఃఖమే లోకమున వానికొసంగబడినది. ప్రాణుల ముఖ్యోద్దేశము సుఖప్రాప్తియని చెప్పుదుమేని మనమీశ్వరుని సృష్టిరచనా ప్రయోజనము నవహేలన చేయుచున్నాము. దుఃఖము కేవలము పూర్ణతకు సాధనమై సుఖసాధనము గాకున్నను ఇది యీశ్వరుని పరమకరుణనే సూచించును. కాని, దుఃఖము పూర్ణతకుమాత్రమే సాధనముగాక సుఖసాధనము నగుటచే దీనివలన నీశ్వరుని యధికాధికదయ సూచింపబడుచున్నది. ప్రయత్నమునకై ప్రేరణచేయు దుఃఖము, ప్రయత్నించుటలో కలుగు దుఃఖము, నివిరెండును అంతమున నానందమును ప్రాప్తింపజేయును. బహుశః సుఖానుభవము కొఱకు

దుఃఖానుభవ మవసరమనవలయును. ప్రాణుల శరీరములు దుఃఖానుభవ మొనర్పకున్న సుఖానుభవ మొనర్ప వీలులేనివిగా నొనర్పబడి యున్నవని చెప్పవచ్చు. ఇదిసత్యము కానిండు కాకపోనిండు. సమస్తజీవనప్రపంచమున ప్రాణులను పరిశ్రమము కొఱకు ప్రేరేపించు దుఃఖముమాత్ర మానందదాయక మనుట సుస్పష్టమనక తప్పదు. దుఃఖోపయోగిత యల్పప్రాణులందుకంటె నధికముగా మనుష్యులయందు తెలియనగును. ఇక్కడను మానసికవిషయములందు తెలిసినంత శారీరక విషయములందు తెలియదు. ఇదియాత్మ పరిశోధనము, శిక్షణము మున్నగు వానియందెక్కుడు సహాయకమగును. దుఃఖమువలన హృదయకాఠిన్యము తగ్గిపోవును; అభిమాన మణగిపోవును. ధైర్యసాహసములు పెంపొందును. సానుభూతి యధికమగును. ధర్మమునందు శ్రద్ధకలుగును. సారాంశ మేమన, దుఃఖమువలన సంపూర్ణ మానవప్రకృతి సుదృఢము, పరిశోధితము, నున్నతము నగును. బట్టీలో తపించినపుడే శుద్ధమగు సువర్ణము సిద్ధమగును. దుఃఖమును సరిగా సహించినవా డెవడును తనకు నావశ్యకతకంటె నెక్కువదుఃఖము సహింపవలసి వచ్చినదని యాక్షేపించి యుండలేదు. ఇంతియగాక మానవజాతికి రత్నములవంటి వ్యక్తులు తమజీవనమున గల యనుభవముద్వారా దుఃఖము చెడుగు కాదనియే తెలిసికొనిరి. భాగ్యమువల్లనే దుఃఖము భించుననియు వాకొనిరి. అమరయశస్సును సంపాదింపవల నన్న, మానవుడు పవిత్రము నున్నతము నొనర్చు దుఃఖ

యవలన లాభము సంపాదించుచు, దానినుండి జీవనవ
డుచవలయును." (ఫ్లింట్. ఆ. వా. ౨౪౭-౫౦)

ంతవఱకు నాకలి, దప్పిక మున్నగు నిచ్ఛారూపము న
ావశ్యకతలను సూచించు దుఃఖములను వర్ణించి
ఇవి వాస్తవమున దుఃఖములు కావు. కర్మప్రాయ
ప్రేరణలు మాత్రమే. ఈశ్రేణిలో చేర్పదగని
ల నసేకములు గలవు. అవి ప్రాణుల సర్వనాశ మొన
ృత్యువు వాని లఘుస్వరూపము. అట్టిదుఃఖములవలన
ము తనకర్తవ్యములనుండి చ్యుతుడగును. వానిపాపా
ృమగును. నిరాశతో నలసుడై జీవనదినములు గడప
సమస్తతాపములను - దుఃఖములను భారతవాసులు
కములుగ విభజించిరి. (౧) ఆధ్యాత్మికములు: ఇవి
నస్సుల నుండియే యుత్పన్నములగును. నానావిధ
ు, అంధ్య బధిరత్వాదులు, ఈర్ష్యాద్వేష కామాది
వ్యాధులు నిందుజేరును. దీనివలన మనుష్యుడెందు
గానివాడగును. (౨) ఆధిభౌతికములు: ఒకప్రాణికి
ప్రాణివలన గలుగు బాధలు. (3) ఆధిదైవికములు:
్తలు ప్రకోపించుటచే కలుగు పీడలు.

మొదటి యాధ్యాత్మికములలో గొన్ని శారీరిక దుఃఖ
కొన్ని మానసికదుఃఖములు ప్రయత్నప్రేరకములని
లిసికొనగలుదుము. కాని, మిగిలిన యనేకరోగములు
యాడవ భాగములకు జెందినబాధలు భయంకరములై
రయోగము తెలియుట దుస్తరమైయుండును. అత్యంత

దయాశీలుఁడును, ఆస్తికశిరోమణియు ననదగినవాఁడుకూడ యొకానొకప్పుడైనను, ఈశ్వరుఁడే యున్నచో నతిక్రూరుఁడై యుండునని యనవలసివచ్చును. చిన్నజంతువులు మొదలుకొని జంతుశిరోమణి యనదగు మానవునివఱకు నొకరిరక్తమును మఱియొకరు పానముచేయ నిచ్ఛగలవారై తోఁచెదరు. చిన్నచేపను పెద్దచేప మ్రింగును. పెద్దదాని నంతకంటె పెద్దది గుటకరించును. ఒకహ్వేల్ భోజనమునకై వందలకొలఁది చేపలు తమప్రాణముల నర్పించును. ఒకపెద్దమొసలి నోరుదెరచుటయే తడవుగా వందలాది మత్స్యములను దిగమ్రింగును. ఒంటికాలిమీఁద నిలబడి గాయత్రిని జపించు కొంగతపస్సు మత్స్యప్రాప్తికొఱకే. మనుజుఁడుమాత్రము తక్కువనుకొంటిరా? కాదు. అరణ్యములలో నొకటిరెండు దినములలో నొకసింహ మొకప్రాణిని చంపి పొట్టనించుకొనిన, నగరములలోని వందలకొలది మనుష్యులు వందలకొలది గొఱ్ఱెలను, మేకలను, కోళ్లను తమ యుదరాగ్ని కాహుతుల నొనర్తురు. వేలకొలది చెలపెయ్యలు వారికొఱకై తమప్రాణముల సమర్పింపవలసినవగుచున్నవి. పిల్లి యెలుకను, బల్లి పతంగమును, డేగ చిన్నచిన్న పక్షులను పట్టుకొనుటలో కొంతవిలంబమైనను జరుగునేమో కాని, సభ్యులు, శిక్షితులు నయిన గృధ్రదృష్టులకు మతుష్యాత్ములలో మంచము, విహంగములలో పతంగము కూడ శీఘ్రముగా నెఱగాక తప్పదు. పెద్దచేపల బారినుండి చిన్నచేపలు తప్పించుకొనగలవుగాని, ద్విపాదమకరములు

తమజాలములను సముద్రమున బరచినపు డొక్కటియు మిగలక యన్నియు వానివాత బడవలసినదే. నాగరిక దేశములలో మనుష్యుల యుపాహారములకై యొక్కొక్క నగరమున నొక్కరెప్పపాటు కాలమున వందలకొలది పశువుల శిరస్సులం శరీరములనుండి వేరుచేయు యంత్రాగారము లేర్పడియున్నవి. ఆదేశములలోని భోజనశాలల నొకమాటు తిలకింపుడు. మృత్యుబాధ ప్రపంచమున నధిక బాధగా నెంచబడునేని, ఈభోజనాలయములు ప్రాణివర్గమున కధికాధిక దుఃఖసాధనము లనక తప్పదు. ప్రాణుల దుఃఖచిహ్నములు వాయుమండలమున నేర్పడ గలుగుచో భూమండలము చుట్టునున్న వాయుమండలమంతయు ప్రాణుల హాహాక్రందనములతో నిండియున్నదనక తప్పదు. భోజనాలయముల కేగుము. ఆసుపత్రులను దిలకింపుము. కాలేజీలను జూడుము. ఎక్కడజూచినను మానవుడు తనకంటె నితరప్రాణులను ప్రాణులనుగా జూచునట్లు తోచదు.

ఆధిదైవిక తాపములు ఆధిభౌతిక దుఃఖములకంటె తక్కువగావు. వర్షమువచ్చిన వేలకొలది ప్రాణులు మృతినొందుదురు. ఒకవరద వచ్చిన వందలప్రాణులను గొనిపోవును. భూకంపమువచ్చిన నగరములే పాడుపడును. జ్వాలాముఖపర్వతమొకటి చెలరేగిన నిరుగుపొరుగు గ్రామములు భస్మసాత్తులగును. సముద్రతరంగ మొండు పైకిలేచిన విశాలకాయములుగల యోడలు తుత్తునియలగును. మృత్యుదేవత గ్రద్దలవలె మనశిరస్సులపై నెల్లపుడు భ్రమించుచునే యుండును. వీనికొక రూపమైన నెట్లో యెదిరింపవచ్చు. ఒకచో కరువురూప

మున నరుదెంచును. మఱియొకచో గలరావ్యాధిరూపమున నాక్రమించును. వేరొకచో బిడుగులరూపమున, కొండొకచో, సుషుప్తిరోగరూపమున నరుదెంచును. వీని కెవరు కారకులు? ఎవరు?

ఇన్ని దుఃఖము లుండగా నీశ్వరుడు దయాళుడు అని యతని దయాళుత్వాదుందుభిని బ్రయోగింప ఆస్తికుల కేమి యధి కారము? దయాళుత దీనిపేరే యగుచో క్రూరత యని దేని నందురు? అందువలననే నాస్తికుడు "ఈశ్వరుడు దుఃఖనివారణ చేయ నెంచుచున్నాడు కాని చేయజాలకున్నాడు. కాబట్టి దుర్బలుడైనను కావలయును, లేదా దుఃఖనివారణ చేయగలిగియు చేయగోరుటలేదు. కాబట్టి క్రూరుడైనను కావలయును; లేదా, నివారింపగోరడు, నివారింపజాలడు కాబట్టి క్రూరుడు, దుర్బలుడు నైనను కావలయును" అని యనుచున్నాడు.

మాదృష్టిలో నీశ్వరుడు దుర్బలుడు కాడు క్రూరుడును కాడు. వాడు దుఃఖములుండరాదని కోరును. వానిని నివారింప సమర్థుడును. కాని, పాపవిషయమున మేము జెప్పిన ట్లీశ్వరుడు జీవులస్వాతంత్ర్యమును తీసికొనజాలడు. అట్లు చేయుట జీవులకు మేలునుగాదు.

ఒకవిధమగు దుఃఖములు ప్రాణులను బరిశ్రమములకై ప్రేరణజేసి వానియున్నతికి గారణములైనచో రెండవవిధమ యిన దుఃఖములు వానిపాపములకు దండన యగుచున్నవి. మనము దుఃఖములను గూర్చి విచారించినట్లు సుఖములను విచారింపకుండుట దుఃఖకరము. నిష్పాక్షికబుద్ధితో విచారించినవారికి బ్రపంచమున దుఃఖములకంటె మిన్నగా సుఖములే రాజ్యమొన

ర్చుచున్నట్లు తెలియును. దయానందమహర్షి సత్యార్థప్రకాశ మున నెనిమిదవ సముల్లాసమున నిట్లు వ్రాసియున్నాడు.

"సృష్టియందలి సుఖదుఃఖములను తూచిచూచిన దుఃఖముకంటె సుఖము పలురెట్లధికమగును. అనేకులు పవిత్రాత్ము లగు జీవులు ముక్తిని సాధించి మోక్షానందము ననుభవించు చున్నారు."

మనుష్యుడు దుఃఖములకై యీశ్వరుని కొండాడినట్లు సుఖములకై యతనిని కొనియాడడు. ఇది మనుష్యుని ప్రమాదము. మనుష్యుడు తన జీవనసాధనములను గూర్చి విచారించిన నతడు ఈశ్వరునియెడ కృతజ్ఞుడే కావలసివచ్చును. మనము శారీరకరోగములకై యీశ్వరుని తూలనాడుదుము. కాని ప్రపంచమున మన మనుభవించు సుఖముల నీశ్వరు డొసంగెనని యోంచెదమా? ఈ మనకన్ను లెంత సుఖదాయకములో అంధులనడిగిన తెలియనగును. మనుష్యునకు నానంద సాధనముల బహుమూల్యత వాని నతడు కోలుపోయిననాడు తెలియును. సాధారణముగా నతడు ప్రాపంచికసుఖములలో లీనుడై తన్నుదా మరచుటయేగాక తన కర్తవ్యములనుగూడ మరచిపోవును. కన్నులతో నెట్టియుత్తమదృశ్యములు చూడబడుచున్నవి! నానావిధ వనమృగములతో నొప్పు పర్వత సానువులు, కలనినాదములతో జంగమ్యమానములగు నదులు, చిత్రవిచిత్రకాంతులీను నక్షత్రాంచితమగు నాకాశము, నానావిధ వర్ణములతో నొప్పారు పుష్పములతో నాడుకొను సీతాకోక చిలుకల వైచిత్ర్యములు ఈశ్వరుడు కన్నులీయకున్న నెట్లుచూడ

బడెడివి? జిహ్వ యొట్టిరుచుల నంద జేయుచున్నది! మనమా జిహ్వ నొనర్పగలమా? మన మాస్వాదించు పదార్థముల నీశ్వరుడు రచింపలేదా? ఇవన్నియు మన కానందము నొసంగుటలేదా? శ్రవణేంద్రియముల నడిగిచూడుము? అవి యేమనుచున్నవి? శ్రవణేంద్రియము సరిగానున్న వాడును బధిరుడును సమానులేనా? చెవులానందమునకు సాధనములు కావా? మనోహరరాగములు, చిత్తాకర్షక వాక్యములు, చెవులు లేకున్న నెట్లు తెలియును? చెవులకొఱకై మనుష్యులచే సంపాదింపబడిన నానావిధవస్తువులు నీశ్వరుడిచ్చినవిగావా? ఇవియన్నియు లోకులచే దుఃఖమయమనబడు సృష్టిలోనివేగదా? ప్రపంచమున దుఃఖమెంతో సుఖమెంతో యిపుడు విచారింపుము. అతిదుఃఖితుడైన పురుషు నుదాహరణము తీసికొని ఇరువదినాలుగుగంటలు లెక్కింపుము. అతడు పండ్రెండుగంటలకంటె నధికముగా దుఃఖము ననుభవించునా? ఒకడు ముప్పదివర్షములు జీవించె ననుకొనుము. వాడు పదునైదు సంవత్సరములకాలము దుఃఖము ననుభవించెనా? ఎన్నడు ననుభవింపనేరడు. జీవనమున దుఃఖము కలుగకపోదు. కాని, యది వవ్వులోని యుప్పంత స్వల్పముగా నుండును. మఱియు నీదుఃఖము జీవుడొనరించిన పాపములకు దండనమాత్రమే. అట్లుగాకున్న జీవులలోని కుసంస్కారములు అశుద్ధియు నివారింప ననువుపడదు. మనమీజన్మకు సంబంధించిన స్వల్పజీవనమునే జీవనముగా నెంచుచున్నాము. అందువలన ననేకదుఃఖముల యుపయోగమును మన మెఱుగజాలకున్నాము. వాస్తవమున మనజీవన మనాద్యనంత మనదగి

యున్నది. కాబట్టి పునర్జన్మ నంగీకరింపనివారికే యిది జటిల సమస్యగాని మనకుగాదు. ఫ్లింట్ మహాశయుడు పశుపక్షుల దుఃఖములకును వానిపాపములకు నెట్టిసంబంధమును కనిపెట్ట జాలకపోయెను.

'మానవ దుఃఖములకంటె పశుపక్షుల దుఃఖములు మిక్కిలి యనిర్వచనీయములు. ఎందువల్లనన, మనుష్యుని దుఃఖములకు పాపముతో సంబంధమున్నది. కాని పశుపక్షుల కట్టిదిలేదు. దుఃఖము ప్రతిప్రాణికి గలుగును.' (ఆ.వా. ౨౪౬)

ఈప్రశ్నకు ఫ్లింట్ దగ్గర సమాధానములేదు. అతడు హతాశుడై యిట్లు చెప్పెను.

'మనుష్యుని మస్తిష్క మీప్రశ్నకు బహుశః పూర్ణ సమాధాన మొసంగనేరదు.' (ఫ్లింట్ ఆ.వా. ౨౪౬).

నాస్తికులు దీనిని దమ ప్రబలవిజయముగా నెంచవచ్చు. వాస్తవమున ఫ్లింట్ మహాశయుని యాస్తికత సరియైనదగుచో దీనికి సమాధాన మిచ్చుట యసంభవమే యగును. అతడొకచో బశ్వాదుల దుఃఖోపయోగితను సంరక్షణగా వ్రాసియున్నాడు. అది కేవల మావశ్యకతారూప దుఃఖములకు సరిపోవునుగాని యన్యదుఃఖములకు సమాధానము కానేరదు.

ఆల్ఫ్రేడ్ రసెల్ వాలెస్ దుఃఖములనుగూర్చి యిట్లు మీమాంసించెను.

"ఈవిధముగా మనము జీవనజగత్తులోగల ప్రబంధమును జూచి చిన్నజంతువులు పెద్దజంతువులకు భోజనము చేకూర్చ

వలసియున్నట్లు తెలిసికొనుచున్నాము. దీని పరిణామ మత్యా శ్చర్యజనకము నుత్తమము నయినది. దీనివలన నొక యుచ్చ తమజాతి 'మనుష్యజాతి' యుత్పన్నమైనది. అది జీవనజగత్తున గల పలువిధములగు సౌందర్యముల ననుభవింపగలుగును. నానావిధములయిన యుత్పత్తులను బ్రయోగింపగలదు." (జీవనజగత్. 323పే)

వాలేస్ మహాశయు డీప్రపంచమును దుఃఖదమనిగాని క్రూరమనిగాని తలంచడు. చిన్నచిన్న ప్రాణులకు దుఃఖము సంప్రాప్తించుటచే మనుష్యవికాస మయ్యెనని యతనిభావము. వానిదృష్టిలో సృష్టిప్రయోజనము మానవోత్పత్తి. భోగము కొఱకు గాకున్న వికాసముకొఱకే కావచ్చు. —— విషయ మొకటే. మనుష్యుడే సృష్టిరచన కంతిమప్రయోజనమని యతని తాత్పర్యము.

వాలేస్ మహాశయుని యీకథనము చీకటిలోని తడవు లాటవంటిది. ఇత డింకొక పుస్తకమునుగూడ వ్రాసియున్నాడు. దానిపేరు Man's place in the Universe. దీనిలోను నితడు సృష్టి మానవునికొఱకే రచింపబడినదని చూప యత్నించెను. జీవనజగత్తు పీఠికలో నతడిట్లు వ్రాసెను.

'వికాసమునకు, విచిత్ర దుర్జ్ఞేయ ఘటనలకు ముఖ్య ప్రయోజనము మనుష్యవికాసమే. కారణమేమన సమస్త జీవన జగత్తునకు బహుమూల్యరత్నము మానవుడే.'

మనుష్యుడు సృష్టిలోగల సమస్తప్రాణులకంటె నుత్తముడే. ఇందు సందియములేదు. కనీసము మనుష్యులుమాత్ర

ందు వివదింపరు. పశుపక్షులన నవి మనుష్యవికాసము ఒకింత హింసయొనర్పవలసియుండుటచే మానవులు సృష్టిలో మూల్యరత్నములుగా నంగీకరింపక పోవచ్చు. సుప్ర ద్ధ బంగాలీయుపన్యాస లేఖకుడైన బంకించంద్రు డొకచో క మృగముల సభగావించి వానిచే మనుష్య 'జతి చ్ఛుడు, భీరుడు, వంచకుడు' నని వర్ణింపజేసి యున్నాడు. సిం ము మానవుని తనకు భోజనముగా వర్ణించిన దోషమేమి?

మనము పశుపక్షుల సమ్మతి నడుగకయే వాలెస్ వర్ణించి ట్లు మానవుడు సృష్టియందుగల ప్రాణిరత్నమని యంగీకరించి ను మానవవికాసమే సృష్టికి ముఖ్యప్రయోజనమనియు, మను ర్రచన కన్యప్రయోజనము లేదనియు నంగీకరింపజాలము.

వాలేస్ మహాశయుడు తన 'జీవనజగత్తు' నందొక అధ్యాయము 'సృష్టి దయలేనిదా?' యను శీర్షికతో వ్రాసి యున్నాడు. అందలి పెక్కు విషయములతో మే మేకీభవిం ము. వానిని ముందు యథాస్థానమున నుద్ధరింతుము. నియం దతడు సృష్టి మనమనుకొనునంత దయమాలి ది కాదని చూపింప యత్నించి యున్నాడు. కాని, మానవ కాసముకొఱకు దోషమొనర్పకయే ప్రాణులకు స్వల్పబాధ ంభవించినను సృష్టి దయలేనిదనుట కెట్టిసందియమును లేదు. ల్లి తన బిడ్డ సతనియభివృద్ధికొఱ కెన్నడైన కొట్టి బాధించు ట్లు పాఠశాల యున్నతి కొఱకు వానికి దుఃఖము కలి ంచుట నిర్దయత కానేరదని మే మొప్పుకొనగలము. కాని ప్రాణులను వానియున్నతికొఱకుగాక యితరప్రాణుల వికా

నముకొఱకుగాని, యున్నతికొఱకుగాని పీడించుటను సదయత యనక నిర్దయతయే యందుము. వాలేస్ మహాశయుని యీ నియమమును మానవసమాజమున కాధారముగా నెంచితిమేని (పాశ్చాత్యులలో ననేకు లెంచునట్లు) సృష్టిలోగల ప్రబంధమంతయు నస్తవ్యస్త మగునట్టి యనాచారము లోకమున వ్యాపించును. మనుష్యు డితర ప్రాణుల నన్నిటిని తనభోగోన్నతుల కొఱకుగా నెంచునేని నొక శిక్షితమనుష్యు డశిక్షితులయిన మానవులనుగూడ తనకు భోగ్యవస్తువులనియే యెంచును. అనేక జాతులు తఱచు ఇట్లే విశ్వసించి యన్యజాతులను తనవికాసోన్నతులకు సాధనమాత్రముగా జూచుచున్నవి. కాని యట్టి జాతులందు నిది సర్వతంత్రసిద్ధాంతము కాదు. పరిణామవాద మధికముగా వ్యాపించిన నట్లెంచువారి సంఖ్య పెరుగవచ్చు.

వాస్తవమున నీప్రశ్నకుసమాధానము పునర్జన్మసిద్ధాంతమే యొసంగగలదు. ఈసిద్ధాంతము ననుసరించి ప్రతిప్రాణియు దన కార్యములద్వారా దుఃఖముల ననుభవించును. ఇట్లు స్వీకరించిన నే దుఃఖమును సృష్టినిర్దయతను బోధింపజాలదు. అపరాధుని దండించుట న్యాయమునకు దయకు సూచకమగును. అన్యాయమునకు నిర్దయతకు ద్యోతకము కానేరదు.

ఈశ్వరుడు ప్రాణుల కింతకష్టమును గలిగించు దండన నేల చేయును? అను ప్రశ్న యొకటి పొడముచు. సభ్యజాతుల దండనపద్ధతికి మూలాధారనియమము, దండన దండ్యునిసంస్కరించుటకేగాని కసిదీర్చుకొనుటకో లేక యేవగింపును వెల్లడించుటకో కాదని తెలియుచున్నది. సృష్టినియమము నిట్టిదియే.

వాస్తవమారయ సభ్యజాతు లీనియమమును సృష్టిరచన నుండియే నేర్చుకొనియుండునని మాదృఢమైన విశ్వాసము. సృష్టిని సరిగా నిరీక్షింపని జాతులలో దండనపద్ధతులు భయానకములై యున్నవి. కాని శిక్షితజాతులకు ప్రకృతినియమములు తమ్ము సహృదయు లగుట కుపదేశించు చున్నవని తెలియవచ్చినది. అథర్వవేదమున నొకమంత్రమున

సహృదయం సాంమనస్యం అవిద్వేషం కరోతివః
అన్యోన్య మభిహర్యత వత్సంజాత మివాఘ్న్యా॥

'మానవులారా! నేను మిమ్ములను సహృదయులు బుద్ధిమంతులు ద్వేషరహితులునుగా సృష్టించియున్నాను. ఇప్పుడే ప్రసవించిన గోవు తన వత్సమును ప్రేమించునట్లు మీరును బరస్పరము వ్యవహరింపుడు' అని బోధించుచున్నది.

వస్తుతః సృష్టియం దీనియమమే యున్నది. ప్రాణులకు దండన లభించునుగాని నిర్దయతో గాదు. సంస్కరించుటకై దయతో దండింపబడుదురు. బాగుగా విచారించినట్లయిన సృష్టి తన యపరాధుల నెంతమెత్తనిహృదయముతో దండించుచున్నదో యంతటి కరుణతో శిక్షించు రాజు లోకమున మచ్చునకైనను గానరాడు. నియమముల నుల్లంఘించు వారి నెంతటి దయతో సృష్టి శిక్షించునో యట్టిదయతో బిడ్డల బాగుగోరి శిక్షించు కోమలహృదయులయిన తల్లు లతివిరళముగానే యుందురు. కాని మోహమున జిక్కి మూర్ఖమాతలు తమబిడ్డలను కుమార్గములనుండి మరల్పక తోడుపడునట్లు ఈశ్వరుడు మాత్ర మాచరింపడు. ఈశ్వరునిప్రేమ సత్య

మైనది. అది మనలను సంస్కరించుటకై శిక్షింపుమని ఈశ్వరుని ప్రార్థించుము. ఈశ్వర నియమములన్నియు జీవుల మేలు కే గాని యతనికి వానితో నెట్టి ప్రయోజనమును లేదు. కాబట్టి సృష్టియందు క్రూరత్వ దోషారోపణ నొనర్చువారొక యంశమును మాత్రమే చూతురు. వారిదృష్టి సృష్టిలోని యన్ని భాగములపై బడదు.

ఈశ్వరుడు క్రూరుడుకాక దయాళువని మేము చెప్పెదము. అదియెట్లన, మొదట దండనాపద్ధతిని తీసికొనుడు. జీవులు నిత్యము సృష్టినియమముల నుల్లంఘింతురు పాపముల నొనర్తురు. దీనివలన వీరిలో నాలస్యప్రమాదములు, అభిమానము పెరుగును. వీరిజ్ఞానము తగ్గిపోవును. వీరిలో నితర జీవులను గష్టపెట్టువృత్తి పెరుగసాగును. సృష్టినియమము లన్నియు జీవుల కల్యాణముకొరకైనవగుటచే వాని నుల్లంఘించుట దుఃఖసాధనమగును. ఇదియే పాపము. అందువల్లనే గదా! "అహింసా పరమోధర్మః" అని చెప్పిరి. ఇతరులను జంపుటమాత్రమే హింసకానేరదు. సృష్టినియమముల నుల్లంఘించుటయు గొప్ప హింసయే యగును. నియమోల్లంఘన పరిణామము దుఃఖమేయగును. కాబట్టి జీవుడు సృష్టినియమముల నుల్లంఘించిన నతనికి దండన లభింపవలయు ననునదియు నొక సృష్టినియమమై యున్నది.

సృష్టియందు దండనకై యెట్టి యుత్తమ నియమము న్నదో చూడుము. పునర్జన్మము నంగీకరించని వారీ రహస్యము నెఱుంగజాలరు. వారి నడుగుడుగునను కష్టము తెలు

రొందనుచుండును. ఒకయల్పజీవనమున మనుష్యుడు తనయంతిమోద్దేశము నెట్లు నెరవేర్చుకొనగలడో వారికి దెలియనే తెలియదు. జీవులకు శిక్షణనొసంగుటకై భిన్నభిన్నశ్రేణులుగల పాఠశాలకు సమానముగా నీసృష్టి యేర్పడినదని వారెఱుంగజాలరు. వాస్తవమున లక్షలకొలదిగా జూడబడు యోనులీప్రపంచపాఠశాలలోని తరగతులు. ఉత్తముడు కానిండు, అధముడు కానిండు, ప్రతిజీవుడు నీతరగతులలో నొండొకదానికి దగినవాడగు నట్లీయోనిశ్రేణు లేర్పరుపబడినవి. సృష్టి తన విద్యార్థులలో నెవరినిగూడ నీపాఠశాలనుండి బహిష్కృతుల నొనర్పదు. అయోగ్యవిద్యార్థుల నొకేకక్షయందు నుంచదు. మనపాఠశాలయందు మంచి చెడు విద్యార్థులు కలిసియుండి యొకరికొకరు హానిని కలిగించుచుందురు. ఇందొకరి కనుకూలమైన పాఠమును బోధించిన మఱియొకరికి సమయము నష్టమగును. మంచిపిల్లలకు దెలియుపాఠము చెడ్డపిల్లలకు దెలియదు. చెడ్డపిల్లలకు దెలియు పాఠములిచ్చిన మంచిపిల్లల సమయమే నష్టమగును. ఇట్టి దురవస్థ సృష్టిపాఠశాలయందు కానము. జీవులయోగ్యత ననుసరించి వలయునన్ని శ్రేణులిందుగలవు. వీనినే యోనులందురు. హిందువులు పురాణములలో నచ్చటచ్చట ఎనుబదినాలుగులక్షల యోనులు వర్ణించియున్నారు. వాలేస్ మహాశయుడు 'తనజీవనజగత్తు' నందు ౯౨వ పుటయందు ఏ. ఈ. శిప్లే వ్యాఖ్యానము నాధారముగా గొని ప్రాణియోనులను ఏడులక్షల, తొంబదివేల, ఐదువందల ముప్పదిమూడు (౭,౯౦,౫౩౩) అని లెక్కించియున్నాడు.

పాఠకుల మనోవినోదార్థ మిట వానిని పొందుపరుచు చున్నాము.

| | | | |
|---|---|---|---|
| ౧ | పాలనిచ్చు జంతువులు | (Mammalia) | ౯౯౫౫ |
| ౨ | పక్షులు | (Birds) | ౧౩౮౩౫ |
| ౩ | ప్రాకులాడునవి | (Reptiles Batrachia) | ౭౯౮౦ |
| ౪ | చేపలు | (Fishes) | ౧౪౯౯౬ |
| ౫ | మొలస్కా | (Mollusca) | ౬౨౦౦౦ |
| ౬ | బ్రియోజోఆ | (Bryazoa) | ౨౨౨ |
| ౭ | క్రస్టేషియా | (Crustacea) | ౧౩౯౫౨ |
| ౮ | బల్లిమొదలయినవి | (Spiders) | ౨౫౮౭౦ |
| ౯ | బహుపదములుగలవి | (Myriapods) | ౮౭౨౫ |
| ౧౦ | పురుగులు | (Insects) | ౪౪౫౯౭౮ |
| ౧౧ | గట్టిచర్మముకలవి | (Echino-derms) | ౧౫౦౯౭ |
| ౧౨ | చిన్నపురుగులు | (Worms) | ౮౭౧౬ |
| ౧౩ | Coclenterata | | ౫౦౦౮ |
| ౧౪ | Sponges | | ౨౯౬౫ |
| ౧౫ | Protozoa | | ౬౦౦౦ |

ఈపట్టికయు సరియైనది కాదు. గూంథర్ మహాశయుడు క్రీ. శ. ౧౮౮౧న. వీనిసంఖ్య ౩౧౧౬౫౦ మాత్రమే చెప్పియున్నాడు. డాక్టర్ డి. షార్ప్ మతమున Insects సంఖ్య ౨౦ లక్షలకంటె నెక్కువగా నెంచబడినది. గూంథర్ పాలుత్రాగించువాని సంఖ్య ౨౩౦౦ వ్రాసియున్నాడు. కాని పైనే ౯౯౫౫గా లెక్కపెట్టెను. ఇట్లే మరియు నన్వేషించిన

లార లక్షలవరకు చేరుట అసంభవము కాకపోవచ్చు. అట్లు గాకున్నను ౬౪ లక్షల యోనులనే యంగీకరించినను ప్రస్తుతప్రయోజనమునకు బర్యాప్తమే యగును. ఇవియును నేవలము భూగోళమునకు సంబంధించినవేగాని సమస్తసృష్టికి జెందినవికావు. భూమి సూర్యమండలమున నొక చిన్న భాగము. ఇట్టి సూర్యమండలములు బ్రహ్మాండమున నెన్నియో గలవు. అట్టియెడ బ్రహ్మాండమున గల జీవరాసులను లెక్కింప మానవుల తరమా?"

ఈలక్షలకొలది యోనులే లక్షలకొలది తరగతులు. వీనియందు జీవులు శిక్షణను బొందుదురు. సృష్టిప్రబంధ మతి సువ్యవస్థితము. జీవుడొక విశేషయోనికి యోగ్యుడయినంత కాలమే యందుండగలడు. ఉన్నత్యావనతులవలన దానికయోగ్యుడు కాగానే దానినుండి తొలగించి మఱియొకయోనికి పంపబడును. ఈకక్షాపరివర్తన మతిచాతుర్యముగా జరుగును. జీవునకు తానెక్కడనుండి యెక్కడికి వచ్చెనో తెలిసికొనుటయే దుర్లభమగును. అతనికి దనపూర్వపరిస్థితి తెలియవచ్చిన యెడల క్రొత్తచోట లాభముపొందజాలడు. పూర్వమిత్రుల స్మృతి యతనిని విడిచిపెట్టదు. పూర్వసంస్కారములు జాగృతి నందుచుండ నతడు క్రొత్తపాఠమును నేర్చుకొనజాలడు. శోకమున మునిగియుండును. పునర్జన్మమున్న వెనుకటిజన్మసంగతులేల స్మరణకురావని యనేకు లాక్షేపింతురు. జ్ఞాపకమున్నచో జీవుడు సంస్కరింపబడుట దుర్లభమని మేము నుడివెదము. మానవుల దండనాలయముల నొకమాటు స్మరింపుము. ఒక

వ్యభిచారి యొక మానవతీసతీత్వమును భంగపరచె ననుకొనుము. వానిని కారాగారమున నుంతురు. రాజదండన యింతకంటె నేమిచేయును? కాని, యతని పూర్వసంస్కారము లతనిమనస్సున పనిచేయుచునే యుండును. కాబట్టి కారాగారమున దనపూర్వపరిస్థితినిగూర్చి విచారించుచునే యుండును. కారాగారమునుండి విడివడివచ్చినను మరల దనపూర్వపు పాపమయవ్యాపారము చేయగడంగును. రాజదండన అపరాధులస్మృతిని మార్పగల్గుచో నెంతబాగుండును! అపరాధులెంతత్వరలో సంస్కరింపబడుదురు!

ఇది యంతయు నీశ్వరవ్యవస్థయందే సంభవమగును. నిత్యమిట్లు జరుగుచునే యున్నది. అనేకదుఃఖములు మానవుల సామాన్యదృష్టికి దుఃఖములని తోచినను వాస్తవమున నవి దుఃఖములు కావు. ప్రతిమృత్యువు దుఃఖదము కాదు. ఇతరుల కెట్లున్నను మరణించు వ్యక్తి కైనను గాకుండును. అతనికి దన తరగతి మార్పబడుచున్నదనియు తెలియదు. క్రొత్తశ్రేణి యందు తీవ్ర దత్యుత్సాహముతో పాఠములు నేర్వనారంభించును. ఈశ్రేణులందు పూర్వసంస్కారములు నష్టపడుట, క్రొత్తసంస్కారము లేర్పడుటయను రెండుకార్యములు జరుగుచుండును. ఇట్లే యోనులు లోకవిధముగా శుద్ధికి సాధనములగుచున్నవి.

ఇతరప్రాణుల యత్యాచారములనుండి తప్పించుకొనుటకు దగినసదుపాయము లనేకము లాయాయోనులం దీశ్వరుడు కలిగించియే యున్నాడు. జంతుశరీరములరంగు వానిపరిస్థితుల కను

కూలముగా నుండునని జంతుశాస్త్రజ్ఞులు చెప్పెదరు. తోటలం దుండవలసిన చిలుకల రంగు చెట్లయాకులవలె నాకు పచ్చగా నుండును. అందువలన నవి యట దాగగలవు. పొదలలోనుండు కుందేళ్లు కదలకుండ పొదలందు కూర్చుండియున్న నీవు వానిని తేలికగా గనుగొనజాలవు. ఇట్లు సృష్టిలోని ప్రతిప్రాణికి రక్షణకు దగినన్ని సదుపాయము లుండనే యున్నవి.

ఇప్పుడొక కొంత హింసక జీవులవలన కలుగు దుఃఖమును గూర్చి విచారింపుడు. భిన్నభిన్న ప్రాణులను సురక్షిత పరిస్థితులలో నుంచుటకు దోడుగానటనైన నొకప్రాణి పట్టుబడి చంపబడునేని దానికి విశేష కష్టమొదవకుండు నేర్పాట్లును గలవు. ఈవిషయమున రసీల్ వాలేస్ సాక్ష్యమే పర్యాప్తమగునని యెంచెద.

"ఈ చిన్నచిన్న విషయములను హేతువుగాగొని సృష్టి క్రూరత నాక్షేపింప వలనుబడదు. వాస్తవమున సృష్టి భిన్నభిన్న ప్రాణుల కొసగిన భయంకరసాధనములబట్టి యాక్షేపించు టుచితము. ఎట్లన, పిల్లికుటుంబమునకు జెందిన కఱకు దంతములు, నిశితనఖములు, వేటాడుపక్షుల మొనతేలిన ముక్కులు, తన్నుకొనిపోదగిన కాళ్లు, పాముల విషాక్త దంతములు, కందిరీగల తీక్ష్ణమైన ముండ్లు మున్నగునవి యెంత భయానకములు! ఈసాధనములన్నియు దుఃఖములనిచ్చుటకే యైన వీలులేదు. వీనివలన నుపయోగమున్నది. వీనివలన వేటాడబడు జంతువునకు గష్టములు తక్కువగును. ఇట్లుగాకున్న నవి గాయములుమాత్రము పడి వదలిపెట్టబడిన నెంతో

తడవు దుఃఖముల ననుభవింపవలసిన వగును. కొనలుతేరి దంతములు, భయానక హస్తములు, ఖాద్యజంతువును బాగు బట్టుకొనగలవు. సర్పదంతములు వధ్యుని వెంటనే మూర్ఛిత నొనర్చును. ఒకమాటు కందిరీగల యుంటి యనుభవము సంపా దించిన పక్షులు వానిని తిన యత్నింపవు. సింహము, పిల్లి తోడేలు మున్నగు జంతువులచే బట్టుబడిన మృగములు కఠిన యాతనలు సంభవింపవు. పట్టుకొనుటయే తడవుగా పంజాతో గొట్టుటచేతను దంతములతో జీల్చుటచేతను, మృత్యువు సంభ వించుటో లేక స్మృతితప్పి పోవుటయో కలుగును. అటువై మృత్యుపీడ వానికి బొత్తుగా తెలియదు. ఇందొకవిషయము జ్ఞాపక ముంచుకొనదగినది కలదు. మాంసాహారిజంతు వా కలిగొన్నపుడే భక్ష్యజంతువులను జంపును. మనోవినోదము కొఱకు జంపదు. పెంపుడు పిల్లుల యుదాహరణములు భ్రమ మూలకములు. మనుష్యశరీరము దుఃఖము నతిశీఘ్రముగా ననుభవించును. కారణమేమున, రక్షణకు దగిన పట్టీలు దీనిపై నుండవు. అయినను సింహాదులకు పట్టువడి తప్పించుకొని వచ్చిన మనుష్యులు తమ కెక్కడు కష్టము కలుగలేదనియే చెప్పుట కలదు.”

ఈయుదాహరణములవలన సృష్టినియమములు దయాళువులనియే తెలియుచున్నది. అవి జీవునకు హద్దుమించి దుఃఖము నొదవనీయవు. అధికదుఃఖముల నొసంగు సాధనము ఉపస్థితములైయున్న మూర్ఛవచ్చును. మూర్ఛలో దుఃఖములు తెలియవు. ప్రపంచమున నధికదుఃఖకరప్రాణి మనుష్యుడు.

సింహము తన ఖాద్యజంతువును క్షణములో బరిమార్చును. కాని మానవుడు తనశత్రువును దీర్ఘకాలము హింసించి హింసించి చంపగల సాధనములెన్నో కనిపెట్టియున్నాడు. ఈవిషయమున డాక్టర్లుచేయు హింసలకు మేరలేదు. అనేకప్రాణుల శరీరావయవములు సగము నరికియుంచి వానిపరీక్షణా లొనర్చుచుందురు. జంతువు లెంతకొట్టుకొనిన నేమి, వాని కెంతదుఃఖము కలుగుచున్ననేమి వారుమాత్రము తమజ్ఞానమును బెంపొందించుట కనుడు లేక తమ క్రూరతాక్షుధ నార్పుకొననముడు పీడించుచునే యుందురు. కాని, యీయవస్థయందును బరమాత్మునిప్రాణులకేదో యొకవిధమున సాంత్వన నిచ్చును. మనుష్యుల కాయత్యాచారములకు దగిన దండన నొసంగును.

పైన మేము సుమారేడులక్షల యోనులను వర్ణించియుంటిమి. ప్రతియోనియందును కోట్ల వ్యక్తులుండును. ఈ భూమండలమున మనుష్యుల గణనయే ౧౫ యర్బుదమందురు. ఒక్కొక్కబిలమున లక్షలాది చీమలున్నవి. ఇట్లు పృథివిలోనున్న ప్రాణులసంఖ్యయే మానవగణితమున కందదు. ఈసంఖ్యలో నశనిపాతాది విపత్తులవలన జనిపోవువారిసంఖ్యను జూచిన దుఃఖ మత్యల్పమని తోపకపోదు, ప్రాణుల దుఃఖములను గణించునపుడు సుఖములను సరకుగొనము. పెద్ద దండనయను మృత్యురూపదుఃఖము జీవనమున నొక్కమారే సంభవించును. కాబట్టి యీశ్వరుడు తనజీవులకు సంస్కారణాకవసరమైన దండననే యిచ్చునని చెప్పియుంటిమి. సృష్టినియా

ములు ప్రాణులకు దుఃఖములనుండి తప్పించుకొనుటలో సహాయపడుటయేగాక పాపములనుండియు నడ్డగించును.

కాబట్టి నాస్తికు లనెడి దుఃఖసముద్రయందు సార మొకింతయు గానరాదు.

---

# ఎనిమిదవ అధ్యాయము

## ఈశ్వర గుణములు (౨)

### అనంతత

పూర్వాధ్యాయములం దీశ్వరుడొక్కడు, సర్వవ్యాపకుడు, చేతనుడు, సర్వశక్తిమంతుడు, దయాలువు, శుభంకరుడు నని వర్ణించియుంటిమి. మనయంతరాత్మ, మన యీ సృష్టియు నిందులకు సాక్షులు. ఆస్తికు లీశ్వరునందు మఱియొక గుణము నంగీకరింతురు. అది యనంతత.

ఈయనంతత చతురుల బుద్ధికల్పితమా? లేక దీనికేదైన యుక్తి - ప్రమాణ మున్నదా?

మనుష్యుడు సాంతుడు. వానిమస్తిత్వమును సాంతమే. అట్టియెడ మనుష్యు డీశ్వరుని యనంతత నెట్లు తెలిసికొనును?

ఒక వస్తువును తర్కముద్వారా సిద్ధపరచుట, దానిని మనస్సుద్వారా ననుభవమునకు దెచ్చుట యనునవి రెండు నొక విషయము నెఱుగుట కవసరములు. ఇందు మొదటి విషయము తర్కశాస్త్రము (Logic) నకు, రెండవది మనోవిజ్ఞానమున (Psychology) కు సంబంధించి యుండును. ఈ రెండుశాస్త్రములు నొకదాని కొకటి విరుద్ధములు కానేరవు. కారణమేమన దర్కశాస్త్రమునకు మూలాధారము మనోవిజ్ఞానమే. కాని యనేక స్థలములందు మనుష్యుడు తన మనస్సుతో ననుభవమునకు దెచ్చికొనిన యనేకవిషయములను

తర్కముద్వారా సిద్ధముచేయనేరదు. తర్కముద్వారా సిద్ధపరచినను మనస్సునకు శాంతినొసగని విషయములు నుండవచ్చును. అనుభవము, తర్కము రెంటిద్వారా పుష్టిచేయబడిన విషయమున మనుష్యునకు దృఢవిశ్వాస మేర్పడును.

మనమిట యనంతత్వమును గూర్చి మీమాంసింపవలె నెంచితిమి. అనంతతను సాంతమస్తిష్క మెట్లెరుగగలదని యాక్షేపింపబడినది. మనుష్యుని మస్తిష్కము సాంతమనుటలో నెట్టి సందియమును లేదు. దానిసీమ యెల్లరికి ననుభవగమ్యమే. అద్వైతవాదులు (జీవుడే బ్రహ్మ యను భ్రాంతివాదులు) మాత్రము వ్యవహారమున నల్పముగా దోచునది తత్వతః అనంతమని నుడువవచ్చు. వారిజీవుడు నిట్లనంతు డగుటచే ననంతుని చే ననంతత యెరుగబడుటలో నెట్టి యిక్కట్టును కనిపింపదు. కాని, జీవుని బ్రహ్మగా నంగీకరించుటలో ననేక యాపత్తు లున్నవి. కాబట్టి వారితో మే మేకీభవింప జాలము. ఇతరులు నెవ్వరు వారి ననుగమింపరు. కాబట్టి యీప్రశ్నకు సమాధానము జీవుని యల్పత్వ మంగీకరించియే కావలసియున్నది.

వస్తుతః అనంతత్వము నిషేధాత్మకము. మనము మన యనుభవమునకు దెచ్చుకొనలేని లేక తర్కముద్వారా సిద్ధము చేయజాలని యంతముగల వస్తువును అనంతమందుము. ఈ రెండువిషయములు సాంతమస్తిష్కమున కసంభవము కానేరవు. మనము నిత్యము అంతముగల వస్తువులను జూచుచుందుము. కొన్ని దేశాపేక్షచే సీమితములు; కొన్ని కాలాపేక్షచే పరిమితములు. మఱికొన్ని యుభయవిధముల పరిమిత

ములు. నేను వ్రాయ నుపయోగించు కలమొక చిన్నవస్తువు. దీనికి రెండు కొసలున్నవి. పొడవు మందము లున్నవి. కాబట్టి యిది దేశాపేక్షచే సీమితమై యున్నది. ఇది సాంతప్రదేశము నాక్రమించియున్నది. ఇది యనాదికాదు. దీని నెవడో చేసి యున్నాడు. దీనిని నేనిపుడు విరిచి భంగము చేయగలను. అప్పు డీకలముండదు. కాబట్టి యిది కాలాపేక్షచేతను సాంత మైనదే. నాకీకలముయొక్క సాంతత్వ మనుభవములో నున్నది. నామస్తిష్క మీ కలము సాంతమని బాగుగా తెలిసికొన్నది. కొన్నివస్తువు లీకలముకంటె పెద్దవి. కాని, వానికిని అంత మున్నది. నేను పర్వతమువంక చూతును. నాకు దాని శిఖరము కనబడును. ఆ శిఖరమే దాని యంతమని నేనెంతును. కాలము నపేక్షించియు నీపర్వత మొకనాడు నిర్మింపబడియుండును. తర్కశాస్త్రముసైత మీపర్వత మొకనాడు నశించునని చెప్పును. ఈవిధముగా బర్వతపు సాంతత్వమును నాకు తెలియును. కలము నెదుట జూచినపుడు దాని యంతము ప్రత్యక్షమగును. పర్వతము నెదుట నిలబడినపుడు దానిపొడవు వెడల్పుల యంతము కనుపింపదు. ఆసమయమున మనస్సునందు 'పర్వతము సాంతమైనను దీని పొడవు వెడల్పుల యంతము నాకు ప్రత్యక్షము కాకున్నది' అను భావ ముదయించును. నేను తర్కింపకున్నయెడల పర్వత మనంతమని చెప్ప సిద్ధపడవచ్చు. అట్టి పర్వత మనంతమని చెప్ప నిర్బంధించు వస్తువేదో తెలిసికొనవలసి యున్నది. అంతము లేకుండుటయా? అనుభవము లేకుండుటయా? అంతముగల మస్తిష్కము అనం

తము ననుభవము చేసికొనలేకుండుట స్వభావమే. మస్తిష్క మెంత చిన్నదైన నంత చిన్నవస్తువుల యంతమును గుర్తింప జాలదు. మానవ మస్తిష్కమునకు బర్వతమెట్లో, చీమ మస్తిష్కమునకు మన యింటిగోడయు నట్టిదే యగును. హిమాలయపర్వత తలమున నిలబడి మనము దాని పొడవు వెడల్పుల యంతమునుగాని, శిఖరపు కొననుగాని చూడజాలనట్లు, చీమకు మనయింటిగోడ కొనలును కనిపింపవు.

దీనింబట్టి మస్తిష్కముయొక్క సాంతత యనంతత్వమును దెలిసికొనుటకు సాధకమేగాని బాధకముగాదని తెలియుచున్నది. అనేక నిషేధాత్మక శబ్దములను మనమిట్లే ప్రయోగించుచుందుము. అవి యేర్పడినదియు నిందులకే. మనము సముద్రతీరమున నిలబడి దృష్టిసారించితిమేని మనకు జూచినంతవఱకు జలముతప్ప మరేమియు గనిపింపదు. దానికంతము కనిపింపదు. అందువలన సముద్రము నపారమందుము. అపారతానుభవము పారము కనిపింపకుండుటచేతనే కలుగును. మన శరీర మనల్పమై మనదృష్టి యతితీవ్రమై బొంబాయి ఓడరేవున నిలబడిన యాఫ్రికాతీరము కనిపించునేని, మనమనస్సున అరబ్ సముద్ర మపారమని తోపదు. ఒకతీరమున నిలబడి రెండవతీరము చూడగల యమునా గంగానదు లపారము లనబడుచున్నవా? నదీతటములు కనబడును. సముద్రతటములు కనిపింపవు. కాబట్టి యొకదాని నపారమనము. మఱియొకదాని నపారమందుము.

వాస్తవమున శిశువులు పుట్టగానే వారికి వస్తువుల యంతము నెఱుంగు కోరిక జనించును. వస్తువుల యంతము నెఱుంగ జాలకున్నంతవఱకు నవి వాని కనంతము లనియే తోచును. ఇట్టి యనంతభావము స్వభావముగానే మన హృదయములం దుండును. సాంతత్వము జ్ఞానముతోపాటు పెరుగుచుండును. కాబట్టి సాంతమస్తిష్కమునకు ననంత పదార్థముయొక్క యనంతత్వమును గుర్తించుట దుష్కరముకాదు. కాని, యనంత పదార్థమును బాగుగా తెలిసికొనుట దుస్తరమేగాక యసంభవము నగును. కారణ మేమన, ఏవస్తువు బాగుగ నెఱుగబడునో అది సాంతమే యగును కాని, యనంతమెట్లు కాగలదు? పందలకొలది వస్తువులను సాంతమస్తిష్క మనంతము లని యెంచును. కాని, జ్ఞానము వర్ధిల్లిన వెనుక వానిని సాంతము లని తెలిసికొన నారంభించును. వస్తుతః ఏవస్తువనంతమో జ్ఞానవృద్ధ్యనంతరము దాని యనంతత్వమే యధికముగా బోధపడును.

సాంతమస్తిష్కమున కనంతపదార్థపు టనంతత్వానుభవము కలుగగలదని యంగీకరించినను నీశ్వరు డనంతుడని యెట్లుసిద్ధమగును? పూర్వ మనంతపదార్థములని యెంచబడిన కొన్ని జ్ఞానము వృద్ధమైనకొలది సాంతములని యెఱుంగబడి నట్లు అల్పజ్ఞు డీశ్వరుని యనంతుడని యెంచినను జ్ఞానము పెరిగినతరువాత నాయీశ్వరుడును సాంతుడుగావలసి వచ్చునేమో? ఒకానొకదినమున మనము నీశ్వరుని యంతము జూడగలుగుదుమేమో యెవరెఱుగుదురు?

ఇంతియుగాక యీశ్వరుని యనంతత్వమునకు విరుద్ధముగా నొకయుక్తి చెప్పబడును. సృష్టిరచనను జూచి యీశ్వరుడున్నాడని మన మెఱిగితిమి. సృష్టి సాంతము. అది యనంతమని యెవ్వరు ననరు. కాబట్టి సృష్టిరచయిత కూడ సాంతుడే కావలయును. ఎవని క్రియ సాంతమో వాడనంతుడెట్లగును?

ఈ యాక్షేపమునకు సమాధాన మతిస్పష్టము. సాంతసత్త యనంతక్రియ నుత్పన్నము జేయనేరదు. కాని యనంతసత్త్రకు సాంతక్రియ దుస్తరముగాని యసంభవముగాని కాజాలదు. కారణమేమన సాంతత యనంతత్వమున కంతర్భాగము.

ప్రస్తుతమిట నీశ్వరానంతత్వమును మీమాంసింతము. ఒక విషయము నంగీకరించుటకు దర్కానుభవములు రెండును కావలయునని పైన వర్ణించియుంటిమి. మొదట యనుభవమును తీసికొనుడు. మనుష్యు డల్పుఁడని రెండవ యధ్యాయమున వివరించి యుంటిమి. సృష్టిశిరోమణి యయిన మనుష్యుడే యల్పుడయిన మిగిలిన ప్రాణుల యల్పతనుగూర్చి వ్రాయ నవసర ముండదు. మనకు సృష్టిలో నేపదార్థమును సంపూర్ణముగా తెలియదు. దానిలో నేదో యొకయంశ మజ్ఞాతమై యుండును. కాబట్టి మనము మన యనుభవము ద్వారా సృష్టిలోని ప్రతివస్తువునందును బ్రతిఘటనలోను ననంతనియమములకు దావుగలదని చెప్పగలము. విజ్ఞానము ప్రారంభమునుండి నేటివఱ కీనియమముల నన్వేషించుచునే యున్నది. అన్వేషణ పెరిగినకొలది యజ్ఞాత నియమ

సంఖ్యయు పెరుగుచునే యున్నది. మనమొక విషయము నెరిగినకొలదియు నది యధిక క్లిష్ట మగుచున్నది. ఉల్లిపొరలవలె నొకదానిలో మఱియొక నియమ మున్నది. వస్తుతః ఆకాశ విశాలత నెఱుగగోరి యం దెగుర నారంభించు పక్షులవలె మన విజ్ఞానుల స్థితి యున్నదని మా యభిప్రాయము. పక్షికి నాకాశమున నెగిరిన కొలది దాని విశాలత యనుభవమునకు వచ్చుచుండును. వాస్తవమున నీశ్వర సృష్టియు సాంతము కాదు. అనంతమే యగును.

దేశకాలముల నపేక్షించిచూచిన సృష్టి యనంతమనియే చెప్పనగును. కాలము నపేక్షించి చూడుడు. ఈసృష్టి కాది యున్నదా? మీ రవశ్య మున్నదందురు. కారణమేమన, సృష్టి కాదికలదని కల్పించియే యీశ్వరసిద్ధి నొనర్చితిమందురు. మన కంటె కగపడు సృష్టి కాదియుండుటలో సందియము లేదు. నిజమే కాని, సృష్టి స్వరూపముచే సాదికాదనిమా తాత్పర్యము. ప్రవాహరూపమున సృష్టి యనాది యని మాయభిప్రాయము. ఈ సృష్టికిబూర్వము సృష్టిలేదా? తరువాతనుండదా? అని మాప్రశ్నాభిప్రాయము. ఈసృష్టికి బూర్వోత్తరములందు సృష్టియుండు నని చెప్పుదు వేని మేముమఱల వానికిబూర్వోత్తరములలోసృష్టి యుండునా యుండదా? అని ప్రశ్నింతుము. ఉండునని సమాధానము వచ్చునేని సృష్టి ప్రవాహరూపమున ననాది యను మాసిద్ధాంతము సరియగుచున్నది. అనగా కాలము నపేక్షించి దీని కాద్యంతములు లేవని బోధపడుచున్నది. పగటికి దరువాత రాత్రి, రాత్రితరువాత పగలు వచ్చునట్లు జన్మమరణములు

ఉత్పత్తివినాశములు, సృష్టి ప్రలయములు, వీనిప్రవాహము నడుచుచునే యుండును. కాబట్టి సంస్కృతమున దీనిని సృష్టి చక్రమని పిలుతురు. చక్రమున కాద్యంతములు తెలియుట దుస్తరమైనట్లు, సృష్టిప్రవాహమునకు నాద్యంతములు తెలియవు.

కొన్ని మతముల వారు ముఖ్యముగా క్రైస్తవ మహమ్మదీయు లీ విషయము నంగీకరింపరు. ఈ రెండు మతములలో గల గొప్ప దోషమిదియొకటి. అందువలననే వారనేక సిద్ధాంతములలో నిరుత్తరు లగుదురు. సృష్టిప్రవాహము నంగీకరింపక పోవుటచే వారనేక యప్రామాణిక విషయముల నొప్పుకొనవలసిన వారైరి. ఈశ్వరుడీ సృష్టిని శూన్యమునుండి రచించెనని వారందురు. అభావమునుండి భావసృష్టి నుత్పన్నము చేసెనని యొప్పుకొనిన నీసృష్టికి బూర్వ మీశ్వరు డన్య సృష్టులకు గర్తగానుండినను ఇప్పటి సృష్టికి వెనుకటి సృష్టులకు నట్టి సంబంధమును స్థాపింపబడదు.

నిజముగా నీప్రస్తుతసృష్టి యీశ్వరుని ప్రథమశిల్పమే యైన పక్షమున నాస్తికులుచేయు నాక్షేపములకు సమాధానము మఱియొకసృష్టిలో నీశ్వరుడీదోషములను లేకుండ జేయగలడని యనుటకు వీలుండును. కాని, యితడు మానిర్ణయించిన యీశ్వరుడు కాజాలడు. మఱియు క్రైస్తవమహమ్మదీయులచే నంగీకరింపబడిన యీశ్వరుడును కాజాలడు. ఈశ్వరుని సృష్టిలో నిది ప్రథమ సృష్టియేయైన ఈశ్వరుడీజంజాటము నేల పైనిడుకొనెను అనునాక్షేపము మొదటిదగును. ఇంతవఱకు సృష్టి

నెన్నడుచేయని యీశ్వరున కీసృష్టివిషయక జ్ఞానక్రియాదు లెందు కేర్పడినవి? ఎట్లేర్పడినవి? ఇంతకుపూర్వమే జ్ఞానాదు లున్న నవి నేటివఱకు నెందుకు గార్యకారులు కాలేదు? ఈశ్వ రుని కిది స్వభావమన నొప్పదు. కారణమేమన, నిత్యము సృష్టి యేర్పడుచు నశించుచు నుండిన స్వభావమన వీలగును స్వభా వము నిత్యముగా నుండునుగాని యకస్మాత్తుగా నేర్పడునా? క్రొత్త ఘటనలకు గారణము నుండకతప్పదు. క్రొత్తఘట నకు కారణము నడుగుటయు మానవునకు స్వభావము. నేనెల్ల పుడుచేయు నుచ్ఛ్వాస నిశ్వాసములను గూర్చి యెవరును ప్రశ్నింపరు. కాని, నా ఉచ్ఛ్వాసనిశ్వాసములలో హెచ్చు తగ్గులు కలిగినచో వానికి గారణమేమని యందఱును బ్రశ్నిం తురు. ఇట్లే యీసృష్టి మొదటిసారి సృష్టింపబడినదనిన 'ఎందు కని? ఎట్లు?' అను ప్రశ్నలు కలుగకపోవు.

క్రైస్తవ మహమ్మదీయులచే నీప్రశ్నకు సరియైన సమాధాన మింతవరకు నీయబడలేదు. ఈ ప్రశ్న వారి హృద యములందు నుదయింపకుండదు. వారును మానవులే. వారి మనోవిజ్ఞాన మొకటి, మన మనోవిజ్ఞానము మఱియొకటియును గాదుగదా? వారును నీసృష్టియందే యున్నారు. మఱియొక ప్రపంచమున గాదు. కాని వారున్న సామాజిక పరిస్థితులను బట్టి యిటువంటి సమస్యల నాలోచించుట కవసరము కలుగ కుండవచ్చు. అవసరము కలిగినపు డాకాశమువంక జూచుట కన్న గత్యంతరము వారికి తోచినది కాదు. కొంద రిట్టిప్రశ్న లొనరించుటయే తమకు తగదని చెప్పుదురు. సమాధానము

చెప్పజాలని ప్రశ్నల నుదయింపజేయరాదని వారి యభిప్రాయము. కాని ప్రశ్నలు బుద్ధిననుసరించి యుదయించుచుండును. వానిని కూడదనిన నూరకుందురా? ప్రశ్నల నుదయింపజేయుటలో సహాయకమగు బుద్ధి సమాధానములను వెదకుటకును, దోడ్పడును. కనుక మాస్తికులు ఈశ్వరుడు తమకు బుద్ధిని వంచించుట కిచ్చెనని యెంచుటమాత్రము తగదు. కఠినమైన సమస్యలనుగూడ బరిష్కరింపదగిన వస్తువేదైన మనుష్యుల చెంతనున్న నది బుద్ధితప్ప మఱియొకటి కాదు. తినుబండముల మొదలు గొప్పగొప్ప పరమార్థములకు సంబంధించిన ప్రశ్నలనుగూడ నిదియే పరిష్కరించును. వ్యక్తులద్వారా గాని, సమాజవ్యాజమునగాని దీని నణచుటమాత్రము మానవజాతి కల్యాణము నడ్డపరచుచే యగును. పెక్కుమంది యంధవిశ్వాసమును ఆస్తికతకు రక్షకముగా తలంచిరి. కాబట్టి వారు తమ మతకర్తలను గురించిగాని మతమును గురించిగాని యితర విషయములలో ప్రశ్నించినట్లు ప్రశ్నించుటకు వెఱతురు. అక్కడ బుద్ధి వికాసము నడ్డగింతురు. ముందుగానే వారు వానియందు దైవీశక్తుల నంగీకరించి యుందురు. అందుచే వారు కల్పిత సిద్ధాంతములను విశ్వసింపవలసిన వారగుదురు. ఎట్లన క్రైస్తవమత ప్రవర్తకుడైన పూజ్యక్రీస్తు ఈశ్వరునకు ముద్దుబిడ్డడు. మహమ్మదీయమత సంచాలకుడైన హాజరత్ ముహమ్మద్ ఈశ్వరున కొక విశిష్టదూత. కాబట్టి వీరిచే సమాధానము చెప్పబడదగిన ప్రశ్నలనే వేయవలయును గాని యితరముల నడుగరాదు. మన మొక భవనము నిసుకగోడలపై

నిర్మించి భవన రక్షణకొరకు గోడల రక్షణ మవసరముగా నెంచి వానికి తాకిడి కలుగకుండ జూతుము. కాని యిసుక గోడ లెన్నాళ్లు నిలుచును? ఒకనాడు కాకున్న మఱి యొక నాఁడైనను భవనముతో బాటు నేల నంటక తప్పదు. ఇట్టి యంధవిశ్వాసములే నాస్తికతా ప్రచారమునకు ముఖ్యకారణ ములు. పైలేఖవలన సృష్టి యనాద్యనంతమని జూప యత్నిం చితిమి. అనాద్యనంతముల కర్త యొక్కఁడే. సాది వస్తువు లనంతము లనబడవు. ఒక కొనయున్న రెండవకొనయు నుండక తప్పదు. ఒక్కఁగట్టుగల నది లోకమున నుండునా? కాలము స్వయముగా నొక నిత్యపదార్థము. దానికాద్యంతము లెక్కఁడను లేవు. దానినే వాస్తవమున నిత్యత (Eternity) అందురు.

దేశము నపేక్షించిచూచినను సృష్టి సాంతము కాదు. సృష్టియు నడి గొలుసునం దనేక గొళ్లెములున్నవి. ఒక్కొక్క గొళ్లెమున కంతమున్నను గొలుసునకు మాత్ర మది కనిపింపదు. మనుష్యుఁడు సృష్టిలో నెంత భాగమును తెలిసికొనగలిగెనని విచారించిన మనకు మనుష్యుఁడెంతయల్పుడో తెలియుగలదు. మానవజాతి విజ్ఞానమునంతటిని రాశిగా జేయగలిగిన నా జ్ఞానరాశికి సృష్టిలోగల జ్ఞానరాశికిని ఆవగింజకు బర్వతమున కున్నంత భేదముండును. గణితమును తెలిసినవారావగింజయు, హిమాలయముయొక్కయు పరిమాణముల నిష్పత్తి Ratio తెలిసికొనుటలో సఫలులు కావచ్చునుకాని సృష్టి పరిమాణ మనుమాత్ర మెఱుగజాలరు. ఈసృష్టి యొకానొక స్థలమున

సమాప్తమైనదని మన మెఱుగగలమా? పెద్దపెద్ద వైజ్ఞానికుల నడిగిచూడుము? వారేమందురో! విజ్ఞానము, జ్యోతిషము సృష్టి యనంతమనక సాంతమని చెప్పగలవా? ఈవిషయమున సర్ ఆలివర్‌లాజ్ ఎంతచక్కగా వర్ణించినాడో చూడుడు.

"వైజ్ఞానికులదృష్టితోనే ప్రపంచమునగల యతిస్వల్ప వస్తువులలోనొకటియగు నొక గులకరాతి మూలకారణమును గూర్చిన జ్ఞానముకూడ మనకులేదని యంగీకరింపకతప్పదు. కొండరాళ్లు తునకలై యిసుకయగును. ఆయిసుక మఱల కలసి కొండరాళ్లుగా నేర్పడును. దీనింబట్టి యనంతత తెలియునుగాని మూలకారణము తెలియనేఱదు. అనంతత మనుష్యుని జ్ఞానమునకు బరమైయున్నది. మనము దానినుండి పారిపోవుదుము. కాని యవకాశమున నింతకంటె నేమగును?

మఱియు నవకాశ విషయమున నట్లో కాలవిషయమున మాత్రమట్లేలకాదు? ఈవిషయమున నెంతో చెప్పవచ్చును. కాని, పోనిండు. విజ్ఞానమునకు నాదిమూలమును గురించి యేమియు తెలియదని మన మంగీకరింపవలయును. అండము మొదలా? అండజమా? ఇది యాజటిలసమస్యలో నొక సాధారణ రూపము. మట్టితో నేర్పడిన గ్రహరూపమగు నీభూమికి నారంభముకలదు. దీనికొక యితివృత్తమున్నది. ఇందు సందేహములేదు. విజ్ఞానముగూడ దీనిని కొంచెమో గొప్పో తెలిసికొనియుండుటయు సత్యమే. ఇది కలిగియున్ననాటి విషయమునుగూడ తెలిసికొనవచ్చు. చంద్రుడెట్లు దేనినుండి యుత్పన్నమయ్యెనో యనుమానింపగలిగిరి. ఇట్లొకవిధముగా భూచం

గ్రములయుత్పత్తి తప్పక జరిగియుండెను. అంతకుపూర్వమిది మిగిలిన సౌరమండలమునకు సమానముగా (Nebula) భాగమై యుండెను. ఈ సూర్యమండలము మరల నొక దూరస్థపదార్థముతో ఢీకొని మరల 'నెబులా' రూపము నొందుటయు సంభవముకావచ్చు. కాని సృష్టిముందిది యత్యల్పము. ఇంద్రియగోచర సృష్టియెదుటను నిది యొకవస్తువే కాదు. మనకన్నుల యెదుట నిత్యము వస్తువులు ఢీకొనుచుండును. సృష్టిలో భిన్న భిన్న పరిమాణముల ప్రకృతిరాసులున్నవి. ఒక సౌరమండలపు చరిత్ర వ్రాయగలుగుట సంభవముకావచ్చు. దానిజన్మమృత్యువులుగూడ. వానిలో నర్బుదవర్షములు యంతరముండిన నుండవచ్చు. కాని దీనితో నేమి? ఇది జీవనమున నొకచిన్న యంశము మాత్రమే. అనంతసృష్టిలో క్షణమాత్రము. బాలుడు నీటిబుగ్గల ఆద్యంతముల నెఱుగగోరినట్లు చరిత్రదృష్టి జన్మమునకు బూర్వము, మృత్యువునకు దరువాతను గలయవస్థ నెఱుగగోరుచున్నది. దీనిరూపము క్షణికము. కాని యిది దేనివలన నేర్పడినదో యదినిత్యము". (సర్.అలివర్ లాజ్)

అనంతనియమము, అనంతదేశము, అనంతకాలము వీనికొఱకు అనంతుడయిన నియంతయు నవసరము. కాబట్టి ఈశ్వరు డనంతుడు. సాంతుడయిన సృష్టి నెన్నడు రచింపజాలడు. డీక్ ఇంజ్ ఇట్లు చెప్పియున్నాడు.

"సృష్టినిరచించు చేతనశక్తి దానిని నియమము నందుంచును. అందులకది యనంతమై యుండవలయును. కారణమేమన, సాంతుడైనజీవుడు తనకందరాని యుపరిప్రపంచమును

గూర్చి యది యెట్లున్నదియూ నెరుగజాలడు. వీరిలో నెవరును సృష్టివిషయము నెక్కుడెఱుంగరు. సృష్టిలో ననేకభాగములు పాంత జీవున కందరానివిగా నున్నవి. కాబట్టి సృష్టివిషయమున నేవిధిశ్చయింప దలచినను సృష్టికర్త తన జీవనమును సృష్టియందేగాక దానికి బాహ్యమునను గడుపుచున్నాడు. అనగా నతడు సర్వోపరిభాగమున నున్నాడని యెంచియే నిశ్చయింపవలయును."

'సృష్టియందు ప్రకృతిచ్ఛాయ, ఈశ్వరునిబుద్ధియు గనిపించుచున్నవి. సృష్టికర్త నిత్యుడుకాబట్టి సృష్టి యెల్లపుడు నుండును. సృష్టికర్త యనంతుడు. కనుక సృష్టియు ననంతము. రచయిత యేకరసుడు కాబట్టి సృష్టి నియమవంతము. కర్త బుద్ధిమంతుడు గనుక సృష్టియు బుద్ధిమయమై యున్నది.'

వేదములందీశ్వరుని యనంతతను గూర్చిన ప్రమాణము లత్యుత్తమము లనేకము లున్నవి.

"యోభూతంచ భవ్యంచ సర్వం యశ్చాధితిష్ఠతి"
అధర్వ. ౧౦. ౨౩. ౪. ౧.

ఈశ్వరుడు భూతభవిష్యద్వర్తమానములకు బరుడు.
'సహస్రశీర్షా పురుషః, సహస్రాక్షః సహస్రపాత్
సభూమిం విశ్వతః స్పృత్వాఽత్యతిష్ఠ ద్దశాంగులమ్'
యజు. ३౧. ౧.

ఈశ్వరుడు (సహస్రశీరములు) అనంత బుద్ధి (సహస్రాక్షములు) అనంతశక్తి (సహస్రపాదములు) అనంత క్రియాశక్తి

కలిగి సృష్టినంతయూ వ్యాపించి దానినిమించి యున్నాడని యర్థము.

డీన్ ఇంజ్ ఈశ్వరుడు సృష్టిలో నుండక దానికి బరమున నున్నాడని చెప్పుచున్నాడు. కాని ఈశ్వరుడు సృష్టికి లోపల వెలుపల నన్నిస్థానములందు నున్నాడని వేదము బోధించు చున్నది. సృష్టియం దుండుట చేతనే యతడు పురుషుడు (పురి బ్రహ్మాండే శేతే ఇతి పురుషః) అనబడెను. వేదదృష్టియం దీశ్వరుడు సృష్టికి దూరముననుండి యతనిఛాయ సృష్టిపై బడుట సంగతము కాదు. సృష్టి ఈశ్వరునిచే వ్యాపింపబడియున్నది.

మఱియొక స్థానమున నీయనంతత రూపాంతరమున వర్ణింపబడియున్నది.

'ఏతావా నస్యమహిమాఽతో జ్యాయాగ్ంశ్చ పూరుషః
పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యా మృతం దివి'

'దాని మహిమ యింతయే. కాని యీశ్వరు డంతకంటె గొప్పవాడు. సృష్టియంతయు నతనిలో నొకచతుర్థాంశమే. అమృతమయిన వాని యధికాంశము సృష్టికి బరమున నున్నది.' సృష్టి రచింపబడిన పదార్థము; నిత్యము కాదు. అందువలన దీనిలో నీశ్వరుని యమృతత్వ మెట్లుగాననగును? సృష్టినిజూచి వాని నింతేయని తలచువారు పొరబడుచున్నారు. దయానంద మహర్షి యీమంత్రమునిట్లు ఋగ్వేదాది భాష్యభూమికయందు వ్యాఖ్యాన మొనర్చి యున్నాడు.

"అస్య పురుషస్యభూతభవిష్యద్వర్తమానస్థో యావాన్ సంసారోఽస్తి తావాన్ మహిమా వేదితవ్యః ఏతావా నస్య

మహిమాఽస్తిచేత్తర్హి తస్య మహిమ్నః పరిచ్ఛేదః ఇయత్తా జాతేతి గమ్యతే. అత్రబ్రూతే నైతావన్మాత్రఏవ మహిమా కింత్వతోఽప్యధికతమో మహిమా అనంత స్తస్యాస్తీతి గమ్యతే అత్రాహ (పాదోఽస్య) అస్యానంత సామర్థ్యస్యేశ్వరస్య (విశ్వా) విశ్వాని ప్రకృత్యాది పృథివీపర్యంతాని సర్వాణి భూతాని ఏకః పాదోఽస్తి ఏకస్మిన్ దేశే అంశే సర్వం విశ్వం వర్తతే. (త్రిపాదస్యా) అస్య దివి ద్యోతనాత్మకే స్వస్వరూపేఽమృతం మోక్షసుఖమస్తి. (౧౨౧. పృ)

ఈశ్వరుని యమృతరూప స్వస్వరూపము సాంతసృష్టిని జూచినంత మాత్రమున తెలియదు. ఈశ్వరుని యనంతత్వ మతని యమృతత్వమున నున్నది. అమృతత్వమే వాస్తవమున సానందము. కారణమేమన, దానికి విపరీతమగు మృతియో నాశమునకు ద్యోతకమని ఋషి తాత్పర్యము.

ఈశ్వరు డనంతుడని యంగీకరించుటేల? సాంతేశ్వరుని వలన మనకు ప్రయోజనము సిద్ధింపదా? ఈశ్వరు డొకస్థానమున గొంతకాల ముండుననిన గలుగు హానియేమి? ఆస్తికు లట్లుతలపరా? క్రైస్తవుల గ్రంథములలో నీశ్వరుడు నాలుగవ యాకాశమున నున్నట్లు చదువుచున్నాము. మహమ్మదీయుల గ్రంథములలో నాకాశముల సంఖ్యను బెంచి యేడవయాకాశమున నున్నట్లు వర్ణించియున్నారు. హిందూపురాణములలో విష్ణువునకు వైకుంఠము క్షీరసాగరము మున్నగు శయనాగారము లుండనేయున్నవి. ఇట్లే భిన్నభిన్న ధర్మగ్రంథములలో భిన్నస్థానము లీశ్వరునకై వర్ణింపబడియున్నవి.

పైనవర్ణించినట్లీశ్వరునకు విశేషస్థానములున్నచో నీశ్వరుని యనంతత్వము ఖండింపబడుటలో నెట్టి సందేహము లేదు. కాని ప్రతిధర్మగ్రంథములోని ప్రతివిషయమును బోధించుట మావని కాదు. ఈమతములలో నీవిషయములన్నియు నెట్లు ప్రవేశించె ననునది యొకవిచిత్రగాథ. దానిని వర్ణించుట కిది యుచిత స్థలము కాదు. ఏమతగ్రంథములలో నీశ్వరుని కొఱకు మనోరంజకములు, మానవచిత్తాకర్షకములు నగు భవనములు వర్ణింపబడినవో యాగ్రంథములందే యీశ్వరుని యనంతత్వమును వర్ణింపబడియున్నదని మొదట మేము చెప్పదలచితిమి. అనగా నన్నిమతములలోను నీశ్వరుని యనంతత్వము మాత్రము సమానధర్మముగా నంగీకరింపబడి యున్నది. కాని దీనికి తోడుగా గొన్నిమతములవా రీశ్వరునికి స్థానవిశేషములను కల్పించియున్నారు. ఇది పరస్పర విరుద్ధమే. ఈవిరోధమును దూర మొనర్చు బాధ్యత ఆయా మతకర్తలమీదను, అనుచరుల మీదను ఉన్నది. మఱియొక విషయమేమన, నీమతానుయాయులు, స్వయముగా నీస్థానములను స్థానవిశేషములుగా నంగీకరింపక, యాలంకారిక వర్ణనలని చెప్పసాగిరి. నేడు శిక్షితుడైన క్రైస్తవుడుగాని, మహమ్మదీయుడుగాని యీశ్వరుడు తత్తదాకాశములలో నున్నాడని చెప్పసాహసింపడు. బుద్ధిమంతుడైన పౌరాణికుడును ఈశ్వరుడు మత్స్యమువలె నొకసముద్రమున నీదులాడుచున్నట్లు విశ్వసింపడు.

ఈమతము లీశ్వరుని యనంతుడని యంగీకరింపకున్న జరుగుహానియేమి? అనంతసృష్టిని రచించుట కనంతేశ్వరు డావ

శ్యకమని పైన వర్ణించియేయున్నాము. ఈశ్వరు డొకస్థానమున నున్నాడని కల్పించిన నతనితరువాత నేమున్నది? శూన్యమా? శూన్యమననేమి? అదియొక వస్తువిశేషమా? అయిన శూన్య మెట్లగును? సర్వాభావమే శూన్యమందుమా? ఆ యభావ మెట్లు స్థితమగును? ఇది మానవమస్తిష్కమునకు నందరాని విషయము. ఈశ్వరుడుత్పన్నుడగుటయు నెట్లో తెలియదు. ఈశ్వరు డుత్పన్నుడైన నెవనినుండి? ఎట్లు? ఈశ్వరునకు బితరు లున్న వారికిని బితరులుందురు. ఇట్లుప్రశ్నించిన అంతము గాన నేరము. అనవస్థాదోషమున జిక్కి తబ్బిబ్బుల మగుదుము.

వస్తుతః ఈశ్వరుడొక కొన్ని వస్తువుల కలయికచే నేర్పడియుండడు. అందువలన అతనిపుట్టుక సిద్ధపడదు. పుట్టని వస్తువు సమయాపేక్షచే ననంతమగును. దీనిలో సందేహము లేదు. కాబట్టి ఈశ్వరుడు సర్వవిధముల అనంతుడని తేలు చున్నది.

కొందఱు మఱియొకవిధమున నాక్షేపింతురు. ఈశ్వరుని సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు నను నామములచే బిలుతురు. కాబట్టి యతడనంతుడు కాజాలడు. కారణమేమన, సర్వశబ్దము సాంతద్యోతకము. సర్వమానవులు, సర్వవస్తువులు, సర్వసాధనములు, ననుచోట సర్వశబ్దము సాంతవాచకము. కాబట్టి యీశ్వరుని సర్వవ్యాపకు డనియో లేక, యనంతు డనియో చెప్పుడు. రెండును చెప్పుటకు వలనుపడదు. పరస్పర విరుద్ధమగును. అంత జ్ఞానము కలుగనంతవఱకు మనము సర్వ శబ్దమును బ్రయోగింప నేరముకాదా?

మాదృష్టియందీయాక్షేప మనుకొనునంత సారగర్భిత మైనది కాదు. ఇందు కాకదంతపరీక్ష యొనరింపబడినది. సర్వ శబ్దమువలన (సీమ-పొలిమేర- హద్దు-అంతము) తెలియబడు టలో సందియము లేదు. కాని సర్వశబ్దమును వాడినంతమా త్రమున ననంతత్వము ఖండింపబడదు. నేనీశ్వరునికొఱకు మూడుశబ్దముల నుపయోగింతును. సర్వజ్ఞుడు, అనంతజ్ఞుడు, హృదయజ్ఞుడు; అనగా నీశ్వరునకు అనంతవస్తువుల జ్ఞానమున్నది. సర్వవస్తువుల జ్ఞానమున్నది. నాహృదయజ్ఞానము నున్నది. ఈమూడు వాక్యములలో నుత్తరోత్తర వాక్యములు సంకో చమును బోధించును. కాని ఇవి పరస్పరవిరోధమును గాని ఖండనను గాని బోధింపవు. కారణమేమన ననంతుడైన యీ శ్వరుడు మానవ విచారానుసారముగా సర్వశబ్దముచే జెప్ప బడు పదార్థములలోను నుండును. అట్లే నాహృదయమునం దుండుటలోను హానియేమియు లేదు. అనంతజ్ఞానికి సర్వజ్ఞాన ముండుటలో నాశ్చర్యమేమి? సర్వము సాంతబోధకము గాబట్టి సాంత మనంతమున నిమిడియే యుండును. విరుద్ధ మెట్లగును? కాబట్టి యీశ్వరునకు సర్వానంత శబ్దముల నుప యోగించుటలో నెట్టిప్రమాదమును గనిపింపదు.

ఈశ్వరునకై, యనంతపదమేగాక, అజన్ముడు, అనాద్య నుపముడు, అజరుడు, అమరుడు మున్నగు శబ్దములు వాడ బడును. ఇవన్నియు ననంతమున రూపాంతరము లనదగి యుండును. ఇందు జరాజన్మ మరణములన్నియు సంతతా బోధకములు. అనంతతను బాధకములును. అందువలన నజ

రామరాది శబ్దము లనంతుని పర్యాయములుగా వాడబడుచు ననంతత్వమునే బోధించును.

అనంతతావిషయమున నిట మఱియు రెండుప్రశ్నలను వివరింప నెంచుచున్నాము. పాఠకుల కీయధ్యాయమున విశేషాహ్లాదము కలుగకుండుట యసంభవముకాదు. కాని చేయునదేమి? ఆస్తికవాదమునకు ననంతత్వముతో గల ఘనిష్ఠ సంబంధమును గుర్తించి దానినింతగా మీమాంసింపక తప్పి నదికాదు.

మొదటిప్రశ్న:—ఈశ్వరుడు సాంతుడైననేమి? అనంతుడైననేమి? మన వ్యావహారిక జీవనముతో ననంతత్వమున కేమిసంబంధము?

ఈయనంత మీమాంసకున నేల సమయము వెచ్చింపవలె? సాంతానంత క్లిష్టతను విడదీయకున్న గలుగు హాని యేమి?

మనహృదయమున ననంతత్వ ప్రభావ మధికముగా నున్నది. ఆస్తికవాదము మనయిచ్చవచ్చినట్లు గ్రహించుటకు గాని, త్యజించుటకుగాని సాధ్యమైనది కాదు. దీనికి మానవ మస్తిష్కముతో సంబంధమున్నది. జీవనమున దీనిచే గలుగు మార్పునల్పము. ఆస్తిక నాస్తికుల జీవనములొకటిగా నుండ నేరవు.

మేడమ్ బ్లేవట్‌స్కీ యుక్తమే వచించినది.

"ఈశ్వరుడు లేడు! జీవుడు లేడు! ఓహో! ఇది యెంతటి భయంకరమయిన వినాశకరమైన కల్పన? ఉన్మత్తుడు ప్రమా

దియునగు నాస్తికుని యెదుట, ప్రకృతి విస్ఫులింగముల యపరిమితశృంఖలమునకు నిట్టి కురూపకల్పన నొనర్చుటా! దాని యుత్పత్తి శూన్యమునుండి యైనది. స్వయముగానే ప్రకటమైనది. స్వయముగానే యున్నది. స్వయముగానే పరిణమించుచున్నది. ఈస్వయ మనునదియూ నేమి లేదు. ఇదియొక శక్తియూ గాదు. పురుషుడు కాడు. ప్రవహించుచున్నది. కాని యెట నుండియూ గాదు. దీనికి గారణ మొందు లేదు.సర్వధా౽భావమే. ఇది యనంతచక్రము. అంధము, నిష్క్రియము అకారణము."

నాస్తికతా విషయుక్త ప్రభావమునుండి జీవనమురక్షింపబడవలయునన్న బరమాప్తుని యనంతతా విచారమే సాధనము. అనంతభావము హృదయమునశ్రద్ధనుత్పన్నము చేయును. మానవుని విశాలు నుదారు నొనర్చును. అధఃపతనమునుండి రక్షించును. అనంతుడగు నీశ్వరుని యనంతసృష్టి నొకమాటు కన్నులుదెరచి చూచినపుడే మానవహృదయమున వర్ణింపనలవిగాని ఉల్లేఖింప నశక్యమగు ప్రభావమేర్పడును. మనుష్యుని పరిమితాక్షులు సృష్టిలోని పరిమితభావమునే చూడ గలిగినను, విశాలసృష్టియందు స్వేచ్ఛగా విడువబడినను, దృష్టి సీమితస్థానములే యాక్రమించి నప్పటికి కంటియందు సూర్యుని యపారప్రకాశమున విచరింప నాంతరికయిచ్ఛ వొడముచు. దీనిని బ్రతి మానవాత్మయు ననుభవించును. ఈయాంతరికేచ్ఛా ప్రయోజనము సాధారణముగా తెలియదు కాని దీనియుపయోగము లేకపోలేదు. ఉపయోగమే లేకున్న యిచ్ఛవొడమనేరదు. గదిలో నింపుప్రకాశమున పుస్తక

మును జూచుచుందుము. కాని వెలుపలికి వెళ్లి యనంతాకాశ మున ననంతప్రకాశము నాలంబుగా గొనినప్పుడు నీకొక యపూర్వానందము కలుగును. ఎల్లపుడు మూతగదులలో పని చేయువారికి దగినంతవెలుతు రక్కడ లభించినను వారి కన్నులు వికృతములగును. కారణమేమన, కన్నులు తమ యల్పతను విశ్వానంత్యముతో కలిపి యానందము ననుభవింప వలయుననెడి కోరిక పూర్తికాకుండుటయే. జీవునిదశయు నిట్టిదే. జీవుడల్పుడు. అతని మస్తిష్క మల్పము. అతని యంతఃకరణము దృష్టియు నల్పమే. కాని ఇట్లల్పుడయ్యు నతనికి ననంత విశ్వములోని యనంతత్వముతో సంబంధ మేర్పరుచుకొని తద్ద్వారా పొందు నానంద మన్యథా లభింపదు. ఋగ్వేదమున నొక ఋక్కుగలదు.

"తద్విష్ణోః పరమం పదమ్,
సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షురాతతమ్."

అనగా బుద్ధిమంతు లనంతపరమాత్ముని పరమపదమును విప్పిన నేత్రము సూర్యుని జూచునట్లు సదా చూచుచుందురు అని తాత్పర్యము.

జీవేశ్వరుల సంబంధమును జూపుటకు నక్షిసూర్యుల సంబంధముకంటె నుత్తమయుదాహరణ మొండు లేదు. విప్పారిన నేత్రమే సూర్యునిజూచి యానందము ననుభవింపగలదు. రోగగ్రసిత నేత్రము దానిని పొందజాలదు. ఇట్లే బాగుగా వికసించిన హృదయ మీశ్వరసంబంధము వలన ననుభవింపగల యానందమును సంకుచితహృదయము పొందనేరదు.

అల్పజీవునకు ననంతేశ్వరునితో గలుగు సంబంధమే వికాస మనబడును. ఈయనంతతయొక్క పూర్ణానుభవమే వైదిక సాహిత్యమున ముక్తియని పేర్కొనబడినది. కాని పూర్ణ వికాస మొక్కమాటు కలుగనేరదు. ధనపతులకు దమ కోశ ములను నింపుట కొక్కొక్క దమ్మిడీ సేకరింపవలసి వచ్చును. ఇట్లే పూర్ణవికాసప్రాప్తికొఱకు ముందుగా చిన్నచిన్న వికాస శ్రేణుల ననుభవింపవలసి యుండును. ఈశ్రేణులే జీవుని యున్నతికి సోపానములు. వీనియం దతడా యనంతత్వము ననుభవమునకు దెచ్చుకొనును. క్రమముగా నొకనా డనంత సృష్టిలోని యానంత్యమున విహరించుటచే గలుగు ప్రఫుల్లత వలన మరల సంకుచితవలయమున నుండ నిచ్ఛగింపడు. అపార మగు నాకాశమున స్వేచ్ఛగా విహరింప నలవాటుపడిన పక్షి పంజరమున నేలబంధింపబడ గోరును? పంజరమును విడిచి యాకాశమున నెగురుటయే వికాసమున కారంభము. తుచ్ఛ మగు పంజరమున నేవగింపు, అనంతాకాశమున నవిచల ప్రేమయు నేర్పడుటయే వికాసమున కంతము. పక్షి కా యనం తాకాశమంతయు నావశ్యకమని దీని తాత్పర్యముకాదు. ఒక విధముగా నావశ్యకమనియు ననవచ్చు. పక్షికి ఎగురుటయే జీవ నోద్దేశమైన దానికెగురుటకు కావలసినంత యాకాశమే చాలును. కాని యెగురుట యొకయుద్దేశమునకు సాధనము మాత్రమే. అది కేవలము దానివికాసమున నొకశ్రేణి. ఎగురుట లోగల యుపయోగము పక్షి యల్పతకు ఆకాశమునగల యానంత్యముతో సంబంధమేర్పడుటయై యున్నది. ఈసంబం

ధమునకు బరిమితాకాశము చాలదు. ఇందుకనంతాకాశమే కావలయును.

జలము మనుజుని దప్పిక కవసరమందురు, ఎంతజలము? ఒకచెంబెడు లేక రెండుచెంబులు. అంతతో నతనికి తృప్తికలుగ వచ్చును. కాని సముద్రతటమున నిలబడి యాయనల్పజల రాశిని దిలకించునపుడు మానవుని హృదయమున విశేషానంద మేల కలుగుచున్నది? అంతజలమతని కవసరమా? అవసరమే. శారీరకతృష నడంచుటకుగాదు. అనంతతతో సంబంధమును జోడించుటకు, నాంతరికయల్పతను తొలగించుటకు నవసర మగుచున్నది. తన హృదయమును విశాల మొనర్చుటకు సైత మిది యవసరమే. ప్లేటో (Plato)నడుగుము. అతడేమనునో!

'సర్వాల్పసత్వములకు బరమున సర్వగౌణకారణము లకు, సిద్ధాంతములకు, నియమములకు నావలియొడ్డున నొక బుద్ధి-జ్ఞానమున్నది. అది యన్ని నియమములకు నాదిమూలము. అది యన్నివిచారముల కన్నిటికి నాధారమగు పరమవిచారము. అదే సృష్టికి రాజు. నియంత పదార్థము లన్నియు దమ స్వత్వ తత్త్వముల నా మూల సత్తనుండియే పొందుచున్నవి. సమస్త సృష్టియందు వ్యాపకమైయున్న సంఘటనము, సౌందర్యము, ఔన్నత్యముల కది మూలకారణము. శ్రేష్ఠతను సర్వోపరిత్వ మును నిమిత్తీకరించియే దీని నీశ్వరుడందురు. ఇదే యన్నిటి కధిష్ఠాత.'

ఈభావమే నిమ్నలిఖిత యుపనిషద్వాక్యమున మనము చూడగలము.

"నిత్యోనిత్యానాం, చేతనశ్చేతనానామ్, ఏకో బహూనాం యోవిదధాతి కామాన్" (కఠ. ౨.౫.౧౩.)

రెండవప్రశ్న:— జ్ఞానౌచిత్యమువలన ననంతత్వమున మార్పుగలుగునా?

జీవుడు తనయల్పత్వమును ఈశ్వరుని యనంతత్వమును గూర్చిన భావమును సాధారణముగా గలిగియుండును. కాని యజ్ఞాని బ్రహ్మానంత్యమును జ్ఞానియెంచినట్లెంచడు. కూపస్థ మండూకము అనంతమనగా కూపముకంటె నొక పెద్ద వస్తువను కొనును. ఇంతకంటె నెక్కువగా దానికి దెలియవీలులేదు. కాని దానినే తీసి యొక పెద్దసరస్సునందుంచిన దాని యనంతతాజ్ఞానమున బరివర్తనము గలుగును. అప్పుడది అనంతమనగా కూపముకంటె గాక పెద్దసరస్సుకంటెను పెద్దదని యెఱుంగును. మనుజునిస్థితియు నిట్లే. ఒకయాటవికుని హృదయమునను ఒక విజ్ఞాని హృదయముననను నీశ్వరానంత్యమునుగూర్చిన జ్ఞానముండును. కాని 'న్యూటన్' హృదయమునగల యానంత్య భావము, ఒకయాఫ్రికా నివాసియైన మూఢుడగు నీగ్రోహృదయమున నుండనేరదు. ఒకజ్యోతిర్విదుడు తారాగణముల పరిమాణాదులను లెక్కించి బ్రహ్మయొక్క బృహత్త్వముతో పోల్చి విచారించునపుడు వానిహృదయమున ననంతత అతివిచిత్రముగానే భాసించును. ఈశ్వరుని యనంతతవలన ప్రభావితుడు కావలయునన్న దనయున్నతియు నావశ్యకమగును. మన మౌన్నత్యమునందుకొలది మన క్షితిజవృత్తమును విశాలమగుచుండును.

ఇట్లే సృష్టివిషయకజ్ఞానము మనలో పెరిగినకొలది యీశ్వరుని యానంత్యజ్ఞానముకూడ మనలో పెరుగును.

మనము విచారించిచూతుమేని, సృష్టికి నారంభమున నేగుణము లీశ్వరునం దంగీకరింపబడెనో నేటికి నవియే యంగీకరింపబడుచున్నవి. అసభ్యజాతులలో నేగుణములున్నవో సభ్యులలో నేడవియే వికసించినవి. ఈశ్వరు నందఱు దయాళువు, పాలకుడు, అనంతుడు నందురు. కాని యీగుణవిషయికజ్ఞానము సభ్యులకు గలిగినంత పరిష్కృతముగా నసభ్యులకు కలుగదు. ఉత్పన్నవస్తువులను గూర్చి యెవరు బాగుగా విచారింతురో వారికే యుత్పాదకుని యుత్పాదకతానుభవ మెక్కువగా గలుగును. ఒకపిల్లవాడు గడియారమునుజూచి దీనిని నిర్మించువాడొక డుండునని యెంచును. కాని యొకపురుషు డాగడియారములోని ప్రతిచక్రమును తీసి విశ్లేషించి యాయాచక్రముల నట్లేర్పరచుటకు గలకారణముల నెఱింగినపు డాగడియారపు కర్తయొక్క బుద్ధివిశేషతను గుర్తింపగలడు. ఇట్లే సృష్టిలోని నానావిధవస్తువులను వేలువేలుగా విచారించినవాడు వానినిర్మాపకుడైన యీశ్వరుని యనంతత్వాదుల నెఱుగగలిగినట్లు సామాన్యబుద్ధులు, ఆపాతదృష్టులు నెట్లెఱుగగలరు?

---

# తొమ్మిదవ అధ్యాయము

## (కర్మ - ఫలము)

'చేసికొన్న వారికి చేసికొన్నంత' యనునది వ్యాపకలోకోక్తి. దీనిసమానార్థక లోకోక్తి ప్రతిదేశమునందును ప్రతియుగము నందును వాడబడుచున్నది. నాస్తికుడుగాని, యాస్తికుడు గాని, (ఆధ్యాత్మవాదిగాని, భౌతికవాదిగాని, ఆత్మవాదిగాని, అనాత్మవాదిగాని, విజ్ఞానిగాని, యవిజ్ఞానిగాని,పేడు వాడ నేల? ఎల్లరును, కర్మను తత్ఫలమును అవహేలన చేయనేరరు. ఐకకంఠ్యముతో నంగీకరింతురు. తులసీదాస్,

> కర్మప్రధాన విశ్వకరి రాఖా,
> జో జస కరే సో తస ఫల చాఖా, అన్నాడు.

కాబట్టి లోకమున సర్వసమ్మతమైన సిద్ధాంతమొకటి యున్నదనిన నది కర్మఫలవాదము మాత్రమే. 'యెట్లుచేయు దువో యట్లనుభవింతువు' అను లోకోక్తిలోగల సత్యమునకు విముఖులుండరు.

ఈ యధ్యాయమున నీసిద్ధాంతమున కాస్తికవాదము తోగల సంబంధమును విచారింపగోరుచున్నాము.

ముందు కర్మ, దానిఫలమునుగూర్చి మీమాంసించుట ఆవశ్యకము. తరువాత దాని పరిణామములను విచారింప వలసి యుండును.

మనుష్యు డొకడు చౌర్యము చేయును. ప్రభుత్వమతనిని కారాగారమున నుంచి దండించును. చౌర్యము కర్మయనియు

కారాగారబంధన ఫలమనియు లోకులందురు. ఇందు చౌర్యమును కర్మకోటియందు చేర్పగలవిశేషము దానిలో నేమియున్నదో విచారింపవలసియున్నది. కారాగారమును ఫలములో చేర్పగల లక్షణమేమి?

ఇట్లే మఱియొకమనుజుడు నెలరోజులు కూలిచేయును. మాసాంతమున యజమాని యాతనికి వేతనము నిచ్చును. కూలి కర్మ, వేతనము ఫలము ననబడును. ఇక్కడగూడ పైప్రశ్నలే యుదయించును.

కర్మ - దానిఫలము నను విషయము మిక్కిలిజటిలమైనదే. దీనివిషయమున ననేకు లనేకమతములు గలిగియున్నారు. కనుకనే గీతాకారుడు

"కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః"
(౪. ౧౬)

'కర్మ అకర్మల విషయమున విద్వాంసులును మోహితులైరి' అనెను.

మొదట కర్మశబ్దమున కర్థమును విచారింపుడు. కర్మ 'కృ' ధాతువువలన నేర్పడినదికాబట్టి క్రియయని యర్థము.

కణాదమహర్షి వైశేషికమున కర్మనిట్లు నిర్వచించియున్నారు. "ఏకద్రవ్య మగుణం సంయోగవిభాగే ష్వనపేక్షకారణమితి కర్మలక్షణమ్" (౧-౧-౧౭)

గుణముకాక, ఏకద్రవ్యాశ్రితమై సంయోగవిభాగములయందనపేక్షకారణము కర్మయనబడును.

అన్నంభట్టు తన తర్క-దీపికయందు

"సంయోగభిన్నత్వేసతి సంయోగసమవాయికారణం కర్మ" అన్నాడు. సంయోగముగానిదై సంయోగమునకు సమవాయికారణమగునది కర్మయని వాక్యార్థము. ఇట్టికర్మల నైదుగా లెక్కించియున్నారు.

"ఉత్క్షేపణ మపక్షేపణ మాకుంచన ప్రసారణ గమనాని పంచకర్మాణి" ఈలక్షణము వలన నన్నివిధములయిన గతియు గర్మ యనబడుచున్నట్లు తెలియుచున్నది. వాయువు వీచుట, పృథివి యాకర్షించుట, అగ్నిజ్వాలలెగయుట, వృక్షము నుండి ఫలములు పడుట, చీమలపరుగు, మనుష్యుల నిమేషోన్మేషములు, మున్నగు క్రియలన్నియు కర్మలే.

కాని, మనము 'కర్మ-దానిఫలము'ను గూర్చి మీమాంసించునపుడు కర్మనీయర్థమున గ్రహింపము. ఇట యోగరూఢార్థమున కర్మనుదీసికొందుము. వాస్తవమున, సుఖదుఃఖరూపఫలము ననుభవించుటకై కర్తచే నుత్తరదాతృత్వము వహించి చేయబడు మానసిక వాచిక శారీరకక్రియలు కర్మలనబడును.

ఇంతకుబూర్వమే మేము చౌర్యము, కూలి యను రెండుదాహరణముల నుల్లేఖించి యుంటిమి. ఈరెంటియందును కర్తలు తమతమ కర్మలకుత్తరదాతలై యుండిరి. కారాగారప్రాప్తి, వేతనప్రాప్తి రెండును క్రియలయినప్పటికి కర్మలలో వీనిని గణింపరు. కారణమేమన కర్తలకిందు స్వాతంత్ర్యముండదు.

కాబట్టి కర్మనాచరించుటలో గర్తకు స్వాతంత్ర్య ముండ వలయును. స్వాతంత్ర్యములేకున్న నట్టిక్రియ కర్మయనబడదు. నిమేషోన్మేషములలోను ఉచ్ఛ్వాసనిశ్వాసములందును మనకు స్వాతంత్ర్యముండదు. కాని, చౌర్యాదులలో నుండును. అందు వలన చౌర్యము కర్మ.

ఏప్రయోజనము నుద్దేశించి కర్మ యాచరింపబడునో ఆప్ర యోజనముగాని, క్రియాసమాప్తికాని కర్మఫలము కాదు. ఎట్లన ధనప్రాప్తికొఱకు ఒకడు చౌర్యమాచరించును. చౌర్యములలో నెక్కుడుధనము లభించుటయు గలదు. కాని యది చౌర్య ఫలము కాదు. చౌర్యక్రియాసమాప్తియు ఫలము కాదు. చౌర్య ముచేసిన నొకప్పుడు ధనములభించుటయు గలదు. పట్టుపడు టయు గలదు. కాని వీనినిరెంటిని మేము ఫలములనము.

మంచిప్రయోజనము దృష్టియందిడుకొని చేయబడిన కర్మ పుణ్యమనబడును. చెడువిచారముతో జేయబడిన పాప మనబడును.

ప్రయోజనములలో మంచిచెడుగు లెట్టివనున దొక ప్రశ్న. కారణమేమన ప్రయోజనములోని మంచిచెడుగులనీ దనే కర్మమంచిచెడుగు లాధారపడుచున్నవి. దీనికొఱకు సృష్టిని నిరీక్షింపవలసియున్నది. సృష్టినియమము లోక విశేషోద్దేశ మును బూర్తి జేయును. ఆయుద్దేశము జీవులకల్యాణము. జీవుడు కర్మనొనరించుటలో స్వతంత్రుడేగాని యాస్వాతంత్ర్యము పరి స్థితుల కంతర్గతమై యుండును. ఒకవిధముగా జీవుడు కర్మనొన రించుటలో స్వతంత్రుడు, మఱియొకవిధముగా బరతంత్రుడును.

అనగా నరుని స్వాతంత్ర్యమునకు సీమలున్నవి. వానినిదాటి యతడేమియు జేయరాదు. ఈపరిస్థితి నరుడు నిర్మించుకొన్నది కాదు. అది సృష్టినిర్మాతృకార్యము. ఈపరిస్థితి జీవునకు గర్మ నొనరించుటలో స్వాతంత్ర్యమునొసంగుచు నంతమున నరునికి శుభముకలుగునట్లు రచింపబడినది.

ఈనియమములను బోషించుచు సిద్ధించుప్రయోజనము పుణ్యమనియు, నియమోల్లంఘనచే నేర్పడునది పాపమనియు వ్యవహరింపబడును. దీనినే దృష్టియందిడుకొని ఋషులు, మునులు ధర్మగ్రంథములందు బుణ్యపాపములను వివేచించి యున్నారు. సామాన్యమానవులు సృష్టినియమములను సరిగా నెఱుంగజాలరు. కాబట్టి యొకకార్యము సృష్టినియమముల కనుకూలమా? ప్రతికూలమా? యని యెఱుగుటయు వారికి దుస్తరము. అందువలననే వారికి నిరపేక్షక పుణ్యపాపములను విధించియున్నారు.

'సత్యంవద ధర్మంచర.' సత్యము చెప్పుము. ధర్మమాచ రింపుము. కాని యొక్కొక్కయెడ మనుష్యుడు పుణ్యము నొనరింప గోరియు కింకర్తవ్య మూఢుడగుటయు సంభవిం చును. తానొనర్పబూనిన కార్యము పుణ్యమో పాపమో యతనికి తెలియదు. ఇట్టి యసమంజస స్థలమున దనయంతరాత్మ చెప్పినట్లో, ఆప్తపురుషులు నుడివినట్లో, నడుచుకొన వల యును.

వేదములందు కర్మలు నిష్కామములు, సకామములు నని రెండువిధములుగా జెప్పబడినవి. ఇవి రెండును బుణ్యము

నకు జెందినవేగాని పాపమునకుగావు. సకామములలో భావ ముదవవచ్చునుగాని నిష్కామము పాపముకాదు. స్వార్థరహిత మగుటచే నిష్కామపుణ్యము సకామపుణ్యముకంటె నెక్కువందురు. మనుష్యుడేదేని యొక కార్య ప్రయోజనమును సిద్ధియించెనేని; నతని దైవీ ఆసురీప్రకృతులందును, వాసనలందును ప్రబలయుద్ధము జరుగును. మఱియు విశేషముగా ఆసురీవాసనలు దైవీవాసనల నణంచుచుండును. కాబట్టి సకామకర్మ నాచరించుటలో నతనిస్థితి సందిగ్ధమగును. కావున స్వయముగానే మంచిభావనకాదు. దుమ్ములోగూర్చుండి సంధ్యవార్చుకొనుటలో గుడ్డలకు దుమ్మంటుకొనుభీతి కలుగునట్లు సకామకర్మాచరణమున స్వార్థప్రవేశభయము కలుగుచుండును. దానమిచ్చుట పుణ్యకర్మయనుకొనుము. ఈదానము సకామనిష్కామరూపములలో నీయవచ్చును. దానమిచ్చుటలో గీర్తిమాత్రమపేక్షించెనను, యోగ్యపాత్రకు దానమిచ్చుటకుబదులుగా కీర్తినికలిగించుచోటుననే దానమిచ్చుట సంభవించును. కాని యట్టిదానములలో విశేషభాగము కలంకదాయకమగుట సంభవము. నిష్కామబుద్ధితో ననగా గీర్తినైన మపేక్షింపక దానమిచ్చిన నట్టిభయము వాటిల్లుట కవకాశముండదు. శక్తికొలది యోగ్యులయినవారిని వెదకియిచ్చుటయే తటస్థించును. వాస్తవమున సృష్టినియమములను దృష్టినిడుకొని వానిని బుష్టినొనర్చుటకై చేయుకర్మలే నిష్కామకర్మలగును.

మనచేయు కర్మలవలన సృష్టినియమములపై గాని, మనపైగాని, యెట్టిపరిభావ మేర్పడుచున్నదో తెలిసికొనవలసి

యున్నది. సృష్టినియమము లతిదృఢములగుటచే మనకర్మలచే వానిలో మార్పులు కలుగనేర వనుమాట విస్మరింపరాదు. మనము సృష్టినియమముల నుల్లంఘింప గోర గలముగాని యుల్లంఘింప నేరము. ఈశ్వరుడు వాని నతిదృఢము లొనర్చుటచే వానిస్థితులను మార్చుటలో మన యత్నములన్నియు నిరర్థకములగును. ఒక యాంగ్లేయకవి యందముగా వర్ణించి యున్నాడు.

"There is a divinity that shapes over ends, Rough hew them how we will"

మనము మనపనుల నెంతపాడుచేసినను ఈశుని కృప వలన నవి సరియగుచునే యుండును. మన చెడుభావనలు సృష్టి నెన్నడు జీవుల కశుభకరమగునట్లు చేయనేరవని భావము.

ఇది యొకదృష్టాంతమున బాగుగా బోధపడగలదు. ఒకరాజు తనరాజ్యమున మంచివ్యవస్థ నొనరించియున్నాడను కొనుడు. అతనిరాజ్యమున పాపులు పుణ్యాత్ములు నెల్లరు వసించుచున్నారు. పాపులు పాప మొనర్ప నెంచుచుందురు. వారెక్కువగా బుణ్యాత్ములను బీడింపనెంచుచుందురు. కాని రాజ్యనియమము లతి సువ్యవస్థితములగుటచే బాపులు సజ్జనులకు గష్టములను జేకూర్చుటకుగాని, విప్లవ మొనర్చుటకు గాని యవకాశము లభింపదు. పాపులకు గోరికలు మాత్రము కలుగుచుండును. ఆకోరికలు వారికే నష్టములు కలిగించును. కోరికలను పూర్ణ మొనర్చు యత్నముల నొనర్చుటయు నష్ట

లముకాకుండుటచే వారిమనస్సులు కలుషితములై వారినే కష్టపెట్టును. ఇట్లే సృష్టిస్థితియు నూహింపుడు.

చేయబడుకర్మల సంస్కారములు మన యాత్మలలో నేర్పడును. ఈచిహ్నములనే సంస్కారములందురు. ఈసంస్కారములు ఫలముకాదు. ఇవి వాస్తవమున కర్మచిహ్నములు. ఇవి యాత్మలందో లేక సూక్ష్మశరీరములందో నేర్పడును.

శరీరములు మూడురకములు. స్థూలశరీరము, సూక్ష్మశరీరము, కారణశరీరము. అన్నమయ ప్రాణమయ కోశములు స్థూలశరీరమనబడును. హస్తపాదాదీంద్రియముల సంస్థానముచే నేర్పడి మనకు గనబడునదియే స్థూలశరీరము. మనము భుజించినట్టియు పానముచేసినట్టియు నన్నపానములచే నీశరీర మేర్పడును. అందువలన నన్నమయము మనబడును. కాని ప్రాణముల సూక్ష్మప్రాణమునే ప్రాణమయకోశ మందురు.

రెండవది సూక్ష్మశరీరము. ఇందు మనోమయకోశము, విజ్ఞానమయకోశము నను రెండుభాగము లున్నవి. ఇవి స్థూలములు కావు. వీనిని మనము చూడనేరము. కాని తన యంతఃకరణవృత్తులను గూర్చి యాలోచించిన నివి తెలియును. మనము స్వప్నము గాంచునపుడు స్థూలశరీముతో మన కట్టి సంబంధము నుండదు. కాని స్థూలశరీరముద్వారా చేయబడిన వ్యాపారముల ప్రతిచ్ఛాయ మన సూక్ష్మశరీరమునందు 'ఫొటోప్లేటు' మీద బాహ్యదృశ్యము చిహ్నితమై నట్లేర్పడును. జ్ఞానము, స్మృతి, సుఖదుఃఖములు మున్నగునవన్నియు నీసూక్ష్మశరీర వృత్తులే.

మూడవ కారణశరీర మత్యంతసూక్ష్మము. దీని నానంద మయ కోశ మనియు నందురు. సుషుప్తియందు జీవునకు దీని యనుభవముండును. దీని యనుభవమును నానందరూపముననే యుండును. ఆసమయమున సుఖదుఃఖాది వృత్తులన్నియు దిరో భూతములై యుండును.

ఈమూడు శరీరములును ఆత్మపై దొడగబడియున్నవి. ఇవి యొకదానికంటె నొకటి స్థూలము. మన మేదిచేసినను దానిప్రభావము మొదట స్థూలదేహముపై బడును. కాని యది యచటనే యుండక క్రమముగా నింకుచు సూక్ష్మదేహ ములకు నంటును. ఇట్లు ఇంకుటలో స్థూలతమాత్రము నశిం చును. సూక్ష్మశరీరము స్థూలప్రభావములను గ్రహింపదు. కాబట్టి సూక్ష్మరూపమే వానియం దేర్పడును. దీనికి దృష్టాం తము కొంతవఱకు ఫొటోగ్రాఫీలో లభింపవచ్చు. ఆరంగుళ ముల పొడవువెడల్పులుగల ప్లేటుమీద పెద్ద భవనము లేర్పడ వీలుండదు. కాబట్టి మేడల ప్రతిచ్ఛాయ లందు సూక్ష్మరూపముననే యేర్పడును. ఇట్లే మన కర్మలప్రభావమునని తెలియ వచ్చును. ఈప్రభావములు సూక్ష్మ రూపమున సూక్ష్మ శరీమునం దుండి సంస్కారము లనబడును.

సూక్ష్మశరీరమున సూక్ష్మసంస్కారము లేర్పడును. కారణశరీరమున నవి సూక్ష్మతమావస్థయం దుండును. ఈ సంస్కారములే మృత్యువుతరువాత నొకజన్మమునుండి మఱి యొక జన్మమునకు గొంపోబడును. ఒకజన్మమున జేసినది మఱియొకజన్మమున జ్ఞాపకముండదని లోకులు కొందఱు వ్యర్థ

ముగా నాక్షేపింతురు. స్థూలవస్తువులు జ్ఞాపకముండవు. అతి సూక్ష్మములైన సంస్కారము లొక జన్మమునుండి మఱియొక జన్మమున కేగును. అవియే పరిస్థితు లనుకూలించినపుడు వికసించును. భిన్నభిన్న మనుజులలో భిన్నప్రవృత్తులేర్పడుట కిదియే కారణము. శరీరము లొకటిగానున్నను ఒకరి వ్యవహారము మఱియొకరి వ్యవహారముకంటె నెంతో భిన్నమైయుండుటను మనము చూచుచునేయున్నాము. కారణమేమన ప్రాణులు తమ పూర్వశరీరోపార్జిత సంస్కారముల సూక్ష్మరూపములను వెంట తెచ్చుకొనును. ఇవే వాని సాధనసంపత్తులు.

ఇట సంస్కారములను మీమాంసించుట మాయుద్దేశము కాదు. కర్మ దానిఫలమునకు ఆస్తికతతోగల సంబంధమును జూపుటయే మాయుద్దేశము. అనేకులు కర్మను భ్రమోత్పాదక వ్యూహముగా నెంచి పరిహాసమొనర్తురు. మఱియు హిందువుల నున్మత్తులని యెంతురు. కాని యిది వారిమూర్ఖత. వాస్తవమున మనుష్యజీవన మెంత జటిలసమస్యయో అట్లే కర్మమహిమయు జటిలమే. కర్మమీమాంస నొనర్పకున్న మనుష్యజీవనము తెలిసికొనుటయే దుస్తరమగును. హాస్యమొనర్చుట తేలిక. కర్మచక్రమునుండి తప్పుకొనుట కఠినమే గాక యసంభవము నైయున్నది.

ఈసంస్కారములు వీనిసూక్ష్మరూపమే కర్మకునంతము. స్థూలశరీరముచే జేయబడిన కర్మ స్థూలశరీరమునందే యంత మొందదు. నేనీరోజున నొకనిని దిట్టితిని. అది స్థూలకర్మ యయ్యెను. నేనీకర్మ యిక్కడ నశించినదని యెంచితిని. కాని

యట్లుకాదు. ఇట నిది కేవల మారంభ మైనది. కారణశరీర మున దీని సూక్ష్మరూప మేర్పడునంత వఱకు నిది నశింపదు. చాలమంది సంస్కారములనే కర్మఫలమందురు. గౌణరూప మున నట్లనవచ్చును. వాస్తవమున నది సరిగాదు. సంస్కారము కర్మకంతముగాని ఫలము కాదు.

ఇక ఫలమునుగూర్చి విచారింపుము. ఆత్మ యందేర్పడు సంస్కారములలో గొన్ని యున్నతికి సాధనములై యిష్టము లన బడును. కొన్ని యున్నతికి బాధకములై 'యనిష్టముల' నబడును. ఇష్టసంస్కారములనుంచి యనిష్టసంస్కారములను తుడిచి వేయుట యావశ్యకము. ఇష్టమును రక్షించుటకు సుఖము, అనిష్టమును దుడిచివేయుటకు గష్టమును గలుగును. ఇదే కర్మ ఫలము. ఇది కర్తయధికారమున నుండక ఈశ్వరాధికారమున నుండును. గీతలో,

'కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన' అని యున్నది.

స్థూలకర్మ నొనర్చుట, సూక్ష్మరూపమున నది సూక్ష్మ శరీరమున నుండుట మనుష్యాధికారమునకు లోబడినవిషయము. కాని యాసంస్కారములలో నిష్టరక్షణకు ననిష్టవినాశమునకు సంబంధించిన సాధనములను సేకరించుట జీవుని యధికారము కాదు. వాస్తవమున నామ్రవృక్షమునుండి ఫలముదయించినట్లు సంస్కారమునుండి ఫలమేర్పడదు. ఆమ్రఫలము వృక్షాంశమే యగుటచే వృక్షమునుండియే లభించును. కర్మఫల మట్లు సం స్కారాంశము కాదుకదా! కాబట్టి యది సంస్కారమునుండి బయటపడునదికాదు. అది కర్మనిమిత్తముగా వచ్చినది. కర్మ

దానికి నుపాదానకారణము కాదు. నిమిత్తకారణము. చోరునకు గారాగారము లభించును. ఆకారాగారము చౌర్యకర్మాంగముకాదు. చౌర్యము దానికి నిమిత్తకారణము. దానినిచ్చువాడు మఱియొకడు. ఇట్లే యొకపురుషుడొక నెలరోజులు నౌకరి చేసిన నతనికి లభించు వేతనము నౌకరియనుకర్మభాగముకాదు. అది మఱియొకవ్యక్తిచే నీయబడును. అందువలననే గౌతముడు న్యాయదర్శనమున నిట్లు సూత్రించియున్నాడు.

"పూర్వకృత ఫలానుబంధా త్తదుత్పత్తిః" (3.౨.౬3.)

'పూర్వజన్మమున జేయబడినకర్మకు ఫలరూపమున శరీరోత్పత్తి కలుగును'. మనమీజన్మమున పొందుశరీరము పూర్వజన్మ సంస్కారములలో నిష్టములను రక్షించి యనిష్టములను మార్పొనర్చుటకై యొసగబడినదని భావము.

కాని, యీశరీరము నెవ రిత్తురు? జీవాత్ముడు స్వయముగా గ్రహించునా? కాదు. జీవాత్మున కిందధికారమున్న నతడు తనకొఱకు దుఃఖములను గ్రహింపడు. కర్మయెట్టిదొనర్చినను సుఖమునే గ్రహించును. కారణమేమన ననిష్టకర్మలు, అనిష్టసంస్కారములు, సుఖభ్రాంతిచేత నేకదా యతడు చేసినది? ఇక్క డీసంస్కారములపై నతని కధికారములేదు. సంస్కారములే యతనిపై నధికారము వహించును. మద్యపానము సేయకుండవలయునని యతను కోరును; ప్రతిజ్ఞలనొనర్చును; ఒట్లుపెట్టుకొనును; వ్రతము లాచరించును. కాని మద్యపాత్రము కనబడగానే యవన్నియు నతడు మరచును.

సంస్కారము స్వయముగా శరీరము నుద్భవింపజేయునా? చేయదు. సంస్కారము జడము. వానిలో నుత్పాదకసామర్థ్య ముండదు. అనిష్టసంస్కారములు శరీరమును రచించిన ననిష్ట శరీరమునే రచించును. తననాశనముకొఱకెవరును సాధనములను సంపాదింపరు. శరీరముమీద మురికియేర్పడిన నది స్వయముగా సబ్బునురాచి తన్నుదూర మొనర్పదు. దానిని దూర మొనర్చుటకును సబ్బును తెచ్చుటకును మఱియొక నిమిత్త మవసర మగును. అందువలననే గౌతముడు,

“ఈశ్వరః కారణమ్ పురుషకర్మాఫల్య దర్శనాత్” (౪.౧.౧౯.)

అను సూత్రమున కర్మలు స్వయముగా శరీరమును కలిగింపవు. ఫలరూపశరీరము నీశ్వరుడు కర్మానుసారము నిర్మించుచున్నాడని చెప్పియున్నాడు.

దీనిపై నొకపూర్వపక్షము.

“న, పురుషకర్మాభావే ఫలానిష్పత్తేః” (౪.౧.౨౦. న్యా.ద)

పురుషుడు కర్మనాచరింపకున్న ఫలము లభింపనేరదు. కాబట్టి యీశ్వరు నంగీకరింప నవసరమేల? అని సూత్రార్థము.

సమాధాన సూత్రము.

“తత్కారితత్వాదహేతుః” (౪.౧.౨౧.)

ఈ హేతువు సరియైనది కాదు. కారణమేమన కర్మఫల మీశ్వరాధీనమై యున్నది. ఇట్లు కర్మఫలము లభించుటచే నీశ్వరుడు సిద్ధించుచున్నాడు. ఈశ్వరుడు న్యాయకారి యగుటచే కర్మానుకూలముగానే ఫలమునిచ్చును.

జైనులు మున్నగువారనేకులు కర్మస్వయముగా ఫలము నిచ్చునుకాబట్టి యీశ్వరుని యస్తిత్వము నేలయంగీకరింప వలయునందురు. వాస్తవమున కర్మలు స్వయముగా ఫలము నొసంగగలిగినను సృష్టిరచనకొఱకు నీశ్వరాస్తిత్వ మంగీకరింపక తప్పదు. పూర్వాధ్యాయములం దీవిషయము నిరూపించియే యున్నాము. కాని కర్మమీమాంసను తెలిసికొనకపోవుటచే జైనప్రభృతుల కిట్టిభ్రమ కలిగినది. వారు సంస్కారములనే కర్మఫలములని యెంచియున్నారు. సంస్కారములు కర్మాంతములుగాని కర్మఫలములుకావు. లోకముననుదీనికి దృష్టాంతములు లభించును. నేనొక అధ్యాపకుడ ననుకొనుడు. నిత్యము విద్యార్థులకు జదువుచెప్పుదును. అదినాచేయుకర్మ.

ఈయధ్యాపనకర్మసంస్కారములు నాలో నేర్పడును. ఎట్లనగా నాలో జ్ఞానము, విద్యార్థులలో ప్రేమయు నెక్కువగును. కాని యీసంస్కారములు ఫలముకాదు. నాకులభించు వేతనము ఫలము. ఇష్టసంస్కారములవృద్ధి యీవేతనోపయోగము. అధ్యాపనమున నేను పొరపాట్లనొనరించిన నాలో ననిష్టసంస్కారము లేర్పడును. ఇదియు నాపొరపాట్లసమాప్తిగాని, ఫలముకాదు. ఫలము దండనరూపమున లభించును. దానివలన నీయనిష్టసంస్కారములు నశించును. వేతనముగాని, దండనగాని, సంస్కారములు నిమిత్తముగా లభించునుగాని, సంస్కారములు స్వయముగా నీయజాలవు. ఈ వ్యవస్థ యధికారివర్గ మొనర్చును.

కాబట్టి కర్మఫలనియమ మీశ్వరసిద్ధి కొరకు ప్రబలప్రమాణము. కర్మఫలముయొక్క వాస్తవికస్వరూపము నెఱింగిన నాస్తికులయాక్షేపములు చాలావఱకు దూరములగును. ఈశ్వరుడు దుఃఖ మేల కలిగించును? కీటపతంగాది శరీరముల నేల నిర్మించును?

వాస్తవమున దుఃఖమన నేమి? అనిష్టసంస్కారములను దూర మొనర్చు నబ్బువంటిది. దుఃఖములద్వారా మన మెన్ని దుష్టసంస్కారములనుండి ముక్తుల మగుచున్నామో చెప్ప జాలము. పొట్టలో వికారమున్న విరేచనమాత్రల నీయక తప్పదు. వ్రణములచే బాధపడువానికి శస్త్రచికిత్సయే కల్యాణకరము. మనుష్యేతర యోనులను గూర్చి విచారించిన నవియు శుభమును దృష్టియందిడుకొని యీబడినట్లు తెలియును. కంటితో చెడుకర్మల నాచరించుటచే నొకయాత్మయందు చెడ్డ సంస్కారము లేర్పడినవనుకొనుము. కాబట్టి మఱియొక జన్మమున నాజీవికి గన్నుల నీయకున్నను, లేక అక్షిప్రయోగ మంతగా లేని యోని లభింపజేసినను నాయనిష్ట సంస్కారములు నశింపబడుటలో సహాయ మేర్పడును.

మానవాత్మలలో ఇష్టానిష్ట సంస్కారము లనేకము లుండును. అందువలన వీనిలో కొన్నిటి రక్షణ, కొన్నిటి వినాశము దృష్టియందిడుకొని యోనులు ననేకములగుచున్నవి. ఈ యోనులవలన నీశ్వరుని క్రూరత ప్రకటింపబడదు. దయయే తెలియనగును. ఆవాగమనము (పునర్జన్మ) నంగీకరింపనివారు జీవనమునకు సంబంధించిన జటిలసమస్యలకు సమాధానము

లను జెప్పజాలరు. యథార్థమైన యాస్తికులును గాజాలరు. ప్రపంచమున నింతదుఃఖ మెందుకో వారెఱుగజాలరు.

వేదాంతదర్శనమున వ్యాసముని,

'వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వా త్తథాహి దర్శయతి'
(౨. ౧. ౩౪.) అని సూత్రించియున్నాడు.

ఈశ్వరునిలో విషమతగాని నిర్దయతగాని లేదు. అతడు వర్గాపేక్షచే భిన్నభిన్న యోనుల గల్పించునని సూత్రతాత్పర్యము.

పునర్జన్మ నంగీకరింపనివారు మోక్షసమస్యనుగూడ పరిష్కరింపజాలరు. క్రైస్తవమహమ్మదీయులు ముక్తి నంగీకరింతురుగాని పునర్జన్మ నంగీకరింపరు. వారు కర్మసంస్కారముల మహత్త్వము నెఱుగరు. వాని నెఱిగిన వారొక జన్మమున ముక్తి నంగీకరింప జాలరు. కారణ మేమన, కారణశరీరమున నేర్పడు సంస్కారములలో గొన్ని యిష్టములు, గొన్ని యనిష్టములు నుండును. అనిష్టములను నాశన మొనర్చుట యవసరము. ఈకార్యము యోనుల మూలమున కలుగును. ఇష్టసంస్కారముల విషయమునను ప్రకారభేదములనుబట్టి యనేక యోను లవసరము లగును. ఈయిష్టములు మఱియొక జన్మమున నంతకంటె సూక్ష్మసంస్కారముల నేర్పరుచును. మూడవ జన్మమున నవి యంతకంటె సూక్ష్మముల నేర్పరుచును. ఇట్లు క్రమముగా నిష్టముల పరాకాష్ఠయైనప్పుడు పూర్ణజ్ఞానము కలుగును. అప్పుడే,

'జ్ఞానాన్ముక్తిః.' (సం. త. 3-౨3).

జ్ఞానమువలన ముక్తి చేకూరును.

ఇట్లు పునర్జన్మచేతను కర్మఫలమువలన నీశ్వరాస్తిత్వము సిద్ధించును. పునర్జన్మమునకు నీశ్వరాస్తిత్వముతో గల ఘనిష్ఠ సంబంధము వలననే యనేక గ్రంథములందు పునర్జన్మ నంగీకరింపకుండుటయే నాస్తికత యని వర్ణింపబడినది. వాస్తవమున జీవుల నీశ్వరసమీపమున జేర్చునవి కర్మఫలము, పునర్జన్మము ననియే తెలియవలెను.

---

# పదవ అధ్యాయము

## ఆస్తిక్య ప్రయోజనము

'వేదాహమేతం పురుషం మహాన్తమ్
ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్
తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి
నాఽన్యః పన్థా విద్యతేఽయనాయ' (యజు)

మన్త్రార్థము:—అజ్ఞానమునకు బరమున భాస్కర తేజమున వెలుగు మహాపురుషు నెఱుగుచున్నాను. అతని నెఱుంగుటచే మనుజుడు మృత్యువును దరించును. మోక్షమున కితరంబగు వేఱొక మార్గము లేదు.

దుఃఖములనుండియు, మరణమునుండియు, దప్పుకొనుటకు ప్రతిప్రాణియు యత్నించును. ఇది ప్రతిజీవికి స్వాభావికమగు నాకాంక్ష. మానవసంఘములన్నియు నీయుపదేశమునకై పాటుబడుచున్నట్లు చూడనగును. ఆకలిరూపమగు కష్టమును దొలగించి మృత్యువు నెదుర్కొనుటకే కృషీవలులు వ్యవసాయ మొనర్తురు. మన శరీరావసరములను తీర్చుటకే వివిధవ్యాపారములు కలాకౌశలములు లోకమున విస్తరిల్లినవి. దైహికరోగములను రూపుమాపి మృత్యువాత బడకుండ జేయుటకే యౌషధాలయములు నెలకొల్పబడినవి. మానవులలో నొండొరులను స్వార్థవశమున పీడింపకుండుటకే న్యాయాలయములు వెలసినవి. బాహ్యశత్రువుల యాక్రమణలనుండి రక్షించుటకే సేనావారములు స్థిరపరుచ బడినవి.

ఈసంస్థలన్నియూ మనలను దుఃఖములనుండి కాపాడుట-కేర్పడిన వనుటలో సందియములేదు. అయినను ఈశ్వరు నెఱుగకున్న మృత్యువును జయించుట దుఃఖములనుండి విముక్తులగుటయూ దుస్తరమని వేదము నుడువుచున్నది. 'నజ్ఞానాదృతే ముక్తిః' అని శాస్త్రము ఉద్ఘోషించుచున్నవి.

ఇదేల? ఈశ్వరుని విడిచి జీవనము సుఖమయ మొనర్ప జాలమా? ఆస్తిక్యమును విడిచిన మనకార్యములు నడువవా? దానిలో మనకట్టి ఘనిష్ఠసంబంధమున్నదా? ఆస్తికుల కెల్లరకు సుఖములభించుచున్నదా? నాస్తికులందఱు దుఃఖముల నోర్వలాడుచున్నారా? జీవనమంతయు 'ఋణంకృత్వాఘృతంపిబేత్' అను న్యాయమునకు లక్ష్యమొనర్చువాడు సుఖింపడా? మానవసమాజము సఫలముకావలయుననిన ఆస్తిక్య మేకాంత సాధనమా? ఈసమస్యల నన్నింటిని యథోచితముగా బరిష్కరింపకున్నంతకాల మీశ్వరవిషయమును విచారించుట నిరుప యోగ మనకతప్పదు.

ఈశ్వరుడున్నాడో - లేడో! సృష్టికర్త యీశ్వరుడో లేక యన్యుడో! ఈశ్వరుడు సర్వవ్యాపకుడుగానిండు లేక సృష్టినిరచించి యెటకైన బోయినబోనిండు. అతడు సర్వశక్తిమంతుడో లేక యతినిర్బలుడో ఎట్టివాడైనను గానిండు. మన కతనితో గావలసినదేమి? మన వ్యావహారిక జీవనమున ఆస్తిక్యముతోగల ప్రయోజనమేమి? "సృష్ట్యాదినుండి నేటివఱకు 'నేనన నేమి? అహం కిమ్?' అని మానవులు విచారించుచున్నారు. కాని నేటివఱకును మానవున కీ విషయము స్పష్ట

ముగా తెలియదయ్యె. కాబట్టి యీగొడవలోబడి రోజులు గడుపుట యవివేకమగును. 'నే జేయవలసినదేమని' యాలోచింపవలయును కాని, 'నేనెవడనని కాదు.' అని కార్లాయిల్ చెప్పుచున్నాడు. 'నేనెవడ' ను ప్రశ్నయే నాగరికుల కవసరమైనపుడు 'ఈశ్వరుడనగనేమి' అను ప్రశ్న యంతకంటె నిరర్థకమని వేరే నుడువనేల? మనజీవన మత్యల్పము. సమయమా కొలది. కార్యమా యధికము. కాబట్టి యీ లఘుజీవనమున కొంతకాల మీవ్యర్థప్రశ్నలను బరిష్కరింప వ్యయించిన కర్తవ్యపాలనమునకై సమయమెక్కడ లభింపగలదు?

ప్రపంచమునగల వ్యక్తులు, జాతులు, కన్నులు మూసికొని యాస్తిక్యమును వెన్నాడుచున్నవి. సర్వస్వమును విడిచి కాల్పనికమైన యీశ్వరునిపై నాధారపడి సమయమును గడుపుచున్నవి. ఈశ్వరుని స్తుతిప్రార్థనోపాసనలలో వీని సమయమధికముగా వెచ్చింపబడుచున్నది. వీని యధికాంశధన మీశ్వరాన్వేషణమున వ్యయింపబడుచున్నది. ఎటులయిన నీ యీశ్వరభూతము వీరిని విడిచిపోయినచో వీరి శక్తి, సమయములు సత్కార్యములం దుపయోగింప వీలగును.

ఇట్లు పెక్కుమంది తలంచుచుందురు. అందుచేతనే యాధునిక శిక్షితు లిట్టిప్రశ్నలకు దూరముగానుండ నెంతురు.

కాని ఇది పొరపాటు. మన మీ ప్రశ్నలకు దూరముగానుండ దలచినకొలది దుఃఖము లధికములగును. మానవసమాజమున ననేకవిధములయిన సంస్థలు మనసుఖములకొఱ

కేర్పడినవే. కానిమనము యథార్థమైన యాస్తికులము కానంత వఱకు మన కాసంస్థలు సుఖమును బోధింపజాలవు.

'నేనవడను?' అనుప్రశ్ననువిడిచి, నాకు చేయవలసిన దేమి? అనుప్రశ్ననుగూర్చి విచారింపవలయునను 'కార్లాయిల్' వచనమంత యుత్తమమైనది కాదు. మనము మనయస్తిత్వమును గూర్చి విచారింపకయే మనకర్తవ్యము నెఱుంగగలమా? కర్తవ్యమునకు నస్తిత్వమునకు నెట్టిసంబంధమును లేదా? 'మనమేమో' తెలియకున్న మనకర్తవ్యమేమో మనకెట్లు తెలియగలదు? ప్రపంచమునగల వివిధ మానవులకర్తవ్యములు వివిధములుగా నున్నవి. అదేల? వారిపదవులలో భేదములుండుటచేత నేకదా? రాజకీయోద్యోగులలో నెల్లరికర్తవ్యము లొకటిగానుండవు. సేనాపతికర్తవ్యము కోశాధ్యక్షుని కర్తవ్యముకంటె భిన్నము. న్యాయాధీశుని కార్యమంతకంటె వేఱు. వీరు తామెవరో తెలిసికొన ప్రయత్నింపకున్న తమకర్తవ్యముల నెట్లుపాలింపగలుగుదురు? నిన్నునీవు తెలిసికొనుటలో నిరాశచెందెదవేని నీకర్తవ్యమేమో తెలిసికొనుటలోను నీవు నిరాశచెందెదవు. అట్లైన మనుష్యునకును, జడమునకును భేదమిసుమంతయు నుండబోదు.

దీనికిని, ఆస్తిక్యమునకును సంబంధమేమని లోకులందురు. మా సమాధానమువినుడు. మానవసమాజ మొకకర్తవ్య సముదాయమనవొప్పును. ప్రతిమనుజుడు నేదోయొకపని చేయుచునే యుండును. కాబట్టి 'నేజేయవలసినదేమి?' అనుప్రశ్న మెల్లపుడు నుదయించును. కొందఱీప్రశ్నను మీమాంసించి తమకర్మపరాయణత కాశ్రయమిత్తురు. మఱికొందఱు సమాజ

రీతులననుమాత్ర మనుసరింతురు. కాని యీయనుచరుల కర్తవ్యములను ఆలోచనలేక స్థిరములు గానేరవు. సమాజసంచాలకులే వానినిగూర్చి విచారింతురు. ఈప్రశ్నలనే యాచారశాస్త్ర మందురు. ఆచారశాస్త్రమునకు సంబంధించిన సమస్యలు 'మనుష్యుడెవడు?' అను ప్రశ్నను విచారింపకున్న సరియగునా? యను నదొకప్రశ్న. విచారవంతులగు పురుషుల యాచారములు నొక్కరీతిగా నుండగలవా? చరిత్ర యిందులకు సాక్ష్యమొసగజాలదనుట దోసగు కాదు.

శ్రీ శంకరాచార్యు డొకచో నీ విషయమునగల మతభేదముల నిట్లు ప్రదర్శించియున్నాడు.

౧ దేహమాత్రం చైతన్యవిశిష్ట మాత్మేతి ప్రాకృతా జనా లోకాయతికాశ్చ ప్రతిపన్నాః
౨ ఇంద్రియాణ్యేవ చేతనా న్యాత్మే త్యపరే.
౩ మన ఇత్యన్యే.
౪ విజ్ఞానమాత్రం క్షణికమిత్యేకే.
౫ శూన్యమి త్యపరే.
౬ అస్తి దేహాదివ్యతిరిక్తః సంసారీ కర్తా భోక్తే త్యపరే.
౭ భోక్తైవ కేవలం న కర్తే త్యేకే.
౮ అస్తి తద్వ్యతిరిక్త ఈశ్వరః సర్వజ్ఞః సర్వశక్తి రితి కేచిత్.
౯ ఆత్మా స భోక్తురి త్యపరే (శారీరకభాష్యమ్. ౧. ౧. ౧.)

అర్థము:-

చైతన్యముతోగూడిన దేహమే యాత్మయని కొందఱు చెప్పుదురు.

౨ చేతనేంద్రియములే ఆత్మయని మఱికొందఱు.
౩ మనస్సే యాత్మయని వేఱొకరు.
౪ క్షణికవిజ్ఞానమే యాత్మ. నిత్యపదార్థ మొండులేదని కొంత మంది.
౫ శూన్యమే యాత్మయని యైదవతెగవారు.
౬ దేహాదులకంటెభిన్నగా కర్త, భోక్త యనదగు నాత్మ కల దని యారవరకము.
౭ ఆత్మ భోక్తయేకాని కర్తగాదని కొందఱు.
౮ ఇంతకంటె భిన్నుడయి సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు నగు నీశ్వరుడున్నాడని కొందఱు.
౯ ఈశ్వరుడు భోక్త్రాత్మకంటె భిన్నుడు కాడని కొందఱు.

ఈ మతములన్నిటి నంగీకరించువారి యాచారవ్యవహారము లొక్కటిగా నుండునా? ఎన్నడు నుండజాలవు. మనుష్యుడు తానాలోచించినట్లాచరించును. అతని జీవనమున నతని సిద్ధాంతములయు, తత్త్వవిచారములయు ప్రాభవము ప్రతిఫలించు చుండును. ఆంతరిక విచారముల దౌర్బల్యమువలన గొందఱు మనుష్యులు సామాజిక గతుల నుల్లంఘింప జాలకుండుట సత్యమే. ఆంతరికవిచారములు ఇచ్ఛాశక్తిని మార్పుచేయు ననుటలోను సందియముండదు. మనుజుని తత్త్వవిచారములు పృథ్విలోపల ప్రవహించుచు మెత్తని భూస్థలములందు పైకి వెలువడు జలప్రవాహముల వంటివి.

“నేను శరీరముకంటె భిన్నుడనుగాను. జన్మకుపూర్వము నాయస్తిత్వము లేదు. మృత్యువునకు తరువాత నుండబోను.”

అని యెంచు మనుజునకీలోకమే లోకము. మృత్యువే జీవనాంతము. ఇట్టివాని విచారములు అతని శరీరమును మించి పోజాలవు. వాడు తప్పక ఋణ మొనర్చి ఘృతపాన మొనర్చును. బ్రతికినంతకాలము భోగవిలాసముల దగుల్కొని యుండును. ఇట్టిమానవులే సృష్టియందంతటను నిండియుండిన వారికి సదాచారములు, పరోపకారములు, అహింసాదులన్నియు నిరర్థకము లగును. వా డాత్మత్యాగ మొనర్చిన నెవరికొఱకొనర్చును? వానికి నాత్మత్యాగమున నర్థమేమి? ఇట్టివారు కష్టములను సహించి యితరులకు మేలొనగూర్పగలరా? ఈశరీరముకంటె నతిరిక్తముగా మఱియొండేమియు లేదని నేను నాకు పూర్ణవిశ్వాసము గలిగినచో నాజీవితమే విచిత్రమై యనిర్వర్ణ్యమై కలాశ్రయమై పోవునని యే నానిశ్చితవిచారము. నేనొక్కడ నననేల? చరిత్రలు ఘోషించుటలేదా? భారతవర్షమున 'చార్వాకులు' గ్రీసుదేశమున ఏపికూరియన్ (Eapicurians) అను వారలజీవిత మెట్లుండునో విచారింపుడు. వీరేగదా!

'అంగనాలింగనాజన్య సుఖమేవ పుమర్థతా'

స్త్రీల యాలింగనమున జనించు సుఖమే పురుషార్థమని వాకొనియుండిరి. స్థానస్థానములనుండి తరుణవయస్కలయిన సుందరీమణుల సేకరించి వారి బిగికౌగిళ్ల మైమఱచి కాలము గడుపువాడే కదా వీరిమనమున పరమపురుషార్థి!

ఇట్లే సమస్తప్రపంచముతోబాటు తననుగూడ శూన్యమని విశ్వసించువారిని కర్తవ్యపరాయణతకొఱకు ప్రేరించున దెవరు? శూన్యవాదము మానవులను శూన్యమువంకకే నడు

౭. ఈ భావన పెరిగినకొలది శూన్యవాదుల విభూతియు
కృష్ణపక్షచంద్రునివలెనే క్రమముగా క్షయించి యొకనాడు
శూన్యముగా నంతమొందును.

తన్నుదానీశ్వరుడని భావించిన జాతుల వ్యవహారములు
మున్నతశీల జీవులమని యెంచు జాతులనుబోలి యుండకుం
ను మనము కనులార జూచుచున్నాము. ఒకచో నున్న
మార్గము తెరువబడియున్నది. మఱియొకచో మూయబడి
న్నది.

ఇట్లే యాస్తికులజీవనము నాస్తికుల జీవనముకంటె
నై యుండును. ఆస్తికులయాస్తిక్యవిచారముల కనుకూ
గానే వారియాచరణము నుండును.

కాబట్టి మనుష్యజీవనమున ఆస్తిక్యవిచారము లనవస
లనుట కూడదు. వస్తుతః ఈశ్వరాస్తిత్వమును గూర్చిన
బౌద్ధికవ్యాయామము మాత్రమేయని యెంచుట ప్రమా
ఈ ప్రశ్న మానవజాతియొక్క యున్నతిమార్గమున
బ్రతుకులకు చెందియున్నది. కావుననే యుపనిషత్తు
సర్వే వేదా యత్పదమామనంతి తపాంసి సర్వాణిచ యద్వ
యదిచ్ఛంతో బ్రహ్మచర్యంచరన్తి తత్తేపదం సంగ్ర
బ్రవీమి ఓమిత్యేతత్"

వేదములచే గానమొనర్పబడు వాడును, తపములకు
డును, బ్రహ్మచర్యాది వ్రతాచరణల కాధారుడును నగు
శ్వరుడని చెప్పుచున్నది. ఈశ్వరునిపై విశ్వాసముంచని
ను, ఈశ్వరప్రాప్తియను నున్నతాదర్శము నెదుట నుంచు

కొననివాడును బ్రహ్మచర్యాది కఠినవ్రతముల నేలచేయును? వానికి లలనాలింగనమే జీవనసర్వస్వమగును. అదియే యతని పురుషార్థమున 'కిరిశ్రీ'యగును.

మనుజుని యుద్దేశమేమో విచారింపుడు. కొంతతడవు వఱకై యాస్తిక్యభావము నటు దూరమున నుంచుడు. ఈశ్వరు డుండనిండు; లేకుండనిండు. మనకతనితో బ్రయోజనములేదు. అతనిగూర్చి మనమేల యోజింపవలె? మేమాకాశపాతాలముల నొకటిచేయనెంచము. సత్యమైన వ్యావహారిక పురుషునివలె విచారింతుము. మనుష్యజీవనమున కుద్దేశమేమి? దుఃఖము లను దూరమొనర్చుటయా? మనదుఃఖము లెట్లు తొలగును? మనకు, కుక్కలకు, బిల్లులకు గలభేదమేమి? అవిగూడ దుఃఖ ములను బోగొట్టుకొనుటకు యత్నించునుగదా!

"ఆహారనిద్రా భయమైథునంచ సామాన్యమేతత్ పశు భిర్నరాణామ్" దుఃఖములను తొలగించు సాధారణోపాయము లను దిలకించిన జంతువులు, మానవులు సమానులనియే తోచు ను. అట్టిచో మానవజీవనోద్దేశమేమి? దానితో నీశ్వరాస్తి త్వమునకు గల సంబంధమేమి!

ఆధునికాచార శాస్త్రకారు లీశ్వరసహాయ మపేక్షిం పకయే ఆచారవివేచన మొనర్చిరి. వారిలో ననేకమతములును గలవు. 'మిల్'ప్రభృతులు తమ్ము 'యుటిలిటేరియను' లందురు. లాభవాదులని వీరిని జెప్పవచ్చును. లాభకరమగు కార్యములనే చేయవలయునని వీరందురు. కాని 'లాభము' అనిశ్చితశబ్దము. ద్రవ్యలాభమా? సంపత్తిలాభమా? స్వాస్థ్యలాభమా? లాభ

వాదులు సుఖలాభమందురు. మంచిది. సుఖమే యభీష్ట మగుచో సుఖముకొఱకు జేయబడు కార్యములన్నియు నుచితములే యగును. చౌర్యము, వ్యభిచారము మున్నగు నితర దుష్కర్మలన్నియు నుపాదేయము లగును. అనుచితకర్మయే లోకమున నుండబోదు. అధికాధిక సంఖ్యగల మనుష్యుల కధిక సుఖమును బొందించుట జీవనోద్దేశమందురేని మానవు లనేక దురాచారములనుండి తప్పుకొను వీలుండుననుట నిస్సంశయము కాని యొకమనుజుడు తన ప్రాణములను గోల్పోయి బహుజనుల కధికసుఖము నేల సంపాదింపవలయును. ఇందుకు సాధన మేమి? నేను నేడు నాప్రాణములర్పించిన నాదేశవాసులకు మేలుగలుగును. వారు దాసత్వమునుండి విముక్తులగుదురు. వారు స్వతంత్రులగుదురు. కాని నేనట్లెందుకు చేయువలయును?

దానికిబదులుగా నాకేమి లభించును? నామరణానంతమున నాదేశవాసు లీఋణము నెట్లుతీర్చెదరు? వారు తీర్పని పక్షమున నేనెట్లు కసితీర్చికొందును? ఈప్రశ్నలకన్నింటికి లాభవాదులు సమాధానముల నీయజాలరు. ఈశ్వర వాదుల కివి సులభసమాధేయములు. మృత్యువు మనయంతము కాదు. ఈశ్వరనియమములను నేబాలింపవలయును. నేడు నేను మనుష్యజాతికొఱకు నాప్రాణముల నర్పించిన నాయాత్మ యున్నతమగును. ఈశ్వరునినుండి నాకుఫలము లభించును. నాకు స్వయముగా సంతోషముకలుగును. లాభవాదులు దీనిని గూడ లాభమనవచ్చు. అవును, లాభమే కాని యీలాభ

మునకు, లాభవాదులుచెప్పు లాభమునకు నెంతో భేదము గలదు. ఇందు ప్రేరణశక్తి మిక్కిలి యుత్కృష్టమైనది.

సదాచారభవనమును నీశ్వరాస్తిత్వ మను పునాదిపై నిర్మింపనెంచనివారు సదాచారమును నిరాధారముగ జేయ నెంచెదరు. వారు మనుష్యజాతి మనోవిజ్ఞానము నెఱుగరు. ఈశ్వరవిశ్వాసము సదాచారము నెంత దృఢపరిచెనో వారెఱుగరు.

ఆస్తిక్యము సదాచారమును దాస్యశృంఖలముల బంధించినదని కొందఱందురు. 'పుణ్యము పుణ్యముకొఱకు చేయవలయు'నను భావము మనుజులందు లేదు. ఈశ్వరుడు దండించునను భయముతో నసత్యమాడరు. ఆతడు ప్రసన్నుడగునని స్తోత్రమాచరింతురు. ఈవిధమగుభయము లోకుల హృదయమున నేర్పడును. ఇది సరియైన సదాచారము కాదు' అని కొందరు నుడివెదరు. కాని, యిట్లుచెప్పువారు గంభీరముగా నాలోచింపరు.

వస్తుతః మానవప్రకృతులు భిన్నములు. వారిమస్తిష్కమున నితరభావములతో బాటు భీతిభావము నుండును. ఇది స్వాభావికము. భయము వెలుపలినుండి వచ్చునది కాదు. దానిని ప్రపంచమునుండి దూరమొనర్పజాలము. నికృష్టతమ దశలందు భయమెక్కుడగును. ఉన్నతశీలుర మస్తిష్కములందు తగ్గిపోవును. కాని ప్రకృతిలో భయమునకు స్థానమే లేకుండుట యసంభవము.

ఈ భయమెందుకు? దీని ప్రయోజనమేమి? పరిణామ వాదులగు డార్విన్ మున్నగువారి నడిగిన భయమున్నతికి సాధన మందురు. అనవసరముగా నే భావము ప్రపంచమున నుండ నేరదని వారి సిద్ధాంతము. ఈ విషయమున మేమును వారితో నేకీభవింతుము.

భయమున కాచారశాస్త్రమున గల ప్రయోజనమే మని విచారింపవలసి యున్నది. (సత్యమాడుటవలన మానవ సమాజమునకు లాభము కలుగును. దీనివలన నధికసంఖ్యా కుల కధికసుఖము కలుగును. కాబట్టి మానవసమాజము సత్య మాడవలయునని నియమించినది.) సత్యమాడనివారిని సమా జమో రాజనియమమో దండించును. ఉత్తమపురుషులు దండ నను విచారింపకయే సత్యమాడుదురు. అసత్యమును ద్వేషిం తురు. నికృష్టశ్రేణికి జెందినవారా దండనను దృష్టియందిడు కొనియే సత్యమాడుదురు. మనము మానవుల వాస్తవిక స్థితిని సరిగా గుర్తించెదమేని ఉత్తమోత్తమ మానవసంఘము లందును నికృష్టజనుల సంఖ్య లభింపగలదని గుర్తింపవలయును. వీరికి భయకారణమేమగును? వీరు నికృష్టులగుటచే భయమే వీరిని నియమమున నుంచగలదు. కాని సర్వవ్యాపియగు భయ మెటనుండి గలుగును? సమాజబలముగాని, రాజ్యబలముగాని ప్రతిస్థలమునను, ప్రతిదశయందును కృతకార్యము కానేరదు. అసత్యమాడుటచే నొకమానవుని ప్రాణములు రక్షింపబడును. అతని యసత్యమును సమాజముగాని రాజ్యముగాని యెఱుంగ జాలదు. అట్టియెడ వాడేల యసత్యమాడరాదు? నాస్తికు

లకు వీనికి సమాధానము దొరకదు. ఈశ్వరవిశ్వాసి యేమను నంమురా? సమాజము చూడకున్నను, రాజునకు దెలియక పోయినను,

"పశ్యత్యచక్షుః, సశృణోత్యకర్ణః"

చక్షుఃశ్రోత్రములు లేకున్నను కనవినగల యీశ్వరుని దృష్టినుండి యెట్లు తప్పించుకొనగలడు? కాబట్టి యీశ్వరవిశ్వాసి యట్టిసమయమునందును పాపమునుండి తప్పుకొనగలడు. కాని యనీశ్వరవాది యట్టియెడ నసత్యమాడుటయే పుణ్యమని యెంచును. వానికి లాభమే కావలయును. కాబట్టియే స్వతంత్రాచారవాదులు విశేషావస్థలం దసత్యమును విహితమనిరి.

మాయీదృష్టాంతమున భయము సదాచారమునకు సాధనముగా జెప్పబడినది. నికృష్టదశలందు భయమావశ్యక సాధనముగా నంగీకరింపవలయునని యే మాసిద్ధాంతము. అట్లంగీకరింపకుండుటకు గారణము గాంచము. ఒక శాస్త్రమున్నదను కొనుడు. అది మిక్కిలి యుపయోగియైన దాని నవశ్యము ప్రయోగింపవలయును.

కాని యొకమాట మరువగూడదు. ఈశ్వరభయము నకును, నితరపదార్థభయమునకును చాల భేదమున్నది. ఈశ్వరునకు భయపడువాడితరులకు భయపడడు. ఈభయము భయము కాదు. ఇది యభయమునకు ప్రకృష్టసాధనము. కావుననే యాస్తికవాదు లీశ్వరభీతి యున్నగు శబ్దములను నిర్మించి యున్నారు. ఈశ్వరునకు భయపడుట యుత్తమగుణమని యెంచబడినది. ఈశ్వరునకు భయపడు వాడాలని నియమముల

నుల్లంఘింపరు వస్తుతః నియమోల్లంఘనమొనర్చుట యభయ చిహ్నము గాదు. అది నైచ్యము. భీరుత్వము. నైర్బల్యమునకు చిహ్నము.

నియమోల్లంఘనమునకు, భయమునకు గల సంబంధ మేమి? ఈవిషయమునుగూర్చి సామాన్యజనులలో నొకవిధ మగు భ్రాంతి వ్యాపించియున్నది. అశిక్షితులు, అర్ధశిక్షితులు, కుశిక్షితులు నగుజనులు ప్రాయః నియమముల నుల్లంఘించు వాడే వీరుడని యెంచెదరు. ఇంతకంటె మించినపొరపాటు మఱి యొకటి యేమున్నది? నియమములను పాలింప బలముకావల యును. ఉల్లంఘింప బలమేల? మనుష్యుడు నియమముల నేల యుల్లంఘించును? వాడు నిర్బలుడగుట చేతనే. వాడు ప్రలోభ నముల నెదుర్కొనజాలడు. ఒకచిన్నవస్తువు లభింపగానే వానికి తొట్రుపాటు గలుగును. ఖాద్యపదార్థ మొకింతకనబడిన అతనినోటియందు నీరూరును. ఒకవిలాసవతి కంటబడిన మనస్సు చలించును. ఇవన్నియు నియమోల్లంఘనమున కుదాహరణ ములు. నిర్భయతకు, వీరతకు నుదాహరణములు గావు. మను ష్యున కొకమాటు నియమపాలనమున బలమును, నిర్భయతయు గలదని దృఢవిశ్వాసమేర్పడినచో నతడు తప్పక మహత్త్వ మును సంపాదింపగలడు. కాని, లోకుల మనస్సునందు,

(సమరథ్ కోనహి దోషగుసాఈ)

సమర్థునకు దోషముండదను విషాక్తశిక్ష వ్యాపించి యున్నది. ఇది వారిని ప్రలోభనముల నెదుర్కొననీయదు. 'నేను రాజను. నారాజ్యమున నాకంటె గొప్పవాడు లేడు. కాన

నేనధిక భోగవిలాసముల ననుభవింపగలను. స్త్రీలసతీత్వమును నష్టపరుపగలను. అసతులమధ్య ననారతము విషయసుఖముల ననుభవింపగలను.' అను నివి వీరపురుషుల విచారములా? అభయ సూచకములా? వాస్తవమున నివి భయమునకు నికృష్టరూపములు.

"పరస్త్రీకుచకుంభేషు కుంభేషు పరదన్తినామ్.
నిపతన్తి న భీరూణాం దృష్టయః శరవృష్టయః"

అనుసూక్తులను జపించువారు స్వయంభీరువులగుటయేగాక పరులను కూడ భీరులనొనర్చుచున్నారు.

ఆత్మను ప్రపంచమునగల మహోన్నతప్రలోభనముల నపహరింపఁజేయు నభయత్వమే వాస్తవమైన యభయత్వము. అది యీశ్వరభీతిచేతనే కలుగగలదు. ఈశ్వరభీతిగలవానికితర భీతి యెక్కడిది? ఈశ్వరభీతి లేనివాడు ప్రపంచమున తుచ్ఛాతితుచ్ఛవస్తువులకు భయపడును. కన్నులు విప్పిచూడుము. రాజ, దరిద్రులజీవనము మనకిదియే బోధించును. ఈశ్వరభీతి లేనివారు వానినియమముల నుల్లంఘించుచు నంతమున శోచనీయు లగుదురు.

కాబట్టి యీశ్వరభయమును సాధారణభయముతో చూచుట పొరపాటు. నికృష్టమనుష్యులకు పాపములనుండి తప్పుకొనుటకు భయమెంతయు ముఖ్యసాధనమని పైనజెప్పియుంటిమి. కాని, యీభయము క్రమముగా మనుజుని ప్రేమపథమునకు గొనివచ్చును. ఈశ్వరునకు భయపడువాడు కొంతకాలమయిన తరువరి యీశ్వరుని ప్రేమింపదొడగును. ఈశ్వ

శుని ప్రేమించుట, యీశ్వరునకు భయపడుట యనునవి రెండు నంతమున కలిసిపోవును.

ప్రేమ మనుజుని యుత్కృష్టతమభావమని జనులందురు. ప్రేమపూర్ణహృదయ మమూల్యరత్నకోశము. దాని యెదుట ప్రపంచవిభూతి తుచ్ఛము. కాని, యాత్మ పరమాత్మ ప్రేమయందు మగ్నమైననాడే యీయుత్కృష్టతమభావము ప్రఫుల్లితమగును. అప్పుడతనికి ప్రత్యణువునందేగాక ప్రతిపరమాణువునందు పరమప్రియుని దర్శనము లభించును. స్వాత్మయందపారప్రకాశ ముదయించును. నాడతడు మైమరచును. ఆస్థితినే యుపనిషత్తు,

"బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి"

బ్రహ్మజ్ఞుడు బ్రహ్మయే యగుచున్నాడని యనుచున్నది.

మనుజుని సదాచారునొనర్చుట కీశ్వరప్రేమకు మించిన మతియొకవస్తువు గానరాదు. సదాచారనియమము లన్నియు నీశ్వరప్రేమాంతర్గతములే యగును. అధికసంఖ్యాకుల కధిక సుఖము అను మిల్ ప్రభృతుల సిద్ధాంతము నంగీకరించినను అట్టిసుఖమును సంపాదించుటకు నీశ్వరప్రేమకంటె మిన్నయగు సాధనము వేరేమున్నది? నన్ను ప్రేమించువాడు నాపిల్లలను తప్పక ప్రేమించును.

ఈశ్వరుని ప్రేమించువాడు జీవులనన్నిటిని ప్రేమించును. జీవులన్నియు బరమాత్ముని సంతానములని యతడెఱుగును. 'అధికసంఖ్యాకులగు మనుష్యుల కధికసుఖము సంపాదించుటయే మనుష్యకర్తవ్యము'ని 'మిల్' చెప్పుచున్నాడు. అతని

విచారము మనుష్యులమించి ముందుకుబోజాలదు. కాని యీశ్వరప్రేమ యంతకంటె పెక్కుమడుంగులు ముందంజ వేయును. మానవులుమాత్రమే యీశ్వరపుత్రులా? ఇతరప్రాణులు కావా? మనుష్యుల సుఖముకొఱ కితరప్రాణులకు దుఃఖమొదవింపవచ్చునా? ఎన్నటికి గూడదు. యథార్థముగా ఆస్తికుడగుచో నతడన్యప్రాణికి దుఃఖముకలిగింప నెట్లుసాహసించును? అతనిహృదయమునుండి

"మిత్రస్యాహం చక్షుషా సర్వాణిభూతాని సమీక్షే" 'నేనన్నిప్రాణులను మిత్రదృష్టితో జూతున'ను నుద్గారమే సదా వెలువడుచుండును. అన్నదమ్ములకు బరస్పరము సాక్షాత్సంబంధమేమియూ లేదు. పితృజనులమూలముననే వారికి సంబంధమున్నది. ఇట్లే యొకమనుష్యున కన్యమానవులతో — అన్యప్రాణులతో నికటతమసంబంధము స్థాపించు దృఢతమసూత్రమేదైన నున్న నది యాస్తిక్యమే.

ఆస్తిక్యము వాస్తవమైన సార్వజనిక సంజీవనౌషధమేయైన ఆస్తికులితరులతో క్రూరముగా వర్తించుచుందురేల? అధికముగా నీశ్వరభక్తిగలవారేలోకమున నెక్కుడుస్వార్థులు, కపటులు, క్రూరులుగా నేలకనబడుచున్నారని కొందఱాక్షేపింపవచ్చును.

ఈయాక్షేపమున గొంతయత్యుక్తి, కొంతభ్రమయు నిమిడియున్నది. ఈశ్వరభక్తి పెరిగినకొలది స్వార్థము, కపటము పెరుగుననుటకల్ల. వస్తుతః యీశ్వరభక్తులే ప్రపంచమున నన్యోన్య సంస్థలందు సేవాపరులై యుండుటను జూచుచున్నాము. అవును.

కొందఱునాస్తికులు తమ్ముదామాస్తికులమని చెప్పుకొనుచు బూటకముల నటించువారు క్రూరులై, స్వార్థులై, వంచకులై యుండుట చూడనగును. దీనికిగారణ మాస్తిక్యముకాదు. పాషండత. ప్రపంచమున బగటివేషగాండ్రెందరోగలరు. వారు నానారూపములను దాల్చి ప్రపంచమును మోసగింతురు. వారొకచో బ్రతిష్ఠగల పురుష రూపములను, మఱియొకచో ఆస్తికుల వేషమును, కొండొకచో నీశ్వరోపాసకుల వేషమును ధరింతురు. కాని యీపగటివేషగాండ్ర దృష్టాంతముతో మనము సరియైనపరిస్థితిని తెలిసికొనజాలము.

మఱియు సన్యగుణములతోబాటు ఆస్తిక్యమును వికసించును. ఆస్తిక్యము గారడివానిమాత్రపుకఱ్ఱ తలమట్టుత్రిప్పుట వలన సిద్ధించునది గాదు. శనైఃశనైః కతూక్రమము ననుసరించి చదువగాచదువగా గణితభూగోళాదులు నేర్పబడునట్లు క్రమాభ్యాసమువల్లను, సధ్యయనాదులవల్లను నీశ్వరభక్తివిశ్వాసము లేర్పడును. కాబట్టి దానికొక మార్గప్రదర్శకు డవసరమగును. పరిస్థితులు గావలసియుండును. శుద్ధాంతఃకరణము ముఖ్యము. ఆత్మయొక్క యున్నతావస్థయే ఈశ్వరవిశ్వాస మనబడును. మనము తఱచుగా నీశ్వరవిశ్వాసముగల జనులను భిన్నభిన్న శ్రేణులలో జూచుచుందుము. వారిలో కొందఱు కపటులుందురు. దొంగగానులు తొడిగికొని స్నాతకులయి కూర్చుందురు. కొందఱిలో నభ్యాసన్యూనతయు నుండవచ్చు. సామాజికపరిస్థితుల నెదుర్కొనజాలనివారై యుందురు. కొందఱు పథప్రదర్శకులలోనున్న లోటులవలన పాషండతనే యాస్తిక్యమని

మొంచువారుందురు. వారు గులకరాతిని రత్నమని నమ్మియుందురు. అట్టి వారికి రత్నఫలమెట్లు లభింపగలదు?

దీనివలన ఆస్తిక్యప్రయోజనమున నెట్టిలోటును గలుగనేరదు. వాస్తవమున నిన్నిదోషములతో గూడిన సాధారణాస్తికుల జీవనముగూడ నైశ్వర్యమేకొంచెమో లేకున్న నెంతో భ్రష్టమై యుండెడిది.

ప్రపంచపు ప్రలోభనములు, భయములు మనుష్యుని నసత్యమార్గ ప్రేరేపించు సమయమున నీశ్వరవిశ్వాసము సత్యమార్గమున నచలుడై యుండుట కతనికి బలముచేకూర్చును. ఈశ్వరవిశ్వాసియగు మనుష్యు డురిశిక్ష ననుభవించుటకు భయపడడు. హర్షముతో నతడు తనకర్తవ్యమును పాలించును. మృత్యుసమయమునను నీశ్వరుని కరుణాకటాక్ష మతనికి గోచరించును. ఈశ్వర విశ్వాసము మనుష్యునకు నిజమైన క్షమత నేర్పును. శమదమాదిక మింద్రియ నిగ్రహాభ్యాసమున దోడ్పడును. పాపాచరణమునుండి తొలగించును. నిజమారయ నీశ్వరవిశ్వాసము మానవజీవన కాయకల్పమునకు బరమౌషధి యనకతప్పదు.

ఈశ్వరవిశ్వాసములేక యీ గుణములను ధారణ చేయలేమా? యని లోకు లడుగవచ్చు. చేయలేమనియే మా సమాధానము. వాస్తవమున సృష్ట్యాదినుండి యీశ్వర విశ్వాస మేదోయొక రూపమున మనుష్యులందు వ్యాపించియే యున్నది. దీనియాధారముననే జనులు ఆచారశాస్త్రమును నిర్మించియున్నారు. దాని నాశ్రయించియే యీనియమములు

ప్రపంచపు వాయుమండలమున వ్యాపించియున్నవి. వాని ప్రాభవము ప్రతిమానవునందు నేదోయొకరూపమున స్థిరమై యున్నది. కాబట్టి కొందఱు మనుజు డీశ్వరునిపై విశ్వాసముంచకున్నను వానియమములతనిని గొంతవరకైనను సదాచారము నుల్లంఘింపనీయవు. ఇట్లు పాపముసైత మొక పొలిమేరకు లోబడియే యున్నది. అట్టిచో నాస్తికు డీశ్వరవిశ్వాసము లేశమైనను లేకుండుచోటున జేరి తమపూర్వసంస్కారముల నన్నిటిని విడిచిపెట్టి యటుపై నీశ్వరవిశ్వాసము లేక మానవుడు సదాచారి కాగలడని ఋజువుపరుపవలసి యుండును. కాని యిది యెట్లుసంభవమగును? భూమ్యాకర్షణశక్తి లేకున్న నేను లోకమున నిటునటు తిరుగగలనో లేదో తెలిసికొనగోరుదు ననుకొనుడు. అట్టియెడ నాకర్షణశక్తిరహితమైన స్థానమునకు నేను వెళ్లవలసి యుండును. ఇది నాకు సంభవమగునా? ఎన్నడును కాదు. కాబట్టి వ్యర్థకల్పనలవలన ప్రయోజనమేమి? వైజ్ఞానిక ప్రయోగములందు గారణము లేకుండ నట్టికల్పనయు జేయబడుండదు.

మఱియొకమాట. సదాచారమనగా నర్థమేమి? అబద్ధమాడకుండుట, యితరులకు దుఃఖము కలిగింపకుండుట, చౌర్యాదుల నొనర్పకుండుటయేకదా! సామాజికనియమములే మనుష్యుల కిట్టి నియమపాలన మొనర్చుటలో ప్రేరకములగునని కొంతతడవున కంగీకరింపుడు. అయినను ప్రేరణ వెలుపలనుండియేకదా కలుగవలయును? ఈ సదాచారమున కొకహద్దు కూడ నుండును. కాని, సదాచారమునకై యాత్మశాంతికూడ

నావశ్యకమగుచో నదిపైకి నెగయుమువల్లి నేర్పడెను. మనుష్యుడు తనలో గొన్న మహాసత్వప్రకాశము ననుభవమునకు తేజాల సంపదకు బరమానందము, పరమసుఖము నుండి వంచింప బడును. చేతనమనుష్యుడు జడవస్తువులవలన గలుగు దుఃఖముల నుండి తప్పించుకొనగలడు. సుఖములను బొందగలడు. కాని శారీరిక సుఖము తాత్కాలికము. శరీరములో భోగవిలాసములందు లిప్తమైయున్న ప్రతిమానవుడు తెలియును.

'పీత్వా పీత్వా పునః పీత్వా యావత్పతతి భూతలే' అను దానివలనగూడ తృప్తి కలుగదు. బాహ్యవిషయములు సుఖము లొదగూర్చుటకుగాదు. అవి శారీరికావసరములను బూర్తిచేయుటకు మాత్రమే పనికివచ్చును. ఆకలియయిన నన్నము తినుము. దానివలన శరీరము కార్యములనొనర్ప శక్తి కల దగును. జీవనోద్దేశమే భోజనమని యెంచెదమేని, నంతట గతి కేదిగలదా? భోజనమువలనను దుఃఖములు వాటిల్లును. అతిమాత్రము తినుటవలన రోగములకు సుఖములనుండియును మనుజుడు వంచింపబడును. 'మిల్' తన యుటిలిటేరియనిజమ్ నందొక ప్రశ్న నొనర్చియున్నాడు. 'సుఖముగోరుటే మనుష్యుని యుద్దేశమగుచో మనుష్యునకు, సూకరమునకు గల భేద మేమి? బురదలో పొరలాడుటచే పందికి గలుగు సుఖము కంటె నధికసుఖము హంసతూలికా తల్పమున శయనించు రాజునకు గలుగదు.' దీని కతడే యిట్లు సమాధానమిచ్చెను. 'సుఖములలో భేదమున్నది. సూకరసుఖము సూకర సుఖమే. మనుష్యసుఖము మనుష్యసుఖమే. సూక్ష్మతర సుఖము ననుభ

వించు శక్తి సూకరమునకు లేదు'. మిల్ మహాశయుని యీ కథనము సరియే. కాని 'మిల్' మహాశయుడీ విచారమును గొంచెము ముందుకు నడిపి యుత్కృష్టతమానందమును గూర్చి విచారింపగలిగినచో సూకరసుఖముకంటె మానవ సుఖము న్నతమైనదని తెలిసినట్లు విషయులోలుని యానంద ముకంటె నిశ్వాకవిశ్వాసి యనుభవించు నానందము పలురెట్లు విశిష్టమైనదని బోధపడి యుండెడిది. ఒక గణితజ్ఞునకు, గణిత మునకు సంబంధించినకఠినసమస్యలను బరిష్కరించుటచే గలుగు సుఖము మిఠాయితినుటవలన గలుగనేరదు. కాని ఆసూక్ష్మ తర సుఖము నెఱుగని బాలకుడు మిఠాయితిని యింతకంటె సుఖకారకవస్తు వున్నదా? అనును. బాలబుద్ధిగల మనుష్యుని స్థితియు నిట్టిదే. వాడింద్రియతృప్తినే సుఖసారమనుకొనును. చేతనజీవుడీయింద్రియవశుడై యున్నంతకాల మిది వాని కష్టమువచ్చి నట్లాడించును. ఇతరులయాజ్ఞలపై నటించువానికి సుఖమెట్లు లభించును? దుఃఖనివృత్తికి దారియెక్కడిది? అందు వలననే వేదమున,

> "యస్తు సర్వాణిభూతాని ఆత్మన్యేవానుపశ్యతి
> సర్వభూతేషు చాత్మానం తతోనవిచికిత్సతి
> యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః
> తత్ర కోమోహః కఃశోకః ఏకత్వమనుపశ్యతః"
>
> (యజు. ౪౦౭.)

సమస్తసృష్టిని పరమాత్మునందు వ్యాప్తమైయుండ జూచువానికి శోకమోహము లుండవని వర్ణింపబడి యున్నది.

ఈశ్వరభక్తులు సాంసారికసుఖములను తృణప్రాయముగా నెంచి కర్తవ్యపాలన మొనర్చుటలో గష్టములకోర్చి యోరికిని భయపడకుండుట కిదియే ముఖ్యకారణము. జనులు వారిని మూర్ఖులన్నను వారి కిసుమంతయు హానిలేదు. వారి హృదయము ప్రేమభరితమై యుండును. ఇది వాస్తవమున సదాచారమునకు సత్యమైనయాధారము.

ఈశ్వరుడు నిరాచారుడు కాబట్టి మనకు సదాచారము నెట్లు నేర్పగలడని కొందఱనవచ్చు. నిరాచారుడనుశబ్దమును పాఠకులు తెలిసికొనియే యుందురు. సదాచార దురాచార శబ్దములు సాపేక్షికములు. మనుష్యుడు సదాచారియో లేక దురాచారియో యగును. కుక్క, పిల్లి మున్నగు జంతువులలో బుద్ధిపూర్వక కార్యములుండవు. కాబట్టి సదాచార దురాచార ప్రశ్నయే యటగలుగదు. కాబట్టి యాప్రాణుల నాచారాత్మక ప్రాణులలో(Moral-beings)లెక్కింపరు. వానిని సదాచారములనియు దురాచారములనియు వ్యవహరింపము. ఇట్లే యీశ్వరుని విషయమునను నాచారసంబంధమగు ప్రశ్న ఉదయింపదని కొందరు చెప్పుదురు. అతడుకూడ నాచారాత్మకుడుగాడు నిరాచారుడు. (unmoral being) కారణమేమన, నతడొక్కవిధముగానే పనిచేయును. విపరీత మొనర్పడు. ఇట్లు మనుష్యున కాచారము నేర్పవలయుననిన నాచారవంతుడే సమర్థుడగును. నిరాచారియయిన ఈశ్వరు డెట్లునేర్పగలడని వారి తాత్ప

కుక్క, పిల్లి, మున్నగునవి నిరాచారములైనట్లీశ్వరుడు నిరాచారిగాడని మా సమాధానము. మనమే యర్థమున మనుజుని సదాచారి యనగలమో యాయర్థమున నీశ్వరునిసైతము సదాచారి యనగలము. ఈశ్వరుడు 'సత్' కాబట్టి యతని యాచారమును సదాచారమగును. కుక్కలు, పిల్లులు మున్నగునవి యబద్ధమాడవు. చౌర్యమొనర్పవు. కాని యిది నిషేధాత్మక సదాచారము. బుద్ధిపూర్వక మనజెల్లదు. ఈశ్వరుని కార్యములన్నియు బుద్ధిపూర్వకములై యున్నవి. కాబట్టి యతనిని నిరాచారియనజాలము. అతడు దురాచారము నెన్నడు నాచరింపడు. సత్పురుషుల యాచరణ మానవుల కనుకరణీయమైనట్లు ఈశ్వరుని దయ, ప్రేమ పరోపకారాదులు మానవుల కనుకరణీయములు. ఈశ్వరుని నిరాచారి( unmoral ) యని చెప్పి సదాచారమునుండి వేరుపరచుట కేవల వాగ్విలాసము. దానికొక యర్థము లేదు. ఆర్. ఎస్. ఆర్మ్‌స్ట్రాంగ్ సత్యమే చెప్పెను.

'సత్పురుషుడు ఈశ్వరునివలన నేర్పడు నన్నియమముల కనుకూలముగా జీవనమును నడుపుటయే సదాచారమనబడును. ఈ యానుకూల్యము ననుభవమున దెచ్చుకొనుటయే యానందము'

ఆస్తికు లీశ్వరునందు వర్ణించు గుణకర్మలను సదాచార కోటియందుంపవీలులేదు. అట్టిచో నీశ్వరుని కర్మల యనుకరణమువలన మనుజుడు సదాచారియగునని యెట్లు చెప్పగలమని కొందఱు ప్రశ్నింతురు. మిల్ మహాశయు డొకచో అన్నాడు.

ఈశ్వరాస్తిత్వమునకు దగు ప్రమాణములు లభించిన నేనీశ్వరు నంగీకరింతును. కాని, యొకసదాచారి మనుష్యునకు దగినట్టి విశేషణములతో నీశ్వరుని పిలుచుటకు నేనంగీకరింపను. ఈశ్వరుడు నన్ను ఘోరనరకమున బడవైచినను నాకిష్టమే. ఘోరనరకయాతనల ననుభవించుటకైన నుద్యుక్తుడ నగుదును కాని క్రూరుని దయాళువని యసత్యమాడ నంగీకరింపనని చెప్పను.

వాస్తవమున నివివీర వాక్యములు. వీని నుచ్చరించుటలో మిల్ తనలాభవాదమునుగూడ లెక్కింపడయ్యె. ఘోరదుఃఖములు సంభవించినను తన్ను సత్యవాదిగా నుంచుచున్నాడు. ఈసత్యవాదమున కతనికి లభించుప్రేరణ యెక్కడిది? లాభవాదము, సుఖవాదము (Hedonism) వానిని దుఃఖములను సహించి సత్యమాడ నెన్నడును ప్రేరేపింపవు. ఈప్రేరణ దయానందమహర్షిచే వర్ణింపబడిన యీశ్వరీయ ధ్వనినుండియే కలిగినదని నాయభిప్రాయము. దీనింబట్టి వాస్తవమున సదాచారనిర్ణాయకమగు నొరపిడిరాయి మనయాత్మలోనే యిమిడియున్నదని తెలియుచున్నది. ఎన్నిదుఃఖములు వాటిల్లినను పాపములనుండి విడివడి పుణ్యకర్మలందు నిష్ఠగలవాడవుకమ్మని యంతరాత్మప్రత్యాత్మకును బోధించును. ఏసత్తనంగీకరించుటకు మిల్ మహాశోదయునకు ప్రమాణము లభింపదో ఆసత్తయముగా నతని కతనిసిద్ధాంతములకు విరుద్ధముగా నెన్నికష్టవచ్చినను అసత్యమాడవలదని బోధించుచున్నది. అతడు

గానిని వినుచున్నాడు. డాక్టర్ వార్డ్ బాగుగా చెప్పి యున్నాడు.

"సమయము వచ్చినపుడు 'మిల్' యొక్క యుత్తమ ప్రకృతి యతని నతని మతమునకు విరుద్ధముగా గూడ నిశ్చ యించుటకెంతో బలపూర్వకముగా నిర్బంధించును."

సత్యమాడుటకును, క్రూరశక్తుల నెదుర్కొనుటకును, తినదుఃఖములను సహించియు నసత్యమాడకుండుటకును ఉప దేశించునీశ్వరునిగూర్చి 'మిల్' మహాశయునకు తెలిసియున్న యంత బాగుగ నుండెడిది! వేదమున

"అశ్రద్ధా మనృతే దధాచ్ఛ్రద్ధాం సత్యే ప్రజాపతిః"

అసత్యమున నశ్రద్ధను, సత్యమున శ్రద్ధను నుంచుడని ప్రజలకు బోధించిన వాడీశ్వరుడే.

కాని యిది ప్రపంచమున ఆస్తిక్యప్రచారము కానంత వరకు సంభవము కాదు. ఈశ్వరుడు నత్యాంతక్రూరుడు, దురా చారుడు నని యొప్పుకొన్న మతములు నెన్నోగలవు. తులసీ దాసు రామాయణమున నొకచో,

'ఏఘున మనావహి దేవ కుచాలీ' (అయోధ్యాకాండము) అని వర్ణించియున్నాడు. పురాణములలో దేవతలకు సంబ ధము కాని పాపమొండుకలదా? దేవతలొనర్పని చెడుగేది? ఈర్ష్యాద్వేషములు, వ్యభిచారము, అసత్యములు, మోస ములు నన్నియు దేవతాగాథలందును, పురాణములందును తత్స దృశములయిన నితర మతగ్రంథములందును నుప్పతిప్పలుగా

బోధపడగును. గ్రీసుదేశమునకు సంబంధించిన 'ఇలియడ్' 'ఒడెస్సీ' లను చదువుడు. వానియందును దేవీదేవతల కర్తవ్యములు నిట్లే తెలియనగును. గ్రీకుల దేవమూల నొకమాటు శిలకింపుము. కాదు. కాదు. ప్రపంచమున ప్రసిద్ధిగాంచిన మతముల మూలగ్రంథములయిన బైబిల్ ఖురానుల నొకమాటు చదువుడు. వానిలో నీశ్వరునిగూర్చి వర్ణింపబడిన విషయములను జూచిన తార్కికులహృదయము ఆస్తిక్యమునుండి పెడమొగము పెట్టుననుట నిస్సంశయము. ఒకమాటు నాస్తికబీజము హృదయమున నాటుకొనిన నది యంకురించి పల్లవితమగుట కెక్కువ సమయము పట్టదు.

ఈశ్వరుని సత్యస్వరూపము నెఱుంగుట మనకవసరము. నాడే మనహృదయము సత్యమయిన ధార్మికభావములతో ప్రఫుల్లితమగును. నాడే మనము సదాచారుల మగుదుము.

ఆస్తికులు దుఃఖము ననుభవించుచున్నారు. నాస్తికులు సుఖముల నోలలాడుచున్నా రను లోకులమాటలు నిస్సారములు. సుఖదుఃఖములు వేఱు. సుఖదుఃఖముల యాడంబరములు వేఱు. సామాన్యమనుజులు పైయాడంబరములనుజూచి సుఖదుఃఖముల నూహింతురు. మేడలందుండువారందఱు సుఖులని వాదింతురు. కారాగారమున నుండువారందఱు దుఃఖితులనుకొందురు. సుఖదుఃఖముల వాస్తవరూపము నెఱిగినవారిట్టి పొరపాటులలో చిక్కుకొనరు. సుఖదుఃఖము లాంతరికములు. బాహ్యములుగావు. ప్రకృతిలోగల సమస్త వైభవమును బొందియు మానవుని యాత్మ దుఃఖము ననుభవింప

వచ్చును. కారాగారమునందుండియు సుఖము ననుభవింప వచ్చును. నాస్తికునకు వస్తుతః సుఖమననేమో తెలియదు. వాడు చార్వాకునివలె సాధారణ సుఖసామగ్రులనే సుఖమని యెంచును. ఆపత్తు లావహిల్లినపుడు మానవశక్తుల సహకారము లభింపనినాడు ధైర్యమునొసగుటకు సమీపమున నెవ్వరు లేనికాలమున నాస్తికుని యెదుట ఘోరాంధకారము తాండవించును. అతని కాసమయమున సాంత్వన మొసంగు వారెవరు? ఆతప్తహృదయునకు 'భయపడకుము. నేనుతోడున్నాను' అనువారెవరు? ఇట్టివానికి మధ్యాహ్నము గూడ నర్థరాత్రియగును. వాడు తన బాహుబలముపై నిర్భర పడును. కాని యా బాహుబలము నితని వంచించుసమయ మరుదెంచును. ఇట్టివానితో నీశ్వరవిశ్వాసిని బోల్చిచూడుము. నిర్జనారణ్యమగుగాక అర్థరాత్రియగుగాక! సముద్రమధ్యమున గాలివాన చెలరేగుగాక. కారాగారమున బంధితుడగుగాక, రోగములచే బీడింపబడుగాక, యెట్టికష్టమైనను వచ్చుగాక ఈశ్వరవిశ్వాసి కీశ్వరుని స్మరించినమాత్రమున మహానందము వెల్లివిరియును. అగ్నిజ్వాలలందు మండుచున్నను వానియధరోష్ఠమున స్మేరము తాండవించును. రుగ్ణబాలకునకు దల్లియంక సుఖము తప్పక లభించును. అట్టిచో జగదంబ యంకమున జేరి యామె జోలపాటలను వినుచు శిరమున నమృతకరస్పర్శ ననుభవించి దుఃఖములను మరువని సంతప్తహృదయు డెవడుండును? "నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాం

యోవిదధాతి కామాన్, తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా
స్తేషాం సుఖంశాశ్వతం నేతరేషామ్"

నిత్యులకునిత్యుడు, చేతనులకు చేతనుడునగు పరమాత్ముని హృదయమున నెఱుఁగువాడే శాశ్వతసుఖమును బొందును.

కొందఱు జీవాస్తవికానందమును భ్రమయందురు.

నక్షత్రములతో వ్యాప్తమయిన యాకాశమును జూచి నీవుపొందునానందము, ఈశ్వరబుద్ధియు నాకొక కప్పుకాఫీ లోనే దొరకుచున్నది. నల్లమందు నెక్కువగా నుపయోగించిన స్వర్గద్వారము తెరువబడవా?' అను నిట్టిమహానుభావులే

"పీత్వాపీత్వా పునఃపీత్వా యావత్పతతి భూతలే" అను సిద్ధాంతమును కనుగొనియుందురు. వారికి స్మృతితప్పుటయే యానందము. జ్ఞానతిరోభావమే యానందమగుచో రాలు రప్పలు మనకంటె నెన్నోరెట్లు మెరుగగును. నల్లమందుమత్తు కొంతతడవునకు దొలగవచ్చు. రాలకెన్నడును స్మృతియే కలుగదుగదా! దుఃఖములను దూరమొనర్చుటకు మత్తుపదార్థముల నుపయోగించువారెంతమూర్ఖులు? ఒకమహాశయుడు తనకు మానసికవ్యథ కలిగినపుడెల్ల నొకకాయ బ్రాంది నుపయోగించుచుండెడువాడు. ఆమద్యము తనదుఃఖమును వెదకి నశింప జేయునని యాతనియూహ. కాని యతనిదుఃఖ మొక్కొక్కప్పుడు మత్తునే దూరమొనర్చి రాజ్యముచేయుచుండెడిది. మద్యము దుఃఖమును దూరమొనర్పగల్గుచో సారాదుకాణమున దుఃఖమే కలుగకుండవలయును గదా! కాని మద్యపాయుల

# పదునొకండవ అధ్యాయము

## ఈశ్వరప్రాప్తికి సాధనములు

ఈశ్వరుడు ప్రతిస్థానమునందు ప్రతికాలమునందును వ్యాపకుడగుటచే ప్రతిజీవికి స్వభావతః ప్రాప్తుడే.

'తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే
తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః'
(యజు ౪౦.౫)

ఈశ్వరుడచలుడు కాని ప్రపంచమును చలింపజేయును. అతడు సమీపమునను దూరమున నున్నాడు. అన్నిటికి బాహ్యాభ్యంతరముల నున్నాడు.

అన్నిటికి సమీపమున నుండినను యథార్థముగ నతడు దూరమే. కాలము, స్థానము నపేక్షించి యతను సమీపమున నుండియు నందఱికి ప్రాప్తుడుకాడు. అతని నెవరు నెఱుంగరు.

ఈశ్వరప్రాప్తికి మూడుసాధనములు చెప్పబడినవి. అవి జ్ఞానకర్మోపాసనములు. ఇవి మూడును గలసి యీశ్వరప్రాప్తి నొనరించును. ఒక్కటొక్కటి కాదు. ఈ మూడుసాధనములు యుగపత్తుగా ప్రయోగింపబడవలయును. మొదటకర్మ, తరువాత ఉపాసన, అటుపై జ్ఞానము ప్రయోగింపవలయు ననుట సరిగాదు. ఈమూడును గలిసి యీశ్వరభక్తి యనబడును. దీనివలననే యంతమున మోక్షముగలుగును.

కర్మ.

ఈశ్వరభక్తికి ప్రధమాంగమైనకర్మను ప్రథమమున విచారింతము. కర్మ, కర్మఫలములను గూర్చి విచారించుచు మనుజులు సత్కర్మ నాచరింపవలయునని చెప్పియుంటిమి. వేదమునందును-

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః
ఏవం త్వయి నాన్యథేతో౽స్తి నకర్మ లిప్యతేనరే"

మనుజుడు జీవిత మున్నంతకాలము ఉత్తమకర్మల నాచరింపవలయును- దానివలన గర్మబంధనమునుండి విముక్తుడగునని వర్ణింపబడియున్నది.

వేదములందు గర్మ నిరాకరింపబడినదని యనేకులెంతురు. 'ఋతేజ్ఞానాన్నముక్తిః' ఇత్యాది వాక్యములవలన వారికిట్టిభ్రమ గలిగియుండును. జ్ఞానములేక ముక్తిగలుగదని వాక్యార్థము. కర్మలేకున్న జ్ఞానమును కలుగనేరదని వారెఱుగరు. ఈభ్రమలోబడి యనేకపండితమ్మన్యులు వ్యర్థముగా కాలముగడుపుచురుగాని కర్మల నాచరింపరు.

మనము మనశరీరముమీద దృష్టినిసారింతుమేని యిందు జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు రెండు నున్నట్లు తెలియ నగును. కన్ను పాదములకు నడచుటలో సహాయమొనర్చును. పాదములు కన్నులను భిన్నభిన్నస్థానములకు గొనిపోయి నానావిధ దృశ్యములను జూపించును. అందువలనజ్ఞాన మధికమగును. ఇట్లు జ్ఞాన కర్మేంద్రియములు పరస్పరాభివృద్ధికి గారణములగు

చున్నవి. ఒకప్పుడు కర్మ పూర్వము. ఒకప్పుడు జ్ఞానము పూర్వమగును. ఒకటి జ్ఞానపూర్వకముగా కర్మనాచరింతుము. మఱియొకటి కర్మపూర్వకముగా జ్ఞానమార్జింతుము.

ప్రాపంచికకార్యముల నాచరించుచు మనమీశ్వరుని ప్రాప్తింపజాలమని కొందఱియభిప్రాయము. కాబట్టి వారు ప్రపంచమును విడిచి యీశ్వరు నన్వేషింతురు. ఈశ్వరుడు ప్రపంచమును విడిచి యెటనైన దాగియుండెనని వారియభిప్రాయము గాబోలు! కర్మల నాచరించినంతకాలము మన కీశ్వరభక్తికి సమయము లభింపదని వేఱొకకొందఱుతలంతురు. కాని వేదము వీరిని నిరాకరించుచున్నది. వేదదృష్టిలో గర్మలనాచరింపకున్న శుభములు కలుగనేరవు.

బిడ్డ యుదయించి నప్పటినుండియు గర్మ యారంభమగును. అతనిబుద్ధి వికసింపని పసితనమున జేయబడు కర్మలకు వాడుత్తరవాది కాకపోవచ్చు అయినను వానిమాతాపితరులయు, పరిజనులయు గర్మలప్రభావ మతనిపై బడుచుండును. అందువలననే వైదిక సంస్కారముల నొనర్పవలసియున్నది. యజ్ఞాదులు నిందులకే యాచరింపబడును. వీనివలన బిడ్డలయాత్మలపై సుసంస్కారము లేర్పడును. ఈశుభసంస్కారములే మనుష్యుని భవిష్యజ్జీవనమున పుణ్యములనాచరించుటకు, పాపముల నాచరింపకుండుటకు యోగ్యుని జేయును. ఇవే యంతమున నీశ్వరుని బ్రాపింపజేయును. ఈవాక్యమున బ్రయోగింపబడిన 'అంత'శబ్దము ముక్తికిబదులుగా వాడబడినది. కాని ముక్తికిబూర్వ మీకర్మలద్వారా యీశ్వరప్రాప్తి

కలుగదని యెంచరాదు. వస్తుతః శుభసంస్కారము ఏర్పడిన దాది యీశ్వరానుభవము కలుగుట కారంభించును. ఈశ్వరానుభవము శరీరమునకు బుష్టినిచ్చి క్రమముగా నధికభోజన మొనర్ప జేయు శక్తి నొసంగు భోజనము వంటిది. శుభసంస్కారము ఏర్పడినతోడనే మనుజున కీశ్వరానుభవము కలుగదొడగును క్రమముగా బుణ్యకర్మల నొనర్చుటలో నీశ్వరానుభూతి సహాయకమగుచుండును. పుణ్యకర్మ లీశ్వరానుభూతిని పెంచును. ఆ పెంపొందిన యీశ్వరానుభూతి యధికముగా బుణ్యముల నాచరించుటలో సహాయకమగును. ఇట్లు పరస్పర సహాయకములగుచు నంతమున మోక్షము లభింపజేయును. వేదమున

వ్రతేన దీక్షామాప్నోతి దీక్షయాప్నోతి దక్షిణామ్,
దక్షిణయా శ్రద్ధమాప్నోతి శ్రద్ధయా సత్యమాప్యతే

'శుభకర్మ నాచరించుటకు వ్రతపరాయణుడైనవానికి ధర్మమాచరింప నధికారము లభించును. అధికారప్రాప్తిచేత యోగ్యతకలుగును. యోగ్యతవలన శ్రద్ధోత్సాహములు కలుగును. శ్రద్ధవలన సత్యములభించును అని చెప్పబడినది.

శ్రీశంకరాచార్యుడు బ్రహ్మసూత్రముల భాష్యమొనర్చుచు బ్రహ్మజిజ్ఞాసకు నాలుగువిషయము లవసరమని వర్ణించియున్నాడు,

౧ నిత్యానిత్య వస్తువివేకము.
౨ ఇహాముత్రార్థ భోగవిరాగము.

3 శమదమాది సాధనసంపత్తి.
౪ ముముక్షుత్వము

ఈశ్వరభక్తి లేకయే నిత్యానిత్యవస్తువివేకాదు లేర్పడు ననుట కల్ల. మనుష్యు డీశ్వరుని గుర్తింపగలిగిననాడే నిత్యానిత్యవస్తువుల వివేకము కలుగును. వాస్తవమున నీశ్వరజ్ఞానము, నిత్యానిత్యవస్తువివేకము రెండును సమకాలముననే యేర్పడును. దీపమువలన నితరవస్తువులతోబాటు దీపమునుకూడ జూడగలుగుచున్నాము. ఆసూర్యప్రకాశమే మనకు వస్తువులతోబాటు సూర్యునిగూడ జూపించును. ఇట్లే బ్రహ్మజ్ఞానము బ్రహ్మను తదితరపదార్థములనుండి వేఱుచేయుటలోను సహాయకమగును. ఈవిధముగానే బ్రహ్మజ్ఞానము నిచ్ఛగింపకున్న భోగముల వైరాగ్యముగాని, శమదమాదులుగాని యేర్పడజాలవు. కాబట్టి యివన్నియు సాధనసాధ్యముల కార్యములు సాధించుచున్నవని చెప్పుటసంగతమగును. పిల్లవాడు కన్నులు తెరవగానే సూర్యకిరణప్రకాశమును గ్రహించును. కాని ప్రచండప్రకాశమును గ్రహింపగలశక్తి యింకను వచ్చియుండదు. సూర్యుని కోమలప్రకాశము శిశువు గ్రహింపగలిగియుండును. ఆ కోమలప్రకాశమే శిశువు నేత్రములలో బ్రచండప్రకాశమును గ్రహింప సామర్థ్యమును గలిగించును. ఇట్లే బ్రహ్మప్రాప్త్యభిలాషాపరిస్థితియై యున్నది.

చాలమంది బ్రహ్మజిజ్ఞాసకు గర్మతో సంబంధములేదందురు. కాని యిట్లనుట ప్రమాదము. శంకరాచార్యుడు

"వేద ఏవాగ్నిహోత్రాదీనాం శ్రేయః సాధనానా మనిత్య ఫలత్వం దర్శయతి తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే, ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకః క్షీయతే." (ఛాం. ౮. ౧. ౬)

వేదమున అగ్నిహోత్రాది శ్రేయఃసాధనముల ఫలము అనిత్యములని వర్ణింపబడినవి. ఈలోకమునకై చేయబడిన కర్మల ఫలము క్షీణించునట్లు పరలోకమునకై యొనర్చిన పుణ్యఫలమును క్షీణించునని ఛాందోగ్యమున వర్ణించి యున్నది

అట్లయిన అగ్నిహోత్రాదులు శ్రేయఃసాధనములని యెట్లు చెప్పబడినవి? మద్యపానము, పరస్త్రీగమనము మున్నగు కర్మఫలములవలె అగ్నిహోత్రాదికర్మఫలములు ననిత్యములగుచో వాని నేల చేయవలయును? వీనిని శ్రేయములని చెప్పి ప్రయోజన మేమి? ప్రయోజనము లేకపోలేదు. పై రెండువిధముల కర్మలు సమానములుగావు. ఒకటి మనల నీశ్వరప్రాప్తికి నడపును. మఱియొకటి మనల నామార్గమునుండి తొలగించును. సాధ్య ప్రాప్తికానంతవఱకే సాధనముండును. సాధ్యము ప్రాపింపగనే సాధనము నశించును. భోజనము పక్వమగుటతోడనే యగ్ని చల్లార్పబడును. కాని, యగ్ని యనిత్యమని యిటనర్థము కాదు. అది జ్వలించుట నిష్ప్రయోజనము. కర్మఫలములు క్షీణించు నని యుపనిషత్తు చెప్పినది సరియే కాని ఫలము క్షీణించిన నది సాధనకృత్యమును నెరవేర్చును.

ఈశ్వరప్రాప్తికొఱకు జేయబడు మనజీవితమునకు సంబంధించిన శుభకర్మలన్నియు నత్యంతావశ్యకములయినవి. వీనిని విడిచి మన మీశ్వరప్రాప్తిసాధనములను సంపాదింప నేరము.

వీనిలోఁగొన్ని దూరస్థసాధనములు. మఱికొన్ని నికటస్థములు. మనుజుఁడు సాధనముల కెంతదూరముగానుండిన నంతదూరస్థ సాధనముల నుపయోగింప వలసిన వాఁడగును. వీనినొక యుదాహరణముద్వారా స్పష్టముగా తెలిసికొనవచ్చును.

మనము తెనాలినుండి కలకత్తా వెళ్లవలసి యున్నట్లూహింహింపుము. కలకత్తా తెనాలికిచాలదూరముననున్నది. కాబట్టి మొదట మనము స్టేషనునకు వెళ్లవలసియుందుము. అక్కడ టిక్కెట్ తీసికొని కలకత్తాపోవు రైలుబండిలో గూర్చుండవలయును. అదిమార్గమున పెక్కుస్టేషనులను గడచుచు గలకత్తా చేరును. మార్గమధ్యమున ననేకస్థానములందు స్నానపానాదులను జేయవలసియుందుము. ఇవన్నియు కలకత్తాచేరుట యను సాధ్యమునకు సాధనములు. కాని వీనిలో కొన్నిదూరస్థములు. కొన్ని నికటస్థములు. మధ్యలో భోజనాదులనొనర్చుట గూడ గలకత్తాచేరుటకు సాధనమగుచున్నది. ఆభోజనాదులు చార్యాదులనొనర్చుటకు సాధనమగును. దీనింబట్టి సాధ్యముసిద్ధింపజేయు కార్యములన్నియు నాసమయమున సాధనములనబడును. సాధనమున రెండుగుణము లవశ్యముగా నుండవలయును.

(2) సాధ్యమును సిద్ధింపజేయు యోగ్యత.

(౨)సాధ్యమును దృష్టియందిడుకొని యుది యవలంబింపబడుట.

ఇందేగుణము లేకున్నను సాధనముకానేరదు. కలకత్తా వెళ్లుటకు బెజవాడస్టేషనునకు వెళ్లవలయును. కాని వెళ్లువాని దృష్టి బెజవాడకుబదులు కలకత్తాపై నుండవలయును. మిత్రు

లెక్కడికి వెళ్లుచున్నావని యడిగిన కలకత్తా యనిచెప్పును. బెజవాడయని కాదు. మధ్యలో బెజవాడ వెళ్లుచున్నను లక్ష్యము కలకత్తాయై యున్నది.

సాంసారిక కార్యములు నిట్లేయుండును. మనము నాలుగు విధములగు కార్యముల నొనర్తుము.

(౧) కొన్ని కార్యము లీశ్వరప్రాప్తి నొనర్చు యోగ్యత కలిగి యుండును. అవి యందులకే చేయబడును. దానమిచ్చుట, విద్య లనునేర్చుట, పరోపకారమొనర్చుట మున్నగున విందు జేరును.

(౨) కొన్ని కార్యము లీశ్వరప్రాప్తి నొనరించు యోగ్యత కలిగియున్నను అందుకొఱకు జేయబడవు. యశస్సుకొఱకు దానమిచ్చుట, కొండొకస్వార్థమునకై యన్యులకు సాయమొ నర్చుట మున్నగునవి.

(3) ఈశ్వరప్రాప్తినిగోరి కొన్నిపనులు చేయబడును కాని వానిలో నట్టియోగ్యత యుండదు. విగ్రహారాధనము, పశు బలులు మున్నగునవి.

(౪) కొన్నిటిలో ఈశ్వరప్రాప్తినొనర్చు యోగ్యతయు నుండదు. అందుకొఱకై యవి చేయనుబడవు. చౌర్యము, వ్యభి చారము మున్నగునవి.

ఇందు మూడు నాలుగు విభాగములకు జెందినపనులు ప్రపంచమునకు లాభమును చేకూర్పకపోగా కర్తయాత్మోన్న తికిని గారణములు కావు. కాబట్టి యివి నిషిద్ధకర్మలు. వీని వలన వ్యక్తికిని, సంఘమునకును నష్టము వాటిల్లును.

రెండవ విభాగపు పనులు మానవున కీశ్వరప్రాప్తి కలిగింపవు. కాని, యతని నీశ్వరప్రాప్తికి సమీపస్థుని జేయును. అతడు శుభకర్మల నొనర్చును. కాని సకామభావముతో జేయును. అతనిలో శుభకర్మలనాచరింప రుచికలుగును. నిషిద్ధకర్మలతని నాత్మయందు చెడుసంస్కారములను గలిగింపనేరవు. స్వార్థవశమున బుణ్యమాచరించుటవలన నతడొకప్పుడు సన్మార్గమునుండి విచలితుడు కావచ్చును. కలకత్తా వెళ్లువాడు బెజవాడజంక్షన్ చేరి యటనుండి బొంబయి చేరుట కవకాశముండును. కలకత్తా వెళ్లనుద్దేశింపకున్న నొకప్పుడు బెజవాడనుండి కారణాంతరముచే ప్రేరితుడై కలకత్తా వెళ్లుటయు సంభవింపవచ్చును.

నిషిద్ధకర్మల నాచరించువాని కంటె స్వార్థవశమున సకామకర్మల నాచరించువాడు ఈశ్వరునకు సమీపస్థుడగును. ఛాందోగ్యోపనిషత్తున బైవాక్యమునందు వర్ణించినట్లు సకామకర్మల ఫలము క్షీణించుటలో సందియము లేదు. కాని యాకర్మలు మనుష్యుని ఈశ్వరానుభూతికి సమీపింపజేయును.

కాబట్టి యజ్ఞాదులొనర్చుట వ్యర్థముకాదు. అత్యావశ్యకము. వీనివలన నాత్మయందు శుభసంస్కారము లేర్పడును. వీనినాచరింపకున్న మనుజుడు ముందంజ వేయజాలడు. మనుష్యుడు భోజనము చేయ మాను ననుకొనుడు. కొలదిదినములలో నతడు దుర్బలుడగును. మస్తిష్కము భ్రమింపసాగును. అట్టియెడ ముముక్షుత్వ యోగ్యత యుండనేర్చునో! వాడు యోగసాధనమొనర్పగలడా? దాపినహి. ఇట్లేయున్న సాంసారిక శుభ

కర్మలని యెంచవలయును. ఇట్టికర్మల నాచరింపక మనుజు డీశ్వరుని బ్రాపింపనెంచుట భ్రమయగును. అతని కీశ్వరప్రాప్తి కలుగకపోగా నతనిసామీప్యమును లభింపజాలడు.

## అశుభకర్మ లెయ్యవి?

౧ పంచ మహాయజ్ఞాదుల నొనర్చుట.

౨ తన నిర్వాహణముకొఱకు శుభకర్మలనాచరించుట.

3 దానమొసర్చుట.

౪ ఇతరప్రాణుల కష్టములను దూరమొనర్చు నుపాయముల నాలోచించుట

ఈనాలుగువిధములందు నీశ్వరప్రాప్తి నాచరించు కర్మ లన్నియు నంతర్భూతములగును.

ఈకర్మలన్నియు నీశ్వరప్రాప్తిని దృష్టియం దిడుకొని చేయబడినచో నీశ్వరప్రాప్తి సుగమమగును. పదభ్రష్టుడగుట కవకాశముండదు. ఈశ్వర ప్రాప్తి లక్షింపకున్న మొదట పద భ్రష్టు డగునట్టి భయముండును. రెండవది యాత్మయందు మహత్వ మేర్పడదు. కావున నిత్యానిత్య వస్తువివేకము నందును సహాయము కలుగనేరదు.

కొందఱు హోమాదులనే కర్మకాండగా నెంత వారు నిత్యము ప్రాతఃకాలమున సంధ్యాగ్నిహోత్రముల న రింతురు. ఇతరయజ్ఞములందును బాల్గొందురు. కాని, వ తమ నిర్వాహార్థము శుభకర్మల నాచరింపరు. దానమీయ సామాజిక దుఃఖములను దూరమొనర్ప యత్నింపరు. ఇట్టి

కెన్నడు నున్నతిని బొందజాలరు. ఇది కర్మకాండ కాదు. పాషండకాండము. హోమాదులనొనర్చుట పాషండము కాదు గాని వారు తమకర్తవ్యముల నంతటితోనే సీమితమొనర్చి యన్య పురుషార్థములందు శైథిల్యమే పాషండమనబడును. హిందువులలో నేడిట్టి పాషండమధికముగా వ్యాపించియున్నది. హోమాదులు కర్మకాండమున కంగములుమాత్రమే. అవి యావశ్యకాంగము లైనను పెద్దవిమాత్రము కావు. ఒకమను జుడు పొలముదున్ని విత్తనములునాటడేని వాడుమూర్ఖుడు, పాషండుడు నగును. పొలముదున్నుటకృషికంగమైనను కృషిలో పెద్దభాగము కాదుకదా? పంచమహాయజ్ఞాదుల నొనర్చుట తనయాత్మక్షేత్రమున అన్యసత్కార్యములనెడి బీజారోపణము నకు సిద్ధపరుచుట యనదగును.

గృహస్థధర్మమును పాలించుట, సంతానముగనుట, పరివారపాలనార్థము ధనమునార్జించుటయు కర్మకాండమునకు ముఖ్యాంశములే. వివాహమాడుట స్వయముగా స్వార్థము కంటె నొకయడుగు ముందునకు వేయుటయు శమదమాదుల నభ్యసించుటయు నైయున్నది. గృహస్థధర్మపాలన సంకల్ప మును విడిచినను, పరివారపాలనచింత లేకున్నను మనుజునకు వానియున్నతి కవసరములగు ననేకానుభవములు లభిం పవు. ధర్మశాస్త్రములందు వర్ణాశ్రమ వ్యవస్థయు వాని కర్తవ్యముల నిర్దేశము నిందులకే చేయబడినవి అవి యభ్యు దయమునకు పర్యాప్తము లగుటయే గాక నిఃశ్రేయసమున

కును సాధనములగును. గృహస్థమునందే యౌదార్యము, ప్రేమ మున్నగు గుణములు వికసించును.

ఈవాస్తవికప్రేమయే పరోపకారమునకు ప్రథమసోపానము. ఏకపత్నీవ్రతము . తన్నితరులకొఱకేల మరువవలెనో, తనసుఖము నితరులసుఖముకొఱకేల విడువవలయునో మనుజునకు బోధించును. వివాహ మనుశుభసంస్కారమే లేకున్న మనుజు డింద్రియదమన మొనర్ప జాలడు. వ్యభిచారము, ఉచ్ఛృంఖలత మున్నగువాని నడ్డగించుటకు వివాహము-గృహస్థాశ్రమమే ఉత్కృష్టసాధనము. స్త్రీలకు సంతానముగనుటతోడనే వారిహృదయమున మాతృప్రేమ యపూర్వముగా వెల్లివిరియును. ఈశుద్ధప్రేమ నన్యముతో నుపమింప వలను పడదు. అదియనుపమము. పతికొఱకు గల ప్రేమయందొకింత స్వార్థవిలాసాదుల గంధ మిమిడియున్నను అది సంతానోత్పత్తితోపాటు నశించును. ఇట్లే గృహస్థుడయిన మనుజుడు తనసంబంధమును తన యాత్మనుండి యితర ప్రాణులతో బోధించును. అతడొకవృత్తమును నిర్మించును. ఆవృత్తమున కతడే కేంద్రము. కాని
యనదగుదురు.

గృహస్థాశ్రమమును
క్రమముగా విశాలమగును.

ధర్మము. తనసుఖమును త్యజించి కొంత సుఖసామగ్రిని ఇతరుల దుఃఖనివారణమునకై వ్యయ మొనర్చుటయే దానకర్తవ్యము. దానమునుగూర్చి విచారించుటతోడనే మనము మన

పుత్రకళత్రాదులతో నేర్పరచుకొనిన పరిధి క్షుద్రమని తెలిసియున్నది. అది విశాలము కాదని మనకు బోధపడును. దానిని పెంచుట యావశ్యకము. పుత్రకళత్రములకంటె నితరులును మనసంబంధమునకు యోగ్యులైన వ్యక్తు లెందరో గలరు. వారి యున్నతినే తన యున్నతిగా నెంచవలయును. వారు దుఃఖితులై యున్నంతకాలము మనకు సుఖమెక్కడిది? వారు దూషితులై యున్నంతకాలము మనమెంతయత్నించినను, దేవాలయాదులందెంత గంటలువాయించినను శుద్ధులము కానేరము. వారియందు పావిత్ర్యము రానంతకాలము మనయాత్మ యున్నతినందదు. ఇట్లు గృహస్థ ధర్మమున నన్యకార్యములతో బాటు దాన పరోపకారములు కర్తవ్యములగును.

ఇతరులతో మనకేమి? మనముమాత్రము శుద్ధులమై, ధర్మాత్ములమై యున్న చాలునని యెంచువారు సృష్టికార్యక్రమము నెఱుంగరు. సముద్రమున నొకనీటిబిందువు తక్కిన నీటిబిందువులలోగల శుద్ధ్యశుద్ధులను గ్రహింపకుండునని యెంచుట యసంభవమగును. ప్రళయావస్థయం దనంతజీవులు ఒకరికొకరు వేఱైయుండిరి. కాని యీశ్వరుడు సృష్టిని జీవులిట్లసంబద్ధులై యుండకుండుటకై రచించెను. సృష్టిరచన, శరీర నిర్మాణము జీవులను బరస్పరము సంబద్ధులజేయుటకు మార్గములు. ప్రతిచేతనమునకు నితరచేతనముతో సాక్షాత్సంబంధము కలుగనేరదు. అందులకవి యౌన్నత్యశిఖరము నధిరోహింపవలసి యుండును. ఇంతవఱకెన్నడు నౌన్నత్యమునందక నేడుపొందగోరువారు శరీరములద్వారా పరస్పరము సంబ

విడిచి యన్యస్వల్పమార్గము నవలంబింపగలమని మాయభిప్రాయము గాదు. ఒకస్థానమునుండి మఱియొకస్థానమున జేరుటకు ౫౦ క్రోసులు, ౧౦౦ క్రోసులుగల రెండు మార్గములున్న నందు నూరుక్రోసుల మార్గమును విడిచి యేబది క్రోసుల మార్గము ననుగమించుట న్యాయము. కాని వస్తుతః యీశ్వర ప్రాప్తి కొకతిన్నని మార్గము లేదు. ఏమనుష్యు డేస్థానమున నేస్థితియం దున్నాడో వాడాస్థితినుండియే తన మార్గమును కొలువవలసి యుండును. ఒకానొక మనుజుడు గృహస్థుడు కాకయే సమస్తప్రపంచమును దనకుటుంబముగా నెఱుగగలిగి నంత యౌదార్యముకలవాడగుచో వాడు గృస్థులకంటె ముం దుండెననుటలో సందేహముండదు. అట్టివాడు గార్హస్థ్యమున జిక్కి వెనుకకుమఱలవలసిన యవసరము గానము. లేకున్న నతడు తన సాధ్యమునకు దూరుడగును. కాని మానవుని హృదయమింత వికసితము కానినాడు లోకభీతిచేతనో లేక యితర ప్రలోభములకు లోబడియో గృహస్థాశ్రమమును విడువ రాదు. నేటి హిందూసన్యాసులు, బైరాగులు వాస్తవమున సద్గృహస్థులకంటె నీశ్వరప్రాప్తికెంతో దూరమున వెనుకబడి యున్నారు. గృహస్థుడు కనీసము తనపరివారము కొఱకైన ను త్యాగమొనర్చును. కాని యీసాధువుల వృత్తపరిధి వారి యాత్మలనుమించి యొకయంగుళమైన వెలుపల వ్యాపింపదు. వీరు భోగవిలాసముల ననుభవింతురు కాని స్వార్జితమున గాదు. ఇంద్రియభోగములలో లిప్తులైయుందురు కాని యితరప్రాణుల విషయమై చింతింపరు. నేటిసాధువులలో స్త్రీపురుషుల చరి

త్రములు చోరులయు, వ్యభిచారులయు చరిత్రలకు భిన్నలు గావు. వీరియాత్మ లధమాధమ గృహస్థులకంటె నీచములు. వారు భోగములను సంపూర్ణముగా ననుభవింపగోరుదురు. కాని గృహస్థ కర్తవ్యభారములను వహింపనుంకింపరు. ఇదంతయు కర్మకాండ మహాత్త్వము నెఱుగకుండుటచే జరుగుచున్నది.

భారతవర్షమునగల నేటిసాధువులు, సన్యాసులు గీతను తమ పరమధార్మిక గ్రంథముగా నెంచువారయ్యు కర్మల నవహేలన చేయుచుండుట యాశ్చర్యము. సాధువులలో గీతనుపఠించని వారుండరు. కాని వారిలో కర్మపరాయణు డొక్కడును గానరాడు. వీరు గీతను పఠింతురేగాని యొన్నడును విచారింపరు.

"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్.
తస్మా త్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్"
"నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః,
శరీరయాత్రాపి చ తే నప్రసిద్ధ్యే దకర్మణః" (3. ౮)

కర్మల నాచరించుట వేదాజ్ఞ. వేదము లీశ్వరీవచనములు. కాబట్టి కర్మ శ్రేష్ఠము. అర్జునా! కర్మల నవశ్యమాచరింపుము, కర్మలను విడుచుటకంటె కర్మలనాచరించుట శ్రేయస్కరము. కర్మల నాచరింపకున్న జీవయాత్రయు నడువదుకదా!

కర్మకాండ విషయమున రెండు పెద్ద పొరపాట్లు గలవు. కొందఱు కొన్నియాడంబరములనే కర్మకాండయని యెంచుచున్నారు మఱికొందఱు కర్మకాండ యీశ్వరప్రాప్తి కనావశ్యకమని తలంచుచున్నారు. ఇందు మొదటియాలోచన హిందూజాతి

యందు నభిమానులు, మత్సరులు నైన పండితులను జన్మింప జేసినది. వారు కేవలము స్వయంశుద్ధులై యుండుటకంటె వేఱొక కర్తవ్యము లేదనిభావింతురు. రెండవతలంపు లక్షలకొలది మూర్ఖులు, పాషండులు, ఆచారభ్రష్టులు నగుసన్యాసులను జన్మింపజేసినది. ఇట్లు రెండుపెద్ద తెగలు హిందువులలో తమకు దమజాతికి శ్రేయఃసాధకు లగుటకు బదులు పతనకారకులయి యున్నారు

పండితులు వేదముల నితరజాతులవారు చదివినను, విగ్రహాదుల నారాధించుటకు బూర్వము దామితరుల స్పృశించినను దమపూజాస్థానముల కన్యవర్ణముల వారు పోయినను తమకు బాతకమాపాదించునని యెంచుచున్నారు. వారుతప్ప మిగిలిన ప్రపంచమంతయు నసత్యమాదు నాచారముల పడి యుండి యజ్ఞానమున మునిఁగి తేలుచు యజ్ఞాది శుభకర్మల నాచరింపక ఘోరాంధకారమున బడి యుండినట్లయిన నీశ్వరుడు తమకొఱకు స్వర్గద్వారము తెఱచి స్వాగతమీయ దొట్రుపడుచుండునని యెంతురు. పాపము! ఎంతటిమూర్ఖత! ఎంతటిభ్రమ! మూర్ఖజీవులార! ప్రపంచమంతయు నజ్ఞానాంధకారమున మునిఁగియున్న ప్రకాశము నీకడకెట్లువచ్చును? ప్రపంచమంతట నధర్మమను రోగకీటకములు వ్యాపించియున్న నీవుస్వస్థుడవెట్లగుదువు? ప్రపంచమంతయు దురాచారముతో నిండియున్న నది నిన్నుమియు జేయదా? లోకము అవనతియను ఘోరరసాతలమున కేగుచుండనీవు ఔన్నత్యశిఖరము నధిరోహింపగలవా? కాదు. ఎన్నడు నట్లుకాదు. ప్రపంచము నజ్ఞాన

మాయ మొనర్చు నెంచువానికి జ్ఞానముదయించదు. ఇతరుల నశుద్ధులుగా జూచుచు వారి శుద్ధికై యత్నింపనివాడు శుద్ధుడు కానేరడు. ఇతరుల నస్పృశ్యులనుగా నెంచ నెంచువాడొక నాడస్పృశ్యుడు కాక తప్పదు. పరులను ధర్మాత్ముల జేయనెంచు స్వయం ధార్మికుడు కాగలడు. తోడివారిని భ్రష్టుల జేయు దలచువాడు భ్రష్టుడగును. ఈశ్వరుడు సృష్టినంతటి నొక ఘనిష్ఠసంబంధముగల సూత్రమున గ్రంథించియున్నాడు. దారము తెగిన పూసలన్నియు గ్రిందబడును. కాబట్టి కర్మమర్మము నెఱింగి యీసూత్రమును దృఢపరచుట యావశ్యకము.

కర్మకాండము దిరస్కరింపకుము. పాషండమును గర్మకాండగా నెంచకుము. నీచేయు శుభకర్మలన్నియు నీశ్వరప్రాప్తి లక్ష్యముగా నుంచుకొని యాచరించుట మరువకుము. సాధనమును సాధ్యముగ గొందువని యున్నతి కలుగదు. అభీష్టము సిద్ధింపదు. కాబట్టి

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న సపాపేన, పద్మపత్ర మివాంభసా
కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాఽఽత్మ శుద్ధయే
(గీత-౫-౧౦-౧౧)

బ్రహ్మను లక్ష్యముందుంచుకొని కర్మల నాచరించువారు జలమున కమలమువలె కర్మలలో నంటుకొనరు. యోగులు త్రికరణములతో ఫలాకాంక్షను విడిచి కర్మనాచరింతురు. వారిలక్ష్య [illegible]

చిన్నఫలములను వారుపేక్షింపరు. ధ్యానముకొఱకు గృషి సొనర్చువారికి గడ్డిదొరకకపోదు. ఇట్లే యాత్మశుద్ధికొఱకు పాటుపడువారికి దానితోబాటు శరీరసుఖములు లభింపక పోవు. కర్మకాండను బరిపాలించుచు మనము మనధ్యేయమును మరువకుండుట మిక్కిలి యావశ్యకము. దీనికొఱకు కర్మకాండకుదోడు జ్ఞానోపాసనాకాండలు నవసరములు.

## జ్ఞానకాండము

జ్ఞానకాండము మనుష్యుని లక్ష్యమును స్మరింప జేయును. అతనిని కర్మమున లిప్తునిగానీయదు. అతనికి దాజేయునది శుభము, శ్రేయము, ఆవశ్యకమునని నిశ్చయము కలిగించును. కాని, జ్ఞానము సాధనమేగాని సాధ్యముకాదు. సోపానమేగాని శిఖరముకాదు. జ్ఞానాభావమున జనులు సాధనమునే సాధ్యమనుకొందురు. రైలుబండిని దనయిల్లుగానెంచి ప్రేమను జేసిన తరువాతకూడ దానినుండి దిగనెంచనివాడు మూర్ఖుడు. మహామూర్ఖుడగును. నిచ్చెనమెట్లను పట్టుకొని వానినివిడువని వానిబుద్ధి భళిభళియని ప్రశంసింప దగినదే. కాబట్టి జ్ఞానవృద్ధి యెంతయు నవసరము.

ఈశ్వరజ్ఞానప్రాప్తికివిసాధనములు

(౧) సృష్టిరచనాజ్ఞానము.

(౨) వేదాది సచ్ఛాస్త్రముల యధ్యయనము.

(3) సద్గురువుల యుపదేశము, సత్పురుషులసంగతి.

ఈశ్వరప్రాప్తి నభిలషించువాడు ప్రతిదిన మీమూడు సాధనములనుసంపాదింప గొంచెమో గొప్పో యత్నింపవల

యును. మనము సృష్టిరచనను ప్రతిదినమును జూతుము కాని ఈశ్వరప్రేమ చూచుదృష్టితో చూడము. విజ్ఞానము నందలు సంపాదింతురు. వారిదృష్టి సృష్టినియమముల నతిక్రమించి సృష్టినియంతవరకు నేగదు. విదేశమునుండి యాత్రనొనర్చి స్టేషనుకు వచ్చితివని యెంచుము. నీతల్లి స్టేషనునందు నిన్ను ప్రతీక్షించుచున్నది. రైలుబండిని నీతల్లిచూచుదృష్టితో నితరులు చూడరు. బండి స్టేషనుకు వచ్చును. అప్పుడు ఇంజన్, పెట్టెలు మున్నగువాని యన్నిటిగతియు నామెదృష్టియందు నీతో సంబద్ధమై యుండును. ఆమె కాబండి యొక్క ప్రియ వస్తువు. ఎందుకని? తన ప్రియకుమారుని తెచ్చుచున్నది కాబట్టి. ఆబండిలో నీవు లేకున్న నాబండిలోగల సౌందర్య మంతయు నామెకు నిస్సారమై తోచును. ఇట్లే నీవు సృష్టిని చూచునపుడు నీ పరమప్రియుని లక్ష్యమున నుంచుకొని తిలకింపుము. పర్వతముల యున్నత శిఖరములు, సముద్రపు టుత్తుంగతరంగములు, నదుల, మధురప్రవాహములు, చంద్రుని శీతలకాంతి మున్నగు నన్ని పదార్థములలోను నీవీశ్వరుని ప్రకాశమును జూడగలవు. ఒక పారసీక కవి,

'కి బచశ్మాని దిల్ మబీ జుజ్ దోస్త్
హార్చి బీసి బిదా కి మజహారే ఓస్త్'

'హృదయనేత్రముతో దన ప్రియుని దప్ప నితరుని జూడకుము. నీవు చూచునదంతయు నతని ప్రకాశమని యెఱుంగుము'ని పలికెను. ఈ విషయమునసే మాండూక్యోపనిషత్తు కూడ నిట్లు చెప్పియున్నది.

"ఓమిత్యేతదక్షర మిదగ్ం తస్యోప వ్యాఖ్యానమ్"

ఈ సమస్తజగత్తు పరమేశ్వరుని యుపవ్యాఖ్యానమని భావము. కాని ప్రతివానికి నీవ్యాఖ్యానము బోధపడదు. అందుల కభ్యాస మొనర్పవలసియుండును. పిల్లలకు చిన్నతనమునుండియే ప్రతివస్తువు నీశ్వరునితో సంబంధమని బోధింపవలయును. అతనిమనస్సున నీశ్వరుడు సర్వవ్యాపకుడనియు, నతడు సర్వపదార్థముల నొసంగుచున్నాడనియు నాటునట్లు చేయవలయును. వస్తుతః నిత్యానిత్య వస్తువివేక మన నేమి? మనకు నిత్యవస్తువన నేమో యనిత్యవస్తువన నేమో తెలియుటయే కదా? అనిత్యవస్తువులలో నిత్యవస్తు చమత్కారము నెఱుగకున్నంతకాలము మనమజ్ఞానులమే. నామరూపములతో మనకుగనబడునదంతయు ననిత్యమే. కాని మిథ్యకాదు. అదియు నిత్యప్రకాశమే. నిత్యోపవ్యాఖ్యానమే. మిథ్యావస్తువు సత్యవస్తువున కుపవ్యాఖ్యానము కానేరదు. కాబట్టి ప్రపంచమున గనబడునదంతయు మిథ్యకాదు. సత్యమేయగును.

వేదాదిశాస్త్రములను జదివింపుట ఈశ్వరప్రాప్తికి సాధకముకాక బాధకమని యనేకులందురు. వేదములను నిషేధించి యవహేళన మొనర్చిన వచనముల ననేకముల నుద్ధరింతురు. 'వేదము సామెతమాటలు' ఇత్యాది అనేకు లుపనిషద్వాక్యముల ద్వారా శాస్త్రములను బఠించుట యీశ్వరప్రాప్తి కనవసరమని సిద్ధపరుతురు.

"నాయమాత్మా ప్రవచనేనలభ్యో నమేధయా నబహునా శ్రుతేన। యమేవైష వృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్" (ముం.)

కథలకు, బుద్ధికి, వేదశ్రవణమునకు నాత్మలభ్యము కాదు. ఈశ్వరుని వరించువానికే యీశ్వరుడు లభించును.

ఈయుపనిషత్తునందే మఱియొకచో,

ద్వే విద్యే వేదితవ్యే ఇతిహస్మ బ్రహ్మవిదో వదన్తి పరా చ తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వవేదః శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి. అథ పరా యయా తదక్షర మధిగమ్యతే.

(ముండకోపనిషత్తు ౧. ౧. ౪. ౫)

విద్యలు రెండు. అపరవిద్య వేదాదులు. పరవిద్య ఈశ్వరప్రాప్తిసాధనము. కాబట్టి ఈశ్వరప్రాప్తిగోరువారికి వేదములతో నేమి ప్రయోజనము? దీనిననుసరించియే యనేకులు సాధువులు చిమ్మటల నాదించుచు జడలువిరియబోసికొని తిరుగుచుందురు. 'ఏమైన చదివితివా?' అని వారి నడిగిన 'చదువుతో మాకేల? మేము రామనామమునుజపించుచున్నాము' అందురు.

కాని ఇదియొక పెద్దదోషము. వేదాది సచ్ఛాస్త్రముల పఠింపక యీశ్వరజ్ఞానము సరిగాగలుగనేరదు. జ్ఞానము కలుగకున్న నీశ్వరప్రాప్తి యెట్లుసంభవించును? మిథ్యాజ్ఞానముతో నే వలమీశ్వరు డీశ్వరుడని జపించినంత మాత్రమున లాభము లేదని పూర్వమే వ్రాసియున్నాము. వేదములను దిరస్కరించువారు పొరపడియుందురు. లేదా వారితాత్పర్యము మఱియొకటై యుండవచ్చు. చాలమంది సత్పురుషులు విద్వాంసులయి యుండిరి. వారికనేకు లనుయాయులయిరి. కాబట్టి వారు వారికి తోచిన ట్లెల్ల నుపదేశించిరి. వారిగ్రంథములందు ననేకస్థలముల పర

స్పర విరోధములు కనబడుచుండును. వారియుద్దేశములు మంచివైనను, కొన్నియెడల వారిని ప్రమాణముగా నంగీకరింప వీలుండదు. ఆసత్పురుషులే వేదాంతులను జదివియుండిన వారియాత్మల కధికశాంతి లభించియుండెడిది.

అంధవిశ్వాసులగునను యీయాయులందు నొకదోషమున్నది. వారుకొండొకని శుభములతోబాటు చెడుగులనుగూడ ననుకరింతురు. ఒకసాధువు కేవలము భోగవిలాసములనుండి విరక్తుడైనమాత్రమున లోకులతనిమాటలు విశ్వసింపదొడగుదురు. ఇదియునొక పొరపాటు అతనికి వైరాగ్యమున్నను జ్ఞానము లేకుండవచ్చు. జ్ఞానమున్న వైరాగ్యముండకపోవచ్చు. వైరాగ్యముండి జ్ఞానములేకున్నను ప్రపంచమునుండి యుపరతి గలుగవచ్చును. కాని వానికీశ్వరప్రాప్తి కలుగదు. వేదాది శాస్త్రములను జదివి జ్ఞానము సంపాదించినను వైరాగ్యము కలుగకున్న నీశ్వరప్రాప్తి కలుగ నేరదు. భోగవిలాసముల జిక్కికొనియున్న యాత్మ వేదములనుపఠించియు నౌన్నత్యము నందజాలదు. పైనుదాహరించిన యుపనిషద్వాక్యముల తాత్పర్యమిదియే. అవి వేదాదిసచ్ఛాస్త్రముల ననాదరించినవని యెంచజనదు. వేదములు రెండువిధములుగా జదువబడును. ఒకటి మంత్రములను బఠించి యీశ్వరప్రాప్తికై యత్నింపకుండుట. ఇట్లుచదువుటయే అపరవిద్యలో జేరును. వేదములనుజదివి యీశ్వరవిచారమొనర్చి తదర్థమాచరించుట రెండవవిధము. దీనినే పరవిద్యయందురు ఈవిషయము వేదాధ్యయనము, ఈశ్వరప్రాప్తియందే కాక యితరవిషయములందును గుర్తింప

అంధేనైవ నీయమానా యథాంధాః"। "అవిద్యాయాం బహుధా వర్తమానాః వయం కృతార్థా ఇత్యభిమన్యన్తి బాలాః, యత్కర్మిణో న ప్రవేదయంతి రాగా త్తేనాతురాః క్షీణలోకాశ్చ్యవన్తే,"

అవిద్యయందు చిక్కుకొని పండితమ్మన్యులగుచు నితరులను మోసపుచ్చువారిగతి యంధుల ననుసరించు నంధుల వంటి దగును. వీరికెన్నడును మంచిగతి లభించదు.

హిందూజాతిలో నేడు సాధువులనబడువారికి జరుగు నాదరమే గురువులకును జరుగుచున్నది. మూర్ఖులు ధనములను ధారపోసి గురుమంత్రములను గైకొందురు. దానివలన గలుగు లాభమేమైన నుండునా! ఉండదు. వీరుగురువులుకారు; మోసగాండ్రు. వీరినాదరించుట జాతికి హానికరము. శిష్యులకు విజ్ఞానములభించదు. ఉన్నతియంతకు ముందే గుందునున్నయగును.

యథార్థజ్ఞానము నొసగువాడే గురువు. ఈజ్ఞాన మొకక్షణముననో ఒకదినముననో ఈయదగినదికాదు. దీనికి శిష్యులు బహుకాలము గురువులసమీపమున నుండవలెను. అధ్యయనము గారడీవిద్యకాదు. "ఏక్;దో;తీన్"అనగానే పడునదికాదు.

## ఉపాసన

ఈశ్వరప్రాప్తికి మూడవసాధనము ఉపాసన. దీనికీశ్వరప్రాప్తితో దగ్గఱసంబంధమున్నది. ఉపాసన సాధనమయ్యు ననేకాంశముల నిది సాధ్యమనదగియున్నది. కారణమేమన, అన్యసాధనసంపత్తి సరిగా నేర్పడిననాడే ఉపాసన సరికాగలదు. ఉపాసననే సామాన్యజను లీశ్వరపూజయందురు. శుభకర్మాచర

ణము, జ్ఞానప్రాప్తియు నుపాసనకంగములే. వీనివలన మానవాత్మ శుద్ధమగును. అటుపై నీశ్వరునందు ప్రేమయేర్పడును. పిదపనానందము ప్రాప్తించును.

వ్యావహారికదృష్టితో జూచిన నుపాసనకు రెండంగములున్నవి. ఒకటి ప్రార్థన. రెండవది ధ్యానము. ధ్యానమష్టవిధయోగాంగములలో నొకటి.

ఇందు ప్రార్థన యనగా స్తుతి. ప్రార్థనలని మాయభిప్రాయము. ఈశ్వరుని గుణగానమును స్తుతి యందురు. ఈశ్వరుని సాక్షాత్తుగా నెంచి యతనినుండి సహాయమపేక్షించుట ప్రార్థన యనబడును. ఇట్టి ప్రార్థన ధ్యానమునకు బూర్వమొనర్చిన నది ధ్యానమున కెంతయు దోడ్పడును. చిత్త మేకాగ్రమగును. హృదయమునకు శాంతిలభించును. తానొక గొప్ప శక్తితో గూడియున్న ట్లాత్మ కనుభవము కలుగును.

ఈశ్వరుని నున్నతస్వరమున బిలుచుటేల? అని యనేకులు ప్రశ్నింతురు. ఈశ్వరుడు బధిరుడా? వినబడదా? ఇంత పెద్దగా నేలయరచుచున్నావు? అతని గుణముల ననేకపర్యాయములు వర్ణింతువు. అతడాత్మస్తుతి నభిలషించునో! అతడు నీవర్ణనలకు లోబడి నీయొనర్చిన కర్మల కధికఫలము నిచ్చునా? అని ప్రశ్నకర్తల యభిప్రాయము.

ఇట్టిశంకల నొనర్చువారు ప్రార్థనాతాత్పర్యము నెఱుగరు. వారు లోకమున స్తుతినిందలకు లోనగు రాజులు, ధనికులు మున్నగువారివలె నీశ్వరుని భావించుచున్నారు. వాస్తవమిదికాదు. మనమేదియొనర్చినను నీశ్వరునికొఱకుగాదు. మన

కొఱకే కర్మఫలములను బొందవలయునని యుద్దేశముతో గాదు. ఆత్మోన్నతి మనయుద్దేశమై యుండును.

ఈశ్వరప్రార్థనమునుగూడ నేడు దురుపయోగము చేయువారు లోకమున లేకపోరు. అజ్ఞానవశమున నితరులను దురుపయోగమొనర్చునట్లు ప్రార్థననుగూడ దురుపయోగపరుతురు. కాని యీశ్వరప్రార్థనకు ముఖ్యతాత్పర్య మిదికాదు. లంచము వలన ననేక కార్యములు లోకమున నెరవేరినట్లు ఈశ్వరప్రార్థన వలనగూడ నెరవేరునని యనేకులెంతురు. "ఓయీశ్వరా! నాకీ వ్యాపారమున లాభముకలిగిన నందొకయంశము దానమిత్తును. పరమాత్మా! నాశత్రువు నశించిన లక్షపర్యాయములు గాయత్రిని జపింతును" ఇట్లనికోరుట ప్రార్థనలని యెంతురు. కాని ప్రార్థన యుపయోగము నెఱుంగకుండుటచే నిట్టిపొరపాట్లు జరుగుచుండును. ఈశ్వరుడు మనపాపములను క్షమింపడు. కర్మలకు న్యూనాధికములైన ఫలములనొసంగడు. అతనికి ధనమక్కఱలేదు, ప్రశంసయు నిరుపయోగమే.

వస్తుతః మన మతనిగుణములను గానమొనర్చినపుడా గుణములందు మనకు శ్రద్ధ యేర్పడును. అంతఃకరణమునగల మాలిన్యము తొలగును.

స్తుతియందు గొప్ప శక్తిగలదు. దీని నొకవిధముగా దెలిసికొన వచ్చును. మన శరీరము మీద మన మస్తిష్కమునకు ప్రాభవ మెక్కువగా నుండును. మన కార్యములన్నియు మస్తిష్కము నుండియే ప్రారంభ మగును. మస్తిష్కమున విచార ముద్భవించును. అది యనేక తంతువుల

ద్వారా మన యవయవములను కార్యమొనర్ప బ్రేరేపించును. భిన్న భిన్న విచారములు మస్తిష్కమునగల భిన్నభిన్న కోష్ఠము లందు, భిన్నభిన్నములగు మార్పులను కలిగించును. ఒక కామో త్పాదక కథనుగాని, గీతమునుగాని విందుమేని మస్తిష్కమున గామమునకు సంబంధించిన వికారము గలుగుటచే మన మనేక కుచేష్టలు చేయ నారంభింతుము. ఇందు మానసిక కుచేష్టలు నిమిడి యుండును. కాని వీరరసమును జొప్పించు గీతములను విందుమేని బాహువులు స్పందింప నారంభించు. ఇట్లే యీ శ్వర స్తుతి నొనర్చునపుడు ఆగుణములకు సంబంధించిన విచార ములు మన మస్తిష్కమునందు బాదమ నారంభించును. దాని వలన మస్తిష్కకోష్ఠముల నిర్మాణమునసే మార్పుగలుగును. సత్యమైన ప్రార్థన హృదయపూర్వకముగా నొనర్తుమేని మన మానసిక పరిస్థితియే మారుననుటలో సందియ ముండదు.

కాని యొకటి విస్మరింపజనదు. ప్రార్థనలు మస్తిష్కమున బరివర్తన నొనర్చుటకే. ఇది 'తమాషా' కాదు. కాబట్టి ప్రార్థ నలు ముఖ్యమై ఈశ్వరుని గుణములతో సంబంధములై ప్రార్థిచే దెలియుబడునవై యుండవలయును. లోకమున ననేకు లీశ్వరుని మనుష్యునిగా నంగీకరించి మానవగుణముల నతనియం దారోపింతురు. ఒకడు ప్రాతఃకాలమున లేచి 'తూర్పు దిశ యదె వెల్లవారెను. వేగుజుక్క బొడిచెనదిగో!

లేవరా కృష్ణా! లేవరా!' అనును.

మరికొందరు విగ్రహమునెదుట షడ్రసోపేతమగు భోజనము నుంచి "గోవింద; గోవింద! భోగింపవయ్యా నీకంటె దిక్కెవరు

మారులోకమున" అందురు. "చోరజారశిఖామణీ! దుకూల చోరా! బృందావనవిహారీ" ఇత్యాది నామములతో ననేకు లతనిని స్తుతింతురు. ఇట్టిగుణానువర్తనమున మాస్తిక్యమున నెట్టి మార్పుగలుగును? బుద్ధిమంతులు బాగుగా నెఱుంగ గలరు. మనము మనయారాధ్యుని దుకూలచోరాది శబ్దములతో బిలుచునపు డాశబ్దముల యర్థము మనకు స్ఫురించిన మనమాస్తిక్యముల నది యేమిచేయును? అర్థమెఱుగకున్న ప్రార్థనయే నిరర్థకమగును. ఇట్లు రెండువిధముల నీప్రార్థనలు హాని నొదవించును.

లోకులిట్లు స్తుతించి తామీశ్వరభక్తి నొనర్చితి మని యెంతురు. ఈవిచారమే 'భక్తిమార్గము'ను నిర్మించినది. కాని వీరు భక్తికిగల యర్థమునే యెఱుంగరు. గ్రీసుదేశపు ఎలిమెటిక్ దర్శనసంస్థాపకుడు Xen ophans ఇట్లు చెప్పుచున్నాడు. ఈశ్వరుడు మనుష్యుని నిర్మించుటకు బదులు మనుజుడీశ్వరుని నిర్మించుచున్నాడు. బైబిలులో నీశ్వరుడు మనుష్యుని తనకుసమానునిగా నొనర్చెననియున్నది.

'ఓ ఈశ్వరా నేను నిన్ను ధనుర్బాణములు ధరియించి యుండ జూడగోరుచున్నాడ' నని తులసీదాసు మొుదికివేసిన ట్లంధవిశ్వాసు లెందఱో చెప్పుచుండ మేమువింటిమి. తుకారామ్‌జీ, 'మేము నీ నిరాకారరూపము నెఱుంగజాలము. కాబట్టి నీవు శరీరధారివై చతుర్భుజ రూపమున దర్శనమొసంగుమా' ని ట్లు చెప్పుదురు.

వస్తుతః ప్రార్థన నింతకంటె నధికముగా దురుపయోగ పరచుట యసంభవమనక తప్పదు. ప్రార్థన జీవుని ఈశ్వరుని కడకు తీసికొనిపోవుటకుగాని, ఈశ్వరుని జీవుని సమీపమునకు గొనివచ్చుటకు గాదు. ఈశ్వరుని యవతార మంగీకరించు వారీశ్వరుని దమకడకు దింపుదురుగాని యీశ్వరుని కడకు దామున్నతినందుట నెఱుగరు. అందువల్లనే మనుష్యుడిట్టి కల్పనల నొనరించి క్రమముగా పతితుడగును.

ప్రస్తుత కాలమున భక్తిశబ్ద మతిదురుపయుక్త మగు చున్నది. ఆస్తికులలో మంచివారు తమ్ము దామాస్తికులమని చెప్పుటకును వెఱచుచున్నారు. కొలదిరోజుల క్రిందటనే బీహారులో 'రాయసజీ' మతమనుపేరిట నొకమతము బయలు దేరినది. రామునకు సీతయందెక్కువ ప్రేమ. కాబట్టి రామ భక్తులెల్లరు సీతగావలయునని వారు చెప్పుదురు. సీతయగు విధమేమన, పురుషులు స్త్రీవేషమును ధరింతురు. అన్నివిధ ముల స్త్రీలు తమపతులయెడ జూపు నట్టి హావభావములనే ప్రకటింతురు. దీనినే వారు ఈశ్వరపూజ, ఈశ్వరభక్తి యం దురు. ప్రార్థనలకు ఫలమేమగును? ఉత్తరజన్మమున వారెల్లరు స్త్రీలుకావలసి వత్తురు.

వాస్తవమున నిది భక్తికాదు. తమకల్పనలవెంట పరు వెత్తుట యనవచ్చును. భక్తిశబ్దము సంస్కృతము 'భజసేవా యామ్' అనుధాతువువలన నేర్పడును. మనమీశ్వరునకు యథార్థమైన భక్తులము కాదలచిన నతని యాజ్ఞలను పాలింతుముగాని మనయిచ్చవచ్చినట్లు ఈశ్వరు నిందింప నంకిం

షము. ఈశ్వరుడు మూర్ఖులవెంట నాడునట్టి సత్త్వము కాడు. భక్తినెపమున లోకమున ననేకులు వంచింపబడుచున్నారు. పామండు లనేకులు తమ యుదరములను పోషించుకొందురు. కాబట్టి యిట్టి చెడుగులనుండి తప్పుకొనుట కెల్లప్పుడు యత్న మాచరింపవలయును. ఆత్మోన్నతికి సాధనమైన ప్రార్థననే యొనర్పవలయును.

ఉపాసనకు రెండవయంగము ధ్యానము. మనుష్యునకు యోగ్యుడయిన గురువులభించిన నతని శిక్షణకులోనయి ప్రాణాయామము నేర్చుకొన వలయును. దాని వలన మన స్సైకాగ్ర మగును. ఏకాగ్రతకంటె మంచి సాధనము మఱియొకటి లేదు. మనస్సునకు, ప్రాణమునకు స్వాభావికమైన సంబంధ మున్నది. ప్రాణగతి నిరోధింపబడిన తోడనే మనోగతి నిరుద్ధమగును. ఇది యెల్లరకు ననుభవగమ్యమైన విషయము. ఒకానొక యాకస్మిక ఘటన జరిగినపుడు మన మనస్సు నిరోధింప బడుటయు నప్పు డుచ్ఛ్వాసనిశ్వాసములు బంధింపబడి యుండుటయు నందఱెరిగిన విషయమే. కాని యాస్థితి యొకక్షణకాలము గావచ్చు. దానినిబట్టి ప్రాణమును నిరోధించిన మనస్సు కుదుటబడుననుట స్పష్టమే.

ధ్యానమున మనస్సునేల నిరోధింపవలయును? దీనిని కొంచెము విచారింపవలయును. వస్తుతః మన మనస్సతిచంచలము. అదిచలించుచున్నంతకాలము మనమేపనిని సరిగా జేయజాలము.

"చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవ ద్దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివసుదుష్కరమ్"

కృష్ణా! మనస్సతిచంచలము. ప్రయత్న మొనర్చియూ దానిని నిలుపజాలము. వాయునిరోధమువలె మనోనిరోధము దుష్కరముగా దోచుచున్నదని అర్జునుడనుట మీరెఱిగిన విషయమే.

కృష్ణుడు నిట్లు చెప్పెను.

"అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే
(6. 36.)

అర్జునా! నిజమే. మనస్సును నిరోధించుట కష్టమే. అయినను అభ్యాస వైరాగ్యముల ద్వారా నిరోధింపనగును.

పతంజలియూ నిట్లే యోగదర్శనమున జెప్పియున్నాడు.

'అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః'

మనస్సును స్థిరపరుపకున్న కార్యము నెఱవేరదు. చలించుచున్న మలినదర్పణమున మనుజుడు తనముఖమును జూడజాలనట్లు మలవిక్షేపాదులతో గూడిన మనస్సున నీశ్వరధ్యానమును సంభవింపదు. ఈశ్వరప్రార్థన, శుభకర్మలద్వారమున మలము దూరమగును. ధ్యానమువలన విక్షేపము నశించును.

ప్రాణాయామ మొనర్చుటలో నొక విషయమును మఱువరాదు. పుస్తకాదులను జదివి తనయిష్టమువచ్చినట్లు నో చేయరాదు. మఱియు పాఠశాలలయందు వ్రాసిన గురువులుగా

నేర్పరచుకొని వారి యవివేక విధుల ననుష్ఠించిన హాని సంభవించును. అనేక విధములగు రోగములకును లోను గావలసి వచ్చును, వీరివలన ప్రాణాయామము సిద్ధించుననుట వట్టి యాస. నేటి బైరాగులలో యోగవిషయమున నెన్నో విధులు క్రమవిరుద్ధములైనవి వ్యాపించియున్నవి. అనేకులు యువకులు వారి వలలలోఁజిక్కి యపాయములనందుచున్నారు. కనీస మొందఱో యూపిరితిత్తులకు సంబంధించిన రోగములకు గుఱియైరి. కాబట్టి మీకు సందియములు తీరనంతవరకు లేక సరియైన పద్ధతులను దెలుపునట్టి గురువులు లభింపనంత వరకు ప్రాణాయామము నభ్యసింపకుడు. ప్రాణాయామము జేయకయే ధ్యానము కుదుర్చుకొనుటకు యత్నింపుడు. ప్రాణాయామము వలన కలిగినంత లాభము కలుగకున్నను కొంత లాభము కేవల ధ్యానమువలన కలుగకపోదు. ఇంతియగాక సంధ్యా ప్రార్థనామంత్రముల యర్థమును విచారించుటయు 'ఓమ్'ను జపించుటయు శ్రేయస్కరము.

యోగదర్శనమున

"తజ్జప స్తదర్థ భావనమ్"

'ఓమ్'ను జపింపుము. దానియర్థమును భావింపుమని చెప్పబడుచున్నది. ఇందునను మనస్సు ఏకాగ్రము కాఁగలుగును. ఒకింతసఫలత యిందవశ్యము కలుగును.

తత్సత్

భారతీ ముద్రాక్షరశాల, తెనాలి. పి.వి.సి. జి. 36-1000 కా. 19-7-47.